# ఆవిష్కరణ మహోత్సవము
# 2-8-1971

అధ్యక్షులు:- శ్రీ మేకా రంగయ్యప్పారావుగారు
M.A., M.L A.,

ఆవిష్కర్త - శ్రీ లంకపల్లి బుల్లయ్యగారు
ఆంధ్రయూనివర్శిటీ వైస్-ఛాన్సలర్

సభాప్రారంభకులు:- శ్రీ స్వామీ శివశంకరస్వామీ

ఉపన్యాసకులు:- శ్రీ తూమాటి దొణప్పగారు
M.A., P.Hd.

'కళాప్రపూర్ణ'
శ్రీ తుమ్మల సీతారామమూర్తి

# త్రివేణి

'విద్యాపోషక'

శ్రీ పాములపాటి బుచ్చినాయుడుగారి

స్మారక సంచిక

**(14-6-1971)**

పర్యవేక్షకులు :

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

సంపాదకులు:

1. శ్రీ తాళ్లూరి సత్యనారాయణ
2. శ్రీ గోగినేని శ్రీమన్నారాయణ
3. 'కళాప్రపూర్ణ' శ్రీ కొండవీటి వేంకటకవి

# వి ష య క మ ణి క

## ప్ర థ మ భా గ ము



## ద్వి తీ య భా గ ము

# సంపాదకీయము

విద్యాపోషకులుగా, సాహితీ సంసేవకులుగా, లలితకళాప్రియులుగా, వి
శాస్త్ర ప్రోత్సాహకులుగా, ప్రచ్ఛన్న రాజకీయవేత్తలుగా, ప్రత్యక్ష సంఘ సంస్కర్తలు
పి. బి యన్ కళాశాలా సంస్థాపకులుగా, సాహితీపీఠ వ్యవస్థాపకులుగా తమ అమూల్య
లగు సేవల నందించి గుంటూరు మండల మాణిక్యముగా ప్రశస్తినందిన శ్రీ పాములప
బుచ్చినాయుడుగారి స్మృత్యర్థమై సమర్పించు ఉపహారము 'త్రివేణి' రూపుదాల్చినది

ఆగర్భ శ్రీమంతుడయ్యు వినోదముల వైపునకు మొగ్గక, విలాసములకు శిరసా
తనకున్న అర్థమును సార్థకములు, బహుళార్థ సాధకములు, విశ్వకళ్యాణ సంధాయకమ
నగు లోకహితకార్యములకు సమర్పించిన సదాశయుడు నాయుడుగారు.

కవుల పాలిటి కల్పకముగా, సంశ్రితుల పాలిటి చింతామణిగా, అర్థిజనుల పా
వేల్పుటావుగా, పేద విద్యార్థుల పాలిటి పెన్నిధిగా ప్రఖ్యాతినందిన మిన్న.

కవియై, కవి పండిత పోషకుడై వివిధ సాహితీ ప్రక్రియల సమాదరించిన రసజ్ఞ

కమనీయమగు రూపముతో పరుల నాకర్షించుచు, నాప్యాయపూరితమగు వాక్కు
పరుల నాదరించుచు తాను నవ్వుచు; సందర్భోచితము - హాస్యగర్భితము నగు వాక
త్కృతితో పరులను నవ్వించుచు ఇతరుల నలరించెడి సరసుడు.

ఆత్మబంధువులని - అన్యులని; అగ్రవర్ణజులని- అధమకులజులని; భాగ్యవంతులని-భ
హీనులని; భేదభావము రవంత లేక ఎల్లరిలో తలలోని నాల్కగా మెలగు ఘనుడు

రైతుగా జన్మించి, వ్యాపారిగా వ్యవహరించి విద్యావేత్తగా పరిమళించి, వ
శాస్త్రజ్ఞుడుగా ప్రకాశించి, రాజనీతిజ్ఞుడుగా రాణించి, పరిపాలనాదక్షుడుగా దీపించి వి
రంగములలో తన బహుముఖ ప్రజ్ఞను వెలయించిన ప్రజ్ఞావంతుడు.

ఆయన ఒనర్చిన సేవలకు చిహ్నముగా, ఆయనపై గల మన భక్తిభావము
గుర్తుగా వారి ఆత్మశాంతిని కాంక్షించి సమర్పించు స్మృత్యంజలియే 'త్రివేణి'గా రూపొంది

పవిత్ర భావములు నెలకొనిన మనముతో - మార్దవ బహుళములగు వాక్కుల

మానవ ప్రగతి కారకములగు క్రియలతో త్రికరణశుద్ధి నంది అలరారు ఆయన మూర్తి త్రివేణి సంగమము.

ధార్మికదృష్టి- ఆధ్యాత్మచింతన కళాహృదయములను మనుగడలో త్రివేణి సంగమముగా తీర్చిదిద్దిన సదాశయుడు.

మూడు పాయలుగా ధనమును విద్యాపోషణమునకు- సాహితీసేవనమునకు- లలిత కళోజ్జీవనమునకు వెచ్చించిన వితరణ శేఖరుడు.

కవులకు- పండితులకు- విమర్శకులకు సమప్రాతినిధ్య మొసంగిన ప్రోఢ.

గద్య- పద్య గేయ కృతులకు సముచిత స్థాన మొసంగిన వదాన్యుడు.

కావుననే ఆయనకు 'త్రివేణి' యనిన మక్కువ. ఏటుకూరి వారి ఖండకావ్య రచనము 'త్రివేణి' రూపము దాల్చుటకు కారకుడీ విద్యాపోషకుడు. 'త్రిశతి' ఆవిర్భావమునకు ప్రోత్సాహకుడు. ఏ తత్కృతి స్వీకృతి గావించుట తదభిమాన సూచకము.

'సత్యం శివం- సుందరం' అను పలుకుల నడుగడుగున అణువణువున అన్వర్థ మొనర్చిన ప్రోఢ.

కావుననే ఆయనకు సమర్పించు ఈ గ్రంథము గూడ 'త్రివేణి' యయినది.

వివిధ విషయ ప్రాధాన్యమై, భిన్నప్రక్రియా విలసితమై గద్య పద్య గేయాత్మకమై అలరారు ఈ సంకలన గ్రంథము సహృదయ హృదయాహ్లాదన మొనర్చునని మా భావన.

ఈ గ్రంథ పర్యవేక్షణా బాధ్యత స్వీకరించి గ్రంథమును సర్వాంగ సుందరముగ తీర్చిదిద్దుటకువలయు సహకారము,ప్రోత్సాహమును ఒసంగిన శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారికి మా ప్రత్యేక ధన్యవాదములు.

మా సంకల్పమును గ్రహించి- మా విజ్ఞాపనమును మన్నించి తమ అమూల్యములగు రచనముల నంపించి సహకరించిన విద్వద్వర్యులకు మా నమస్సులు.

నిండైన హృదయముతో ఈ గ్రంథమునకు వలయు సర్వవిధములయిన సహాయము నందించిన శ్రీ నన్నపనేని సుబ్బారావుగారికి మా అభినందనములు.

# ఆధ్యానము

నిన్న మొన్న జరిగె నీ షష్టిపూర్తి ను
హోత్సవంబు జను లహో ! యనంగ
నేల కన్నుమూసె తింతలోననె బుచ్చి
నాయఁడా ! తెనుంగునాఁడు వగవ.

ఎందఱెందఱో దినదినం బిహమునుండి
తరలుదురు గాని నినువంటిదాత పోక
లోకమున వారికిం బెనులోటుగా న
పార బాధాకరమ్ముగాఁ బరిణమించు.

ఒడలు చెడునట్టిదే యది చెడినమాత్ర
నాత్మ చావదు పెఱమేని కరుగుఁగాని
సత్య మిది యని తాత్త్వికుల్ చాటు టరసి
తేఱుకొనుచుంద్రు నరు లిట్టి తీఱములను.

ఎండదు తడియదు తునుఁగదు
మండదు చా దాత్మ యని సమస్తార్యులు స
త్పండితులు నుడువ లోకము
గుండియ దిటపడును బందుగులు చన్నతఱిన్.

పెక్కురకు నరిది యగు స
మ్యక్కృతి గావించి యుష్మదభిజనకీర్తుల్
మిక్కిలి వెన్నెల వన్నెల
దిక్కుల వెలివిరియఁ జేసితివి నీ వదిరా !

నాఁడు సనదవోలు వీడుగా వెలనాటి
చోళ లాంధ్రభూమి నేలునప్పు
డుజ్జ్వలించె వారి కుపరాజధానిగా
నీదుకాణయాచి నిడుదప్రోలు.

కాకతీయుల పగపాడికాఁక సోఁకి
యేలుబడిఁ గోలుపోయిన చోళనృపులు
తమ తమిళభూమికిం జనుతలఁపు వీడి
తాపుకొని రిచ్చటనె తెన్గుఁదనము వలచి.

తన తేనివెంట నిమ్మహికి వచ్చిన
తమిళవిప్రుఁడును
మనగాలి వదలిపోలేక నిల్చె
నీమాగాణమంద

తెనుఁగుఁదీపికి లోఁగి యతఁడు
మన కిచ్చెఁ దీయనికైత
కనుము చెళ్ళపిళ్ళవేంకటకవీంద్రుఁ
డీకథలోనివాఁడె.

ఎట్టిసడినైనఁ బ్రకటింప నేఁబదాఱు
వ్రాలు చెలువంపునెలవులై వఱలఁగా న
జంతమై గానలక్ష్మిశుద్ధాంతమైన
తెలుఁగునకు సాటి రా నొండుపలుకు గలదె.

విరిసినయల రామనిలోఁ
గురిసినక్రొందేనె మెంచుకొని పున్నమ రే
మెఱసినవెన్నెల తెలుఁగై
మొరసెన్ బెఱనుడుల కిట్టిమురు వరుదుగదా !

పలుకుసౌరు తీవిపస మెచ్చి చోళులు
కమ్మవారియందుఁ గలసి రపుడు
నిక్క మరయ నరయ నిడుఁద్రోలిచౌదరుల్
తారకాణ సేయఁ దగుదు రిందు.

ప్రాచీనచరితసౌరభ
మీ చందములోని దగుట నీగ్రామమునన్
రాచఱికపుఁజిన్నియలు స
మీచీనము లచటనచట మెఱసెడి నేఁడున్.

తెలుఁగునాడెల్ల నిచటి కేతెంచి గాంధి
కవిని గనకాభిషేకాదిగౌరవములఁ
దనుపునెడ నూరిపెద్ద లందఱు పొనర్చు
శారదాసేవ కోవిదశ్లాఘ లందె.

ప్రకృతిరంజనంబె ప్రభుధర్మ మనుమాట
సత్య మయ్యె వీరిసరణికతన
నీవుఁ బెద్దవారిత్రోవన పాటించి
యుద్ధవిడిని బ్రదుకు దిద్దుకొంటి.

అంగీకృతయుగధర్ముల
సంగతి నీ కబ్బదేని సముచితదానా
సంగము పుట్టక నీ వొక
లింగనిగుడి కిచ్చియుందు లిబ్బి సకలమున్.

## త్రి వే ణి

గుడికాదు నేఁడు నరునకు
బడికావలె మూఢమైనప్రత్యయముల పో
బడి కావలె మృదులంబగు
నెడఁదనుగా కీశుఁ డుండునే శిలయందున్.

పల్లెటూరివారిబాలురు విద్యకై
పట్టణాల కెక్కి బిట్టు చెడుట
నీ వెఱింగి క్రుంగి నిడుఁబ్రోలిలోఁ గళా
శాల నేర్పరింత మేలిచేఁత.

గ్రామజీవనమ్ము కిడలుకొన్నట్టి యీ
నెలవునందుఁ జదువునేర్పువారు
దంభమునకు దవ్వుదవ్వుగా మనుట వీ
క్షించి జగము పెద్దసేయు నిన్ను

నీతలంపు మెచ్చి నీయీవి కలరి నీ
పేర నిరవుకొన్నభారతికి స
మర్థమైనకాన్క లంపినవారి యు
దారతయు గణింపఁదగిన దిచట.

మంచిపనికిఁ బూను మానిసి యుండెనా
వాని ననుసరించువారు నుంద్రు
జగము సాగు నిట్టిసుగుణమ్ముచే నెట్టి
బెడఁద లంటుకొన్న బెండువడక.

సంతతి లేనివారు బహుసంపద
నేలెడి వారు విద్యలన్
మంతు గడించువార్ ముదిమి
మల్లడిచే దురపిల్లువారు న
త్యంతము సిగ్గునంబడ సముచిత
కృత్యము సల్పి సజ్జన
స్వాంతము లాహరించి తిది చాలు నహో
చరితార్థతన్ గనన్.

నీ కపత్యము లే దన్నవెగులు మాను
మీకలార్థులు నీబిడ్డ లేలకారు ?
దేశదేశాల నిను వినుతింత్రు వీరు
పితకువలె నీకు భక్తి నర్పించుకొంద్రు.

ముసలితనము చావు పొసఁగని నరునట్లు
సిరి గడించి మిత్తిచెనఁటి కోఁజఁ
గన్నవానివోలెఁ గర్తవ్యమును దీర్చి
తీవుగాక ప్రాజ్ఞుఁ డెవఁడు సెప్పుమ !

నీయెడఁద నెంతగా ధర్మనిష్ఠ యున్న
దొరలునా బండి నీరాణితోడు లేక
తగిన పాణిగృహీతిగా దక్క నీకు
సుగుణనికురుంబ వేంకటసుబ్బమాంబ.

అతడు పేదవాఁడె యాలు త న్నెదిరిన
వే వేలకొలఁదివిత్త మున్న
నతఁడు సాహుకారె సతి వెంబడించిన
పూఁట రూక లేకపోవుఁగాక.

నీయశమ్ము నిల్పు నిడుఁబ్రోల్ కలాశాల
చాలుఁ, జాలదేని సరసగేయ
పద్యహృద్యమైన భవదీయసాహితీ
కుంజభవము "పూలగుత్తి" చాలు.

అదియుఁ జాలదేని యయ్యాయి కవులు నీ
కిడినకృతులు చాలు నివి జగాన
బ్రదుకఁగలవు శౌచబంధురములు నన్న
యాదికవుల రచనలట్లు చిరము.

నరునికీర్తి యెన్నినా ళ్ళుండు మహి నతఁ
డన్నినాళ్ళు దివ్యుఁడై రహించు
నజర మమరమైన యశము నీది; సుఖమ్ము
ననుభవింపు మిఁక ననారతముగ.

మఱఁది నన్నపనేని వంశజుఁడు వినయ
సుందరుం డగు వేంకటసుబ్బరావు
కలఁడు నీ దానధర్మముల్ కాచుకొఱకు
నిర్విచారముగా దివిన్ నిలువు మిఁకను.

తెనుఁగులెంక

**శ్రీ తుమ్మల సీతారామమూర్తి**





బుచ్చినాయని ధర్మపత్ని

# విద్యాపోషకుని జీవితరేఖలు

భారతమాతను రత్నగర్భ నొనర్చెడి ముఖ్యమయిన పల్లెపట్టులలో నిడుబ్రోలు ఒకటి. వీరభూషాభిరామ మని విఖ్యాతిగడించిన గుంటూరు సీమలోని గ్రామములలో ఇది నాయకమణి. రాజకీయ పరిజ్ఞానమున జగతికి ఆచార్యులై విలసిల్లిన నాయకాగ్రగణ్యులకు పుట్టినిల్లు. పరిపాలనా దక్షతయందు నద్వితీయ ఖ్యాతినార్జించిన పెక్కురకు జన్మభూమి. మధురాతి మధురములగు కవితలను తీర్చిదిద్దిన కవిరాజుల కొటపట్టు. వైభవప్రాభవోపేతములగు పెక్కు కర్షక కుటుంబములకు నెలవు. అందు దిగిభమ్ములటుల దిగంత విశ్రాంత యశోవిరాజితులు పాములపాటివారు. వ్యవహారదక్షులై-ధర్మబద్ధులై లోకహితకార్యము లొనర్చిన సదాశయులు సిరిసంపదలతో పాటు వినయవివేకములను, వానితోపాటు సభ్యతా సంస్కృతులను స్వకీయ మొనర్చుకొనిన సరసులు.

అట్టి పావనవంశమున జన్మించిన మేటి మన 'నాయఁడు'. బుచ్చిరాయడు వీరి పితామహుడు. అంకినీడు వీరి పితృదేవులు. రాయఁడు, నాయఁడు, నీఁడు మొదలగునవి వీరి రాజసమును ప్రకటించి - వీరి ఔన్నత్యమును నిరూపించు బిరుద వాచకములు.

## పితరులు

అంకినీఁడు వ్యవహారదక్షుడు, యుక్తాయుక్తముల నెఱింగి ధర్మబద్ధములగు తీర్పుల నొసంగగల నేర్పరి. కేవలము ధనవంతుడుగా మాత్రమే గాక వ్యవహర్తగా విఖ్యాతి నార్జించిన మేటి. ప్రజలెల్లరు వీరిని ధర్మప్రభునిగా సంభావించెడివారు. పేదలెల్ల 'ధర్మదాత'గా వీరిని కీర్తించెడివారు. చక్కని భాషాజ్ఞానమును సముపార్జించిన ప్రౌఢ. గణితము నందు అందె వేసిన చేయి. ఆ కారణముగనే గ్రామీణులెల్లరు గణితసంబంధములగు విషయముల వీరిపై నాధారపడవలసి వచ్చెడిది. వీరి దర్పమును అభివర్ణించు కవిరాజుల చాటువులు ఇప్పటికి ప్రశస్తములు.

"నిండార విరిసిన బొండుమల్లెలతేప
బొమ్మిడీకము వింత పోలు పొసంగ
సొగసైన పసిఁడి కచ్చుంబోని నొసటిపై
నిడువాలు బొట్టు వన్నియను గూర్ప
రాచఠీవికి వన్నెరా నిట్ట మెలివెట్టు
నులిమీస కట్టు పెందఱుకు లీన
ఆఁదోఁక పాటుగా నమరు పిక్కలనంటి
నిలువుటంగీ హొయల్ చిలుకుచుండ
నిండుకొలువుండు శ్రీయంకినీఁడు ఱేఁడు
భోగ దేవేంద్రుఁ డూర్జిత పుణ్యధనుఁడు.

—కవిరాజు

ఆ దర్పమ్మున కడ్డులేదుతన
కన్యాయమ్ముగాఁ దోఁచినన్
గాదన్నన్ వినఁ డాత్మ
నాశమయినన్ గానిండు పోనిండు మ
ర్యాదాబద్ధముగాని జీవిత
మసహ్యం బంచుఁ బోనాడు నే
తాదృగ్జీవితుఁ డంకినీఁ
డతని వృత్తాంతమ్ము సామాన్యమా
ఆనాఁ డాతని వాక్కు వేదమయి
ధైర్య మ్మాత్మ వజ్రాంగియై
ప్రాణమ్ముల్ తృణమాత్రమై
పరహిత వ్యాపారపారీణతన్
రాణించెన్ ; దనకార్యఖడ్గ
పరతంత్ర స్వాంతముల్ తెగ్గుమా
గాణుల్ మ్రోగు నఖండ
గౌరవ కళా కళ్యాణఘట్టమ్ములై

—కవిబ్రహ్మ

రచన:
శ్రీ గోగినేని శ్రీమన్నారాయణ, యం. ఏ.

అంకినీఁడు గారి మొదటి భార్య పావులూరివారి ఆడపడుచు. పేరు అచ్చమ్మ. అతిథి సేవాపరాయణురాలు. అర్థించినవారికి ముక్కుమునగ విందులు పెట్టెడి అన్నపూర్ణ. పదునాఱువన్నె బంగారపు పసిడి చాయతో, గంభీరమైన వదనముతో కళలుముల చెలివలె భాసించెడి రూపవతి. సిరిసంపదల యందుభోగభాగ్యములయందు కొదువలేకున్నను దంపతులకు సంతతి లేని దుఃఖము అనుదినము వేధించెడి విషయము.ఎన్నియో వ్రతములు గావించియు-నోములు నోచియు ఫలితమును గానక అచ్చమ్మ వంశాంకురము నకై భర్తను ద్వితీయవివాహమునకు ప్రోత్సహించెను. ఆమె సంస్కారమును నిరూపణ మొనర్ప నింతకన్న నిదర్శనమేముండును. భార్య ప్రోత్సాహముపై అంకినీఁడు ద్వితీయగా రత్తమ్మను పరిణయ మాడెను. ఆ పుణ్య దంపతుల గర్భముక్తాఫలములుగా బుచ్చి నాయఁడు, చిన్నమ్మలు ఉద్భవించిరి.

## జననము

వీరి నిలయము నిడుబ్రోలు. అయినను 1907 వ సంవత్సరములో నాయఁడు గారు వారి మాతామహుల గృహములో జన్మించిరి. తల్లి దండ్రులు కానకగన్న సంతానమగుట గారాబుబిడ్డగా పెంచుచుండిరి. రత్తమ్మ కన్నతల్లి అయినను సవతితల్లి అచ్చమ్మ యొడిలోననే నాయడుగారు పెరిగి, పెద్దవారయిరి. ఆమె ప్రేమాదరములలోన పెంపు వహించిరి కావున ఇద్దరుతల్లుల ముద్దుబిడ్డగా గణనకెక్కిరి. తన బాల్యము నంతయు మేనమామలగృహములలో చింతలపూడి గోవాడలలో గడిపిరి.

## విద్యాభ్యాసము

బాల్యముననే తండ్రి మరణించిన కారణముగను, గృహ నిర్వహణ బాధ్యత వహించవలసిన హేతువుగను నాయఁడుగారు విద్యాభ్యాసమునకుఏడవ తరగతియందే స్వస్తి చెప్పవలసి వచ్చెను. కావుననే నాయఁడు గురుముఖతః నేర్చుకొనిన విద్య తక్కువ. కాని సహజమయిన అనుభవ పూర్వకమైన విజ్ఞానము నెంతయో ప్రోదిచేసెను. అట్టి విజ్ఞానము కవి పండితుల సాహచర్యముతో ఎంతయో రాణించెను. బహు గ్రంథ పఠనముతో మోసునెత్తెను. ఆచార్య రంగాగారి అనుచర్యముతో మెఱుగుపీరెను బహుదేశ పర్యటనానుభవముతో నిగ్గుతేలి నాయని 'విద్యా పోషక' బిరుద సమ్మానార్హు నొనర్చినది. 'పూలగుత్తుల' రచనము ద్వారా వీరి విజ్ఞాన సంపద జగద్విఖ్యాతి గడించెను. విద్యయొక్క పరమార్థము మేధస్సును పెంచుట - హృదయ సంసిద్ధిని సమకూర్చుట - మనసును వికసింపజేయుట. ఏ పట్టములను పుచ్చుకొనకయే విద్యా ఫలమును చవిచూచిన విజ్ఞానవంతుడుశ్రీనాయఁడు. చదువులలోని సారమును గణించిన - గడించిన ప్రోఢ. సంభాషణా చాతుర్యములో ఆరితేరిన దిట్ట.మనస్తత్వమును గ్రహించుటలో డిగ్రీలు లేని పండితుడు.

## వివాహము

నిడుబ్రోలునందు పేరెన్నికగన్న కుటుంబములలో నన్నపనేని వంశము ప్రఖ్యాతము. ఆ వంశమున ముత్తయ్య ఆత్మజుఁడగు అంకప్ప, అంకినీఁడుగారికి సమవయస్కుడు - సర్వవిధముల దీటయిన వ్యక్తి. గుణముల ప్రోవగు వేంకటసుబ్బమాంబ అంకప్పగారి అనుగు కూతురు. పావన సుచరిత్ర. వైరులనోట గూడ మెప్పులుగైకొన్న సుగుణవతి. ఆకారణముగనే తమ కుటుంబముల మధ్యగల పూర్వ వైరమును గూడ విస్మరించి అంకినీఁడు ఆమెను తన కోడలుగా స్వీకరించెను. 1921 లో బుచ్చినాయనికి వేంకటసుబ్బమ్మగారితో పరిణయ మాయెను. చిన్ననాటినుండి సహధర్మచారిణియై - అర్ధాంగియై తన సహన సౌశీల్యములతో భర్త హృదయమును లోగొన్న సాధ్వి వేంకటసుబ్బమాంబ. శబ్దార్థముల సంబంధమువోలె - చంద్ర చంద్రికల అనుబంధమువలె వారిప్రేమానురాగములు పెంపొంద ఆదిదంపతులవోలె నలరారుచుండిరి.

తదుపరి అంకినీడు తనకుమార్తెయగు చిన్నమ్మను గోగినేని వంశోద్భవుడును, అంకమ్మతనూజుడును అగు జి. వి. చౌదరి కిచ్చి పరిణయము చేయుట కారణముగ నిడుబ్రోలు నందెల్ల సఖ్యసంబంధములు పెంపొందించుకొనెను.

## గ్రంథాలయ స్థాపనము

పూవు పుట్టగనే పరిమళించునను సూక్తితో నాయఁడుగారు చిన్ననాటినుండి పెద్దలయెడ వినయ విధేయతలు చూపెడివారు. జంపని ఆంబనేయులు

గారి తోటి సాహచర్యఫలితముగా సంఘసేవాపరాయణుఁడై ప్రకాశించెను. తన పదునెనిమిదవ యేట (1925) భూరివిరాళ మొసంగుట ద్వారా గ్రంథాలయ స్థాపనమునకు తోడ్పడెను. అంతియేగాక తానే స్వచ్ఛంద సేవకుఁడై దానిని నిర్వహించు బాధ్యత వహించెను. 'ఆంధ్ర సరస్వతీ గ్రంథాలయ'మను పేర దానిని తీర్చిదిద్దెను.

## జాతీయ భాషా ప్రచారము

స్వాతంత్ర్య సముపార్జనమునకు జాతీయ సమైక్యము ముఖ్యావసరముగా భావించిన రోజులవి. జాతీయ సమైక్యమునకు జాతీయ ప్రబోధము తప్పనిసరి యాయెను. జాతీయ భాషగా 'హిందీ'ని ప్రచారము చేయవలయునను ఆరాటము సంఘసంస్కర్తలలో మొలకెత్తినది. అట్టి పరిణామ ఫలితమే అసంఖ్యాకములగు హిందీబోధనా పాఠశాలలు వెలయుట, తత్ప్రభావమునకు లోనై శ్రీ నాయఁడు గారు కూడ హిందీ నేర్పు పాఠశాలను స్థాపించెను. ఆనాడే వీరు విద్యాపోషక కార్యమునకు నాందీ వాక్యము పలికిరి. బీహారు బ్రాహ్మణులగు రామనుజ, బ్రజనందన శర్మ లుపాధ్యాయులుగా శిక్షకర్తవ్యము నిర్వహించిరి.

## దేశభక్తి

దేశమాత దాస్యబంధములు త్రెంచుటకు ధన మాన ప్రాణముల నరకుగొనక కష్టించిన స్వాతంత్ర్య సమర యోధులు పెక్కురు. అట్టి సమరయోధులకు తగు ఆర్థిక సహాయ మందించుట ద్వారా తన దేశభక్తిని ప్రకటించుకొనిన మాన్యుడు శ్రీ నాయఁడు.

## రాజకీయ ప్రవేశము

శ్రీ నాయఁడుగారు జస్టిస్‌పార్టీ సభ్యులుగా రాజకీయ ప్రాంగణములో ప్రవేశించిరి. పాములపాటి వెంకటకృష్ణయ్యగారి ప్రభావ ఫలితమది. కాని 1930 నాటినుండి ఆచార్య రంగాగారి అనుచరుడు. 1929లో పొన్నూరు, నిడుబ్రోలు యూనియన్ సభ్యత్వము నందుకొనెను. ఆచార్య రంగాగారి అడుగు జాడలలో పయనించు పథికుఁడితఁడు. గాంధీ సిద్ధాంతముల నభిమానించు నిరాడంబరుడు.

## పంచాయతీ అధ్యక్ష పదవి

వీరి నిస్స్వార్థసేవల గమనించి నిడుబ్రోలు పంచాయతీ అధ్యక్షులనుగా 1933 లో ప్రజలు శ్రీ నాయనిని ఎన్నుకొనిరి. గ్రామ రాజకీయములలో పాల్గొనియు కలుషితములకు లొంగని తత్ప్రభావములకు శిరసొగ్గని నేర్పరి. కలుషితము - మాత్సర్యపూరితము అయిన నేటి రాజకీయ మనినవారికి అయిష్టము. రాజకీయవాది గాకున్నను రైతాంగ రాజకీయజ్ఞులతో సన్నిహిత సంబంధముగల చతురుడు. అందరి దృష్టినీ గ్రామీణ సమస్యల వైపునకు ఆకర్షింపజేయు గడుసరి. నిరంతరము రైతుల సమస్యలను వాస్తవిక దృక్కోణములో వీక్షించి పరిష్కార మార్గము అన్వేషింప వలసిన ఆవశ్యకతను ఉద్ఘాటించెడివారు.

## రైతులపై ప్రీతి

వీరు రైతుగా జీవితము గడుపుచు రైతులలో మెలగుచు రైతులకొరకు అన్నివిధముల తాపత్రయ పడుచుండెడివారు. ఆయనలోని ఈ రైతాంగతత్త్వము ఆచార్య రంగాగారి రైతాంగ విద్యాలయము వైపునకు నడిపించినది.

## విద్యాలయ కార్యనిర్వహణము

రైతాంగ విద్యాలయ కార్యనిర్వాహకులలో ప్రచ్ఛన్న కార్యకర్తగా ఆచార్య రంగాగారి "రైతాంగోద్యమ" వ్యాప్తికి శ్రీ బుచ్చి నాయఁడు గారు ఎంతగనో తోడ్పడిరి. ఆంధ్రదేశమునకు చిర పరిచితమైన రామానీడు విద్యాలయము వీరిసొత్తు. అందు రమణయ్యగారు వీరి పెద తండ్రి. అంకినీఁడుగారు వీరితండ్రి. వీరిరువురి నామధేయము లందలి ఆద్యంతములను కలిపి "రామా-నీడు"గా కూర్చిరి. అదియే 'రామా-నీడు' విద్యాలయ జీవిత రహస్యము.

## రైతు రక్షణ యాత్రలు

నాయఁడుగారు 1934-35 సంవత్సరములలో రైతు రక్షణ యాత్రలలో పాల్గొని అభిమానము వెల్లడించిరి. రైతు హక్కుల ప్రకటనలకై "వాహినీ" పత్రికా స్థాపనమునకు తోడ్పడిరి.

## చిత్రశాలా భవన నిర్మాణము

నాయఁడుగారు దూరదర్శి యనుటకు వారి చిత్ర శాలా నిర్మాణమే తార్కాణము. 1939 లో తన భార్య పేర చిత్రశాలా నిర్మాణము గావించెను. నాడు ప్రజ లందరు నష్టముకలిగించు కార్యముగా అవహేళన

మొనర్చిరి. వారి అవహేళనలకు తగినట్లుగనే నిర్వహణదక్షులు కొఱయయిన కారణముగ చిత్రశాల వెలుగునకు రాలేదు. కాని కార్యఖడ్గనిపుణుఁడును, వీరి బావమరిదియునగు నన్నపనేని వేంకటసుబ్బారావు గారి యాజమాన్యమున అది కొంతకాలమునకు విపరీత మగు లాభములను గడింప సమర్ధవంతమాయెను. గ్రామమున చిత్రశాలా నిర్మితి నొనర్చు ప్రయత్నము వీరి సాహసమును – దీర్ఘదర్శిత్వమును నిరూపణ మొనర్చు విషయము.

## సహకార సంఘాధ్యక్ష పదవి

నాయఁడుగారు 1946 వ సంవత్సరములో 'ఉత్పత్తి దారుల–వినియోగదారుల సహకార సంఘమునకు' అధ్యక్షులయిరి. సహకార సంఘమునకు కార్యదర్శిగా నున్న నాకు వారితో నాటినుండి సాన్నిహిత్య మేర్పడినది. వారి నవగత మొనర్చుకొనుటకు అవకాశము లభించినది. ప్రజా ద్రవ్యములను నీరువోలె దూయక సద్వినియోగ మొనర్చిన స్వార్ధరహిత ప్రజాసేవకుడు శ్రీనాయఁడు.

## వి దే శ ప ర్య ట న ము

1947 వ సంవత్సరమున హాలెండులో జరిగిన "అంతర్జాతీయ కర్షక ఉత్పత్తిదారుల మహాసభకు" కర్షక ప్రతినిధిగా శ్రీనాయఁడుగారు రంగాగారితోపాటు హాజరయిరి. ఆ సందర్భముననే కెయిరో, మాల్టా, పారిస్, స్విట్జర్లాండు, లండన్ మొదలగు ముఖ్యపట్టణ ములు పర్యటించిరి.

## క ళా శా లా స్థా ప న ము

విదేశ పర్యటనానంతరము గ్రామీణుల కందుబాటుగా నుండునట్లు కళాశాలను స్థాపింప వీరు సంకల్పించిరి. విద్యపై వీరికి మమకార మధికము. రైతాంగము యొక్క హీనతకు, దీనతకు విద్యా విహీనత కారణమని వీరి దృఢ విశ్వాసము. కళాశాల విద్య ఆర్థిక స్తోమతు చాలని రైతులకు – గ్రామీణులకు 'అందని ద్రాక్షపండు.అట్టి విద్యను గ్రామీణుల కందు బాటులోనికి తెచ్చు ప్రయత్నమే కళాశాలా స్థాపనము. పలువురు పురప్రముఖుల ప్రోత్సాహముతో – బంధు వర్గము సహకారముతో మొట్టమొదట 1951 సంవత్సరములో 'రామా – నీడు' విద్యాలయ భవనములలో కళాశాలను ప్రారంభించిరి. పేద విద్యార్థులపాలి పారిజాతముగా అది ప్రకాశించినది. రొఖము రూపములో రూకకూడ చేతిలో లేనినాడు ఇట్టి మహోన్నత కార్యమునకు సంకల్పించిన వీరి సైర్యము ప్రశంసార్హము.

## ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనెట్ సభ్యత్వము

నాయని వితరణమును గుర్తించి,వారి ఆశయముల నవలోకించి–వారి ప్రజ్ఞాపాటవములకు అచ్చెరువంది ఆంధ్ర విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ శ్రీ వి. యస్ కృష్ణగారు వీరిని సెనెట్ సభ్యులుగా 1952 లో నెన్నుకొనిరి. 1955 వరకు సెనెట్ సభ్యులుగా వీరు పలు విధములయిన జటిల సమస్యలకు పరిష్కార మార్గము చూపిరి.

## కార్యవాది – కార్యసాధకుఁడు

"ప్రచారకాండకు దూరముగా జీవితమును మలచు కొని–అదనులో పదనెఱిగి వ్యక్తికో–సంస్థకో–జాతికో –దేశమునకో గుంభనగా నిర్వ్యాజముగా జవసత్త్వ ములు పంచియిచ్చు కార్యవాది శ్రీ నాయఁడు. కార్య నిర్వహణమున అచంచల దీక్ష చూపెడి దిట్ట. నేటి కళాశాలా భవనము లన్నియు వీరి శ్రమదాన ఫలిత ములే. దాన మొనర్చిన వారు పెక్కు రుండవచ్చును గాని నాయని వోలె తన జవసత్త్వములన్నియు ఆ సంస్థకు సంకిత మొనర్చిన, అర్పించిన వారు చాల అరుదు. ఎన్ని విఘ్నములు సంభవించినను లెక్కింపక ముందునకేగు సైర్య ధైర్యములు వీరి సొత్తు. ఎందరో లక్షాధికారులు సైతము చూపలేని ఈ పదాన్యతకు ఈ రైతుబిడ్డ దానవీరుఁడై ముందడుగు వేయుటలోనే వీరి సాహసము తేటతెల్లము. కళాశాలా నిర్మాణమున ఎన్నియో కడగండ్ల నెదుర్కొనవలసి వచ్చినది. బాలారిష్టములకు ఈ కళాశాల ఎంతయో కాలము గురిఅయినది. నాయనికది పరీక్షాసమయము. పరుల అపహాస్యము లొకవంక, గిటనివారి బాధలు వేరొకవంక. ఎట్టకేలకు గౌ॥ బెజవాడ గోపాలరెడ్డి, గౌ॥ నీలం సంజీవరెడ్డి, గౌ॥ శ్రీ పి. తిమ్మారెడ్డి, పూజ్య ఆచార్య రంగాగార్ల సహాయ సానుభూతులతో వ్యయము గణింపనట్టి నియతితో కళాశాలాసృష్టిని శాశ్వత మొనర్చిన దిట్ట శ్రీ నాయఁడు. కావుననే వెనిగళ్ళ సత్యనారాయణగారు "అసలు ఫస్టుఫారాన్ని మాత్రమే చదివిండైనా, ఆశయం మాత్రం ఒక

విద్యాలయాన్ని గ్రామంలో ఎందుకు పెట్టకూడదనే పట్టుదలగల గుంటూరు మండల మాణిక్యం" అని వీరిని అభివర్ణించిరి.

## 'విద్యాపోషక' బిరుద ప్రదానము

విద్యాదానముపై వీరికిగల మక్కువను గమనించి-తదర్థమై వీరొనర్చిన సేవలుతిలకించి స్వర్గీయ ఆవుల గోపాల కృష్ణమూర్తి, కవిరాజు కొండవీటి వేంకట కవి ప్రభృతులు వీరిని తెనాలిలో సన్మానించి వీరికి 'విద్యాపోషక' బిరుద ప్రదానము గావించిరి. శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు అధ్యక్షులుగా శ్రీ ఏకా ఆంజనేయులుగారు, శ్రీ పి. తిమ్మారెడ్డిగారు వక్తలుగా ఆ బిరుదుప్రదాన మహామునకు దివ్యదీప్తి చేకూర్చిరి

## పరిపాలనా దక్షత

పరిపాలనా పాటవములో వీరి ప్రతిభ అనన్య సామాన్యము. వక్రమార్గముల జోలికి పోక ఆదర్శములకు కట్టుబడియున్న వ్యక్తి. ఉద్యోగులను నియమించుటలో జాతి – మత – కుల విచక్షణకు చోటీయక నైపుణ్యమునే గీటురాయిగా తీసికొని విశాలదృక్పథము చూపు తత్వము వీరిది.

## సాహితీ పోషణము

కవులయెడ వీరుచూపిన ఆదరణము అసాధారణము వీరికి పండితులనిన భక్తిభావముహెచ్చు. కవిత్వమును విని ఆనందించెడి వాడు. పిలిచి పోషించువాడు. కవులకు 'జమాను'నని విన్నవించు కొనిన వినయవినమిత వర్తనుడు. కృతిభర్తగా తాను పెక్కు గ్రంథములను సమాదరించిన మేటి. తానేగాక తనభార్యను గూడా కృతి స్వామిని నొనర్చిన కవితాప్రియుడు. కవిబ్రహ్మ ఏటుకూరి తన 'మగువమాంచాల' కృతిని 1942 లో వేంకట సుబ్బమ్మగారి కంకిత మొసంగిరి.

## నాయఁడు కృతిగొన్న గ్రంథములు

1944లో యడ్లపల్లి దేవయ్య కృతమయిన "ధార్మికుడు".

1956లో జి. జోసపుకవి ప్రణీతమైన "ఆచార్య రంగా".

1961లో 'కవికిశోరు' శంకరప్రసాద్ గారి "అమరుక" ముక్తకము.

1961లో కవిరాజు గారి "త్రిశతి"

1967 లో "అభినవ తిక్కన" తుమ్మలవారి "సమదర్శి".

1967 లో 'గొట్టిపాటి వెంకటసుబ్బయ్య' గారి "సరోజిని".

దీన పెక్కు గ్రంథముల కృతిగొన్న ఘనతతో పాటు వివిధ సాహితీ ప్రక్రియల సమాదరించిన కీర్తి గూడ నాయఁడు గడించినట్లు స్పష్టము.

పైన పేర్కొనిన కృతికర్తలతో గాక వీరు శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు, శ్రీ అమరేంద్ర, శ్రీ పుట్టపర్తి, శ్రీ గుఱ్ఱము సుబ్బరామయ్య, శ్రీ నారాయణరెడ్డి, శ్రీ ఆచంటి, శ్రీ కొనరాజు రాఘవయ్యచౌదరి, శ్రీ జి. వి. కృష్ణారావు మొదలగు కవీశ్వరులతో సన్నిహిత సంబంధము గలవారు శ్రీ వి ఆర్. నార్ల, శ్రీ పండితారాధ్యులు, శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావు మొదలగుగాగల పెక్కురు పాత్రికేయులతో మైత్రిని పెంపొందించు కున్నవారు శ్రీ నాయఁడు.

## సాహితీపీఠ స్థాపనము

సాహితీపీఠ సంస్థాపనము వీరి కవితాప్రీతికి నిదర్శనమగు మచ్చుతునక. తద్వారా వివిధ విషయ పరిజ్ఞాన సంపన్నులగు కవుల యొక్క, శాస్త్రవేత్తల యొక్క ఉపన్యాసములను ఏర్పాటు చేయుచుండెడివారు. అంతియేగాక విద్వత్కవుల సన్మానించుటద్వారా తన భక్తిభావమును ప్రకటించుకొనుచుండెడివారు.

## లలిత కళాభిమానము

శిల్పకళపై వీరికి మక్కువ మిక్కుటము. చిత్రలేఖనముపై ఆదర మధికము. కాంస్య విగ్రహములు చెక్కించిన కళాభిమాని. చిత్రలేఖన కళా ప్రోత్సాహకుఁడు. ప్రాచీన శిల్పసంపదపై – శాస్త్రీయ రూపక నాట్య శాస్త్రములపై అభిమానము చూపిన కళా తపస్వి. శిల్ప – చిత్రలేఖన కళాపారంగతులగు శ్రీ వై. వి. లక్ష్మయ్యగారు, సంజీవదేవ్‌గారు వీరికి ప్రాణమిత్రులు.

## పొదుపరి - ఉన్నతాశయుఁడు

శ్రీ నాయఁడుగారు ఆగర్భ శ్రీమంతుఁడయ్యు పొదుపు నెఱిగినవాఁడు. డబ్బుసంపాదించు నేర్పుతో పాటు దానిని సద్వినియోగ పరచుకొనిన వదాన్య శేఖరుఁడు. అర్థము అగ్నిలో వ్రేల్చినహవ్యము

గాకుండ భూమిలో నాటిన విత్తుగా పరిణమించవలెనని వీరి భావము. ప్రతికాసు మానవజాతి కల్యాణమునకు పచ్చతోరణము గట్టవలెనని వీరి ఆశయము. వీరి ఆకృతిలో – పలుకులో – ఆచరణములో అడుగడుగునా ఇట్టి భావమే గోచరించుచుండును.

## ధర్మసత్ర నిర్మాణము

సప్తసంతానములలో ప్రముఖమయినది సత్రము. అట్టి సత్రమునుగూడ భక్తజనులకు వాసయోగ్యముగా నిర్మించినచో అత్యంత పుణ్యప్రదము ఈ భావముతో శ్రీశైలశిఖరమున ధర్మసత్రమును నిర్మించిన ధర్మదాత శ్రీనాయఁడు ఆ భవన నిర్మాణమును వీరికి దైవముపై గల భక్తితోపాటు ప్రజలపైగల అనురక్తిని గూడ చాటుచున్నది.

## నూత్న చిత్రశాలా నిర్మాణము

నాయఁడుగారు సహజముగా రంగరించు కొనిన విద్య వాస్తుశాస్త్రము. ఇతఁడు భవన నిర్మాణమున పారంగతుఁడు. 1966 లో వీరు నిర్మించిన నూతన చిత్రశాలాభవనము వీరి శేముషీ వైభవమునకు మచ్చుతునక. వాస్తుశాస్త్రజ్ఞుల సలహాలు నామ మాత్రమే. స్వకపోలములగు ఊహలతో, స్వీయమగు ప్రతిభతో వీరు దీనిని నిర్మించి 'లక్ష్మీపిక్చర్ పాలెస్' అని నామకరణ మొంచిరి.

## షష్టిపూర్తి సన్మానము

నాయఁడుగారి సేవలు గుర్తించిన – వారి వితరణమును ఎఱింగిన పురప్రముఖులు ముందునకువచ్చి నడుముబిగించి 1967 ఆగస్టు 10 వ తారీఖున వీరి షష్టిపూర్త్యుత్సవ మొనర్చిరి. కవుల ప్రశంసలతో –విద్వాంసుల అభినందనములతో – ప్రభుత్వాధికారుల ప్రసంగములతో – విద్యావేత్తల ఆశాసనములతో సన్మానమహము విశిష్టత చేకూర్చుకొనినది.

## దేశి కవి

కేవలము కవిపండిత పోషకుడుగా గాక షష్టిపూర్తి నాటికి కవియై నాయఁడు తాను సాహిత్యరంగమున ప్రవేశించెను. "పూలగుత్తుల" మేలితావులతో సహృదయ లోకమును అలరించెను. దేశీయ ఛందములపై మమకార మధికమగుట గేయ గీతులతో కవితను వెలార్చెను.

గంభీరము కమనీయమగు రూప సంపదతో–విమలము నవనీత మార్దవమగు డెందముతో–సమయస్ఫూర్తి వాక్చమత్కృతి గలిగి వెలుఁగొందు నాయఁడు ఎల్లరకు ఆదర్శప్రాయుఁడు నిగర్వి, నిరాడంబరుఁడు.

పెద్దలని – పిన్నలని, పండితులని – పామరులని భేదభావము చూపక అందరితో అన్యోన్యముగా మెలఁగు స్నేహపాత్రుఁడు. శ్రీ ఆవుల సాంబశివరావు గారని నట్లు 'ఈనాటి సంఘ నాయకునకు కావలసిన సత్సంకల్పము దృఢనిశ్చయము – సహృదయత – మాట నేర్పు – బాగా అలవర్చుకొన్న వారు, శ్రీ నాయఁడు గారు.

1967లో పొన్నూరు మున్సిపాలిటీ సభ్యులు ఏకగ్రీవముగా వీరిని ఆఁడరుమన్‌గా నెన్నుకొనుట రూపమున సత్కరించిరి. ఇట్లు పలువిధములయిన సేవలతో మనల తనియించిన శ్రీ నాయఁడు గారీనాఁడు మన మధ్యలేడు. 14–6–1970 వ తేదీన ఉదయము గం 7–45 ని॥ హృద్రోగముచే స్వర్గస్థులయిరి.

ఏవంగుణ విశిష్టులయిన శ్రీ నాయఁని ఆత్మశాంతి పెంపొందింప వలసినదిగా భగవంతునికి మా ప్రార్థన.



# విద్యా పోషకుని సాహితీ పోషణము

ఆంధ్ర సాహిత్య సరస్వతికి అపూర్వాలంకారములను సమర్పించినవారు కొందఱు. సమకూర్చినవారు మఱికొందఱు. ఇరువురును సాహితీ సేవకులే. భాషా పరిపోషకులే. మొదటి తెగకు చెందినవారు కవులు, ద్వితీయవర్గమునకు సంబంధించినవారు కవిపండిత పోషకులు. విద్వత్పోషకులు గూడ కవనము నేర్చిన వారైనచో ద్విగుణీకృత భాషాసేవకులుగా కీర్తి గడించెదరు. ఆంధ్రమున అట్టివారు అరుదు. నన్నెచోడుడు రాజకవియేగాని, కవిపండిత పోషకుడిగా ప్రసిద్ధిలేదు. రాజరాజు, సాహితీపోషకుడేగాని కవిగా కన్పింపడు. బైచిరాజు వేంకటనాథుడు అన్యకవుల నాదరించిన నిదర్శనములు మృగ్యములు, ఈ రెండు గుణములును పుంజీభూతముగ వెలసిన మహనీయులు శ్రీకృష్ణదేవరాయలు, రఘునాథరాయలు. ఇందు ప్రథముడు, భువనవిజయ మహాసభాభవన మధ్యమున అష్టదిగ్గజముల పోషింపగా, రఘునాథుడు 'ఇందిరా మందిరము'ను పలువిధములయిన కవుల కాకరమొనర్చెను. ఒకరు ప్రబంధావిర్భావమునకు కారకులు. మఱియొకరు యక్షగాన మహోన్నతకి మూలపురుషులు. ఇరువురును కృతికర్తలే గాక కృతి భర్తలును. అల్లసాని వాని యల్లిక జిగిబిగి నాదరించిన వాడొకడు. విజయవిలాస కవితా విలాసములు చవిగొన్నవాడు మఱియొకడు. తెనుగునందే గాక సంస్కృత భాషలో నైతము గ్రంథములు రచించిన దిట్టలిరువురు. విశాల సామ్రాజ్య నిర్మాణముతోపాటు వినూత్న కవితా సామ్రాజ్యమును స్థాపించిన యశఃకాములు; సాహితీ సమరాంగణ సార్వభౌములు. కావుననే వీరి కీర్తి అజరామరము ; విద్వజ్జన సంస్తవనీయము ; రసిక జన మనోఽభిరామము. భావిజనములకు ఆదర్శప్రాయము అనుసరణ యోగ్యము వీరుతీర్చిన పుంతలు సుగమములు; సుందరములు. ఆ పుంతల బొంతల నేగువారు ఆధునిక యుగమునను గలరు. వారిలో మేటి మన 'పాములపాటి'. వారివలెనే వీరు 'రాయఁడు'గా ప్రఖ్యాతి వహించిరి. ఆంధ్రభోజులుగా వారు- అసమాన ఖ్యాతి వహింపగా విద్యాపోషక బిరుదాంకితులై వీరు రాణకెక్కిరి. భువనవిజయ - ఇందిరామందిరముల నుపమించు 'సాహిత్యపీఠము'లను స్థాపించిరి.

కాలచక్రము వక్రమయినది. అధికారులు బికారులగుచున్నారు, అంబరచుంబి సౌధరాజంబులు భూగర్భమున దూఱుచున్నవి. సుందరోద్యానవనములు శ్మశాన వాటికలుగ మాఱుచున్నవి. సృష్టి చిత్రము లతివిచిత్రములు పరిణామ సహితములు. రాజాధిరాజులంతరించిరి - సామ్రాజ్యములు నిర్మూలమైనవి. ఏ కొలది సంస్థానాధీశులో - జమీందారులో మిగిలిరి. కాలక్రమమున కవితావధూటి వారి ననుసరించినది. నేడు సంస్థానాధీశులు - జమీందారులుగూడా నామ మాత్రావశిష్టులైరి. కావుననే ఆంధ్రశారదకు సామాన్య ప్రజల నాశ్రయింపవలసిన అవసరము గలిగినది. శక్త్యనుసారముగా తమ సర్వస్వమును విద్యాపోషణకు అర్పించిన ఆదర్శమూర్తుల ముంగిట తిష్ఠవేసికొనినది.

సాహిత్యము జాత్యభ్యున్నతి సూచకము. సాహితీ వృద్ధికి సత్కవులు కారకులు. సత్కవులకాదరువు సాహితీపోషకులు. నేడు సామాన్యప్రజానీకమే సాహితీపోషకులుగా తమజాతి దివ్యదీప్తికి హేతుభూతులగుచున్నారు. ఆధునికాంధ్రదేశమున అట్టిప్రముఖులు పెక్కురున్నారు. వారికోవకు ఉద్దియౌ ఈవిగడించిన వారు శ్రీ నాయఁడుగారు. విద్యార్జన మొనర్చినది స్వల్పము. అయ్యుమతసాంఘిక రాజకీయసంబంధము

రచన:

శ్రీ తాళ్లూరి సత్యనారాయణ

లగు వివిధోద్యమములకుచేయూతనిచ్చినమహనీయుడు.

పలుకులవెలంది కరుణగలవారికి లక్ష్మీకటాక్షము శూన్యము సిరిసంపత్తులతో తులదూగువారికి విద్యాగంధము పూజ్యము. పరస్పరము వైరుధ్యమతులయిన అత్తకోడండ్రు ఒకేచోట కుదురుకొనియుండుట చిత్రాతిచిత్రము. ఏ పూర్వపుణ్యము ఫలించియో నాయనిగారి గృహము అట్టి భాగ్యమునకు నోచుకొనినది.

సంపదకు దగిన సంస్కారము, సంస్కారమునకు దగిన ఆదరణము. ఆదరణమున కనుగుణమగు ప్రవర్తనము-ఒకేచోట మూర్తీభవించి 'బుచ్చినాయని' రూపమున సాక్షాత్కరించినవి.

ఒకనాడు కవులు రాజులు మఱియొకనాడు మంత్రతంత్రాంగ నైపుణ్యము ప్రదర్శించిన అమాత్యులు. వేఱొకనాడు రాజకీయ . రాయబారులై అందలము లెక్కిరి; అగ్రహారములు పొందిరి. కనకములలో స్నానమాడిరి హేమ పాత్రలలో భుజించిరి. నిరుపహతి స్థలములు ఉన్నతప్రాసాదములు రమణీప్రియదూతికలు - షడ్రసోపేత భోజనములు - ఉయ్యాల మంచములు మొదలుగా రాజభోగములు చవిచూచిరి- వారి పలుకు బంగారము వారి కవనము రసామృతాసార సార ధార. నోటినుండి పలుకు వెలువడగనే లేఖక పాఠకులచే లిఖింపబడుచుండెడిది.గండపెండెర బహూకృతులు సముపార్జించుచుండెడిది. నేడో కవులకు వాస యోగ్యముగాని కొంపలు. గ్రంథ సంచయమును చెదపుర్వుగమినుండి రక్షించుకొనజాలని దీన స్థితి - ఉండీ ఉండని, చాలీ చాలని ఆర్జనము ఒకవైపు, భారమైదోచు కుటుంబ రక్షణము మఱియొకవైపు, ముసురుకొన్న దిగుళ్ళలో మునకలిడుచు కవి, కవితాసృష్టి యెట్లొనర్పగలడు? కవితాసృష్టి యొనర్చినను ఫలమేమున్నది? ఒప్పుచొప్పరయు రసజ్ఞులు లేనియెడ. యుక్తాయుక్తముల నెఱింగి విచారణచేయ జాలిన ఱేడులు లేనినాడు. కావుననే 'కవియైపుట్టుటకన్న పాపపరిపాకంబున్నదే'యని వాపోవవలసి వచ్చినది. 'కవితల్ చెప్పిన పాడనేర్చిన వృథా' కష్టంబెయని భావింపవలసి వచ్చినది. నేడు కవిరాజులు కోరునది బంగరుపల్లకీలను పట్టుడనిగాదు మత్తకరిపై నిలబెట్టమనిగాదు. రత్నమయ కుడ్య విచిత్రగృహమ్ములను కట్టియిమ్మనిగాదు. వారల్లిన గద్యపద్యముల నాదరించిననే పరితృప్తి వహింతురు. నెత్తిని పాలు వోసినట్లు ఉప్పొంగెదరు. అట్టి ప్రోత్సాహముగూడరానినాడు - లేనినాడు కవి, దయనీయుడే. వాని నిస్స్వార్థసేవ నిష్ఫలమై పోవునుగదా!

దైన్యముతో జాతి, నిద్రాణము గాకమున్నె. నిరాశా నిస్పృహలతో కవులు గంటములను పారవైవకమున్నె-సాహితీలత వాడిపోవకమున్నె - వారిని సంరక్షింపవలసిన బాధ్యత ఎంతో ప్రజలపైనున్నది. దానిని కర్తవ్యముగా భావించి తన ఈవికి తగినంతలో దోహదమొనర్చిన శ్రీనాయనిగారు సంస్తవనీయుడు ఈతడు కవిత్వమును విని ఆనందింపగలడు. పిలిచి పోషించగలడు - తాను యజమానియయ్యు కవులకు 'జమాను'నని విన్నవించుకొనిన వినయ వినమితవర్తనుడు, 'పెద్దచేసి మాకున్నతిగూర్చి బాధనిడకుండు'డని చాటిన నిగర్వి గుప్తదానములనొనర్చెడి నిరాడంబరుడు. 'ముచ్చటగూర్చు సత్కృతుల ముందిక నే వెడలింతు'నంచు కంకణము దాల్చిన దీక్షితపస్వి. పద్యముతోపాటు గద్యమును సమాదరించిన ఉభయకవి మిత్రుడు. శతకములనుండి చారిత్ర కేతిహాసములవఱకు వివిధ ప్రక్రియలను సమాదరించిన సరసుడు. ఖండకావ్యములనేగాక మహాకావ్యములను ప్రోత్సహించినమేటి. సంస్కృతవృత్తములతోపాటు దేశీయగేయ గీతులకు సముచితస్థానమొసంగిన దేశి కవితాభిమాని- భాషాంతరీకరణ గ్రంథములతోపాటు స్వతంత్ర ప్రబంధములకు దోహద మొసంగిన కవితాపోషకుడు. ఈతడు కవుల నెందఱనో సమ్మానించెను. పండితులెందఱికో బహూకృతు లొసంగెను.మూలబడి మూల్గు కవితామతల్లులకు ముద్రణా రూపమున వెలుగు ప్రసాదించెను.విద్వత్పోషకులు నేటికిని కలరనుటకు నిదర్శనముగా వీరు ఆదర్శముగా నిలిచియున్నారు కవితావధూటి నిర్వికార సంచారత నుల్లసిల్లుట వీరి పేర్మిచే గదా!

వీరు పిన్ననాటనుండి సాహిత్యమును పోషించుచున్న సదాశయుడు. కవి పండితులయెడ ఆదరణముచూపిన వితరణశేఖరుడు. చింతలపూడి శేషగిరిరావుగారి గద్యకృతికి ముద్రణా సహాయమందించుట ద్వారాసాహిత్య రంగముపైకి ప్రవేశించినారు. నాడే సాహిత్యసేవా పరాయణత్వ కావ్యమునకు నాంది వాక్యము వీరు పలికిరి. నాటి నుండి నేటివరకు మేటికవులనెందఱనో



బావమరది శ్రీ జి. వి. చౌదరిగారితో

ప్రోత్సహించుచు - కృతికన్యల స్వీకరించుచు - కవుల గ్రాసవాసో దైన్యంబులు పరిహరించుచు 'విద్యా పోషకులై వినుతికెక్కిరి. కవిబ్రహ్మ శ్రీ ఏటుకూరి వేంకట నరసయ్యగారి 'మగువ మాంచాల' వీరింట వెలసినది. వీరి సహధర్మచారిణి వేంకట సుబ్బమాంబ హృదయమును నాచికొనినది. దంపతు లిరువురు కృతి భర్తలైన ఘట్టములు సాహిత్య ప్రపంచమున కలవేమో! అతి పరిశీలనము పైనగాని తెలుసుకొన జాలము. ఆ లోటును వీరిరువురు తీర్చిరి.

అనువాద గ్రంథములతో ఆరంభింపబడిన ఆంధ్ర సాహిత్యమునకు దేశీయత నశించినది. కవితావస్తువులో రచనా సంవిధానములో పదప్రయోగ బాహుళ్యములో సంస్కృత దాస్య మొనర్చుటచే నిసర్గములు జాతీయములగు గాథలపై నిరాదరణ ప్రబలినది. రామబాణపు వేగమును అభివర్ణింతురేగాని బ్రహ్మనాయని వాడి శూలపువాదర గుర్తింపరాయె. అభిమన్యుని యుద్ధ వర్ణనము వారి కంటికి కానుపించెనే గాని బాల చంద్రుని పౌరుషము పనికిరాదాయె. పంచభర్తృక పాతివ్రత్యమును ప్రశంసించిరేగాని, నాయకురాలి మంత్రతంత్రాంగ నైపుణ్యమునుగాని పగఱ గుండెలు బదాబదలొనర్చిన మగువ మాంచాల సాహస విక్రమములుగాని పేర్కొనరాయె. దేశీయగాథలను కవితావస్తువులుగా గ్రహింప ఆధునికులు సాహసించిరి. ఏటుకూరి కార్యాచరణమున చూపించిరి. శ్రీనాయుడుగారు అట్టిభావములనాదరించి అభిమానించి ప్రోత్సహించినవ్యక్తి. కావుననే కవిబ్రహ్మను పల్నాటి వీరకథా రచనమునకు ప్రేరేపించిరి. ఈ గ్రంథము వీరరసస్ఫోరకమే గాక కరుణరసపూరితము గూడ ప్రతిపద రసోదయము కలిగించునది భావిజన రోష విస్మయాపాదకములగు ఆంధ్రవీర కథానకములతో నిండినది. మగువ మాంచాల ప్రణయసుఖమునకు వెలియైన కొఱత తీర్చుటకై కవిబ్రహ్మ కావ్యశయ్యలలో వీర రస స్వభావ మోహనముగ దిద్ది తీర్చి అజరామరమగు కీర్తి ప్రసాదించె. 'ప్రాత క్రొత్తలందుల్లము చేర్చి' 'దేశి కవితోచిత మార్గముల గమించి' మధురమైన కవితాసవమును రసప్రాణులకు కళారాధకులకు పంచి యిచ్చెను. తెలుగు సంస్కృతి యందున్న చెలువమును చవిచూపించెను. తేనె సోనలు వర్షించు తెలుగు పలుకుబళ్ళు. నుడికారపు సొంపు నింపు సొమ్మెతలు - సందర్భోచితములు, సహజములగు వర్ణనములు - రసస్ఫోరకములగు సన్నివేశ కల్పనములు - సంప్రదాయ సిద్ధములు. మానవ సహజములగు సంభాషణములు గలిగి వీరి కవిత్వము దవుడారించుచుండును. వీరి శైలి ప్రత్యక్షర ప్రౌఢము, నవలావణ్య శరణ్యము అగుచు శిల్ప సంపదకు కాణాచి యయినది.

ఆధునిక సాహిత్యము పలుతెఱగుల, నలుదిక్కుల శాఖోప శాఖలుగా విస్తరిల్లినది. దీనికి ముఖ్య కారణము ఆంగ్లేయ విద్యాబోధనము. దానితో అధికారుల ఆధిక్యము అడుగంటినది. వర్ణాశ్రమాచార విధివమ్మైపోయినది. అగ్రకులములపై గల గౌరవభావము అణగారినది. ధనవంతుల నిరంకుశత్వము బలహీనమయినది సమతాసిద్ధాంతము ప్రచారమునకు వచ్చినది. జాతీయ భావమునకు బీజములు పడినవి. పరాపకర్షకు ప్రాతిపదికగాని మహోత్తమ భావము ఉత్తమ రూపములో మొలకలెత్తినది స్వస్థాన వేషభాషలపై ఆదరము ప్రబలినది విగ్రహారాధనము అపహాస్యముపాలు కాగా హేతువాదము ప్రాతినిధ్యము వహించినది. సంఘ సంస్కరణాభిలాషులు జాతిని దిద్ది తీర్ప ప్రయత్నించిరి. భావవిప్లవ వైతాళికులు, నవయుగ ప్రవక్తలు వివిధ రంగములలో వెలసిరి. రాజకీయ చైతన్యము ఒకవంక - సాంఘిక విప్లవము మరియొకవంక కలసి సాహిత్య పరిణామమునకు కారణమైనవి. అల్పముగనో. అధికముగనో ఆ పరిభావమునకు లోనుగానివారు లేరు మన నాయఁడుగారుకూడ అట్టి విప్లవవేత్తల ననుసరించినవాడే-వారి సందేశముల నాదరించినవాడే.

నిరుద్యోగ సమస్య కార్మికులలో అశాంతిని కల్గించినది. రైతులలో నీరస స్థితికి కారణమైనది. విశ్వాంతరాళమున విప్లవ భావ జీమూతములు గర్జించినవి. కార్మికలోకపు కళ్యాణానికి శ్రీ శ్రీ పెదవినుంచి నవ్య కవిత్వము జాలువారినది ఆ మహాప్రవాహ ఫలితమే శ్రీ దేవయ్యగారి 'కార్మికుడు' అను ఖండ కావ్యరచనా విర్భావము. అట్టి విప్లవవేత్తల నాదరించిన ఫలితమే నాయఁడు తత్కృతికర్తయగుటకు హేతువు. కార్మికుని దైన్యజీవితమును చిత్రీకరించు ఖండకావ్యము వీరు స్వీకరించిన ప్రప్రథమ కావ్యకన్యక.

చేసిన దానికి ఫలము చిక్కక తపించుకూలిసన్యాసి మనోవేదనము హృదయ విదారకముగా నిందు

చిత్రింపబడినది. దుర్భరారణ్యములలో రాచబాట నేర్పరచినవాడు కార్మికుడు. కొండరాలను బ్రద్దలుకొట్టి ఆనకట్టలుకట్టినవాడు కార్మికుడు. అట్టివానికా ఇట్టిహేయంపు బ్రతుకు. అట్టి కష్టజీవికా ఇట్టి దుర్మరణానుభూతియని వాపోయినాడు. కేవలము కార్మికునకే గాక కర్షకునికి గూడ ప్రాతినిధ్య మొసంగెను. పంటలు పండించినవాడు కర్షకుడు. మున్ప్రొద్దు ఎమ్ములు పిండిసేసుకొనును. కండలు కరిగించును. వేడి నెత్తురు ఆవిరియొనర్చును. ఎంత శ్రమించినను పట్టెడన్నమునకు మూరెడు పుట్టమునకు నోచుకొననిదీనుడు. కన్నతల్లియగు భారతాంబతో మంచి చెబ్బర లెంగించు ఘట్టము ఇందలి కవితావస్తువు. కవితానై దర్శించినది, ఎల్లరకు అనుభవైకవేద్యమయినది, కరుణరస ప్రధానమయినది ఆవేశపూరితమైనది, దైవకార్యముల పేరుతో స్వార్థపరులొనర్చునిరుపయోగములగువిగ్రహకల్యాణ మహోత్సవములు ఇందు నిరసింపబడెను. ఇట జాషువా మొదలగు కవీంద్రుల ప్రభావము స్పష్టమగుచున్నది. అలంకారిక రచనావిధేయమైన రచన కాకున్ననేమి ఆవేశపూరితమైనది. కవితా విలాసములతో బోధామృతమును పంచిపెట్టినది. సనాతన రచనా విధానములో నధునాతన భావ విప్లవము పచరించినది.

వీరు కృతిగొన్న పొత్తములలో 'ఆచార్య రంగా' చారిత్రక కావ్యమొకటి. ఒక రాజకీయ నాయకుని జీవిత చిత్రణము. రైతాంగ మహోద్యమ నాకధునీ శీకరములు పంచియిచ్చిన భగీరథుని జీవితచరిత్ర. జీవిత చరిత్రములు అన్య భాషలలో గద్యముల యందు వ్రాయుట పరిపాటి. ఆంధ్రమున అట్టివి కొన్ని పద్యరూపమును గూడ దాల్చినవి. ధారణ కనుగుణమను తలపుతోడనో, లయాన్వితమై శ్రుతిహితమగునను ఊహతోడనో, పద్యమువోలె గద్యము ప్రజాదరణ పాత్రము కాదను భయము తోడనో కవీంద్రులు అట్లొనరించిరి. ప్రొల్లి ఇతిహాసరచనము లిట్టివే. నాటి కృష్ణునికథ భాగవతమయ్యెను. కృష్ణునిబోధ భగవద్గీత రూపముదాల్చెను. అట్టివే గదా గాంధీ ఆత్మకథలు భావే ప్రవచనములు. ఆధునికాంధ్ర సాహిత్యమున ఇట్టి రచనములు అధికముగ వెలువడుచున్నవి. వీరపూజ ఒనర్చు తలపుతోడనో, లోకకళ్యాణసంధాయకములగునను ఆదర్శము తోడనో – జాతీయ భావప్రకటనా శీలము తోడనో ఇట్టి కావ్యముల పెక్కురు రచించిరి. అశ్వఘోషుని బుద్ధచరిత్ర మనువదింపబడెను. శివాజీ జీవితచరిత్రము 'శివ భారత'మను రూపుదాల్చెను రాణాప్రతాపసింహ, అమరసింహ చరిత్రములిట్టివే గాంధీ ఆత్మకథ యథాతథముగ అనువదింపబడెను. ఇట్టివే నెహ్రూ చరిత్రలు. ఆ కోవకుచెందిన మహోత్తమ గ్రంథములలో నొకటి ఈ "ఆచార్య రంగా." తెలుపసనెలంగిన 'జోసఫ్' దీని కృతికర్త. ఇందలి ఘట్టములు దండకవెలలువోలె విసువుగొలుపక – కళాఖండములై కావ్యత్వము నందెను.

సరళమగు రచనము, మార్దవములగు పదజాలములు, మనోహరమైన సమాస నిర్మాణము వీని కవనమున కలంకారములు. ప్రసాద మాధుర్యగుణ సంభరితమగు – ఆవేశపూరితమగు రచనావిధానము వీరిది. కథాకథనము పాఠకులను తన్మయుల నొనర్చు, 'అతులసంగీత విద్యా ప్రహర్షనాద భవ్యపరిపాటీ మాధురీపాకమెఱిగి' రచించిన రచనము–'అకలంక మధుర భావాలాపములదేల్చు' సత్కవీశ్వరుడు. జీవిత చరిత్రములకు కావ్యత్వ సంసిద్ధి చేకూర్చిన కళాతపస్వి. సీసపద్యరచనా చమత్కృతిలో శ్రీనాథుని తలపించును. ప్రకృతి వర్ణనా పారవశ్యము-గ్రామీణ జీవన వివరణము వీరి కవితకు సహజాలంకారములు. 'చక్రవర్తుల ముత్యాల శాలలందు కవులు కనలేని తెలుగు చక్కదనమును చూరలాడిన దేశికవిశేఖరుడు. ఒక్కొక్క ఘట్టమును ఒక్కొక్క ఖండకావ్యముగను, సమగ్రజీవితమును ఖండకావ్య సమాహారముగను రూపొందించెను. కొండొకచో తీయనగు మేలిమి మాటలు తాయము పెట్టును. మరియొకచో రసానుసారమగు పరుషాక్షర ప్రయోగరచనా సామర్థ్యము చవిచూపును. శేషగుణోన్నతమై "మాడకు మాడ యెత్తుగల మాటలతో' రసపుష్టి భావసంచారముతో వెలుగొందు నీతని కవితా సౌభాగ్యము గంగానిర్ఝరిని పోలుచుండును.

నాయుడుగారు కృతిగొన్న వేరొక గ్రంథము అమరుకము గీర్వాణమున ప్రశస్తి వహించిన ముక్తకము. మనోహర శృంగారకావ్యము. కృతికర్త శ్రీ శంకరప్రసాద్. అతిచిన్ననాటనే మిన్నయగు కవిత్వముచెప్పిన కవికిశోరుడు, శ్రీ శంకర ప్రసాద్ లలితకళాసమితి నెలకొల్పిన కళాతపస్వి. గోదావరీ

పావనోదారవాక్పూరముల కవితా సస్యములు పండించిన కవితల్లజుడు. శృంగారమును రస రాజముగా గుర్తించిన రసికుడు కవితను త్రపస సంస్కృత మొనర్చిన పండితుడు. ఆలంకారిక లక్షణములకు లక్ష్యముల ప్రసాదించిన 'అమరుకము'ను ఆంధ్రీకరించి తదభిమానమును చాటిన మేటి ఇతివృత్తము లేని ప్రబంధము కథ కానని కావ్యము అయిననేమి ధ్వనిప్రాధాన్యమై, మనస్తత్వ నిరూపణ మొనర్చి, శైలీసంవిధానమును గూర్చుకొని రసోత్తరమయిన కావ్యమయినది. కవికోకిలుడు సైతము అనవద్యహృద్య మృదుమధుర ప్రబంధముగా తీర్చిదిద్దెను. తొల్లిటికవులవలె ఇతివృత్తమును స్వకీయ మొనర్చుకొని స్వతంత్రానువాద మొనర్చెను. యథా మాతృకయయ్యు ఉత్తమ సహజౌచితీ మధురదర్శన మిచ్చినది వీరికృతి. సరసశృంగార భావసంసక్త వీరి కృతికన్య. కావుననే నాయని లలితకవితావిలాసమెన్ని, రసజ్ఞతకు మెచ్చి వరునిగా వరణం బొనర్చినది.

'కప్పురంపు' చావి గుప్పున వాసింపగా కొండవీటి సుకవి కుంజరు నుడికారము ఆటవెలదుల రూపమంది 'నాయని' వరించెను. మామ, అల్లుడు భిన్నశరీరులయ్యు ఏకమానసులే. కవిరాజు పథమును అనుగమించెడివారు. అనుసరించెడివారు మతము మనుజుల పాలిట మత్తుమందుగా గుర్తించిన బుద్ధునివాక్కు జీర్ణించుకొనిన వ్యక్తులు. విగ్రహారాధనమాది మూఢాచార జీమూతములు విచ్ఛిత్తి నొనర్చిన రామమోహనుని బ్రహ్మసమాజ సూత్రముల నాకళించి కొనిన దిట్టలు. అగ్రకులజులు స్వార్థబుద్ధితో యొనర్చిన దౌష్ట్యమును చాటిచెప్పిన కందుకూరి అనుయాయులు. బూతులబుంగలై యున్న ప్రాతపురాణములను హేతువాద దృష్టితో తర్కించి చారిత్రక సత్యములు వెలార్చిన కవిరాజు శిష్యులు.

శతకరచనము ఆంధ్రభాషా వ్యక్తిత్వమును నిలబెట్టగల విశిష్ట ప్రక్రియ. ఆత్మాశ్రయానుభవములను ప్రత్యక్షముగ వివరించుటకు వీలయినది. సూక్తులుగా తెలుగునాడు వెలసినవి. ప్రజలనోట మెరసినవి. మహాకావ్యకర్తలుగూడ శతకరచనా విధానముపై మక్కువ జూపిరి. కావుననే సప్తశతులు పంచశతులు మొదలగునవి యెన్నియో వెలసినవి. అందులో కొండవీటి' త్రిశతి యొకటి. కేవల శతకమాత్రమే గాదు సాంఘిక విప్లవమునకు ఆధారమయినది. సంఘ సంస్కారమునకు మూదల అయినది. నిశితము - మేధావిలసితము విజ్ఞాన సంధాయకము అగు భావములతో నిండినది.

శతకరాజము మూఢ విపక్ష పక్షముల బెదర గొట్టెను. జాత్యహంకార దుర్మద మోహమ్ములను విచ్ఛిత్తియొనర్చెను. పండిత బ్రువుల కపట రూపములు ఖండించెను. పురాణపు గోలుకొండలను బదాబదలొనర్చెను. దైవపూజ 'లంచమిచ్చి తగిన మంచాల నందగా దేవురించు వారి' కృత్యముగా దీన అపహసింపబడినది. దైవమును గూర్చి 'టక్కునేర్చిన' కవులు వేదాంతులొనర్చిన నిర్వచనములు నిశిత విమర్శలతోఖండింపబడెను. బుద్ధునివేమనార్యునిగాంధీని గూర్చిన విషయములు గలవు. లలితమగు హాస్యము గ్రంథపఠనాసక్తిని ద్విగుణీకృత మొనర్చు చుండెను. పూర్వశతకకర్తల భావములుగూడ కొన్ని లేకపోలేదు. అవి కేవల విమర్శనాత్మకములగు ఖండనములుగా గాక బోధాత్మకములగు సూక్తులుగా వెలుగొందెను. తెలుగు దేశ వ్యవహారములగు కొన్ని సామెతలిందు పద్యరూపముదాల్చెను. రచనా విధానమున వేమన కవిని మార్గదర్శకునిగా గొనెను. ఎంత సంక్లిష్టమైన భావమునైనను చిన్ని ఆటవెలదులలో ఇమిడ్చి అల్పాక్షరముల అనల్పార్థ ఘటనము సాధించెను, ఉపమానసారూప్యములతో అర్థాంతర న్యాస చమత్కృతులను జోడించి పాకముపట్టెను తెలుగు నుడికారపు సొంపు గూర్చుట ఇతనికి- ఉగ్గుపాలతో నేర్చినవిద్యయే పెంకెకు పెంకెయై పురాణ సంహితలలోని బొందులు రంకులు వెలికిబుచ్చెను.

శ్రోతయై కవితను వినుటయేగాక, రసికుడై ఆనందించుటయేగాక కవియై నాయడు కలమునుపట్టెను. సాహిత్యానందముతో నుప్పొంగిన నాయని అవ్యక్త భావము గేయరూపమున వెలువడెను. 'ఎదలోన కదలిన భావము మదిలోన కుదురుటకు కొంతకాలము-మదిలోన కుదిరిన భావము పెదవిదాటుటకు మఱికొంత కాలము-పెదవిదాటిన భావము ఒంటిగా పాడించుటకు మఱికొంతకాలము గడిపి నేటికిపూలగుత్తుల రూపమున షష్టిపూర్తికి సాక్షాత్కరించినది.

పద్యకవిత్వము నాగరకమై విద్వల్లోకమున సుప్రతిష్ఠితము కాగా, పదకవిత్వము నిసర్గమై సజీవ

మయినది. దీనిలో ప్రధానమైన విభజనములు గేయశాఖ - పదశాఖ. మొదటిది గానాంశము ప్రధానమైనది. కవిత్వాంశము ప్రాధాన్యమునందినది రెండవది. పూలగుత్తులలోని గేయములన్నియు గేయశాఖకు సంబంధించినవి. బాటసారి మొదలగునవి పదశాఖకు సంబంధించినవి.

శృంగారమును రసరాజముగా దర్శించి ప్రదర్శించెను. వరూధిని - పూలగుత్తులు, స్వప్నసుందరి లక్ష్యములై వెలయుచున్నవి. 'కోటివిద్యలు తమ్ముడా! నీకొంప్రడకొదుగును తమ్ముడా!' యని కర్షకాభిమానమును ప్రకటించిన కర్షక కవి శ్రీనాయఁడుగారు.

ప్రకృతి వర్ణనా పారవశ్య మధికము. మానవ ప్రవృత్తి చిత్రణము స్వాభావికము. కుహనా ప్రవర్తకులపైన కోపము - అధికార దుర్వియోగపరులపై ఆగ్రహము దైవభక్తి, పరహితాసు రక్తి యనిన మమకారము ఇందు ద్యోతకమగును. శీలమే ప్రాధాన్యమని గుర్తించిన శీలవ్రతుడు. కులతత్వములు మొదలగు మూఢాచారముల నిరసించు సాంఘిక విప్లవమును గోరెడి వ్యక్తి జాతీయ భావముతో దేశరక్షణమాకాంక్షించు దేశభక్తిపరుడు, విశ్వమానవ ప్రేమను రూపించిన శాంతి కాముకుడు.

కెన్నెడీ శాస్త్రిగార్లపై వ్రాసిన విషాదగేయాలు వారికి చలువరాతి సమాధులై సాహిత్య ప్రపంచమున శాశ్వత స్థానము నాక్రమించినవి.

బాటసారి పద్యములు మకుటాయమానము లయినవి. వేమనఆదర్శమును సంస్కారదృష్టిని పుణికిపుచ్చుకొనిన వాడగుట - కొన్నియెడల పూర్వకవుల పలుకులనే నవ్యరీతిని నాట్యమాడించెను.

ఈక్రిందిపద్యమునుచూడుడు.

"పాముకాటుకంటె బడబానలముకంటె
పిడుగుపాటుకంటె బెడిదమగును
నోటిమాటలేని నొసటితోనవ్వెడి
ఆటగానిచేష్ట బాటసారి" —

ఇందలి రచనావిధానము అసామాన్యము. దివ్యవాణీ ప్రసన్నమేదో యుండియుండవచ్చును. కాని నాడిట్టి కూర్పు - జిగిబిగి కష్టసాధ్యము, ఉపమా సాదృశ్యములతో భావములకు ముద్రవేయు నేర్పు వీరికి అలవడినది. అప్రస్తుత ప్రశంసలలో నీతులు వెలయించు విధానము అపూర్వమయినది.

వీరిగేయములకు ప్రమోదులను చిగురించు శక్తి వీరి పద్యములకు నాడులను పొంగించు శక్తి కలదనుట సుస్పష్టము.

నాయఁని షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున 'విద్యాపోషకుని' తనంత తా వలచి పరిణయమాడిన కావ్యకన్య 'సమదర్శి'. రాష్ట్ర గానముతోపాటు ఉదయగాన సర్వోదయ గానముల నాలపించి; పలిగపంటలనే గాక పైర పంటఁను పండించి; 'ఆత్మార్పణముతో' 'ధర్మజ్యోతి'ని వెలిగించి; 'ఆత్మ కథ'కు తోడుగ 'మహాత్మ కథ' వినిపించి; 'తెలుఁగు నీతి'తోపాటు 'భగవద్గీత' బోధించి తెలుఁగు నేలల చెఱగని కవితాముద్రవైచిన 'అభినవ తిక్కన' ఏతత్కృతి పరిదాత. ఆభిజాత్య గౌరవముతో రాణించుచు, శీలసంపదతో వెలుగొందుచు, సహజమగు చెలువముతో దీపించుచు సహృదయ హృదయాహ్లాదన మొనర్చు నీ పొత్తము ఒక విలక్షణమైన కావ్యము.

'దేశభక్తు నందు దీనుని యందును
జెమట నోడ్చి బ్రతుకు జీవియందుఁ
గరుణ సూనృతమ్ము కలవాని యందును
వాసుదేవుఁజూచు వాఁడు సుకవి'
అనెడు సూక్తి గ్రంథమున కెల్ల ప్రాతిపదిక -
'ప్రేమ గలచోట సిద్ధాంత భేదభావ
విముఖత నశించు నంచు రూపించు'టయే -

ఇందలి ప్రధానాంశము. వివిధరంగముల ప్రసిద్ధివహించిన విజ్ఞానులను గూర్చిన ప్రశంసలు; నీతి బోధకములు, చాటు ప్రాయములౌ ధర్మప్రవచనములు ఇందలి కవితా ఖండికలు. అవియన్నియు కవిగారి ఆత్మీయతా ద్యోతకములు. ఈ కబ్బము కవిగారి సమదర్శనమునకు విజయపతాక. చెఱగని ఆంధ్రాభిమానమును సాక్షాత్కరింపజేయు దర్పణము మూర్తీభవించిన జాతీయభావమునకు పట్టుగొమ్మ. విశ్వసౌహార్ద దృష్టికి గీటురాయి, గాంధేయ తత్త్వప్రతిపాదనమునకు భద్రాసనము. గుణగరిష్ఠుల, నిస్స్వార్థ ప్రజాసేవకుల సాధు గుణముల ప్రసరించు కాంతిపుంజము.

అడుగడుగునకు హేతువాద దృష్టి, అణువణువునను మానవతావాద సంపుష్టి.... నంది భావ విప్లవమును

గోరు సీతారామమూర్తిగారు భాషా విషయమున మాత్రము శుద్ధశ్రోత్రియు లగుట నియమబద్ధము. నిపుణము నైన వాడిగల వేడి పలుకు కృతి నెల్లెడల కన్పించును. వేయేల? కావ్య సృజనాత్మక శక్తి, పాండిత్య పరికర్ష, విమర్శనా దృష్టి ఒకచో మూర్తీభవించిన విద్వత్కవి శ్రీ తుమ్మల వారి కవితాకన్యకకు ప్రియులై వరలిన శ్రీ నాయఁడుగారు ధన్యులు.

కేవలము మైత్రీ ధర్మాపేక్షతో, సంక్రాంతి సమావేశము పురస్కరించుకొని 'విద్యాపోషక' బిరుదాంకితులగు మన పాములపాటి బుచ్చినాయఁడుగారికిఇచ్చిన 'ప్రేమోపహారము' 'సరోజిని' గ్రంథము పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు కృతికర్త-ప్రదాత.

సాహిత్యముతో సౌహిత్యము సాధించువారు,పాండిత్యముతో సౌశీల్యముపెంపొందించుకొనువారు, బహు స్వల్పము. శాఖోపశాఖలుగా తాను విస్తరిల్లుచు తన నీడలో ఏ మొక్క గూడ యెదుగుటకు వీలులేకుండ చేయు 'మఱ్ఱిచెట్టు' వలె గాక, తనతో పాటుగా పలువురను వైహాయస వీధీ విహారానికి తీసుకొని పోవు పుష్పక విమానము వలె జీవించు ప్రముఖుల కోవకు చెందిన వారు శ్రీ గొర్రెపాటి. సాధించిన ప్రగతిని మాత్సర్యాగ్నితో బూడి చేసుకొన కుండా; అహంకార విషముతో మలీమసము చేయకుండా ప్రేమామృతముతో పెంపొందించి కల్పకవృక్షముగ రూపొందించువారిలొ నొకరు శ్రీ గొర్రెపాటి. పెద్దలలో పెద్దగా — విజ్ఞానానికి వృద్ధుగా; చిన్నలలో చిన్నగా ఉత్సాహమునకు చిన్నెగా నొప్పు సహృదయ శేఖరుఁడు శ్రీ గొర్రెపాటి.

కావుననే 'పండితన్నెహూచే' 'సర్వప్రియ'గా కీర్తింపబడిన సరోజినీదేవి జీవిత చరిత్రము వ్రాయు భావము చిగురించినది. వ్రాయు దక్షత చేకూరినది. భిన్న సాహితీ ప్రక్రియలతో విస్తరిల్లుచున్న ఆధునిక గద్య సాహితికి అలంకారప్రాయ మయిన దీ గ్రంథము. దండకవెలలు వోలె విసువు గొలుపక దస్తావేజు మతలబుల వోలె విసువు గొలుపక సుగమమైన మార్గములో సుందరమైన శైలిలో రచింపబడిన దీ జీవిత చరిత్రము. విషయమునకు విరసముగాని సహజమైన చమత్కృతిఁగూర్చి ఉదార వృత్తమును కళాకమనీయముగా తీర్చిదిద్దిన మిన్న శ్రీ గొర్రెపాటి.

జీవిత ఘట్టములను పరిచయము చేయుచు-సంఘటనలను రసపోషకములుగా అభివర్ణించుచు-విషయ విశదీకరణ గావించుచు-వానిపై ఇతరుల అభిప్రాయములను ఎఱుకపరచుచుజీవితచరిత్రరచనాసంవిదానమునకు విశిష్టత సాధించినమేటి శ్రీ గొర్రెపాటి. వీరి సరోజిని గ్రంథము సర్వాలంకార శోభితమై రసికలోక పూజ్యమై, ఆస్వాదయోగ్యమగుచున్నది.

అట్టి సరోజిని గ్రంథమును కృతిగొన్న విద్యాపోషకులు భిన్న ప్రక్రియలను సమాదరించిన సరసులుగా సాహితీ లోకమున శాశ్వత స్థానమునలంకరించి సుప్రతిష్ఠితు లగుచుండి రనుట నిర్వివాదము.

ఇట్లు విద్యాపోషకులుగా-సాహితీపీఠ స్థాపకులుగా-కృతి కర్తలుగా - కృతి భర్తలుగా-కవి పండిత పోషకులుగా నాయఁడుగారు నిర్వహించినపాత్ర అద్వితీయమైనది.



# విద్యాపోషకుని స్వీయ రచనలు

## జోతలు

పలుకులు దిద్దెడు పండితులారా !
కలమును పట్టెడు కవివరులారా !
గాన మొనర్చెడు గాయకులారా !
భాష మెఱింగెడు భావుకులారా !
అందఱు దయతో నాశీర్వాదము
లందగ జేయుడు వందలు వేలుగ
వందన శతములు భక్తి నొసంగెద
"పూలగుత్తులను" పూజ లొనర్చెద.

## కేల్మోడ్పు

ఎన్ని ఏండ్లో వేచి వేచీ
ఎన్ని నోములొ నోచి నోచీ
కన్న వారలు నన్ను మిన్నగ
హద్దు పద్దులలోన నిల్పి
ముద్దు ముద్దుగ పెంచినారలు
ఎంత కాలమునుండియో తా
మేర్చి కూర్చి దాచియుంచిన
సంపదల నా కొసగి, జీవిత
సాగరమ్మున నావకును చు
క్కాని పట్టగ కరుణహృదయను
కాంతగా కడు ప్రేమతో నిడు
తల్లిదండ్రుల పాద పద్మము
లెల్లవేళల పూజ సేయగ
'పూలగుత్తుల' గేయ గీతుల
కేలుమోడ్చెద భక్తితో.

## సొంతసొద

ఎదలోన కదిలింది
మదిలోన కుదిరింది
పదశక్తి లేదంచు
పెదవి కదపకపోయె
దారితెన్నులు పీడెగా !
నోరు మెదపకపోయెగా !
మదిలోని సొద చెప్ప
పదములేలా యంచు
అదరుచును బెదరుచును
పద మెత్తి యీ రీతిగా
భావరూపము జంటగా
పాడించె నన్నొంటిగా
నాలోన కలవైన
నవ్యతను నేర్పింది
సాలోచనముతోడ
సరసకే చేరింది
మధురహాసము చిందగా
మంజీరములు మ్రోయగా
మన్నించి వినువీధి
మా చందమామయ్య
నన్నెంతొ దీవించె
నవ్వులో నను ముంచె
మోడులే చిగురింపగా
నాడు లన్నియు పొంగగా.

'పూల గుత్తు లు'
బండకావ్యమునుండి గ్రహింపబడినవి

# పూల గుత్తులు

అతడు : గుత్తులు గుత్తులు పూలగుత్తులూ
సరసానికి సంపెంగ గుత్తులూ
మగువల కింపగు మల్లెగుత్తులూ
చానలు గోరే జాజిగుత్తులూ
గుత్తులు గుత్తులు గులాబి గుత్తులు
తెచ్చితినే నీ కిచ్చెదనే !!

ఆమె మాయలమారీ మామయ్యా !
మల్లెల జాజుల మాకేలా
సరసానికి మామయ్యా ! నా
సరసకు నీవే రావయ్యా !
సరసానికి నీకన్నా — ఈ
సంపెగ లౌనా మిన్న
ముచ్చట తీర్పగ మామయ్యా !
వచ్చితి వంతే చాలయ్యా !!

అతడు వచ్చితినే నే నచ్చితినా మనసిచ్చితివా
కనువిచ్చిన చనువిచ్చిన మనసొచ్చును!

ఆమె ఎదురొచ్చిన వారికెల్ల మనసిచ్చెదనా
మనసిచ్చినచో మగువకు కలసివచ్చునా
అమ్మానాన్నల మనసొచ్చినగాదా

అతడు మదిలోవుంటే మగువా
ముదము తీర్పరాదంటే
అమ్మానాన్నల ఆమోదం
అడిగెదనే నే నడిగెదనే

ఆమె : ఆమోదం కొఱకే గాదా
అమ్మానాన్నా అలసిపోయిరి
ఆలసింపకా రావోయీ !!

అతడు : తియ్య తియ్యని తలపులతో
నిండెను నా మనసెల్లా
అత్తామామల నడిగెదనే — నే
నత్తా మామల నడిగెదనే

ఆమె : ఇంతకాల మాశించినదీ
ఇల్లా తీరె మహేశా !
నీ కరుణవల్ల పరమేశా !
పూజాఫలమది పూరిగ నిచ్చిన
రాయడా ! నెలరాయడా !
రారా నా నాయడా !

అతడు : అందించెదమా పెద్దలకు
డెందమునందలి కోర్కెలను
మందగమన ! మాటాడ వేలనే
కుందరదన ! సిగ్గందనేలనే

ఆమె : మామా ! మామా ! మధువును గ్రోలీ
ఎగిరే ఎగిరే తేనెటీగలను
చూచినంతనే తలపు ల వెన్నో
కలుగుచు నున్నవిరా — మరి
కులుకుచు నున్నవిరా

అతడు : మాటుమాటా చెప్పగలనా
కమ్మనీ వెన్నెల్లో రాత్రులు
కలవుదీరా అనుభవింపా
ఊరు వదలీ పేట వదలీ
హాయి గొలిపే చోటు కెడదామా !

ఆమె కలసిన మనసులు వలసిన వలపులు
తలచిన తలపులు తీయని తలపులు
కలసిన గౌరీపతు లాదర్శము
నచ్చిందీ మనసొచ్చిందీ

అతడు కన్నుకొలకులు కలువపూవులు
చేటిమాటలు చెఱకుతీపీ
ఏటి యొడ్డున తిరుగుచుండే
సాటి కాంతలలోన నీవే
మేటివని నే నెపుడొ యంటీ
బాసచేసి చెప్పుచుంటి
సరసమున సంగీత సాహి
త్యముల జంటగ జంట గలిపీ
సారమగు సంసారమును — మన
సార కొనసాగింతమా !

ఆమె : ఋతువులన్నీ గడిచి పోయెను
ఋతువు దప్పెను వ్రతము పండెను
తల్లి దండ్రులు సంతసించిరి
నందనము ఆనంద మొసగెను.

ఇద్దరు : వెడలుదము మన మేడుకొండల
వెంకటేశుని కనగ వేడుక
మగువలకు గల మమత దీర్చిన
మంగమాంబను జేరి కొలువగ.

## తమ్ముడా

చదువుకొన్నను చదువకున్నను
పదుగురకు నన్నమును పెట్టెడి
సొంత సేద్యము వదలబోకుము
వింతబుద్ధులు మెచ్చబోకుము
దారి తొలగకు తమ్ముడా! విను
పారిపోవకు తమ్ముడా!
కలము పట్టిన కరముతోనే
హలము పట్టియు దుక్కి దున్నుము
పొలము పండిన పొట్ట నిండును
పొలము ఎండిన పొట్ట ఎండును
కోటివిద్యలు తమ్ముడా! నీ
కొండ్ర కొదుగును తమ్ముడా!
కులము కులమని కొంతమందిని
బలగముగ జేకూర్చి తియ్యని
పలుకులాడుచు మతు జల్లుచు
నిలువుదోపిడి చేయు నేతల
మాటనమ్మకు తమ్ముడా! ఆ
బాట త్రొక్కకు తమ్ముడా!
నలగిపోయిన మనకు నాగలె
కలచిపోయిన మనకు కొడవలె
మలగిపోయిన మనకు పొలమే
తలగిపోయిన మనకు గోవే
కల్పవృక్షము తమ్ముడా! మన
కామధేనువు తమ్ముడా!
దుక్కి దున్నెడి వారి కెల్లర
కొక్కటె కులమనుచు తెల్పర
ముక్కముక్కల మనల జేసెడి
టక్కరులకును తలను వంచకు
పదవి చిక్కిన తమ్ముడా! నీ
పార వదలకు తమ్ముడా!
అన్నమో శ్రీరామచంద్రా
యన్న పలుకులు చెవుల దాపున
కెన్నటికి రాకుండ ప్రాణుల
కన్నిటికి మేలే తలంపుము
నిన్ను గన్నాని తమ్ముడా! ప్రజ
వెన్నగావలె తమ్ముడా!

## సంక్రాంతి

రావోయి నేస్తమా!
రావోయి నేస్తమా!

చల్ల చల్లనిగాలి
చలువ వెన్నెల రేయి
పచ్చ పచ్చని బయలు
పల్లంపు లోయలో
మధుర సంక్రాంతి యిది
మన మొక్కటైపోయి
గొంతు గొంతూ కలిపి
కుహూకుహూ ధ్వనులతో
పగలనక రేయనక
పాటుపడు వారలకు
ఫలము లీగల మంచి
పండుగల రోజు లివి
పండబారిన పండ్లు
కొండ కోనలనుండి
తేనెధారల మనకు
త్రేపగా త్రాపగా
సెలయేటి యిసుకపై
సేద దేరిన మనకు
ఇంత కంటే స్వర్గ
మింకేమి కలదోయి

రావోయి నేస్తమా!
రావోయి నేస్తమా!

## మోసగాడు

పరుల నరులగా
భావింపని చెడు
నరులకు దశరథ
నందను జపమే

మోక్షము నీయదు నరుడా !
పాపము పోవదు నరుడా !

అధికారమ్మున
కత్తులు చాచుచు
పరుల డబ్బుతో
ప్రాకారమ్ములు

వరుసగ దీర్చిన నరుడా !
పాపము పోవదు నరుడా

రామనామ పా
రాయణ చేసిన
మాయని మచ్చలు
మరుగునందు పడ

నేరవు నేరవు నరుడా !
పాపము పోవదు నరుడా !

చెసిన పాపము
గోచి నుండగా
కాశి కేగినను
గలుగదు సుఖమను

ప్రాత చదువు నో నరుడా !
పాటింపుమయా నరుడా !

## సోదరా

నోరు మెదపక పోరుపెట్టెడి
క్రూరు లుండిన పారతంత్ర్యము
మనల విడువదు సోదరా !
మంచి రాదుర సోదరా !

కష్టములకును నష్టములకును
నిలిచి శత్రుల గెలిచి తెచ్చిన
సొంతపాలన సోదరా !
జారవిడువకు సోదరా !

అల్లరికి దిగు పిల్లజెల్లల
అదుపు పెట్టక మెదలకున్నను
ఎల్లవారికి సోదరా !
ఎగ్గు గల్గును సోదరా !
మేలి బ్రదుకని చెమట నోడ్చక
కాలు కదుపక ప్రొద్దు పుచ్చిన
ఎదిరిమూకలు సోదరా !
బ్రదుకనీయవు సోదరా !

## బాలికలు

అదరుచు బెదరుచు ఆటలాడుచూ
పాటలు పాడుచు బాగుగ నుండెడి – బాలికలు
మాయా మర్మము మదిలో నెరుగక
కల్లా కపటము కనివిని యెరుగని – బాలికలు
తెల్లని వెన్నెల వెల్లి గొల్పగా
రంగు రంగు లగు రవికలతో
మెడలో పూసల పేరులతో
తలలో పూవుల దండలతో
మాలికలల్లే మసలే సిసలౌ – బాలికలు
చెంగు చెంగున చిందులు త్రొక్కుచు
ఘల్లు ఘల్లున గజ్జెలు మ్రోయగ – బాలికలు
కిలకిల నవ్వుల జల్లులె పువ్వులు
బృందావనమని భ్రమ గొల్పెడు ఈ
బృందము మా కానందము నొసగెడు–బాలికలు

## హెచ్చరిక

లేదురా మఱి లేదురా
మరియాద వానికి రాదురా ! సోదరా !
పరుల సొమ్ముల బాముకొనియెడి
వంచనాత్ములతోడ వాదము
పెంచుకొన నీ మంచితనమే
పోవురా లాభము లేదురా, సోదరా !
మంచివారల నింద చేయుట,
మంచిపనులకు నడ్డు చెప్పుట,
మంచితనమును నేవగించుట
పంచభక్ష్యాన్నమ్ముగా – పర
సంచితార్థము నారగించుట,
బాటరా యది పరిపాటిరా, సోదరా !
బాధపడి పండించి పెట్టిన
'పాప'మని నోరార బలుకని
పాపకర్ముల కొలువు మన కిక
కీడురా, బాధలు మూడురా, సోదరా !

## చిత్తజల్లులు

చిటపట చినుకుల
చిత్త జల్లులకు
తడిపొడి గుడ్డలు
తనువు లంటగా
కదిలి వచ్చిరీ
కన్నెలు కొందరు
కలువ పూలవలె
మిలమిల మెరయుచు
చేరి నిలిచి రొక
చెట్టు చాటుగా
అప్పటి కప్పుడె
అచ్చట మూగిన
పొగరుబోతుల
చూపుల పల్కుల
కాత్మలు తత్తర
మందు చుండగా
పరువు నిల్పుకొన
వాన తడియుచునె

## ముద్దుపాపాయి

ముంగురులు పైనాడ
మురిపమును గొల్పుచును
ముదురు రేయెండలో
మొక్కవోవని యంద
చందాలతో నిదే
ముందునకు వచ్చె మా
ముద్దుపాపాయి

సందుగొందుల నాడి
చల్లగా మెల్లగా
తల్లికన్నుల గప్పి
తడబడుచు తడబడుచు
ఒంటరిగ తా నొకడె
యింటిమొగమైనాడు
మా ముద్దుపాపాయి

పాటలో ఆటలో
పాపాయి నవ్వులో
పల్లవించిన వెల్గు
చల్లగా చల్లగా
ఉల్లమ్ము వలగొంచు
ఉల్లాస మెసగొల్పె
ముదుపాపాయి

చెక్కుటద్దాలపై
చిందించు తననీడ
ఒక్కటే రూపమై
యొడలెల్ల పొంగింప
పక్కుమని నవ్వించె
పాపాయి తల్లినే
మురిపించె మమ్ములను
ముదు పాపాయి

మగవారల దు
ర్మార్గ మెంచుచునె
బితర చూపుల
బిర బిర తరలిరి

# మా పాపాయిలు

మల్లెలు మల్లెలు
మంచి మల్లియలు
గజ్జెల మ్రోతలు
ఘల్లుఘల్లుమన
గునగున వచ్చె
మా పాపాయిలు

అయ్యవారికడ
అల్లరి చేయక
పలకాబలపము
పట్టి ముద్దుగా
వ్రాయుచు చదివే
మా పాపాయిలు

వెన్ను జారునను
వ్రేలు జడలతో
ఒయ్యారముగా
ఒరపు మెరపుగా
కులుకుచు నడిచే
మా పాపాయిలు

అందచందముల
చందమామలన
అలరుచు తిరుగుచు
ఆనందంబుగ
చిందులు త్రొక్కే
మా పాపాయిలు

సన్నని వలువలు
సంతరించుకొని

తో నాడుదురీ మా పాపాయిలు

వసంతఋతువే
వచ్చినదో యన
వన్నెలచిన్నెల
వైఖరి మింతురు మా పాపాయిలు

అలసి సొలసి యరు
ణారుణ కాంతుల
ఆనందంబును
అమ్మకు గూర్తురు
మా పాపాయిలు

# ముద్దు కృష్ణా

వ్రేపల్లెలో మమ్ము
రెచ్చగొట్టావయ్యా
మా పల్లె నంతటిని
మరులు గొలిపావయ్యా
ముద్దుకృష్ణా!

కామితార్థము లిచ్చి
ప్రేమింప జేసితివి
గోవర్ధనం బెత్తి
గొడవలను మాపితివి
ముద్దుకృష్ణా

చల్లగా వచ్చితివి
చల్లంత త్రాగితివి
వెన్నెలను వచ్చితివి
వెన్నంత మ్రింగితివి
ముద్దుకృష్ణా!

పెరుగు త్రావగవచ్చి
మరి దొరకిపోయితివి
మధురానగరి కేగి
మమ్ములను మఱచితివి
ముద్దుకృష్ణా!

గొల్లలంచును మమ్ము
కొంచె పఱిచెడివారి
కెల్ల కన్విప్పుగా
నెత్తితివి జన్మమ్ము
ముద్దుకృష్ణా!

మరవంగలేమురా
మాయదారీ కృష్ణ!
విడువంగ లేమురా
విను యశోదాకృష్ణ!
ముద్దుకృష్ణా!

కాపాడరావయ్య
మాపాలి దేవుడా!
నీ పాదపద్మాల
నెమ్మదిని నమ్మితిని
ముద్దుకృష్ణా!

# మన దేశం

దేశందేశం మనదేశం
భారతదేశం
భారతదేశంకోసం
యీ సమావేశం
చిరకాలంగా
పరపాలననుండి
శివాజీ కాపాడినదేశం
మహాత్ముడైన
గాంధితాతయ
గడించినది యీ దేశం
మనదేశం
కాపాడగ ఈ అవకాశం
సదవకాశం ॥దే॥
ఆవేశంతో
ఠంగుమని "టుంగుని"
ఛెంగున "చింగుని"
గిరగిర త్రిప్పి హిమగిరిపై
ఠంగు ఠంగున టుంగుని
ఛెంగు ఛెంగున చింగుని
ఉత్తర సరిహద్దున
మత్తు దిగిందాకా
సత్తువకొద్దీ కొట్టాలి
అని సందేశం
మనపెద్దల ఉద్దేశం ॥దే॥

# ఏడుకొండలవాడ

ఏడుకొండలవాడ!
వేంకటేశుడా!
మేలుకొన్నావా
మేలుకొలుపులు మేమె పాడుచున్నాము
మగువలా పాలిటీ
మంగమ్మ తోడుండ
అభయ మీయగ వేగ రావయ్యా!
భజియించువారికీ
బాలాజి బాబయ్య
ఏడు కొండలపైన
వెలిగేటి వెంకన్న
ముద్దులొలికే మోము
మోహనాకారా
పాలు పరమాన్నమూ
పంచభక్ష్యములూ
ఆరగించే తండ్రి
అంజలీ చేతు
కరుణించ రావయ్య
కాంచన చేలా!
సిరు లిచ్చువాడ! ఓ
శ్రీనివాసయ్యా
శంఖచక్రాధరా
శరణంటి నిన్నూ
మదిలోన కోరికలు
మన్నించవయ్య
గోవింద యని నిన్ను
కొలుచుచున్నాడ.



శ్రీ గుమ్మడి – శ్రీ నారాయణరెడ్డి – శ్రీ కౌసరాజుగార్లతో, మనుమలు మనుమరాండ్రతో నాయుడు

# ...లుంగు వెలుంగు

తెలుగువాడా!
కలిగినోడా!
నలిగినోడా!
తెలియరా ఆ నాటి తీరూ తెన్నులూ
దేశమందున తెలుగువాడే
తేజరిల్లెను నాడు – నేడూ,
శకమునే స్థాపింపగల్గిన
శాలివాహనుడూ,
తెలుగువాడై ఉన్నమాటను
తెలియరా ఓ తెలుగువాడా! ॥తె॥

దక్షిణాదిని సేతువును – శ్రీ
కాశికాపురి హద్దొనర్చియు
బద్ధదీక్షను బౌద్ధమతమును
వృద్ధి చేసిన దెవరురా!
ఆర్యనాగార్జునుని శిష్యులేగా!
ఓ తెలుగువాడా!
తెలియరా! ఈ పూర్వ వృత్తమునూ ॥తె॥

పాటలీపుత్రంబు దాకా
పట్టిరీ పట్నాల నెన్నో
వైరులను చెండాడి కీర్తికి
వారసులుగా నైరి తెలుగులు
వారిగాథలు మఱచి పోకుమురా
ఓ తెలుగువాడా!
తెలియరా నీ జాతిశౌర్యమునూ ॥తె॥

విద్దెలందున గద్దె నెక్కి
ఢిల్లీదాకా పేరుమోసీ
పాదుషాచే బిరుదు లందిన
అట్టి పండితరాయ లెవరో
తెలుగువాడా! తెలియరా! ॥తె॥

తంజనగరము చేతబట్టి
శత్రురాజుల పీచ మడచిన
విశ్వనాథుడు తెలుగువాడని
తెలిసికోరా తెలుగువాడా! ॥తె॥

ఏడు సంద్రా లెల్ల దాటీ
ఎల్లప్రెగడా సుబ్బరావూ
కీర్తితో దివ్యౌషధంబును
సర్వజనమున కిచ్చిపోవుట
తెలుగులకు గర్వంబు గూర్చునురా! ॥తె॥

తంజవూరీనుండి నాడూ
తమిళనాడూ తెలుగునాడూ
తేనె తరగల తెనుగుపాటల
తన్మయత్వము గూర్చినట్టి
త్యాగరాజూ తెలుగువాడే
తెలిసికోరా తెలుగువాడా! ॥తె॥

భోగభాగ్యము లెన్నియున్న – వి
రాగియై విఖ్యాతి నందిన
యోగి వేమన తెలుగువాడే
తెలిసికోరా తెలుగువాడా! ॥తె॥

తత్వమును క్రొంగొత్త రీతిని
బోధచేయగ నెంచి ప్రజలకు
గీతకే మరుగీత గీచిన
త్రిపురనేనీ తెలుగువాడే
తెలిసికోరా తెలుగువాడా! ॥తె॥

నేడు సైతము సర్వరంగము
లందు నాంధ్రులు వెలుగుచుండుట
మూలముట్టుగ తెలిసికొని – ఉ
త్సాహమున వర్తింపవోయ్ ॥తె॥

కులము తెగులూ తొలగిపోయీ
దేశ సౌభాగ్యమునె ఎంచీ
హలము పట్టీ కలము పట్టీ
కత్తి పట్టీ కదలవోయ్! ॥తె॥

## శ్రీ సత్యసాయిబాబా

చిరునవ్వులు చిందించుచు
శిష్యకోటి తిలకించుచు
సేవ మెత్తించుచు నుందువు
శ్రీ సత్యసాయిబాబా!
నీవె వాసుదేవుడవూ,
ఈశుడవూ, యేసుడవూ
అందరికిని అందుచుండి
మందరగిరి ధరుని వలెను
డెందంబున మసలుచుందు ॥శ్రీ॥
మతభేదము లేదు నీకు
మమత లనలె లేనెలేవు
గతి కానని వారి కీవు
గతియౌదువు చిత్రముగా! ॥శ్రీ॥
వేదమ్ముల సారమునీ
పాదపద్మ మకరందము
చిత్రానది తోయముతో
చిత్తశాంతి నొనగూర్తువు ॥శ్రీ॥
పాపమ్ముల పరిహరింప
పుట్టపర్తిలోన బుట్టి
గట్టెక్కించితి వెందర
నట్టనడమి కడలినుండి ॥శ్రీ॥
ఎన్నని నీ మహిమమ్ముల
నెన్నగలను నే నల్పుడ
అన్నిట మిన్నవు స్వామీ!
శ్రీ సత్యసాయిబాబా ॥శ్రీ॥

## స్వప్నసుందరి

వెన్నవంటి మనసు వెన్నెలారాణీ!
మధురమైనా చూపు మన్మథుని తూపు
కలచెను గుండెల్లు కలలోన నాకు
వలచి వలపించావు వన్నెలరాణి!
మధువు గ్రోలినయట్టుల మైమరచినాను
పలుకరించుచునుండ పరుగెత్తినావు
మేను పులకరించె మేల్కొంటి నేను
ఆ రోజునుండి నిన్నరయుచునుంటి
పగటి వేళల నిన్ను వెదకుచునుంటి
కానరావాయెను కలలోన తప్ప

## ప్రేమోద్దీపనము

నల్లవాడా! గొల్లరేడా!
ఏలనో యిట కేగుదెంచితి!

నల్లనైనా నీదు ఒడలూ
ఎట్టివారె నిదేటికోయీ!

దూరమందలి నిన్ను గాంచీ
హృదయభారముతోడ వచ్చితి
నీదు ఛాయా నాదు మేనికి
వన్నె తెచ్చెను కన్నెరో!

కలువ పూలా కనులు గల నీ
చెంత జేరిన యంత గలిగెను

మనసునకును మెరుగు పెట్టె
మన్మథుని విలువోలె నలరెడి
కలికి నీ కెమ్మోవి కాంతియె
కలుగ జేసెనుగాదె దానిని

ఆసతోడుత మోవితేనియ
గ్రోలగా మది గోరుచుంటిని
అందగత్తెరొ ఆనవెట్టక
ఆనతీయగదే!

మెల్లమెల్లగ చెప్పుచుండగ
ఉల్లమెల్లను ఝల్లుమనియెను
మందయానా! కుందరదనా!
చందమామా! రాగదే!

తెల్లవారుచునుండె గాన
గొల్లపల్లెను చేరుకొందము
పల్లెవారలు కానకుండగ
రారా నాయడ! గొల్లరాయడ!

# కెన్నడీ! ఓ కెన్నడీ

(కన్నీటి కానుక

కెన్నడీ! ఓ కెన్నడీ!
కతను డెవ్వడో కెన్నడీ! నిను
కాల్చినాడట కెన్నడీ! ॥కె॥

యుద్ధవాదుల మత్తు దించీ
సద్దు చేసే పెద్దలను సరి
దిద్దినట్టి సౌమ్య మూర్తీ ॥కె॥

అన్ని రంగములందునా
అందుకొని అడునిలిచీ
శాంతి జీవన మేర్పరించిన
సాధుమూర్తీ! కెన్నడీ! ॥కె॥

బద్ధవైరుల బంధువులుగా
దిద్దితీర్చిన కర్మయోగీ! ॥కె॥

తెలుపు నలుపూ భేదభావము
కడిగి వైచిన కెన్నడీ! ॥కె॥

తెల్ల వారేసరికి నేడూ
నల్లగుండెల తెల్లవానీ
నల్లగుండులవాత బడితివిగా! ॥కె॥

జంకుగొంకూ లేక క్యూబా
కుట్ర నణచీ లోకశాంతికి
కారణముగా విక్రమించిన
వీరుడవురా కెన్నడీ!
పట్టుదలతో విశ్వమంతట
శాంతి నిల్పిన దూతవీవే ॥కె॥

యేసు, లింకన్, గాంధితాతల
వరుసలో చేరితివి నీవును ॥కె॥

గాంధి తెచ్చిన మా స్వరాజ్యము
నిలుప నెంతో సాయపడితివి
లోకమంతయు దదరిల్లగ
చిన్నతనమున చితికిపోతివి
కెన్నడీ కన్నీరుగా కే
మున్నదయ్యా నీ కొసంగగ ॥కె॥

# విశ్వశాంతి

ఏదేశమేగినా ఎందు కాలిడినా
ఏమూలకేగినా భువిలో
కలతలే కనిపించెరా!
శాంతియేకఱవయ్యెరా! విశ్వ
శాంతియే కఱవయ్యెరా! ॥ఏ॥

శాంతియను మాటలూ
భ్రాంతి యని నమ్మరా!
దిగ్భ్రాంతి కలిగించు దివ్యసందేశాలు
దృగ్భ్రాంతి కలిగించు లేరా! ॥ఏ॥

కాలిన కెన్నడీని కానరా!
కూలిన కృశ్చేవునే చూడరా! వట్టి
హోదాల కొరకెరా బోధలూ! అవి
బాధలు తీర్పగాలేవురా! ॥ఏ॥

# మనిషి మనసులో

మనిషి మనసులో ఏముందో అది
కనుగొన్నారా యెవరైనా?
మడుగున కడుగున ఏముందో అది
కనుగొన్నారూ మనవారూ
మహాత్ములెందరొ వచ్చిరి పోయిరి
మాటలు మాత్రము నిలిచియున్నవీ
శాస్త్రాలెన్నో చదివారూ, మరి
శస్త్రాలెన్నో కన్నారు ॥మ॥

చంద్రమండలం చేరారూ మరి
చక్కని చిత్రాల్ తెచ్చారూ
శాంతిసభలనూ జరిపారూ
సహకారము సాగించారు ॥మ॥

యుగ యుగాలుగా జగ జగాలలో
శాంతి జపాలను సలిపారూ
చైనా చేసిన చేతలేమిటి?
సెగలూ పొగలూ రేపుటకాదా? ॥మ॥

# వ రూ ధి ని

మంచుకొండలలోన మై మరచినాను
మలుపు లెన్నో తిరిగి అలసిపోయాను
పూలసెజ్జలలోన కాలూనినాను
కాలికద్దినపూత కరగిపోయినది
నా గుండె రాయియై ఆగిపోయినది
నా గ్రుడ్లలో నీరు నాట్యమాడినది
ఎచటనుండియొ వీణనాదము
చెవుల జొరబడ, ఆశతోడను
జనపదంబని వెదకి, లోయల
మలుపులన్నీ తిరిగి తిరిగీ
చల్లగాలులు, కమ్మతావులు
ముక్కు-గోళములందు సోకగ
కడకు పూ పొదరిండ్ల జేరితి
వీణ మీటుచు పాటపాడుచు
మెరపుతీగను పోలుచుండిన
కుచభరంబున నడుము వంగిన
అంగనను గని, కలత నందితి

*  *  *

ఎంతొ చక్కనివాడు ఎచ్చటీ వాడొ ?
కంతు జయంతులూ సరిపోల లేరు
మన్మథుని మరపించి మనసొచ్చినాడె
కరుణించి నన్నేలుకొనగలడె వీడు
అంతకంటె వేరె భాగ్యమ్ము కలదా !

*  *  *

కదలలేకా కదలి కమలాక్షి దరి జేరి
బాట తెల్పగగోరి పల్కరించినయంత
కిలకిలా నవ్వింది కన్నుగానని కన్నె

*  *  *

చారెడు కనులుండ దారితప్పితివేమి ?
చందురుని చందమౌ అందగాడా నీవు
తెరు వెవ్వరీ నడుగనేలా ?
ఏకాంతమున నున్న జవరాలనని యెంచి
దరిచేరి నాతోడ మాటాడు నెపముతో
త్రోవ తెల్పగ నీవు కోరుచున్నావా !
వచ్చినా త్రోవను మరచిపోయీనటు
మాయలే పల్కెదవు మరులు కొల్పెదవులే
బంగారు కొండపై పచ్చనీ బయలులో
సంచరించెద నేను చందురుని చెల్లెలిని
ముగురు వేల్పుల సభల మోహంబు పుట్ట
రాలు కరిగేలాగ, మనసు రంజిల్లగా
వీణపై పాటలను వినిపించు వారలము
ఊర్వశీ-మేనకా-రంభ మావారలే
వయసు కలిగిన దాన, నే వరూధినినీ
కామింపగల - కామ
శాస్త్ర మర్యాదలను
మదిని మెప్పింపగల
దేవకాంతను నేను
మానవులమని మదిని
భావింపకో బాపనయ్యా !
మమ్ము జేరిన నీవు
మా యింటి చుట్టమవు
మన్మథుని పోలికలె
మరి నీకు గలవు
నీ యలత గనజాల
యీ యాసనము జేరి,
ఆయాసమును బాసి,
ఆతిథ్యమును గొనుము

*  *  *

ఎండ వేడిమిచేత పండువంటీ నీదు
ఫాలభాగము కందె కందర్పసన్నిభా !
పుణ్యాత్ముడవు నీవు పూతచారిత్రుడా !
శ్రమముతీరను నీకుఫలముదక్కనుమాకు,
తొందరెందులకయ్య, పోవచ్చు మీయూరు
కందర ప్రాంతములు కలయంగ తిలకించి,
నా విందు లందుకొని, నా జీవితమ్మును
ధన్యమొనరింపుమా ! ధరణీసురో త్తమా
మధురఫలములతోడ, మంచి తేనెలతోడ
అమృతధారలు నేనె అందించుచుండగా,
రాతిరికి ఇచటనే గడపుదము హాయిగా ;

భావజరూపా ! పరువము వేళల
వైదికకర్మల గడపుచునుంటే
సుఖభోగాలను పొందే దెప్పుడు

యాగఫలమ్ములు కోరే వెందుకు
మా కపుగిళ్ళ సుఖింపనె గాదా !

* * *

ఊరు మాయూరనుచు
ఉబలాట పడ తావు
రత్న మాణిక్యాలు
పొదిగినవి మా గుహలు,
గంధంపు వాసనలు
వెదజల్లు పొదరిళ్ళు,
ఇంపుసొంపులు గొల్పు
ఈ యిసుక తిన్నియలు,
నీటు గో పెరుగనీ బావయ్యా ! మీ
తాటాకు కొంపలకు సాటిగావందువా !

* * *

మక్కువ గొలిపెడి నా మనసూ
మన్మథబాధల కప్పగింతువో
మధువు గ్రోలి మత్తెక్కిన తేటుల
తిరిగెడి పూబొదరిండ్లమాటున
కౌగిటజేరిచి కై పెక్కించెదో !
దాపనేల ధరణీసురనందన !
తరుణిని నామది నోపజాలనిక

* * *

వడివడిగ ముడిపీడ
కురుల విరులును చింద
పులకించి మైమరచి
యెదను పయ్యెద జార
నిట్టూర్పులే పుచ్చి
కోర్కె లీరికలెత్త
పాలిండ్లు పొంగగా
అధరంబు నాశించి
ఆపజాలక ఆపె
కౌగిలించినయంత
"హా ! శ్రీహరీ !" యంచు

ఆ బ్రాహ్మణో త్తముడు
భుజములనుబట్టి త్రోయన్

* * *

ఎంద రెందరొ మునివరేణ్యులు
సుందరాంగుల గూడినారలు
వారి ఘనతలు మారెనా ?
పరమనైష్ఠికులైన మీరలు
పూజనీయుడుగా గణించెడి
ఆ పరాశరు పారద్రోలిరె ?
మందమతిపై దారి తప్పిన
మనుజుడా . యీ మాటలెందుకు ?
మదవతుల మెప్పించలేనీ
రూపమేలా ! కొల్పనా !

* * *

తల్లిదండ్రులు తల్లడిల్లగ
అతిథు లెందరొ వేచియుందురు
వైదికాగ్నులు ఆరిపోవును
కాలయాపన జేయనేలా !
దారి చూపుము తల్లిరో !

* * *

అన్యకాంతలు తల్లిగా, భా
వించి మెలగెడు పుణ్యపురుషుడు
పరువ మొప్పెడి పసరు కన్నియ
వేడుచున్నను లెక్కసేయడు
ఏకపత్నీవ్రతుని ప్రవరుని
మోహజలధిని ముంచ జూచిన
కామరూపిణి యా వరూధిని
కలుషకృత్యము చూడజాలక
కంటగించిన వృద్ధసూర్యుని
కంటి యెఱ్ఱన నిండె నింగిని
నిగ్రహానికి, నిష్ఠకును, ప్రతి
నిధిగ ప్రవరాఖ్యుండు నిలిచెను
అతని పూజలు గొన్న దైవమె
అతని త్రుటిలో నిల్లు జేర్చెను.

## శ్రీ శాస్త్రి

శాస్త్రీజీ! ఓ శాస్త్రీజీ
శాంతికామునిగ, సా
గించితివి నీ జీవితంబును
శాస్త్రముల పఠియించి నిజముగ
శాస్త్రిగా రాణించితీవూ! ॥శా॥

ఆయూబ్ ఆర్భాటములకూ
ఆవంతయైనను జంకు లేక
అణచగలిగితివయ్య నీవూ! ॥శా॥

తాష్కెండునుండీ తాజవార్తల
కొఱకు తహతహ చెందుచుండగ
తరలిపోయావనీ దివికీ
తంతిలేనీ వార్త తెలిపెను
తల్లిపోయిన దానికంటే
తల్లడిల్లీ శోకసాగర
మందు మునిగితేలు చుంటిమి ॥శా॥

ముక్తిచెందిన వానికై ప్రకృతే విలపించెరా!
భక్తితో మనమెల్ల ప్రణమిల్లుదాము! ॥శా॥

## మన ప్రధాని

పాలు పొంగిన గడ్డలోనా
పారుబోతులు వెలసినారూ
నాటి పాలన మందునా!
శాస్త్రి పాలనలోన చూడగ
శౌర్య ధైర్యాల్ సంతరించుచు
హోరుహోరున పోరుచున్, లా
హోరుదరినీ చేరినారూ.
నిజము గనుగొని పల్కువారల
అండదండల కోరుచూనూ
'జై కిసా' నని 'జై జవా' నని
దిక్కులెల్లను పిక్కటిల్లగ
పరవశమ్మున పొంగిపోవుచు
పరమ పదమును పొందె శాస్త్రిజి
పదవినున్నా మన ప్రధానీ
తంత్రినే మరపించు శక్తిని
గలిగి వర్ధిల్లెడును గావుత!!

## బాటసారి!

తొలుత నాటవెలదితో గూడి భోగియై
తుదకు నాటవెలదితోడ గూడి
పూర్ణయోగియైన పుణ్యాత్ము వేమనన్
భక్తితోడ గొలుతు బాటసారి!
చవులు పుట్టునట్టు కవులు చెప్పెడిమాట
నరుల మరుల గొలుపు నవ్యరీతి;
వారి కవితలందు వాణి నాట్యమ్మాడు
మేటి సత్య మిదిర బాటసారి!
కాంచనంబునకును గాంతామణులకును
ప్రభువులైనవారు పాలుపడిన
పాలనంబు బూదిపాలు గాకుండునా!
పరువుబరువు చెడదె బాటసారి!
పరులపంచ నెపుడు పవ్వళింపగరాదు
పవ్వళించెనేని పరువు చెడును;
మోతచేటు పరుల మోచేతినీళ్ళను
బట్టువాడు మహిని బాటసారి!
పాలుబోతు లెపుడు పల్కుచుందురు లెస్స
అవసరముల కెన్న డందబోరు
ధీరులైనవారు కాఱులు ప్రేలరు
పలికిరేని విడరు బాటసారి!
కానివారి నెంత గౌగిలించినగాని
కరుణ మనసులోన గలుగబోదు
కొండరాతి నెంత కోరి పూజించిన
మాటలాడబోదు బాటసారి!
భార్యమాట వినని భర్త యుండగనేల!
భర్తమాట వినని భార్య యేల!
కాడి గలియనట్టి కాపురమ్మునకంటె
బావి దుముక మేలు బాటసారి!
కరుణ లేనివాని కన్నీరు మున్నీరు
కౌగిలింత మిగుల గాఢమగును
వాలువీలు గూడివచ్చిన దిగమ్రింగు
పాపకర్మ డెపుడు బాటసారి!
భరతఖండమందు 'భవతి భిక్షాం దేహి'
యనెడి పల్కు బాల్యమందె నేర్పి
సాగనంపుచుంద్రు సంసారు లిండ్లకు
పాటుపడనివారు బాటసారి!

కరుణ జూపువాని గని గౌరవింపరు
బిరుసుదనము చూప బెదరుచుంద్రు
కరుణ – బిరుసుదనము గాక యింకేముండు ?
ప్రజల తత్త్వమందు బాటసారి !

పరుల సేవపడుచు బల్కుచుండెడివాడు
తనదు తప్పు నెపుడు తలపబోడు
తప్పు నొప్పుగాగ నొప్పును దప్పుగా
వాటముగను దీర్చు బాటసారి !

సాధుమతిని పట్టి సన్యాసి యని తిట్టి
యవగుణమ్ము లెల్ల నంటగట్టి
మూఢమతికి బాదపూజ చేయుదురేమి !
బూటకంపు జనులు బాటసారి !

అతిశయించినట్టి యధికారదాహంబు
వలన నల్పు డెపుడు నలమటించు
పదవి చిక్కి చుట్టుప్రక్కలవారల
బ్రదుకనీయ డింత బాటసారి !

పాముకాటుకంటె బడబానలముకంటె
పిడుగుపాటుకంటె బెడిద మగును
నోటిమాట లేక నొసటితో నవ్వెడి
యాటగాని చేష్ట బాటసారి !

ముచ్చుదనముతోడ ముసిముసినవ్వుతో
నెగడువాడు జగతి బొగడబడును;
అచ్చమైన దొంగయాకార మిదియను
మాట మఱవబోకు బాటసారి !

ధనముకొఱకు వస్తుగొని తిట్టువాడును
కల్లు త్రావి తిట్టగడగువాడు
పదవి కొఱకు బరుల బాధించువా డొక
బాటలోనివారె బాటసారి !

కఱవులేనిదన్న కాశికాపురిలోన
అన్నపూర్ణయన్న 'ఆంధ్ర' లోన
అన్నమమ్ముకొనెడి యయ్యలు మెండైరి
పాఱజూడ వేమి బాటసారి !

వంచనమునమించి లంచంపుచుంచులు
ప్రజల గఱవ 'నంజు' పారియుండ
నిదియె బలుపుగాగ నెఱిగింతు రితరుల
వద్ద నాయకులును బాటసారి !

భావ మెఱుగకున్న బాధ్యత గనకున్న
విసువు నందు నెల్ల వేళలందు
మంచి చెడ్డ – చెడ్డ మంచిగా దోచును
భావ శూన్యులకును బాటసారి !

చక్కదనమె యున్న శాస్త్రమ్మె చదివిన
నీతులెల్ల నోట నింపుకొన్న
పరుల సోదరులుగ భావింపకున్నచో
ఫలము సుంతలేదు బాటసారి !

'కాని' సబ్బుతోడ గడవెడు నీళ్ళతో
గడుగవచ్చు మురికి కండువాను
గడుగలేము నరుని కల్మష మిసుమంత
పట్టు పట్టియైన బాటసారి !

పోట్లయెద్దునైన బులిపించి బలిపించి
యొద్దజేర మేలు నొందవచ్చు;
నాయకుండ నంచు నమ్మించి చేరెడి
హాని జేరదగదు బాటసారి !

మంచిపనులు చేయు మంచివాడేయైన
జేరుచోటుబట్టి పేరు వచ్చు ;
తాడిక్రింద పాలు త్రాగిన-కల్లుగా
బలుకుచుంద్రు జనులు బాటసారి !

పలురకాలపక్షు లెలమితో నొక చెట్టు
నెలవు గాగ గలసి మెలసి నిలువ
క్రూరపక్షి యొకటి గూల్చె జూడగలేక
పాప మనక వాని బాటసారి !

మంచిపలుకు పల్కి మన్నించినటులుండి
కొంప గూల్చు దుదకు గ్రూరు డెపుడు;
వేషభాషలకును విలువ నిచ్చితిమేని
భద్రతలకె హాని బాటసారి !

పరులబాగు చూచి పలవించుచుండెడి
కుటిలబుద్ధి కెపుడు కునుకు రాదు ;
ఎంత కలిమి యున్న నెందఱు తోడున్న
బాధపడు నతండు బాటసారి !

సొంతపనులకొఱకు స్తోత్రమ్ములను జేసి
కానినాడు రెచ్చి కలుషమతులు
ఆడరానిమాట లాడుచునుందురు
వారె పెద్ద లెపుడు బాటసారి !

నీరు పాల గలసి వేఱు చేయగరాక
రంగు-గుణము మాఱు భంగి నెపుడు
మంచివారి గూడి మసలెడి యల్పుండు
బాగుపడునుగాదె బాటసారి !

కండబలిమివలన కన్ను గాననివాడు
అల్పులైనవారి నణచుచుండు;
బుద్ధిబలము గలిగి గద్దరించినవాని
బందియగుచు మసలు బాటసారి !

పరుల పంచ జేరి పాదమ్ము లొత్తుచు
సిరుల బడసి మరుల జిక్కి- నిక్కి-
ఎంద ఱిలను విడిచి యేగరు ! వారలు
బలిని బోలగలరె ! బాటసారి !

పసుల - పక్షులందు - పరగ మానవులందు
ఆత్మ, యొక్క-రీతి నలరుచుండు
పడియలోన - నదిని - పాథోధి నొక రీతి
ప్రతిఫలించు వినుడు బాటసారి !

నీరు దేనియందు నిలిచియున్నను దాని
సహజగుణము మాఱజాలనట్లు
భక్తి యున్నయెడల బాటలు వేరైన
పరము జేరవచ్చు బాటసారి !

మనసు వెన్నపూస మాటలు కటువులై
యడరువాడు 'నారికెడము' బోలు;
మాటలోన తీపి మనసులో విస మున్న
వాడు 'చేదుదోస' బాటసారి !

మాటరాని నేను పాటలు పద్దెముల్
పలికినాడ దివ్యవాణి కరుణ;
కవులు - పండితులును గరుణించి పరికింప
ప్రస్తుతింతు మదిని బాటసారి !

## సంతృప్తి

సాహిత్యపు మాగాణములో
సాగించిన నా కృషి యెంత ?

* * *

తిక్కన్నవలె దేశ దిద్దితీర్చితినా
వేమన్న వలె జాతి వెలుగు నిల్పితినా
కృష్ణరాయలతోడ కేలు గల్పితినా
రఘునాథ నాయక ప్రభుని బోలితినా ?
ఆదర్శ మూర్తులౌ ఆ కవీంద్రులకు
అంజలు లర్పించి యనుసరించితిని
మీతోడ కవితలో సాటిగాకున్న
మీ యట్టి రచనలు చేయలేకున్న
అభిమానమున నన్ను ఆదరించితిరి
అభిమానధనులు మీ రండయై యుండ
కదలెదను కదలెదను కరములను మోడ్చి

# కృతి స్వామిని

('మగువమాంచాల' కావ్యమునందు
కృతిస్వామినిగూర్చి వ్రాసిన పద్యములు)

ఒకనాఁడుజ్జ్వల సౌధ వేదిక నితాం
తోత్సాహియై యుండి, మా
మక కావ్యశ్రుతి చింతనావిరతుఁడై
మా బుచ్చినాయుండు ప్రే
రకుచేనన్నటు పిల్వఁబంచి, తగుగా
రామిచ్చి, పల్నాటి వీ
రకథాఖండము లాలకించి పలికెన్
ప్రస్తావమర్యాదలన్
పలనాడన్నను దిగ్దిగంతములు సం
భావించు వీరాగ్రణుల్
కలరా ? యన్నసమస్య లచ్చటఁ పరి
ష్కారమ్మగున్ ; విచ్చు క
త్తులఁ గారాడిన వీరపూరుషు లెం
దున్ దీసిపోనట్టి ప్రో
డల మాంచాల కొకా నొకున్నత విశి
ష్టస్థాన మర్థించెదన్
ఆ రమ్యంబగు ఘట్టమన్నఁ గడుము
దైగుష్టి కేతేర మా
వారెల్లప్పుడు వించుమందు రది కా
వ్యంబైన రాణించు న
ప్పేరన్ దత్కృతిచెల్లు చెంతయుఁదగున్
వేరొండు భావింతురా !
మీ రేమందు రనన్ భయమ్ముడిపి హా
మీ యిచ్చితిన్ మెచ్చితిన్
వా రర్థించినవేళ యెట్టిదొ ? కృతి
ప్రారంభమున్ జేయు నా
కారోజే జనియించె నాఁడు శిశు; వ
య్యర్థంబె భావించి యా

రచన :
కీ. శే. ఏటుకూరి వేంకట నరసయ్య

పేరే బిడ్డకుఁ బెట్టికొంటి; నిటుపై
వీరింట మాంచాలయో,
శూరోత్తంసుఁడు బాలచంద్రుఁడొ జనిం
చున్; దప్పవీ సూచనల్
తనకుంగూర్చు సతీ నిమిత్తమొక స
త్కావ్యంబు వ్రాయించి శ్రీ
జనతా గౌరవ మాత్మసంస్తుతి నిరా
స్థంజాటి నాఁ డింత కీ
తనిఁ గన్నాతఁడ ధన్యుఁ, డాతని చరి
త్రంబందదే దివ్య లే
ఖిరికైనన్, సుగృహీతనాముఁ డతనిన్
గీర్తించినన్ జెల్లదే !

ఆ దర్పమ్మున కడ్డులేదు తన క
న్యాయమ్ముగాఁ దోఁచినన్
గాదన్నన్ విన డాత్మనాశమయినన్
గానిండు పోనిండు మ
ర్యాదాబద్ధము గాని జీవిత మస
హ్యంబంచుఁ బోనాడు నే
తాదృగ్జీవితుఁ డంకినీఁ డతని వృ
త్తాంతమ్ము సామాన్యమా ?

ఆనాఁ డాతని వాక్కు వేదమయి, ధై
ర్య మ్మాత్మవజ్రాంగియై,
ప్రాణమ్ముల్ తృణమాత్రమై పరహిత
వ్యాపార పారీణతన్
రాణించెన్; దన కావ్యభక్త పరతం
త్ర స్వాంతముల్ తెల్గు మా
గాణుల్ ప్రోఁగు నఖండ గౌరవకళా
కళ్యాణ ఘట్టమ్ములై
తెలికన్నుంగవ సౌఖ్య శాంతరస ము
ద్దీపించు, నా మోములో
పలి శృంగారగభీరభావములఁ జె
ల్పంబూనుచో నర్థపుం

బలు కొక్కండు లభింపకున్నది స్వభా
వస్ఫూర్తి రూపించు నా
తలపాగా, నిడువాలుబొట్టు రయి తీ
రంచు బోధించెడున్
ఆ పుణ్యాత్ముని ముద్దులాఁడె మన కా
వ్యస్వామినీనాథుఁడై
చేఁబట్టెన్ దన తాతతండ్రుల యశ
శ్శ్రీ పాణి పద్మమ్ము నా
రూప మ్మానుజనత్వ మామధుర కా
రుణ్య మ్మనన్యమ్ములై
దీపించెన్ నిజదానధర్మకలనా
దేదీప్యమానంబులై

శ్రీమదంకపనాయని చిట్టితల్లి
ముద్దరా లన్నమాంబిక ముద్దువెల్లి
నాయని గృహమ్ము మెట్టిన నాఁటినుండి
మెట్టినది ముత్యమై నలుమూల లెసఁగె

నాఁ డదేమూ రమందుఁ బెండ్లాడినారొ?
నాయెఱింగిన కొంత లున్నారుగాని
ఇంత మధురమ్ముగా, నింత యింపితముగ,
భర్తృహృదయమ్ము లోఁగొన్న పడఁతిలేదు

సిరులు చిందెడు రసమయ జీవితములు
వలపుఁబూఁదేనె లంచుల కొలుకఁబోసె,
శారదజ్యోత్స్న లెన్ని యాసన్నమైన
యౌవనవసంత మొకపాద మవల కరిగె

పసిఁడి హారతిఁబట్టి సంపత్కుమారి
మంచు తెరవోలె సాక్షాత్కరించుఁ, గాని
కావ్యకన్యకతో సాటి గాదు గాన
ఇంపు దళుకొత్తఁ బూలఁ బూజింపవలయు

ఆఁడుబిడ్డవు సంసారమందుఁ గష్ట
మెఱుఁగు దీవని కృతికన్య నిచ్చినాఁడఁ;
బూరుషుల కెదురిచ్చి వాపోవుకంటెఁ
గడుపులో దాఁచుకొను తల్లి కిడుటె మేలు

పతికీయం దలకొన్న నిర్భరకు సా
పత్న్యంబు వాటిల్లు, నే
పితనౌదున్, సుతనౌదు వీ, విపుడు నీ
పేరన్, సమర్పించినన్

బతి ధర్మమ్మట గిట్ట, దందుకతనన్
మాబిడ్డ నీబిడ్డయై
నుతికెక్కంగల దాంధ్రఖండముల నెం
దున్ గ్రొత్త ముత్తైదువై

తమ్ముం గుట్టుఁడొకండె, లే రితర భ్రా
తల్, ముద్దుచెల్లెండ్రుఁ; మా
"యమ్మం" దట్టి కొంతఁదీర్పఁదగు వి
ద్యాబుద్ధులన్ నేర్చి నీ

సొమ్మైపోయిన; దీమెనీ పతికిఁగూ
ర్చుంబిడ్డ, నీవాలి, వే
మమ్మా. వేంకటసుబ్బమాంబ! కొఱఁతే
లా? మీకు మీవారికిన్

కృతి మాబెత్తినఁ గంటగించెదరు ల
క్ష్మీపుత్రులం దెందఱో,
మతిమంతుల్ శిరసావహింతు రిటులన్,
మా మాటగా, దెవ్వ రీ

క్షితిలో సత్కృతు లంద కిధ్ధయశులై
జీవించి? రీ మర్మమున్
మతినూహించితిరేమొ? మీ మధుర దాం
పత్యమ్ము ధన్యమ్ముఁగన్

ఆ దిగిభమ్ము లట్లు చెర
లాడెడు పాములపాటివారి ము
త్తైదువ, వప్పటిప్పటి మ
హాకృతి నాథుల దివ్యకీర్తిలోఁ
బాదము మోపినావు, ప్రియ
భర్తయు నీ వపరంజి చిల్కలై
పై దలి! ముద్దుముచ్చటల
వర్ధిలుఁ డాశశి తారకమ్ముగన్!

కాలమ్మున్ గడచన్నదై నఁగడకున్
గట్టెక్కితిన్, నాడు మాం
చాలాస్వామిని బుచ్చినాయని సతీ
సౌభాగ్య సౌశీల్యముల్
ప్రాలేయాచలకన్యకాప్రణయ సౌ
భ్రాత్రమ్ములై, జ్యోత్స్నలై,
పాలార్చున్ బతిదేవ జీవిత యశః
పాథోనిధానమ్ములన్.

('కార్మికుడు' కృతియందు కృతిపతి ప్రశంస)

పొచ్చెమెఱుంగఁబోని నిడుఁ
బ్రోలున పాములపాటివారిలో
నచ్చపుఁగీర్తితోడఁ దన
రారుచు సర్వముఁ దెల్గుతల్లికై
వెచ్చ మొనర్పఁగన్ మిపుల
వేడుకఁజెందెడి బుచ్చినాయఁడా,
యిచ్చితిమత్కృతిన్ గొనుమ
యెల్లరు మెచ్చుచునుండ ప్రేమిడిన్.

ఘనతన్ జెందిన కమ్మవంశమిలపైఁ
గామింపఁగా మున్ను హె
చ్చిన సౌభాగ్యములందు నిత్యము సమా
సీనుండవై, హాయిగా
జనసంబందితి వంకినీ ద్సుతుఁడవై
స్వార్థంబు వోనాడి నీ
తెనుఁగుం దల్లి యశంబు నల్గడల వ్యా
ప్తింగాంచ నాకాంక్షతో.

చక్కని కావ్యకన్యకకు
చాలిన సద్గుణరాశి భర్తగాఁ
జిక్కిన నేమికావలయు
చిత్తమురంజిలఁజేసి సర్వదా
మిక్కుటమైన సద్యశము
మేటిగఁజేయును సుస్థిరంబుగన్
నిక్కముగాపచింప ధర
ణిన్ సమకూర్చుయశంబు సత్కృతుల్

రచన:

శ్రీ యడ్లపల్లి దేవయ్యచౌదరి

# ఒప్పగింత

నీ గృహిణీలలామ కమ
నీయగుణాంబుధి సుబ్బమాంబ తా
నేఁగిన గండుపేదలకు
నిచ్చియశంబునుగూర్చ నింటిలో
దాఁగిన నీదు సద్యశము
తాండవమాడఁగఁ దెల్గుగడ్డపై
భోగుల పండితోత్తముల
కొంతకు నీకృతి చేరునిచ్చలున్.

పెటకముఁబెట్టుచున్ బరుల
పెంపు నశింపఁగఁజేసి, వారలన్
గటువగునట్టి వాక్యములఁ
గష్టములం గలిగింపవంచు నాఁ
కట కృశియించు పేదలకు
కామితముల్ సమకూర్చి ప్రోవఁగా
దిటవగువాఁడవంచు విను
తించును నాకృతి తెల్గుసీమలో
కుదురుగ నింటనుండ దికఁ
గోరినవారలతోడ నెయ్యమున్
గదిమి యొనర్చుచుం దెలుంగు
గడ్డను గ్రుమ్మరునంచు ధీరతన్
బదపడి కావ్యకన్యపయి
పంతములాడఁగఁ బూనకయ్య నీ
వదుపున బెట్టినన్ దిరుగు
నాంధ్రధరాతలమెల్ల స్వేచ్ఛగన్.

దీనులను బ్రోవఁగ హితోపదేశమొసఁగు
దొడ్డగుణములఁ దనరు నా బిడ్డనెపుడు
చక్కనగు చిన్ని చూపులఁ జూడకయ్య
సైఁచ దవమానములకు నిజమ్ముసుమ్ము.

కమ్మని దేశభాష నుడి
కారపుసొంపు వెలార్చు చుండి నే

త్రమ్ముల కద్దుచున్ సతము
గ్రాలు నరేంద్రులు రాలిపోవగఁ
'బ్రమ్మిక' వచ్చియుండి పర
భాషలు స్వారియొనర్పఁ దెల్గుపై;
నెమ్మనమందు కుంది యిటు
నిల్చితివా! తలిబాసకండవై.
ముచ్చటఁగూర్చు సత్కృతులు
ముందిక నే వెదలింతునంచు వా
క్రుచ్చిన నీదు వాక్యముల
కున్ గడు మెచ్చదె తెల్గుతల్లియున్
హెచ్చగు కీర్తి చంద్రికలు
నెల్లెడలన్ బ్రసరింపఁజేయఁగాఁ
గిచ్చబిగించియు న్నడుము
గట్టదె సత్కవిలోకమెల్లయున్

నీవు వెలయించు సద్గ్రంథ నిచయమెల్ల
నాంధ్రవాణికి సరిక్రొత్త యాభరణము
లగుచు వెలుఁగొందు నా కావ్య మామె కెట్టి
ముక్కుపుడకయై వన్నె కెక్కఁగలదొ.

లోకులు కార్మ్ని కథయని
వాకొనినన్ జంకులేక ప్రచురించిన సు
శ్లోకుని దేవేరిగ నయి
నాకృతి చిన్నారినవ్వు నవ్వఁదొడంగెన్.



# కృతి స్వామి ప్రశంస

(ఆచార్యరంగా కృతియందు కృతిపతి ప్రశంస)

శాంతి దయాకటాక్ష వికసన్నవ దీప్తుల దొల్కరించి ప్రే
మాంతపచః ప్రసూనముల హారతి పెంపున లోకమేలు సు
స్వాంతుడు పావనుండు భగవంతుడు పాములపాటిబుచ్చి భూ
కాంతునినేలు పుత్రకుల కాంక్షను దీర్చి శుభార్ద్ర దృష్టితో.

గానముల బ్రోవు సూరిజన కోటికి మిత్రుడు శాంతిదాంత వ
ర్తనగలవాడు దీనులవరంబుల దీర్చుచు, దివ్యకీర్తితో
వినయ వివేక భావముల పీఠములందిన యంకిసీడు శో
భనపుచరిత్ర త్యాగులకు పాతము, పూజ్యులదర్శనీయమై.

అడిగిన నెట్టి మానవుని కైన దయామతి గ్రుమ్మరించితో
డ్పడి కనకాభిషేకముల స్వాగతమిచ్చి రసైక దృష్టితో
వడి కరుణింపగాఁదగిన బాంధవుఁడై కవితాప్రపూజ్యుఁడై,
గడగెనుఅంకిసీడు భువి కాంతుఁడు నిర్మలదాన మూర్తియై

శ్రీమతి యచ్చమాంబను ప్రసిద్ధిగ బెండిలియాడె, బుత్రకుల్,
లేమిన దుఃఖపుందెరల ప్రీలి, గుణంబుల మిన్నయై సదా
ప్రేమమరంద బిందువుల భిక్షనొసంగెడి రత్నమాంబ నుం
ప్రేముడియంకిసీడు మఱు పెండ్లి ని యాడెను వంశవృద్ధికై

వినయము సత్ప్రివర్తన వివేక గుణంబుల కాలవాలమై,
వినుతి గడించి దిగ్వలయ వీధుల గ్రుమ్మరు రత్నమాంబ, శో
భనమునజిన్నమాంబను, ప్రభాసగుణాఢ్యుఁడునై నబుచ్చి నా
యని గనియెన్ దెలుంగులకు నభ్యుదయంబులు దొల్కరింపగన్

స్తుతులకు బొంగిపోవడు, ప్రతున్నపుటార్తిన క్రుంగిపోయెడిన్
బతితుల రక్షణార్ధము దపంబొనరించును, జ్ఞానసిద్ధితో
గతులదలంచు, దేశము సుఖస్థితి భాసిలు నట్లొనర్పగా
సతతము, బుచ్చి రాట్ప్రభు విశాల గుణంబుల కల్పభూజమై.

పూనకమైన భాగ్యముల పుష్పొడి గద్దెల గొల్పుదీరి వి
జ్ఞానము జిల్కువరిలును, సాదుల పేదల బ్రోవనెట్టి వా
గ్దానమునైన జేయు, ప్రమదంబున జాజులగుప్పబోసి యెం
తేని చలించి జంకదవి నీతికి జిక్కని మార్గదర్శియై.

చెమటకు మారు రక్తమును జింది పొలంబుల సాగుజేయుచున్
అమితపు బంటలన్ గరిసెలందున గూర్చియు దార భావనా
గమనికతోడ పేదలకు కానుకలిచ్చుచు దానశౌండుడై
విమలయశంబుతో వెలసె, విశ్వము జోహరులంద జేయగన్.

దుగ్ధాన్న దానంబుతోపాటు ఛాత్రుల
కు ధనంబు ముంగొంగు గురిసినాడు

రచన :

శ్రీ జి. జోసప్పు

తనపేరు లోకంబు వినగూడదను నిష
కవి పోషణకు గజ్జె గట్టినాడు
సరసత్వమున దూచి జాతి భేదము మాని
సత్కృతుల్ గొనఁజేయి చాచినాడు
చెదలువాతెఱజిక్కి జీర్ణించు కబ్బాల
సిరికి సింగారంబు చేసినాడు
మాటమధురంబు హృదయంబు మావి పండు
చూపు పుట్టుక తేనె జుంజురులజల్లు
నడకసౌశీల్య భాగ్య విన్యాసగరిమ
గలిగివర్తించు బుచ్చిరాట్ క్ష్మావిభుండు.
కవులదరిద్ర, జాతకపు
గావ్యములన్ బరికించి దీక్షమై
నవరణ చేయగాగల ప్ర
శస్త వదాన్య గుణప్రసక్తితో
భువనమునందు బేర్కొని ప్ర
భూత రసైక కవిత్వసంపద
స్తవమున కంజలించును వి
ధాత రచించిన వ్రాతమాన్పగా.
హరి సర్వోత్తమ భవనము
విరివిగ నిర్మింప మూడువేలకుపైగా
సిరమతి దంపతులిరువురు.
వెరువక దయచేసినారు విశ్రుతకీర్తిన్.
కంఠరంబులనైన ఖండించి యిడుగాని
యనినమాటలు దప్పనట్టిమేటి
తనకున్న సొంతంబు ధారవోయునుగాని
కాఠిన్య మెరుగని కన్నతండ్రి
అస్పృశ్యతా జాడ్య మణప జూచునుగాని
పెంపొందజేయని ప్రేమరాశి
అడిగిన ప్రాణంబునైన నిచ్చునుగాని
శంకింప వెఱువని సత్యమూర్తి
యమృత గుణముల వర్షించి యలమటించు
గండుపేదల రక్షింప గరములెత్తి
త్యాగము వెలార్చు సాత్విక దానశాలి
రమ్య చరితుండు బుచ్చిరాట్ప్రభువరుండు.

పూనిన భాగ్యదేవతల భోగపు దృష్టికి బొంగిపోవడెం తేనియు, నిచ్చలుండలచు దేనె తలంపుల, నాశ్రితాళితో నానతయిచ్చెనా యది శిలాక్షరమైతగు, మెచ్చియిచ్చెనా ఏనుగ పాడిగాగ బొలయించునుసత్కృతులుల్లసిల్లగన్ యూరపు ఖండమంతటనునోపిక బర్యటనంబుజేసి బంగారు సమానభావములగాంచికుతూహల సంభ్రమప్రభాధీరత ఖర్చుకై వెనుకదీయక, పెన్ బకిస్థాపితార్థమై పోరెను, కృష్ణధీయుతునిప్రోత్థిత భావబల ప్రదీప్తితో

బావ మరియు చెల్లి భక్తితో బంపిన
ఇరువదివేల్ ప్రేమ పరతనంది
నిపుణుండు నన్నపనేని వేంకట సుబ్బ
యకటాక్షవీక్షణ హర్షమంది
బంధు సందోహంబు భక్తిమై బనిపిన
కాంచన రజితంబు కానుకలంది
ప్రకృతి సౌభాగ్యంబు భాసిల్లు వరిపైరు
పచ్చని నాజూకు బయలు నందు

మన గవర్నరు శ్రీ ప్రకాశ్ జనకువలన
గడనెత్తించి కట్టించె కాలెజీని;
భారతీదేవి యధ్యక్ష బాంధవమున
తెఱచె గోపాలరెడ్డి మందిరపు దలుపు.

జ్ఞానసముద్రుడై రయితు
సాముల పాలిట కల్పభూజమై
స్నానము పాన మున్ మరచి
జంకక నిచ్చలు సేవ జేయగా
పూనిన రంగనాయకుడు
పోసెను ప్రాణము శాశ్వత ప్రభా
నూనత వెల్గునట్టుల మ
నోజ్ఞ ప్రణాళిక వ్రాసి యిచ్చుచున్.

కాలేజి వృద్ధికొఱకై
మాలిన్యములేని ప్రేమ మలుపుచు దయతో
జాలెల రూకలగుప్పుచు
పాలింపదొడంగె కీర్తి పంటలు పండన్.

ఆరని భక్తి భావముల
హారతితో నిజభర్తృ పాద మే
మారక బూజసేయుచు స
మస్త శుభంబుల గ్రుమ్మరించి శృంగార రసార్ద్రసత్కృతుల
గాంచుచు వేంకట సుబ్బమాంబ సంభారము లంది సద్యశము
బారులుదీర్చ దొడంగె దీప్తిమై.

గడుసుదీరిన పలనాటి గడలందు
విజయ రణభేరి శబ్దించి విస్ఫురించి
వాలని యశంబు తెలుగుల పాలికొసగి
వీర విజయంబు గాంచిన ధీరురాలు
మగువ మాంచాల కావ్యసంపదల తీవి
నేరిచాటిన కవిబ్రహ్మ ఏటుకూరి
వరపయ కవీంద్రు భావవిన్యాస మహిమ
కారతు లొసంగి మెచ్చిన వీరవనిత
శోభితచరిత్ర వేంకటసుబ్బమాంబ.

దుఃఖకాండంబుల దొడ్డ యిల్లాలునై
వ్యాధులందున వెజ్జురాలు నగుచు
ఘోరవిపత్తుల గొమరొప్ప జెలియౌచు
దీనత కాశ్రయ దీపమగుచు
అతి నిరాశానద మం దోడయును నౌచు
శోకాదిదశయందు జ్యోతి యగుచు
బొరలు కష్టాలలో బ్రోయాలియై సంది
యంబుల దృఢనిశ్చయంబు గలిగి
తీవ్ర పరితాప దైన్యగీతికల రవము
వినుచు గన్నీరు డించుచు విసుగుపడక
శ్రద్ధమై గారవించును జాలిపడుచు;
శోభిత చరిత్ర వేంకటసుబ్బమాంబ.

గణనకెక్కి యసెంబ్లి సెక్రటరి గద్దె
నెయ్యమునుగోరు వేంకటప్పయ్య, చిన్న
మాంబ నుద్వాహమాడి నితాంతకీర్తి
తేజము గడించుచున్నాడు దినదినంబు.

నెయ్యపు వియ్యముం బొదిపి
నేస్తుల కాశ్రయ మందజేయగా
తియ్యతలంపులం దలచు,
దీనుల ప్రేముడి నాదరింపగా
చయ్యన జేరదీసికొని
సాయ మొనర్పగడంగు వేంకట
ప్పయ్య సుధీమణీ చరిత
భాసురమై తగు భారతంబులో.

బల్లిదమైన కీర్తిగలప్రాజ్ఞుడు, పేరుడు లోకమాన్యుడై
ఎల్లజగంబు భారతుల యింతికి నాథుడునైన నీదు మే
నల్లుని భవ్యజీవితమునంకితముం గొనుసట్టిప్రాప్తిసం
ధిల్లుట నీ తపఃఫలము ధీవరపూజిత బుచ్చిరాట్ప్రభూ

బద్ధులై నిలువ
నీడ భుజింపను తిండిలేక దుః
ఖాతురులై సతీసుతుల
యార్తనినాదము నాలకించుచున్
యాతనతోడ జీవితము
నంత వ్యయించుచు దేబరించు మా
జాతికి లేదుముక్తి ప్రభు
చంద్రమ భారత పుణ్యభూమిలో.

రామయలింగరెడ్డి కవి
రాజు దయామయదృష్టి నాంధ్ర భా
మామణి పాదసేవలకు
మార్కొని విస్తుల తాపభారమున్
సాములజేయుచుంటిని ది
శావలయంబున రొమ్ము నొడ్డిగా
నీ మనుజేంద్ర నా శ్రమల
నిగ్గుకులేదు ఫలంబొకింతయున్.

కవినై భాస్వదఖండ భోగముల
భాగ్యస్ఫూర్జిత క్రాంత సం
భవ సంతోష తరంగడోలికలపై
పైపూల రంగండనై
భువి నూరేగుచు బొంగెడిన్ బదులు బా
బూ! ఘోరదారిద్ర్యమున్
బవలున్ రాతిరి గుందు నాశ్రమల దీ
ర్చన్ యత్న మర్పించుమా!

తెలుగుం దల్లికి బండుచాకిరుల నెం
తేజేయ సర్వస్వశో
భలతో వెచ్చని నెత్తురి క్రొంజినుకులన్
వర్షించి కూలారి కే
వల దౌర్భాగ్యత గుందు నాగతికి భూ
పా! దారిలేదా మదాం
ధ్రుల భాగ్యోన్నతి జీవితాంగణము లం
దున్ బుచ్చినాయాగ్రణీ

కాలము మారిపోయిన, యు
గంబులు దాటిన లోకపూజ్యుడై
దేలిని రంగనాయకుని
దీపిత జీవిత కావ్యకన్యపు
ష్పాల కిరీట దివ్య సహ
వాసముఁ జంద్రదినేశు లంతకున్
బాలమహాళ్ళ వర్ధిలుచుఁ
బాతువు మారక బుచ్చిరాట్ప్రభూ

# కృతి సమర్పణము

## ('అమరుకము'కృతియందలి కృతిపతి ప్రశంస)

ఎవ్వాఁడు-విద్యాభివృద్ధిని మదిఁ గోరి
    నెలకొల్పె సత్కళానిలయ మిచట;
ఎవ్వాడు-ఆంధ్రసంస్కృతభాషలను పెంపు
    నొనరింపఁ గంకణమ్మును ధరించె;
ఎవ్వాఁడు తనయొద్ద కేతెంచు పేదవా
    రడిగినయంత లే దనక యిచ్చు;
ఎవ్వాఁడు-కవుల సత్కృతులకు ముగ్ధుడై
    యెన లేని సత్కృతులను నొనర్చు;

అతఁడు-పొగ డొందు విశ్వవిఖ్యాతదాత.
జ్ఞానవిజ్ఞానవిద్యాప్రదానములను
నలరు పాములపాటి వంశాబ్ధిరాజు
బుచ్చినాయఁడు సుకవితాపోషకుండు.

కనకాభిషేకముల్ గావించి కవులను
    గౌరవించినయట్టి ఘనుఁడు తండ్రి;
వినయంబు సత్ప్రవర్తన వివేకములను
    వినుతిఁ గాంచిన సాధ్వి యనఁగు తల్లి;
'మగువ మాంచా'లాది మహనీయకృతులను
    గృతిఁ గొన్న ధన్య నీ యతివమిన్న;
ధర్మమార్గంబును తన మది నెఱ నమ్మి,
    అనిన మాటను తప్పనట్టి మఱఁది;

'మాన్యుఁ డాచార్య రంగాజి మహితచరిత'
మాది కృతులను పెక్కింటి నాదరించి,
కవుల పెన్నిధి కల్పవృక్షంబు నగుచు,
ఖ్యాతిఁ గన్న రసజ్ఞశేఖరుఁడ వీవు.

ఇట్టి మీ వంశగౌరవ మెఱిఁగి యెఱిఁగి,
తరతరమ్ముల వచ్చెడు త్యాగ మెంచి,
జ్ఞానదానమ్ము సలిపెడు ఘనత తెలిసి,
లలితభవదీయకవితావిలాస మెన్ని,
సరసశృంగారభావసంసక్త యగుట
మీ రసజ్ఞతన్ మది మెచ్చి మెచ్చి,
అలరు నెంతయుఁ గృతికన్య యమరుకంబు
బుచ్చినాయఁడ! దీనిఁ బ్రేముడిని గొనుచు
నాయురారోగ్యభాగ్యంబు లంది కీర్తి
నవని నాచంద్రతారార్క మలరుమయ్య!

---

రచన:

శ్రీ శంకరప్రసాద్.



# కృతి

('త్రిశతి' కృతియందలి కృతిపతి ప్రశంస)

పలుకుం దొయ్యలి తారహారములు కా
వ్యశ్రీలు తద్భావనా
బలసంపత్తికి మూలకందములు వి
ద్వాంసుల్ తదభ్యర్చనా
కలితుల్ పాములపాటి వంశజులు త
త్తత్క్రమాన్వయ శ్రీ సము
జ్జ్వలమై నీవలనం గడించినది శ
బ్దబ్రహ్మ సామ్రాజ్యమున్.

౨

నన్నొక మిత్రుఁగాఁగ గ ణ
నమ్మొనరింపుడు పెద్దఁజేసి మా
కున్నతిఁగూర్చి బాధ నిడ
కుండుఁడటంచు వచించు సూక్తిలో
విన్నను వెంతయో కొలత
వెట్టితి ముగ్ధుఁడనైతి బాంధవ
మ్మున్నె యియించిమామపద
ముం గయిసేసితి మిన్ను ముట్టితిన్.

విద్య లెటింగి చేసినది
వీసములే దొకకొంత చేసినన్
హృద్యము గాదు హృద్యమగు
నే ననవద్యముగా దెదైన న
య్యుద్యమ రూపరేఖలకు
నూపిరివోయఁ గడంగినాఁడ వీ
విద్యకు విద్య నేర్పెడి వి
వేకము భాగ్యము లభ్యమయ్యెఁగా

౪

నీసరి లేరటంచు గమ
నించి సదా వివిదాంధ్ర సంస్థల

రచన:

'కళాప్రపూర్ణ' శ్రీ కొండవీటి వేంకటకవి

గాననమిచ్చి కొల్చెనిను
నందనిగౌరవ మాఁచికోని వి
శ్వాసము లేదు నేఁటికిఁ బ్ర
జాపరిషత్తులఁ జిత్తవృత్తులం
దాసముదంచిత ప్రతిభ
కారుటితిస్ఫురణమ్ము సౌమ్మగున్.

౫

త్యాగము భోగ మిప్పు డొక
త్రాసునఁదూఁచు శిబిప్రభుండవై
ప్రాగనుభూతు లర్థికర
పల్లవ రేఖల సంఘటించి తీ
త్యాగమహస్సు లన్వహము
దన్పిన వాంధ్రుల నార్థికాగమ
శ్రీగరిమమ్మునందు నినుఁ
జెప్పి మఱొక్కనిఁ జెప్పగా వలెన్.

౬

దొరము స్త్రీదున కప్పళించి కనులే
దో జుట్టినట్లుండు నీ
సరసోక్తిన్ వికసించి వీనులు సుధా
సారమ్మునం దోఁగునీ
కరుణాదృష్టికిఁ గాన్కయై హృదయ ము
త్కంఠాప్తి నూఁగాడు నీ
స్ఫుర దాకారమునన్ గరంగి సకల
మ్మున్ మోహ విభ్రాంతమౌ.

౭

తన మనోనిర్ణయమ్మునకు వీసమ్మేని
జవదాటనట్టి దీక్షాతపస్వి
తన హృదబ్జమున నిల్పిన సాధుశీలుని
మనసార సేవించు మానధనుఁడు
తన నమ్మినట్టి సిద్ధాంతమ్ము విటతాట
నమ్ముగానీని ధైర్యమ్ముతావు
తన కల్మి కపవాద మణుమాత్ర మేనాఁడు
దరిఁజేరనీని సుస్థిరయశుండు
నిరవధిక సత్యసౌశీల్యనియమ శమము
లానుపూర్విసమాలబ్ధమయ్యె దానఁ

జిరయశయుపార్జనము జన్మసిద్ధమయ్యె
నరుల కల్పద్రుమవుఁ గొమ్మ నాయఁడమ్మ.

౮

పసిఁడి హోరంగులం జిఱుము
ఫాలముతో నరుణాంశు రేఖలున్
ముసిరిన విస్తృతమ్మగు క
నుంగవతో నురమైన నాసతో
ముసి ముసి నవ్వుతో మురిప
ముల్ దొలఁకాడెడు దంతపంక్తితో
నొనపరి రూపు బాపురె య
హోయనిపించు సమంచితస్థితిన్.

౯

దరహసితాంకురమ్ములు స
దా ప్రతిపత్తివచః పరంపరల్
పరపెడువేళలన్ సుకవి
పండితకోటి హృదంతరమ్ములన్
గిలికొనుచుండు మెండు గిలి
గింతలు సంతసమంది మిత్రత
న్నెరపెడు వేళలన్ దొలఁగు
నిపను నేనను దారతమ్యముల్.

౧౦

నిండార విరిసిన బొండు మల్లెలతేవ
బొమ్మిడీకము వింత పొలుపొసంగ
సొగసైన పసిఁడి కచ్చుంబోని నొసటిపై
నిడువాలుబొట్టు వన్నియను గూర్ప
రాచఠీవికి వన్నెరా నిట్ట మెలివెట్టు
నులిమీసకట్టు పెంపలరు లీవ
ఆఁదోఁక పాటుగా నమరు పిక్కలనంటి
నిలువుటంగీ హోయల్ చిలుకుచుండ
నిండుకొలువుండు శ్రీ యంకినీఁడు తేఁడు
భోగ దేవేంద్రుఁ డూర్జిత పుణ్యధనుఁడు
రత్నమాంబాధిపుఁడు పుత్ర రత్నమనుచు
నామతించిన సుకృతివయ్యా ! కృతీంద్ర !

౧౧

పలుకుంబళ్లకుఁ దేనెసోనలను గూ
ర్పంజాలు మాంచాల నీ
కులకాంతా హృదయమ్ము నాఁచికొనెఁ బె
క్కుల్ గాథ లింకేల ని
ష్ఠల దాంపత్యము మీది మీవలె రస
జ్ఞుల్ కావ్య కన్యామణీ
కలగానమ్మును విన్న విన్నను వు నొఁ
గా సాహితీ పోషకా !

౧౨

అలంబించిన వీర భారత కథా
ధ్యక్షత్వముం గాంచి మాం
చాల స్వామిని పైన నీకు గురుశి
ష్యత్వమ్ము సంబంధమున్
బాలింపన్ మనుపన్ సగర్వ్యుఁడగు సు
బ్బారావు తోపాటునే
నేలా ! తమ్ముఁడఁగాక పోవుదును సా
హిత్యానుసంబంధినై.

౧౩

చిరతరకీర్తి నార్జనము
చేసిన యంకపనాయఁ డన్నమల్
మురిసిన ముద్దుపంట కవి
ముఖ్యుల పాలిటి మెట్టపంట నా
వరసుత కాత్మవల్లభుని
వల్లభునిం బొనరించి తమ్మన
న్నరయు పురంధ్రి కయ్యెడు మ
నామయ మర్థమనంత సౌఖ్యముల్

౧౪

నాకృతికన్య యన్యుల క
నారతకీర్తి నొసంగు సుప్రతి
ష్ఠాకమనీయమూర్తి కిడఁ
జాలునెకీర్తి పతి ప్రతిష్ఠకై
కూఁకటివేరుతో విబుధ
కోటి కభీప్సిత మిచ్చు కల్పకా
నోకహ మాదిఁబెంచి తిది
నూత్నము వేంకటసుబ్బమాంబికా
కవితాకన్యలు నల్గురైదుగురు భా
గస్వామ్యముంగోరి నీ
ధవు నంకసితినాని రాత్మ చరితా
ర్థత్వమ్మునుం గాంచి రీ
సవతాంధ్రన్ బతిపాదపద్మ భజనా
సంసక్త చిత్తాబ్జవై
మివులన్ గౌరవ మాచరింతు వదియే
మీ ధర్మసంజీవికా !

౧౬

గౌరవ మిచ్చి పుచ్చుకొనఁ

గాఁ దగుపట్టుల నాత్మగల్ మిషన్

గూరిచి తియతీయని మ

నోహరగాథల నల్లికొందురీ

తీరుల నెల్ల వేళ యువ

తీయువకుల్ తలఁదాల్తురిట్టి సం

సార సుఖానుభూతి కభి

మానము చూపుదు రాదరమ్మునన్.

౧౭

ధనము గడించి పెంచి యది

దాఁచి జగద్ధితబుద్ధిగా వ్యయ

మ్మొనరుపఁ జాలినట్టి సుగు

ణోపధు లెందఱు గల్గరీ జగ

మ్మున నిటుచేయ దీని కను

మోదము మద్దియ లెవ్వరిత్తు రీ

ఘనతకు మూదలైరి మును

గా మన పాములపాటి దంపతుల్.

౧౮

ఎంతటి గుండె నిబ్బరము

లీరు వహించితిరో సమగ్రపుం

జింతలఁ బట్టిభ్రముల క

పూర్వము గాఁగఁ గళానికేతన

మ్మింతగఁ బల్లెటూర నెల

యించితి రాత్మలయందు దీనినే

సంతతిగాఁ దలంచితిరి

సంచిత విత్త సమర్పణమ్మునన్

౧౯

మీగుణగానమునన్ మా

ర్మ్రోఁగున్ దిగ్వ్యూహములు సముజ్జ్వలభాషా

సాగరవేలా పరివృత

భూగోళకళాప్రవృద్ధ పురుషారములె.

౨౦

కావున మత్కృతీశ్వరుని

గా మెఱయించితి బుచ్చినాయఁడా

తావకకీ రికాంతికిది

తావళమై పటుదర్ప ధాటికిన్

దావలమై

దర్పణమై గుణరాశి దీప్తికిన్

శేవధియై రసాకృతిఁ బ్ర

సిద్ధి వహించుత మంధమండలిన్.



# సూడిద

## ('సమదర్శి' కృతియందలి కృతిపతి ప్రశంస)

౧

పట్టువిగించి పౌత్రములు
బండ్లకుబండ్లు పఠించి యెవ్వియో
పట్టములన్ గడించుటయె
ప్రసవనీయము కాదు; ప్రేమకున్
బుట్టినయిల్లుదారతకు
మూదల యీవికి నండదండయై
నట్టిహృదిన్ గడించుట స
మంచితకృత్యము మానవాళికిన్

౨

తెలివిముదిరి వెఱ్ఱితలవైచి నరుఁడధో
గతికిఁ జనెడి నేఁటికాలమందు
నచట నచట నాయఁడా! నినువంటి యు
త్తములఁ గందు హృదయధర్మరతుల

౩

కొడుకులు లేనివాఁడు తన
కూర్చిన సంపద వేనవేల యీ
మడలకొలంది నున్న కొఱ
మాలినచుట్టముపాలుచేసి వాఁ
డెడపెడ వెచ్చపెట్టుతటి
నేడ్చు 'లబో' యని; నీవుమాత్రమీ
బెడఁదను దప్పుకొంటివి వి
వేకవిఖండితమోహవల్లరీ!

౪

సిరిగలవారు భోగముల
చెంతకుఁ బోక జగద్ధితక్రియా
పరులగు టొప్పు నంచు మన
బాపువచించినపల్కు నీదెసన్
గరము ఫలించె; నీరసలఁ
గ్రాఁగుసమాజము గుండెపై భవ
చ్చరితము వాఁగురే! యమృత
సారము చిల్కెను బుచ్చి నాయఁడా!

౫

నీ పేర నీయీవి పరమహేతువై
నిడుఁద్రోలునందు
రూపుదాల్చిన కళాశాల
భవదాత్మరోచిః పతాక;
ఏప్రొద్దు భారతీచరణమంజీర
మృదుఘలంఘలలు
నీప్రాంగణమ్మున మొరయు; ధన్యతా
నిధి వోయి! నీవు.

నిన్నుఁ బరిష్కరించిన మ
నీషి దయమ్మున మున్ను మున్నుగా
సన్నుతి సేయఁదగ్గకృతి
సైరిక బంధువు గోగినేని రం
గన్న కరంగఁగా నెనరు
కాలువలన్ బరఁగించి పల్లెటూ
రున్నతినంద జేసెతె! గు
ణోజ్జ్వల! సామ్యులపాటి సత్కులా!

వినయ వదాన్యతా రుచిర
వేంకటసుబ్బమ నీవధూటియున్
దన యనవద్యమైన సహ
ధర్మచరీత్వము కోటికెక్కఁదీ
ర్చెను సదనం బుమాపతికిఁ
బ్రీతిగ శ్రీగిరిసెత్తమందు; మీ
మనుగడ వసువై కపుల
మాదృశులన్ గదలించు నాయఁడా!

రచన:

'కళాప్రపూర్ణ' శ్రీతుమ్మల సీతారామమూర్తి



కృతి స్వీకృతి

౮

నీకు నలువదేండ్లు నిండినవని మహో
త్సవ మొనర్ప జగము సాగెనట్టి !
మంచి మాటవింటి మది నిర్భరానంద
భవన మయ్యె న దితకవన మయ్యె

౯

ఇదిగో ! యీ 'సమదర్శి' కావ్యమును నీ
కీనాఁడు మేల్బంతిసూ
డిదగా నిచ్చెద మాననీయ జనగో
ష్ఠిన్ దీనిఁ గైకొమ్ము సొం
పొదవన్ విచ్చిన మల్లెపూఁబొదవలెన్
యుష్మద్యశఃకాంతి సం
పద దిగ్భిత్తులకెల్ల వెల్లగ సుహృ
న్మాళీ ! విరాజిల్లఁగన్.

౧౦

విమలస్వాంతులు త్యాగమూర్తులు ప్రజా
విక్లేశవిచ్ఛిత్తి ల
క్ష్యముగా రాపిడి పడ్డవారు మహితా
చార ప్రియంభావుకుల్
సమదర్శిన్ సమగౌరవమ్ము గని రీ
సాహిత్యమున్ షష్టిపూ
ర్తి ముహూర్తమ్మున నీ కొసంగి పరితృ
ప్తిన్ గందు విద్యావనా !

౧౧

వయసు వెంట నాత్మవైభవ మధికమై
మబ్బు విడిన గగనమణి విధాన
ముసురుకొనెడి మోహమును ద్రోసి విడుమర
మరగి సజ్జనుండు మెఱుఁగుదేలు.



# అముద్రిత గ్రంథాలు
# అజ్ఞాత కవులు

"మౌలికమైన పరిశ్రమ తగ్గి, క్రోడీకరణ విధానం విపరీతంగా పెచ్చుపెరిగిపోయిన తెలుగు సాహిత్య ప్రపంచంలో, సప్రమాణము, సర్వజనీనము, సర్వతోముఖము నైన సాహిత్య చరిత్ర అవతరించుట కవకాశాలున్న సంగతి,ఆంధ్ర విద్వల్లోకము గుర్తించుగాక" అని 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' మొదటి మూడు సంపుటాల సమీక్ష ముగించాను [1].

సాహిత్య చరిత్రకుగాని, వాఙ్మయవికాసమునకుగాని కవుల కృతులే ప్రాతిపదికలు. ప్రధానాధారాలు – అయితే తెలుగు సాహిత్యంలో నేడు ముద్రితాలైన ప్రాచీనకృతులే గ్రహించుచున్నాముగాని అముద్రితంగా, అజ్ఞాతంగా పడియున్న కావ్యాలను గూర్చి, వాఙ్మయాన్ని గూర్చి పరిశ్రమచేయుటయే లేదు అముద్రితాలైన గ్రంథాలను గూర్చి పరిశోధన చేయుటయే మౌలికమైన పరిశ్రమ. ఆ పరిశ్రమకు పరమాధారం తాళపత్ర గ్రంథాలు. తాళపత్ర గ్రంథపరిశీలన తలస్పర్శిగా, జరిగితేనే తప్ప తెలుగు సాహిత్యము యొక్క సమగ్ర స్వరూపము గాని వైశాల్యముగాని, విశిష్టతగాని మనమూహింపలేము.

ఈ హేతువుచేతనే ఆదిని బ్రౌన్ దొరగారు తాళపత్ర పరిశోధనతో, ఆంధ్రసాహిత్య చరిత్రకు పునాది వేశారు. కీర్తిశేషులు మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రిగార్లు– ఆ తాళపత్ర గ్రంథ సేకరణకు, పరిశోధనకు తమ జీవితాలను ధారపోసి – బ్రౌను దొరవారి పునాదిపై గోడలు లేవనెత్తడానికి తగిన సాధన సామగ్రి సమకూర్చారు. కాని ఆ పని కొంతవరకైనా కొనసాగలేదు కారణము వెదుకనక్కరలేదు. "కవుల చరిత్ర సమగ్రముగా రచితమైనగాని వాఙ్మయ చరిత్ర రూపొందుటకు వీలులేదు." అన్న ప్రధాన సూత్రము మనము గమనింపలేదు. కవుల చరిత్రగూర్చి పరిశ్రమ జరుగుచుండగానే, వాఙ్మయ చరిత్ర అవతరించింది.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కవుల చరిత్రతో సంబంధంలేని వాఙ్మయ చరిత్ర పరీక్షా పాఠ్యముగా నిర్ణీతమైనది. నిబంధనలకు, అధికారానికి నియమితమైన ఆ వాఙ్మయ ప్రణాళికవల్ల-భవిష్యత్తులో తెలుగు సాహిత్య చరిత్ర కెంత ముప్పు కలుగుతుందో ప్రభాకరశాస్త్రిగారు ఆ కాలంలోనే గ్రహించి యిట్లా వేడినపడ్డారు.

"ఆంధ్ర వాఙ్మయ సౌధనిర్మాణ కర్మకాండలలో నొకడనగుదు ననుకొని కొన్నాళ్ళు మట్టిముద్దలు మోసితిని. నేడు చేతులు కడుగుకొనుటకు సిద్ధముగానున్నాను."

(భారతి మార్చి 1940)

కాలక్రమాన్ని-ఆంధ్ర విశ్వవిద్యాలయ వాఙ్మయ చరిత్ర ప్రణాళికయే సర్వేసర్వత్ర వ్యాప్తమైనది.

1 గ్రంథ విమర్శలు- భారతి (ఆగస్టు 1965, 93-100 పుటలు) సమగ్ర ఆంధ్ర సాహిత్యం- రచయిత శ్రీ ఆరుద్ర.

సమగ్ర ఆంధ్రసాహిత్యం ఇప్పటికి (మార్చి 1968 నాటికి) పన్నెండు సంపుటాలు వచ్చినవి- వాఙ్మయ చరిత్ర సంబంధమైన ఈ పన్నెండు సంపుటాలను- 'భారతి' మూలముగా సమీక్షించు మహదవకాశమును గల్పించిన- భారతి పత్రికాధ్యక్షులు శ్రీ శివలెంక శంభుప్రసాదుగారికి నేను శాశ్వతముగా ఋణిని–

రచన:

శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు

తక్కిన విశ్వవిద్యాలయాలలోను అదే వరవడియైనది[1]. వాఙ్మయ చరిత్రలు — ఈ ప్రణాళికపైనే వెలువడినవి. ఇందువల్ల వాఙ్మయ చరిత్ర రచన కాధారమైన కవి చరిత్ర రచన కెంత అనర్థకము కలిగినదో — తెలుగుదేశము గుర్తింపలేదు. కవుల చరిత్రనుగూర్చి మౌలికమైన పరిశ్రమ చేయుట కవకాశములున్నను విశ్వవిద్యాలయ ప్రణాళికా ప్రభావముచేత—చేసిన పరిశ్రమ అల్లే నిలిచిపోయినది. కవుల చరిత్ర వాఙ్మయ చరిత్ర—ఎన్నడూ కలియని, రెండు సరళ సమానాంతర రేఖలైనవి. పర్యవసానము అటు సమగ్రమైన కవులచరిత్ర మనకు లేదు. ఇటు సప్రమాణికమై, సాధికారమైన వాఙ్మయ చరిత్ర మనకులేదు. ఇదీ మన ప్రస్తుతపరిస్థితి.

ప్రాచీన సాహిత్య చరిత్రనుగూర్చి — అథవా, ప్రాచీన సాహిత్య గ్రంథములను గూర్చిగాని యీ కాలమునందెవ్వరు పట్టించుకొనరు. ముద్రితకావ్యాలనే తిరిగి ముద్రించుటయే మనము చేయుచున్నపని. అంతే. అజ్ఞాతముగా, అముద్రితముగా, ఆయా ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాలలో మూలుగుచున్న ఆ అపూర్వగ్రంథసంపదయాన్ని గూర్చి మనము తలపెట్టనైన తలపెట్టము.

స్వాతంత్ర్యానంతరం — అప్పటి ఉమ్మడిమదరాసు రాష్ట్రప్రభుత్వమువారు తంజావూరి పుస్తక భాండాగారమువారు తెలుగులో కొన్ని ప్రాచీన గ్రంథాలు ప్రకటించారు— అవి క్రీ॥ శ॥ 1950 నుండి వెలువడినను — ఇంతవఱకును అవి వాఙ్మయచరిత్రలలో నెక్కనేలేదు — ఇంతకూ ప్రభుత్వమువారే కొద్ది గ్రంథములు ప్రకటింపగలరేగాని అన్ని ప్రకటింపజాలరు. సాహిత్య సంస్థలు చేపట్టిన కొన్ని ముఖ్యమైనవానిని వెలుగులోనికి తెచ్చుటకు అవకాశము గలుగును.

## ముద్రిత గ్రంథప్రకటన

తెలుగు సాహిత్యమున — అముద్రితముగా నిలిచిన గ్రంథములు, పదులుకావు, వందలుకావు-వేలసంఖ్యగా నున్నవి. కాబట్టి వానినన్నింటిని ముద్రించుట కేనాటికి, నెవ్వరికి సాధ్యముకాదు. అయినను వానియందలి విషయములు గ్రహించి మన కవిచరిత్రలను, సాహిత్య చరిత్రలను సాధ్యమైనంతవఱకు సమగ్రము చేయుటకు మనము ప్రయత్నించవలెను. అందుకు నేనీ క్రింది సూచనను చేయుచున్నాను.

## అముద్రిత వాఙ్మయ కోశము

ఈ కోశమున — అముద్రితములైన గ్రంథములు—వాని వివరణములు నుండవలెను. గ్రంథావతారికయందలి విషయములేగాక, గ్రంథస్థ విషయములు సంగ్రహముగా నుండవలెను — ఆయా గ్రంథములో నుండి తెలియదగిన యంశములు — ఆయా గ్రంథములను గూర్చి స్థూలముగా పరిశీలన చేయువారికి, అందుబాటులో నుండవలెను — ఆకరములన్నియు తెలుపవలెను. ఇట్టి "అముద్రిత వాఙ్మయకోశము" అవతరించినచో నేటి మన తెలుగు వాఙ్మయ చరిత్ర ఇంకా ఎంతగా రూపొందవలయునో తెలియగలదు — భారత వర్షమున దేశ భాషలన్నింటికన్న మన తెలుగు సాహిత్యమెంత విస్తృతమైనదో, విశిష్టమైనదో—తేట పడగలదు.

అట్టి — అముద్రిత వాఙ్మయ కోశమెట్లు ప్రారంభము కావలెనో, తెలియజేయుటకు—ప్రాతిపదికగా—నీ వ్యాసమును 'త్రివేణి' ద్వారమున ప్రకటించుచున్నాను—ఇందు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము—తంజావూరి పుస్తక భాండాగారము—అడయారు పుస్తకాలయము అను మూడింటినుండి గ్రంథములనుగూర్చి వాని వలన తెలియదగిన కవులను గూర్చి ఆకరములతో నిచ్చి యున్నాను. ఇది సూచనామాత్రముగాన —కొన్నింటిని మాత్రమే తెలిపినాను[1]

---

1. ఈనాటికి, ఆంధ్ర శ్రీ వేంకటేశ్వర, ఉస్మానియా విశ్వవిద్యాలయాలలోను ఈ విశ్వ విద్యాలయ కేంద్రాలైన,ఒరంగలు గుంటూరు అనంతపురములోను, నలభైయేండ్లనుండి, ఏ వాఙ్మయ చరిత్ర నడచుచున్నదో అదే పఠనీయము. ఇంకొక విశేషం—ఈ నాటికి ఆ ప్రణాళిక — లిఖిత రూపముగానేయున్నది! పరీక్షాపట్టమునకూ, పరిశోధన పట్టానికి, ఇదే ఆధారము. ఈ ప్రణాళికయే కాదు. సాహిత్యము-పరిశోధన- అంతా ఆయా విశ్వవిద్యాలయాంధ్రశాఖాధికారుల హస్తగతమైయున్నది మనమేమి చేయగలము?

1 గ్రంథములు సాహిత్య ప్రక్రియలుగా విభజింపబడుటచేత కవుల కాల నిర్ణయములు ఒక కాలక్రమమున లేవు. కావున వాఙ్మయ చరిత్ర కారు లన్యథా భావింపవలదని మనవి.

ఆంధ్రమహాజనులు - సమగ్రమైన అత్యావశ్యక మైన, "అముద్రితవాఙ్మయకోశము" అవతరించుటకు కృషి సేయుదురుగాక.

# ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము-చెన్నపట్టణము (మదరాసు)

## 1. పు రా ణ ము లు

తెలుగు సాహిత్యములో కమ్మనాయకులకు అంకితమైన కావ్యాలు - చాలా ఉన్నప్పటికీ వానిని గుఱించి ఏమాత్రమూ పరిశ్రమ జరుగలేదు.[1] అముద్రితంగా కమ్మవారికి కృతియైన ఒక పురాణాన్ని గూర్చి తెలుపుతున్నాను -

మాఘ మాహాత్మ్యము - వాయుపురాణము

వాయుపురాణమున మూడు ఖండములలో నొకటియైన మాఘమాహాత్మ్యమును- ఒడ్డెపూడి పెద్దయ అను కవి రచించి, దాసరి చిన గంగన్న కంకితము చేసెను. ఈతడు కొండపల్లికి తూర్పున-పురుషోత్తమ పట్టణాన్ని- పరిపాలించేవాడు. బాహుబలేంద్రుడు. హరిశ్చంద్రుడు అన్న గజపతి రాజు (ఓఢ్ర రాజు) లకు సామంతుడు- కృతిపతియైన చిన గంగన్నను వర్ణించుచు, కవి యిట్లు కొన్ని వివరములు తెలిపినాడు.

"పురుషోత్తమనామ పట్టణంబునఁబరిపూర్ణ కరుణా సముద్రుండును,చౌదరిపట్టభద్రుండునుకమ్మవంశపయః పారావార చంద్రుండును,శ్రీమన్మారుట్లగోత్ర పవిత్రుం డును,సూరివర్ణితచరిత్రుండును, మద్దాలి తిరుమలాచార్య శిష్యుండును, కవితా వైదుష్యుండును నగు దాసరి చిన గంగ నాహ్వయుండు"

* * *

ఇఁదు దాసరి చినగంగన్న వంశ వృత్తాంతము కలదు- వంశావతారిక యిట్లు కవి ప్రారంభించినాడు.

ఉ. హరిపద సంభవుల్ ,బుధహితాతిశయుల్, కమలాశ్రయుల్ శుభా
చరులును, బుణ్యజీవనులు, సత్పథవర్తులు, లోకపావనుల్
సరసకవి ప్రజాస్పదులు, చారుగభీరులునై వియన్నదీ
స్థిరగతులైనవారి నుతిచేసెదఁగమ్మకులాగ్రగణ్యులన్

1. దక్షిణదేశమున- కమ్మనాయకులుదండనాయకులై, విజయ నగర రాజులకు, దండగా ఉండేవారు. వారిలో గోళ్ళ పెద రామనాయకుని కంకితమైన- చొక్కనాథ చరిత్రను గూర్చి నా దక్షిణదేశీయాంధ్రవాఙ్మయమున (17 - 22 పుటలు) తెలిపినాను. ఇప్పటికి 40 యేండ్లకుముందే, రావిళ్ళ లింగమ నాయకునికి కృతి యిచ్చిన సౌగంధిక ప్రసవాపహరణాన్ని గూర్చి - విజయ నగరము మహారాజకళాపత్రికలో తెలిపినాను. ఇవి రెండు ప్రశస్త ద్విపద కావ్యాలు. తరువాత ముద్రితములైనవి,

* కమ్మవంశము - మారుట్ల గోత్రము

నారన -

|

తిమ్మనేడు

నాగన - (సూరమ)

పెద గంగన (అక్కమ) నాగన తిమ్మన ఎఱ్ఱన

నాగినేడు చిన గంగన - (ఇతడే కృతిపతి) (మల్లమ)

బాపినేడు బొబ్బినేడు అంకన్న అక్కన్న

(కృతిపతి దాసరి చిన గంగన వర్ణన)
సీ. సహకార పనసకేసర నింబజంబీర
సంశాది భూరుహోత్కరమునిల్పి
నిఖిల జీవాధార నిమ్నపుష్కరమైన
చెఱువు చేయించె నచ్చెరువుగాగ
చతుర దేవాగారశార్ఙ్గ కోదండ ప్ర
తిష్ఠా సమాసక్తిఁ దేజరిల్లె
ఉర్వీసుర శ్రేణి కుపనయనోద్వాహ
వస్తు ప్రదాఢ్యుడై వాసికెక్కె
గీ॥ నౌర యనమీతె బురుషోత్తమాభిధాన
పట్టణ స్థిర చౌదరి పట్టభద్రుఁ
డనుపమోదార నియత వర్తనుఁడు మాన
ధనుఁడు దాసరి చినగంగ ఘనయశుండు"

పై పద్యమునుబట్టి చినగంగన - సప్తసంతానము లలో, తటాక, ఆరామ దేవాలయములను ప్రతిష్ఠించి ఆత్మ సంతానమును కృతి సంతానము బడసిన మహనీయుడని తెలియుచున్నది

చిన గంగన కుమారులు నలుగురు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులవంటివారు,అందు బాపినేడు-అంకన మహావీరులు. వారిలో అంకన, నిశ్శంక బిరుదాంకుడు.

ఈ అవతారికలో ఎన్నో చారిత్రక విషయము లున్నవి. అయినను గ్రంథవిస్తర భీతిచే వివరింపలేదు.

## కృతి విశేషములు

కృతికర్త : ఒడ్డెపూడి పెద్దయ

"ఉ. పంకజగర్భ దారకటిభాగ విభా
సిత భర్మమేఖలా
కింకిణి కా వి రావములఁ గేరితదీయ
కర్మాగ విస్ఫుర
త్కంకణ నిష్కళంక నినదంబునగున్
జినయొడ్డెపూఁడి మా
వేంకటమంత్రి పెద్దన నవీన విలాసవచోని
గుంభనల్"

అని ప్రసిద్ధిగన్నవాడు. ఇందలి కవితా రచన కమనీయమైనది.

ఇది రెండాశ్వాసము లున్నవి. ఆశ్వాసాంతగద్య "ఇది శ్రీ మద్వరాహగిరి లక్ష్మీ నృసింహ వరప్రసాద లబ్ధసారస్వతవిచిత్రాపస్తంబసూత్రకాశ్యపగోత్రపవిత్ర ఒడ్డెపూడి వెంకట మంత్రిపుత్ర సకలసుకవిజనవిధేయ పెద్దయ నామధేయ ప్రణీతంబైన వాయుపురాణంబు నందు మాఘమాహాత్మ్యం బను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము

దీని కొకటియే తాళపత్ర ప్రతి యున్నది. ఇప్పటికి ముద్రితమైన పురాణములలో, వాయుపురాణ సంబంధమైన కృతులే లేవు. ఈ గ్రంథము ముద్రిత మైనచో- వాయుపురాణమును గూర్చిన విషయము లనేకము పునః కపగతములు కాగలవు సాహిత్య విమర్శకు చాలగాతోడ్పడును *1. (R. 409)

## వరాహపురాణము

నందిమల్లయ, ఘంటసింగయకవుల వరాహ పురాణము మనకు పరిచితమైనదే[1] కాని అది సంస్కృత వరాహపురాణము నకు సరియైన అనువాదము కాదు. అందుమూలముననే వారికొక తరము[2] వెనుక నున్న హరిభట్టు దీనినియథామూలముగా తెలిగించియున్నాడు[3] అయితే-ఇంతవఱకు యిది అముద్రితముగానే నిలిచి యున్నది.[3]

"అమృతప్రాయ వచోవిశేష రచనా హంభావ
పుంభావ వా
గ్రమణీమూర్తి వేదశాస్త్ర వివిధగ్రంథార్థ
నిర్ణీతి వే
కమఖబ్రహ్మవు యాజుషప్రకట శాఖా
ధర్మధుర్యుండ వ
ర్యమతేజుండవు రాఘవార్య హరిభట్టా
సత్కవిగ్రామణీ"

*1. కవుల చరిత్ర మూలమున కవి పరచితుడే అయినను - కావ్య మముద్రితముగా, అజ్ఞాతముగా నున్నందున నిందు చేర్చి నాడను. ఈ తాళ పత్రప్రతి నాజనకులు సంపాదించినది.

1. ఈ వరాహ పురాణము క్రీ శ. 1904లో- అనగా నిప్పటికి 66 యేండ్ల క్రిందట వీరేశలింగం పంతులుగారు ముద్రించి నారు అంతే- ఇప్పటివఱకు దీనికి పునర్ముద్రణమే లేదు దీనిని గూర్చి వాఙ్మయ చరిత్రలో తప్ప ప్రత్యేకముగా విమర్శక వ్యాసము లేనే లేదు.

2. ఈ హరిభట్టు క్రీ శ. 1520-30. అనగా కృష్ణదేవరాయల కాలమువాడని మొదటనే నే శాసనస్థ ప్రమాణముచే నిరూపించి నాను చూ. భారతి జూలై 1949. కవికాల నిర్ణయములు శాసనా ధారములు (పుటలు 19-25) ఆంధ్ర కవితరంగిణీకారులు మొద లైన తరువాతి కవి చరిత్రకారులు దీనినే గ్రహించినారు.

3. తాళపత్ర సంఖ్య R. No. 411. ప్రతి మంచి స్థితి యందున్నది. ఇదియు నా జనకులు సంపాదించినదే.

అని ప్రస్తుతిగన్న హరిభట్టు బహుగ్రంథరచయిత ప్రశస్త కవి. కమ్మమెట్టునివాసి. ఆతనికృతులు (లభ్యమైనవి)

1 వరాహపురాణము.

2. మత్స్య పురాణము (విష్ణు ధర్మోత్తరము)

3 భాగవత షష్ఠస్కంధము

4 భాగవత ఏకాదశస్కంధము

5. భాగవత ద్వాదశ స్కంధము

6. ఉత్తర నారసింహ పురాణము

7. సంస్కృతమున రతి రహస్యము.

పై వానిలో 3) భాగవత షష్ఠ 5) ద్వాదశ స్కంధములు - 1) వరాహ పురాణము - ముద్రితము కావలసి యున్నవి.

తెలుగున భాగవత కర్తలలో నొకడైన హరిభట్టును గూర్చి ఆంధ్రవాఙ్మయమున - అతని స్థానమునుగూర్చి ప్రత్యేక పరిశోధన చేయదగిన సామగ్రి యున్నది - ముద్రితములైన మత్స్య పురాణము, ఉత్తర నారసింహ పురాణము నేడు లభించుటలేదు- అవి పునర్ముద్రణ చేయదగిన రచనలు-

## 2. ప్రబంధములు - కవులు - తారక బ్రహ్మరాజీయము

కృష్ణరాయని భువనవిజయమున అష్టదిగ్గజ కవీశ్వరులలో [1]నొకడైన రాధామాధవ కవి (చింతలపూడి యెల్లకవి) కృతులు లభ్యమైనవి మూడు.

1. రాధామాధవము——
2. విష్ణుమాయా నాటకము——
3. తారక బ్రహ్మరాజీయము——

వీనిలో నేటికి అముద్రితముగా నున్నది తారక బ్రహ్మరాజీయము - దీనికి రెండు తాళపత్ర ప్రతులున్నవి. ఇందైదాశ్వాసములున్నవి [2]ఇందలిగద్య——

1. అష్టదిగ్గజములు-అనునావ్యాసము-1952సంవత్సరాదిసంచిక.

2 R 347. R 466— ఇందు రెండవదానిలో ప్రథమ ద్వితీయాశ్వాసములుమాత్రమే యున్నవి,

మొదటిదగు 347 సంఖ్య ప్రతిలో మొదటినుండి 4 వ ఆశ్వాసము మధ్యభాగము వఱకే యున్నది. ఈరెండును మాయింట నుండి గ్రహించినవే తారక బ్రహ్మరాజీయము పంచమాశ్వాసమున్న దీని తొలుత శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావు గుర్తించినాడు. రాజమహేంద్రవరము— ఆంధ్రదేశీయేతిహాస మండలి వారి తాళపత్రములో నున్నదానిని వ్రాసి కీర్తిశేషులైన ప్రభాకరశాస్త్రిలవారి కొసగియున్నాడు.

"ఇది శ్రీ మదనగోపాల చరణకమల సేవాధురీణ సత్కళాపారీణ, కృష్ణభట్టారక పౌత్ర, చింతలపూడి కామయ ప్రభుసుపుత్ర శుద్ధ సారస్వత విభవ రాధా మాధవ ప్రణీతంబైన శ్రీరామతారక బ్రహ్మ రాజంబను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము -" ఈ ప్రబంధము సాహిత్యదృష్ట్యా, చరిత్ర దృష్ట్యా ముఖ్యమైన కృతి -

## వేదాంత వాఙ్మయము-

తెలుగు సాహిత్యములో - వేదాంత శాఖావాఙ్మయమును గూర్చి పరిశోధన ప్రారంభము కాలేదు-తారక బ్రహ్మరాజీయ మీ వేదాంత శాఖకు సంబంధించినది - ప్రయాగ క్షేత్రనివాసియైన నారాయణాశ్రమి యను యతీశ్వరుడు సంస్కృతభాషలో రచించిన తారక బ్రహ్మరాజీయమను వేదాంత గ్రంథమున కిది తెలుగు ఇదు, తారకమంత్రమాహాత్మ్యము రామబ్రహ్మ తత్త్వము ప్రపంచింపబడినవి- ఈ గ్రంధరచనము వలన రాధామాధవకవి-వేదాంత వాఙ్మయమున నీ పేరుగల కావ్యముల రచనమున కాద్యుడైనాడు - ఈ తారక బ్రహ్మరాజీయమున కాంధ్రదేశమున నొక్క విశాఖ మండలముననే విశేష వ్యాప్తిగలదు గాని తక్కిన చోట్ల లేనేలేదు. రాధామాధవ కవి వెనుక - విశాఖ మండల వాసులైన ఈ క్రింది కవులు దీనిని పద్య కావ్యములుగా రచించినారు.

1. కొటికలపూడి వెంకటకృష్ణ సోమయాజి ... తారక బ్రహ్మము.

2. కొటికలపూడి కోదండరామకవి, తారక బ్రహ్మ మాహాత్మ్యము.

3 అనుమంచి జగన్నాధకవి - తారక బ్రహ్మ మంత్ర మాహాత్మ్యము.

ఇవి మూడును అముద్రితములే.[1]

## చరిత్ర

ఇది కృష్ణరాయని యనంతరము విజయనగరమును పాలించిన అచ్యుత దేవరాయని మంత్రియైన నంజయతిమ్మరుసు ప్రేరణచే రచితమయినది. అచ్యుత దేవరాయలు - తన యన్నయైన కృష్ణరాయలవలె, భాషా పోషకుడని దీనివలననే తెలియ

1) R 477. b 2) R 545 3) R. 670

వచ్చినది. ఆతడు ప్రతి వత్సరము శ్రీ వేంకటేశ్వర స్వామికి సత్కావ్యప్రబంధ పుష్పాంజలి సమర్పించు వాడు."

ఈ గ్రంథావతారికలో - సంజయ తిమ్మరసు దండనాయకత్వము - ఆతడు జయించిన ప్రదేశములు - మొదలైన చారిత్రక విషయములు -[1]ఆతని వైదుష్యము పరిణతములైనవి - సాహిత్యమునకు చరిత్రకు నింత ముఖ్యమైన ప్రబంధ మింతవఱకముద్రితమగుట చింత్యము. ఇందలి కవిత్రయస్తుతి మనోహరముగ నున్నది.

"భారత కావ్యహార మొక భాగము నన్నయభట్టు గూర్చె, మఱకతరమణీయ వాక్యముల, దక్కిన భాగము సోమయాజి పెంపార రచించె, రెంటిగలయన్ శివ దాసుడు మధ్య నాయక శ్రీ రచియించె శారద ధరింపఁ గవిప్రియకీర్తి మించఁగన్

## కాళ్ళకూరి లక్ష్మీపతి (క్రీ॥ శ॥ 1650)

లక్ష్మీపతి కవి "భద్రా కల్యాణము" అను నాల్గాశ్వాసముల ప్రబంధము రచించెను. ఈతడు నియోగి- ఆపస్తంబసూత్రుడు. భారద్వాజగోత్రుడు. కృష్ణార్జున సంవాదమును ప్రౌఢప్రబంధము చేసిన కాళ్ళకూరి నాగన్న పుత్రుఁడు- తల్లి నాగమ్మయే. సోమప్రధాని తమ్ముడు. ఇతడు "శైవ రహస్య ప్రవీణుడైన" చెందులూరి తెలగ నారాధ్యునిసుతుడగు, శివ దేవయ్య శిష్యుడు "వాగ్దేవతా నుగ్రహ సారస్వతైక విశారదుడు. 'ఆంధ్ర గీర్వాణ భాషా మహాప్రబంధ కల్పనానల్ప నిపుణుడు'. 'ఇందుశేఖరచరణారవింద భక్తిరతుడు'-

ఈతడు వాగ్దేవీ భక్తుడని గద్య తెలుపుచున్నది. ఇది శ్రీమద్వాగీశ్వరీ ప్రసాద లబ్ధ కవితా చమత్కార కాళ్ళకూరి నాగయామాత్య కుమార భవానీశంకరచరణ పంకజ సంజాతారాంకణ భక్తిధురేయ లక్ష్మీపతినామధేయ ప్రణీతంబైన భద్రాపరిణయంబను మహా ప్రబంధంబున సర్వంబును చతుర్థాశ్వాసము. శ్రీకృష్ణుకు భద్రను పెండ్లియాడిన కథ యితివృత్తము. ఇది కాశీ విశ్వనాథునకంకితము. (R 564)

1. ఇందలి చారిత్రక విషయములు విజయనగరచరిత్ర- మూల గ్రంథములు- అన్న చారిత్రక సంపుటములలో చేకొనబడినవి Further sources of Vijayanagar History. Vol. I Dr. N. Venkata Ramanayya Madras University - Publication ఇందు మూలము తెలుగున, ఆంగ్ల భాషలో వివరణము గలదు.

## కాలము

కవిస్తుతిలో

"ఉ. మ్రొక్కెదనాంధ్ర వాక్కవి
ముఖ్యుడు నన్నయ భట్టమౌళికిన్
తిక్కన సోమయాజికి సుధీపరమేష్ఠికిఁ
గేలు మోడ్చెదన్
ఎక్కగ శంభుదాస బుధచంద్రున
కంజలి యాచరించెదన్
మిక్కిలి భక్తితోడ ప్రణమిల్లెద
భాగవత ప్రబంధకున్"

అని పోతనస్తుతి యుండుటచే నితడు 15వ శతాబ్ది తరువాతి వాడు ఇక నితని వంశీయులలో నొకడగు కాళ్ళకూరి గౌరీకాంత కవి తన ధర్మనందనవిలాసము నందిట్లు తన వంశమును గూర్చి తెలిపినాడు-

సీ॥ శ్రీగోత్ర పతిభక్తి మీగోత్ర భవులెల్లఁ
గవులయి రమర భార్గవులఁబోలి
మీ వంశకర్త లక్ష్మీపతి భద్రా ప
రిణయ ప్రముఖ సత్కృతులు చెప్పె
మీ పెదతండ్రి నిర్మించెను రసవినో
దాది కావ్యములు పేరయ మనీషి
మీ తండ్రి రచియించెఁ బ్రీతి సీతారామ
చారిత్ర ముఖకృతుల్ సూరసుకవి

గీ॥ గాన వాణీకటాక్ష వీక్షణము చేతఁ
గవనమెప్పుడు మీయింట గలిగియుంట
జేసి తత్ప్రసాద సంసిద్ధివలనఁ
బొందియున్నది రచనా విభూతినిన్ను

పై పద్యమును బట్టి కాళ్ళకూరి వంశీయులందఱు కవులు- గౌరీకాంత కవి క్రీ శ. 1794-1826 ప్రాంతముల విజయనగర సంస్థానమును పరిపాలించిన నారాయణ గజపతిరాజు కాలమున నున్నట్లు[1] ధర్మనందన విలాసమువలన తెలియుచున్నది. కాబట్టి గౌరీ

1. ఈ ధర్మనందన విలాసము వెలిచేటి గురురాయడను కమ్మనాయకునికి కృతి, ముద్రితమైనది. కమ్మవారి ప్రాభవమిందు వర్ణితము.

కాంతకవి క్రీ. శ. 1800 ప్రాంతములో నున్నట్లు స్పష్టము పై వంశవర్ణనలో లక్ష్మీపతి కవిని వంశ కర్తగా పేర్కొన్నాడు - ఆతడు భద్రా పరిణయము వ్రాసినట్లు గౌరీకాంత కవి చెప్పుటచేత. ప్రసుత మన లక్ష్మీపతియే గౌరీకాంత కవి వంశకర్త యనుటలో సందేహములేదు.

గౌరీకాంతకవి లక్ష్మీపతి కవిని వంశకర్తగా పేర్కొనాడు గాని, యాతనినుండి తన వఱకు వంశ క్రమము వర్ణింపలేదు. తన తండ్రి సూరనను పెద తండ్రిపేరన్నను పేర్కొన్నాడు. దీనిని బట్టి లక్ష్మీపతి తరువాత తన తండ్రివఱకు నున్న తన పూర్వులను గూర్చి యాతనికి తెలియదని చెప్పవచ్చును. లక్ష్మీపతి వంశకర్తయని మాత్రమే తండ్రివలన విని దీనిని గ్రంథస్థము చేసెనని నిర్ణయించవచ్చును- అనగా గౌరీకాంత కవికి, లక్ష్మీపతికవికి నడుమ ఎన్నోతర ములు గడిచియుండవచ్చును - గౌరీకాంతకవి తండ్రి క్రీ. శ. 1750 ప్రాంతము వారు. ఆతనికి నాల్గు తరములు ముందున్నవాడైన లక్షీపతికవి- కీ.శ. 1650 ప్రాంతములవాడుగాని అంతకు ముందువాడు కాని కావచ్చు-

త్రిమూర్తులను నొకే పద్యమున నిట్లు లక్షీపతి స్తుతించినాడు.

చ॥ నరవరదాన చాతురియు నారద
గౌరవచారుమూర్తియున్
సరస గవాను రంజనము
శంభు సమాఖ్యయు నాగభూతి వి
స్ఫురిత మహాశయోన్నతియుఁ
బొల్పమరందగు నచ్యుతుండు శం
కరుఁ డజుఁ దీప్సితార్థ పరికల్పన
మమ్మలరించు గావుతన్-

లక్ష్మీపతి తన తండ్రి- కృష్ణార్జునసంవాద కథ పద్య కావ్యముగా చేసెనని తెలిపినాడు - పద్యకావ్యము చేసెనని స్పష్టముగా నిర్దేశించుటచేత నొకవిషయము స్ఫురించుచున్నది.

కృష్ణార్జున సంవాద కథను మొదట తెలుగులో తెలిపినవాడు- నాదిండ్ల గోపమంత్రి. అది ద్విపద కావ్యము[1] కాబట్టి అది సులభశైలిలో నున్నది. నాగన్నకవి దీనిని ప్రౌఢపద్యకావ్యముగా రచియించి యుండవచ్చును. గోపమంత్రి క్రీ. శ. 1515 నుండి 1533 వఱకును కొండవీటి దుర్గమును పాలించినవాడు కాబట్టి నాగనకవి క్రీ శ. 1600 ప్రాంతముల నుండ వచ్చును. ఇదియు నేను ముందు నిరూపించిన కాలమే నిర్ణయించుచున్నది- నాగన పద్య కావ్యము లభింప లేదు.

కృష్ణార్జున సంవాదము అను గయోపాఖ్యానము రచించిన కవులలో నాగన్నకవియే తొలివాడు- తరు వాతి కవులు-

1. వెలిచేటి వెంకటరామప్రధాని - అముద్రితము (R 230)

2. రామయామాత్యుడు. ముద్రితము- చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు. గయోపాఖ్యానమున దీని ననుసరించిరి.

గౌరీకాంతకవి పెదతండ్రి వ్రాసిన రసవినోదము. తండ్రివ్రాసిన సీతారామచరిత్ర లభ్యముకాలేదు.

## తెలుగున భద్రాపరిణయములు

1. కాళ్ళకూరి లక్ష్మీపతి కవి. ఉపలబ్ధములైన భద్రాపరిణయములలో లక్ష్మీపతి కవిది తొలిది.

2. కాణాదము పెద్దన సోమయాజి ముకుంద విలాసము (భద్రాపరిణయము).

3. అల్లమరాజు సుబ్రహ్మణ్య కవి భద్రా పరిణయము ఇది పై పెద్దన సోమయాజి కృతిని పూర్తిగా అనుసరించినది.

## ఎడవల్లి వెంకటకవి- ( క్రీ. శ. 1650 )

ఈతడు పతిత పావన చరిత్రము అనుయూదాశాస్త్ర నా పీఠికతో వావిళ్ళవారి వలన ముద్రితమైనది.

ముల ప్రబంధము రచించెను- ఆ గ్రంథమున తన వంశవృత్తాంతము తెలిపియున్నాడు.

ఆర్వేల నియోగులలో హరితస గోత్రుడగు తమ్మనార్యుడు వెలసెను. అతడు ఎడవల్లి పురశాసనుడు. పల్లకి పదస్థుడు. వెంకటమంత్రి ఆతని కొమారుడు- గుడిపాటివారి యల్లుడైన అతడు మల్ల తిరునాథ మండలేశ్వరునిచే 'హయచ్ఛత్రాది బహుమానము లను' బడసెను- అచ్చటనుండి వంశవృక్షమిది.




కవి యిట్లు చెప్పినాడు.

గీ॥ అభ్యుదయ పాత్రమైన వంశాభివృద్ధి
గన్న కిచ్చయ వెంగమ నన్నుఁగనియె
నేను వేంకట కవిని మానిత కవిత్వ
కల్పనానల్ప శేముషీకౌశలుండ—

## కాలము

వెంకటకవి తాత తండ్రి-మల్ల తిరునాథ మండలేశ్వరునిచే సమ్మానితుడు-ఈతడు మల్ల తిరువెంగళ నాథుడు- క్రీ. శ. 1600 ప్రాంతముననున్న మల్ల అనంతరాజు తండ్రి-ఈతడు క్రీ శ. 1560 ప్రాంతము వాడు — ఈ కాలమునకు మూడు తరముల వెనుక వెంకట మంత్రి యున్నాడు - అనగా అది క్రీ. శ. 1650 ప్రాంతమగును.

ఈ కవికాలము మఱియొక రీతిని నిర్ణయింప వచ్చును శివ రహస్య ఖండమను మహాగ్రంథమును రచించిన— కోడూరి వెంకటాచల కవి, తన కృత్యావతారికలో— అభిరామ వాసుదేవాది కావ్యకర్త యగు ఎడవల్లి వెంకటకవి తన విద్యాగురువని చెప్పుకొన్నాడు [1] వేంకటాచల కవి మైసూరు రాజ్యమున భైరవకూరును పాలించిన ముళువాగళ ప్రభువునకు తన కృతి నంకితము చేసియున్నాడు- ఆతడు క్రీ॥ శ॥ 1650-1700 ప్రాంతముల నున్నట్లు శాసనముల మూలమున తెలియవచ్చుటచేత ఎడవల్లి వెంకట కవియు నాకాలము వాడేయని నిశ్చయముగ జెప్పవచ్చును.

వెంకటకవి దత్తాత్రేయ యోగీంద్రుని శిష్యుఁడని- పతితపావన చరిత్రమునందలి గద్య తెలుపుచున్నది—

"ఇది శ్రీ దత్తాత్రేయ యోగీశ్వర కరుణాకటాక్ష సాక్షాత్కృత విద్యానవద్య సంస్కృతాంధ్ర కవితా మాధుర్య ధుర్యకిచ్చనార్యనందన వెంకటకవి సంక్రందన విరచితం బైన పతిత పావన చరిత్రంబను మహాప్రబంధంబునందు దృతీయాశ్వాసము"

ఈ దత్తాత్రేయ సంప్రదాయమునకు చెందిన వాఙ్మ

1. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము - పుట 491.

యము తెలుగున పదునాఱు పదునేడు శతాబ్దులలో వ్యాప్తి చెందినది[1]–

వెంకట కవి అభిరామవాసుదేవము దొరకలేదు– పతితపావన చరిత్ర యాతని కవితా వైశద్యము నెఱుకపఱచుటకు చాలును–కవి యీ యితివృత్తము క్రొత్తదని యిట్లు చెప్పినాడు.

ఉ॥ "కావున నొక్క క్రొత్తకథ
కావ్యము చేసెదనంచు నెమ్మదిన్
భావన సేయుచోఁ బతిత
పావననామ చరిత్ర పాత్రమై
వావిరిఁదోఁచెఁదోఁచుటకు
వారకమైనది నిర్విరోధవాం
ఛావరణీయ భాగ్యవిల
సత్త్వమొ? రామకథా మహత్త్వమో?"

ఇందు పతితుడగు నొక బ్రాహ్మణుడు శ్రీరామ మంత్ర ప్రభావమున పవిత్రుడగు కథ వర్ణితమైనది. ఇది శేషగిరీశునికి కృతి–

ఉ॥ శ్రీయుత కౌస్తుభా తపముచేఁ
బయి కెక్కిన యిందిరా తను
చ్ఛాయ యనంగ దక్షిణ భుజా
శిఖరంబున నుర్విఁ దాల్చి తా
నా యరవిందలోచనల నర్థి
గరంచు ఘనుండు భోగని
శ్రేయ సదాన శీలుఁడగు
శేషగిరీశుఁడు మమ్ముఁ బ్రోచుతన్

1. చూడుడు. దత్తాత్రేయవాఙ్మయము– తెలుగుగ్రంథములు– ఆంధ్రపత్రిక– క్రోధి– సంవత్సరాది సంచిక– (1965).

కవితను గూర్చి చెప్పినపద్యము సరసముగా నున్నది.

సీ. అత్యంత గూఢమై యర్థంబుగాని సం
దర్భంబు కవిత కొందఱకుఁ బ్రియము–
సరవి నప్రశుత పూర్వశబ్ద ప్రయోగముల్
బెరసిన కవిత కొందఱకుఁ బ్రియము
పోఁడిమి రెట్టింప వాడిక మాటలు
తరచైన కవిత కొందఱకుఁ బ్రియము
సెలయేళ్లు దుమికిన చెలువున జంఝూళి
తంబైన కవిత కొందఱకుఁ బ్రియము

గీ భువిని నందఱమనసు రాఁగవితఁజెప్పి
మెప్పుగైకొనఁగా శక్యమప్పపమున
దాఁచనేఁటికి బుద్ధికిఁదోచినటుల
రచన చేసెద వినరయ్య! రసికులార

(R 116)

## గుడిపాటి వెంకటకవి (క్రీ. శ. 1700)

కృష్ణరాయల కృతి ఆముక్తమాల్యద అవతరించిన నాటినుండి వ్యాఖ్యానము నపేక్షించినది. వ్యాఖ్యానము వ్రాసిన వారిలో తొలివాడు చిత్రకవి అనంతకవి. ఈతడు "విష్ణుచిత్తీయాది వివిధార్థములను" దెల్పినాడని వ్రాసికొన్నాడు. కాని అది లభ్యము కాలేదు. లభ్యములైన వానిలో మొదటిది గుడిపాటి వెంకటకవి "తాత్పర్య బోధినీ" వ్యాఖ్యానము

ఈ గుడిపాటి వెంకటకవి పతితపావన చరిత్ర వ్రాసిన ఎడవల్లి వెంకటకవికి భిన్నోదర సోదరుడు– వారి సంబంధమిది.

కిచ్చన లేక కృష్ణయ్య
ఈతని కిరువురి భార్యలు –
(పతితపావన చరిత్ర రచయిత
వెంకటకవి తండ్రి– )

భార్య వెంగమ
ఈమెకు జన్మించినవాడు
వెంకట కవి

లింగమ –
ఈమెకు జన్మించినవాడు
వెంకట కవి
తాత్పర్యబోధినీ వ్యాఖ్యాత

దీనిని బట్టి పతితపావన చరిత్ర కర్త. క్రీ. శ. 1650–1700 ప్రాంతములలో నుండుటచేత తాత్పర్య బోధినీ వ్యాఖ్యాత- ఆ ప్రాంతమువాడే కావగును. అయిన నిక్కడ నొక్క- శంక రావచ్చును. వెంకటపతి 'ఎడవల్లి' యని ఇంటిపేరు చెప్పుకున్నాడు- ఈ వెంకటకవి 'గుడిపాటి' అని చెప్పుకొన్నాడు. ఇది యెట్లు? అని దీనికి ప్రత్యుత్తరము పతితపావన చరిత్రయం దిట్లు గలదు–

వెంకటకవి పూర్వుడు. వెంకటమంత్రి. "ఇతడు గుడిపాటివారి అల్లుడై గుడిపాటి వంశాఢ్యు డన వన్నె వాసి గాంచి"న వాడు. అప్పటినుండి ఈ వంశీయులు ఎడవల్లి– గుడిపాటి- అను రెండు పేళ్ళతోవ్యవహృతు లగుచుండిరి. తాత్పర్యబోధిని గద్యయు దీనిని బల పఱచును.

"ఇది సూర్యనారాయణాది నవగ్రహ .... ప్రసాద సమర్థిత సంస్కృతాంధ్ర ప్రబంధ నిబంధనా ప సంభ సూత్రహరితస గోత్రగుడిపాటికిచ్చనామాత్య కుమారక వేంకట కవీంద్ర విరచితాముక్తమాల్యదా ప్రబంధ తాత్పర్యబోధినీ సమాఖ్య ప్రఖ్యాత వ్యాఖ్యానంబు నందు సర్వంబును షష్ఠాశ్వాసము–"

గద్యయందు హరితస గోత్రమని యుండుటచే నిరువురు సోదరులు–

ప్రారంభము ;

శ్రీ మహీనందని వామాంకతలమున
వలనొప్పముందఱ వాయుసుతుఁడు
చరమ భాగంబున సౌమిత్రి భరతుండు
శత్రుఘ్నుఁ డుభయపార్శ్వముల యందు
వాయువ్యముఖ్యకోణీ చుంతదళముల
నినజ విభీషణా నిమిషరాజ
పౌత్ర భల్లుక లోక పట్టభద్రులు గొల్వ
నయ్యష్ట పత్రపద్మాంతరమున

గీ. ప్రేమ మీఱంగఁగద్దికా పీఠమునను
సన్నుతింపఁ బేరోలగ మున్న వాని

భద్ర సంధాయకుని రామభద్రుగొలుతు

ఈవ్యాఖ్యానమును ఇంతవఱకు ఆముక్తమాల్యదా వ్యాఖ్యాన విమర్శకులు వేదము వేంకటరాయశాస్త్రిగారు సూక్ష్మముగా పరిశీలించినట్లులేదు.– తదనంతరము వారును దీనిని చూచినట్లులేదు- ఇందాఱాశ్వాసములే యున్నవి. ఇంతేగాక ప్రస్తుత ముద్రణములలో నాల్గవయాశ్వాసాంతమున నున్న–

"మ. ఇది సింహాచలదంభ కేసరి పదాభీష్టార్చనా
పుణ్యుల
బ్ధదురుట్టంకణ పొట్టునూరి విజయ సంభోవ
లోట్టంకి తా
కద్భుతా ష్టాక్షర కృష్ణరాయ ధరణీకాంతాస్మ
దాముక్త మా
ల్యదనా శ్వాసపరంబు నాఅవది హృద్యం
బై మహిన్పొల్పగున్–"

అను పద్యము- ఆఱవయశ్వాసాంత పద్యముగా నున్నది– ప్రస్తుతము ఆముక్తమాల్యదయందు– ఏడాశ్వాసములున్నవి– పూర్వవ్యాఖ్యాతయగు వెంకటకవి స్పష్టముగా- ఆముక్తమున- ఆఱాశ్వాసములని చెప్పుచుండగా, నవీన వ్యాఖ్యాతలు ఏడని చెప్పుట దురూహ్యముగ నున్నది[1].

1. ప్రప్రథమమున, ఆముక్తమాల్యద వ్రాత ప్రతులను సేకరించి, పాఠ భేదములను సూచించి, సంస్కరించి దానిని ముద్రణ యోగ్యముగ నొనర్చిన యశస్సు భాషోద్ధారకులైన బ్రౌను దొరవారిది. వా రాముక్తమాల్యదకు ఒక శబ్దసూచి (Concordance) వ్రాయించిరి. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో 405 సంఖ్యగల ప్రతిలో విషయ మిట్లు వారి స్వదస్తూరీతో నున్నది.

"This manuscript has been corrected by the very learned Critic Zuluri Appaya in 1834 The third book of the poem is wanting."

బ్రౌను దొరవారు సంప్రతించిన ప్రతు లన్నింటిలోను ఆఱాశ్వాసములే యున్నవి.

తంజావూరులోని పుస్తకశాలలో ఆముక్తమున కారు ప్రతు లున్నవి. వానిలో ఆఱాశ్వాసములే యున్నవి.

వావిళ్ళవారువెలయించిన 6 ముద్రణములలోఆఱాశ్వాసములే యున్నవి.

అయినను వేంకటరాయశాస్త్రిగారు, తమ వ్యాఖ్యానమున నేడాశ్వాసములుగా ప్రకటించి యున్నారు. దీనిని గూర్చి వేదము వారి వ్యాఖ్యానమును గూర్చి నా వ్యాసము చూడుడు. (భారతి, అక్టోబరు 1963-గ్రంథ విమర్శనము-ఆంధ్ర సాహితీ సార్వభౌముడు)

వెంకటకవి తాత్పర్య బోధినీ వ్యాఖ్యానము ముద్రితమైన- ఆముక్తమాల్యదను గూర్చి నూతన విషయము లెన్నో బయలు పడును.

దీనికి రెండుప్రతులు- గలవు. డి.402, ఆర్.1005 398 పుటలు గల రెండు సంపుటములు-

## పెద్దాడ నాగరాజు క్రీ. శ. 1750

ఈతడు శకుంతలాపరిణయమను మూడాశ్వాసముల ప్రబంధముగా రచించెను- పెద్దాడ వారు నియోగులు.గౌతమ గోత్రులు- వారి వంశక్రమమిది




గద్య :-"ఇది శ్రీ విశాలాక్షీ కాశీవిశ్వేశ్వర కరుణా కటాక్ష వీక్షాలబ్ధ సరససాహితీ ధౌరేయ విద్వజ్జన విధేయ, గౌతమ గోత్ర పవిత్ర సూరయామాత్యపుత్ర సద్గుణ సమాజ నాగరాజ ప్రణీతంబైన శకుంతలా పరిణయంబను మహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము."

ఈతడు క్రీ. శ. 1872-1919 లో జీవించిన భాషా పోషకుడు. ప్రసిద్ధుడు అయిన కొచ్చెర్ల కోట రామచంద్ర వెంకట కృష్ణారావుగారి మేనమామకు నాల్గవతరము ముందువాడు-కాబట్టి క్రీ శ. 1750 ప్రాంతమున నున్నాడు-ఈ గ్రంథము ముద్రితమైనది- దీనిని గూర్చి అముద్రిత గ్రంథ చింతామణి పత్రిక- సం. 14 సంచికలు 1-2-3, 1909 జనవరి-మార్చి" ప్రకటించిన సమీక్ష చూడనగును - "పిన వీరన శకుంతలా పరిణయము వెనుక నింతచక్కని శకుంతలా పరిణయము పుట్టలేదని వారభిప్రాయపడిరి" (10-12 పుట్ట) తెలుగున శకుంతలా పరిణయములు.

## శకుంతలా పరిణయములు

కవి కుల గురువగు కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమును పినవీరన తెలుగున, ప్రబంధముగా నంతరించి తెనుగున శాకుంతల వాఙ్మయమునకు మూలపురుషుడైనాడు. ఆధునిక యుగమున శాకుంతల నాటకాంధ్రీకరణములతో నీ వాఙ్మయము విస్తరిల్లినది-విమర్శన గ్రంథములు వచ్చినవి పిల్లలమఱ్ఱి పినవీరన రచనలను గూర్చి విపులమైన సమీక్షా గ్రంథము గలదు[1] ఇందు పద్యకృతులను గూర్చి మాత్రమే తెలిపెదను.

1. పిల్లలమఱ్ఱి పినవీరన శృంగార శాకుంతలము. ముద్రితము

2. రేవణూరి వెంకటాచార్యుని శకుంతలా పరిణయము-అముద్రితము (R 140)

   ఈతడు దివ్య తిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులై పదకవితా సార్వభౌములైన-తాళ్ళపాక అన్నమయ్యగారి కుమార్తె వంశములోనివాడు- ఈతని శ్రీ పాదరేణుమాహాత్మ్యమును తిరుపతి దేవస్థానము వారచ్చువేసినారు.శకుంతలా పరిణయము ముద్రితము కాలేదు-

3. పేద్దాడ నాగరాజ కవి శకుంతలాపరిణయము ముద్రితము

4. కృష్ణ కవి శకుంతలా పరిణయము- ,,
   ఈతడే అకలంకము కృష్ణమాచార్యులు-
   ఈతని ధనుర్విద్యా విలాసము మదరాసు ప్రభుత్వమువారు ప్రకటించినారు.

1. ముదిగొండ వీరేశలింగము అను పరిశోధక విద్యార్థి ఉస్మానియా విశ్వవిద్యాలయము వారికి సమర్పించిన సిద్ధాంత వ్యాసము (Theisis).

పిల్లలమఱ్ఱిపిన వీరభద్రుడు అతని రచనలు - అని దాని పేరు.అది పి. హెచ్. డి. పట్టమును బడయుట ధాగ్యమునను నోచుకొనక పోయినను,ముద్రణము నందినది-పినవీరభద్రకవి రచనలను గూర్చి యింతకన్న బృహత్ ప్రామాణిక గ్రంథము వేఱొకటి లేదు.

5. పక్కి వెంకటనరసయ శకుంతలాపరిణయము (1836) ముద్రితము

6. భరతాభ్యుదయము - (శకుంతలా పరిణయము) (1899) ముద్రితము

ఇది అభినవ పండితరాయ మాడభూషి వేంకటాచార్యుల కృతి. శృంగార రస ప్రధాన మగు వారి "రామావధూటి తారావళి" నెఱుగుదురు గాని; సముచిత, సరస, వర్ణన, భావములు గల వారి భరతాభ్యుదయము నెవ్వతెఱుగరు- ఇది ప్రశస్తమైన ప్రబంధము-

## కామరాజు (క్రీ. శ. 1750)

ప్రసిద్ధమైన గోవ్యాఘ్ర చరిత్ర కథను రెండాశ్వాసముల పద్యకావ్యముగా రచించిన కామరాజుకవి, హరిహర భక్తుడు- తన గ్రంథమును హరిహరనాథునికే అంకితము చేసియున్నాడు.

ప్రారంభము-

సీ. శ్రీరత్నమును సతీసీమంతినీ మణి
యును వక్షమున నర్తనువు నమర
నీల జీమూతంబునెఱి శారదాభ్రంబు
కరణి దేహద్యుతుల్ కాని పింపఁ
గలువల చెలికాడు కంజాత మిత్రుండు
నేత్రద్వయంబునై నివ్వటిల్లఁ
జక్ర త్రిశూలముల్ శారఙ్గపినాకముల్
కరముల విక్రమక్రమముఁదెలుపఁ

గీ. కంఠసీమల గౌస్తుభగరము లొప్పఁ
గస్తురియుఁబొట్టు మిక్కిలి కన్నులమరఁ
దలఁప నొకతేజ మిరుతెఱంగుల వహించి
రటి హరిహరులను గొల్తునసుదినంబు-

వంశక్రమ మిది,




గ్రంథమున- "హరిహర చరణారవింద మకరంద పానానంద సంపూరిత స్వాంతుండగుచు" అనియు "హరిహర దాసుఁడ" ననియువ్రాసికొన్నాడు. ఇంతకు ముందు "ఒక్క ప్రబంధంబు లక్ష్మీనారాయణుల కంకితంబుగా రచియించి మఱియునొక్క ప్రబంధం బార్యా సనాధుండగు విశ్వనాథున కంకితంబుగా నొనరించి, మఱియు నొక్కచరిత్రంబు భక్తిపూర్వకంబుగా హరిహరుల కంకితం బొనంగందలంచి షష్ఠ్యంతములు రచించెదను." అని చెప్పుటచేత, నీతడు విష్ణునకు, శివునకు వేఱు వేఱుగా ప్రబంధముల నంకితము చేసెనని తెలియుచున్నది. కాని అవి యిపుడుకానరావు

తెలుగున హరిహరనాథతత్త్వమును గూర్చి - పరిశ్రమ చేయువారీ కావ్యము పరిశీలింప దగును.

ఈ కవికాల నిర్ణయము చేయుట కాధారములు లభింపలేదు. ఇది తాళపత్రప్రతి R. 44 సంఖ్య ప్రతి ప్రాతది కావున కవి నూటయేబది యేండ్ల కన్న ముందు వాడని మాత్రమే స్థూలముగా చెప్పవచ్చును.

గోవ్యాఘ్ర చరిత్ర కథ అనంతామాత్యకృత భోజరాజీయమునను న్నది. దీనిని గూర్చిన ప్రత్యేక రచనలు.

1. కపిల గోసంవాదము. రామావధ్యుల కొండుభట్లు. R. పద్యకృతి.
2. గోవ్యాఘ్ర చరిత్ర- కొమఱ్ఱాజు రామలింగకవి.
3. కామధేనువు కథ. వచనము.

## హరిహరనాథ తత్త్వము

ఆంధ్ర సాహిత్యమున తొలుత తిక్కన ప్రతిపాదించిన హరిహరనాథ సంప్రదాయమును గూర్చి యింతవరకు సాధికారమైన పరిశ్రమ జరుగలేదు సాహిత్య విమర్శక దృష్టితోనే కాక శైవవైష్ణవమత పరిణామ దృష్టితోడను, నీ తత్త్వమును సమీక్షింప వలసియున్నది. అట్టి పరిశ్రమకు ప్రాతిపదిక నీ వఱకే సిద్ధము చేసి యున్నాను. 1

నాచనసోమన తన యుత్తరహరివంశమున తిక్కన ననుసరించి హరిహరనాథునికి తన కృతినంకితము చేసెను. సోముని యుత్తర హరివంశమును గూర్చి యెన్నియో విమర్శనలు వచ్చినవి-కాని యే విమర్శన యందును నీ హరిహర తత్త్వ విచారణ కానరాదు. తిక్కన రచన లోగల యాధ్యాత్మిక భావన సోముని రచనలో లేదని మన విమర్శకులు గుర్తింపలేదు- తిక్కన సోమనల హరిహరాంకితాశ్వాసాద్యంత పద్యములు – సంపూర్ణ టీకాతాత్పర్యములతో ప్రకటితములైనయెడల నీ విషయము విస్పష్టమగును. ఇట్లే కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశికాశ్వాసాద్యంత పద్యములు టీకా తాత్పర్యములతో ప్రకటితములు గావలెను. దూబగుంట నారాయణ కవి- బెంచరాజు వెంకటరాజ కవి తాము హరిహర భక్తులమని మాత్రమే చెప్పుకొన్నారు. ఇంకను పూర్వ కవుల రచనలలో హరిహరనాథ స్తుతులు సేకరింపబడవలెను. ఈ సందర్భమున నింతవఱకు సాహిత్య చరిత్రకారు లెఱుగని యొక నూతనాంశమును దెలుపుచున్నాను.

తిక్కన హరిహర నాథ భక్తుడైనను తన కొమారునికి తనతండ్రి పేరేపెట్టినాడు. తిక్కన కుమారుడు కొమ్మన కొమ్మన మాత్రము తన కుమారునికి, తండ్రియైన తిక్కనపేరు పెట్టక తిక్కన యుపాస్య దైవమగు హరిహర నాథుని పేరు పెటినాడు. ఇది యెంతయు ప్రశంసనీయమేకాక, తిక్కన భక్తి సంప్రదాయము నిలుపునట్లు చేసినది.




తిక్కన సోమయాజి సంపూర్ణవంశ వృక్షమిప్పటికి డెబ్బదినాలేండ్ల క్రిందట ప్రకటితమైనది. 1 తిక్కననుండి క్రీ. శ. 1896 వఱకు గల వంశీయుల క్రమ మిందుగలదు. తిక్కన వంశీయులు నేటి వఱకు నున్నారు. ఇట్లవిచ్ఛిన్నముగా వచ్చుచున్న పూర్వ కవి కుటుంబములలో, తిక్కన కుటుంబమొక్కటి మాత్రమే యున్నదని మనము గ్రహింపవలెను.

తిక్కన సోమయాజి మనుమడు హరిహరామాత్యుని వంశము వృద్ధియైనది. ఆతని తరువాత వారు "హరిహర నాథునివారు" అని యింటిపేరితొ వ్యవహరింపబడిరి వారిలో నొక కవిగలడు.

## హరిహరనాథునిచెన్నకృష్ణయ (క్రీ.శ.1780)

ఇతడు "సాంఖ్య రామాయణము" అను పేర రామకథను రచించి యున్నాడు. గ్రంథము సమగ్రముగ లభింపలేదు. ఇందలి కిష్కింధా కాండాంత గద్యయిది :

"ఇది శ్రీ మద్రమారమణ చరణ సేవాధురీణ పరిణామ హరిహరనాథాన్వయ పయః పారావార సుధాకర నరసింగ యామాత్యపుత్ర చెన్నకృష్ణయాఖ్య

1. నా తెలుగు కవుల చరిత్ర రెండవ సంపుటము-తిక్కన-ఎఱ్ఱనల యుగము. ఇందు, తిక్కనకు ముందు, మల్లికార్జున పండితారాధ్యులు హరిహరతత్త్వము నెట్లు ఖండించినది-తిక్కన దాని నెట్లు పునరుద్ధరించినది- మున్నగు విషయములు సోపపత్తికముగా నిరూపింపబడినవి.

1. అముద్రిత గ్రంథ చింతామణి. నవంబరు 1896 సం. 8 సం. 11 ఇందున్న వంశ వృక్షముతో, కేతన దశకుమార చరిత్రలోతిక్కనకు ముందేడుతరములవారి సంపూర్ణ వంశవృక్షము వివరములతో నా తెలుగుకవి చరిత్ర -తిక్కన ఎఱ్ఱనల యుగము నందీయబడినవి.

ప్రణీతంబైన శ్రీమత్సాంఖ్య రామాయణంబను మహా ప్రబంధంబునందుఁ గిష్కింధాకాండము సంపూర్ణము"

కొన్ని పద్యములు :

చ. వినయము దోపఁ మ్రొక్కెడుదు
విశ్రుతకీరకరావలంబకున్
ఘనతరమాక్షికై క్షవముఖ
స్ఫురితాధర భూరిబింబకున్
జనిత విలాసహాసముఖ సౌర
భసారస వైరిబింబకున్
దినమణి.... దివ్య
నితంబకు శారదాంబకున్

శా. కాంతుండర్థ శరీరమిచ్చె తనకై
కాంక్షించి యంచాత్మలో
చింతం బొంది యపర్ణనై
ఋణములో జిక్కంగ రాదందు బల్
సంతోషంబున దేహమంతయుఁ
బరాధీనంబుఁ నుంజేయున
క్కాంతారత్నము న్నాశ్రయింతు
నన్వణుంగాజేసినన్ బ్రోవుతన్

ఉ. పాణి యుగంబు మోడ్చి ప్రణిపాత
మొనర్చెదఁ బోషితామర
శ్రేణికి పంకజాసన వశీ కరణాకర
కీరవాణికిన్
వాణికి విస్ఫురద్ధవళ వస్త్రపరీవృత
పూత సైకత
శ్రోణికి చంచరీక గణ సుందరవేణికి
నబ్జపాణికిన్

ఇది స్పష్టముగా పోతన భాగవత పద్యమునకను వాదము-

కవికాల నిర్ణయమున కాధారములు లేవు. పై యను వాదమునుబట్టియితడు పోతనకు ననగా క్రీ.శ.1500లకు తరువాతివాడు-

ఈ గ్రంథ తాళపత్రప్రతి ప్రాచీనమైనది. కావున నీతడిప్పటికి రెండు వందల యేండ్ల క్రిందటి వాడు కాదగును- దొరకి యున్న భాగము పెద్దదిగా నున్నది.

(R964)

<u>క్షేత్రమాహాత్మ్యములు-కవులు</u>

## పాపనామాత్యుడు- (క్రీ.శ 1790)

స్కాందపురాణాంతర్గతమగు సేతుఖండమును పద్యకావ్యముగా రచించిన ఈతని కృతి మనకు సమగ్రముగ లభింపలేదు- అదృష్టమువలన అవతారికగల ప్రథమాశ్వాసము లభ్యమైనది. దానినుండి వివరములు.

హరితస గోత్రమున శాయిమంత్రి. వరులోపన గర్యధినాథుడై వెలసెను- ఆతడు లక్కమయందు రామచంద్రుని గనెను- అక్కడినుండి వంశక్రమమిది

శాయిమంత్రి-లక్కమాంబ
|
రామచంద్రుడు-దమ్మాయమ్మ
|
వెంకట కృష్ణుడు-లక్ష్మమ్మ
|
పాపయ-(గ్రంథకర్త)

పాపయ తల్లి- లచ్చమాంబ-వసుపేటయందలి గౌరీదేవిని గొల్చి భాగ్యసంపన్నయైనది-

"శా॥ ఆసాధ్వీమణి లచ్చయాంబ
వసుపేట్యావాస గౌరీప్రసా
దాసంపాదిత భోగభాగ్య
యగుచున్ దానంబులుర్వీసుర
శ్రీ సంఘంబునకిచ్చు నెచ్చు
పడ నా శ్రీలక్ష్మి నా విశ్రుతిన్
వాసోకాంచన ధేను ధాన్య
సమితిన్ వంచింప కెల్లప్పుడున్"

ఆ వెనుక తననుగూర్చి యిట్లు చెప్పు కొన్నాడు:

"వ. నేను మజ్జననీజనకులాలన ప్రవర్ధమానుండనై కాంతావాగిందిరా నాయకన్యను పాణిగ్రహణంబుచేసి సంతతిపడసి వ్యవహారదశను శాకనగరంబున కధికారంబు సేయుచుండితి.........

...............................

ఇట్టి ప్రతీతిగల శాకనగరంబునధికారము సేయుచుండి, తన్నగరంబున గోపాలసలంబుండి శిథిలంబై యున్నఁ బునరాలయంబుఁగల్పించి [1]సాధారణ నామ సంవత్సర

1. ఇచట కాలము - సంవత్సర, మాస, తిథులు తెలుప బడినను "వారము" చెప్పబడలేదు - అందుచే నిర్ణయము సుగమము కాకున్నది.

జ్యేష్ఠశుద్ధపూర్ణిమా పర్వంబున శ్రీ గోపాలస్వామి సంప్రోక్షణంబు గావించి ద్విజసంతర్పణం బాచరించి (తీర్థవారినాటి రాత్రియం?) దుత్సవంబు చేసినఁ దద్రాత్రి సుఖసుప్తుండనగునాస్వప్నంబున శ్రీ గోపాల స్వామి సాక్షాత్కారంబుగా దర్శనంబుఁ బ్రసాదించె. దొరికిన దానిలో చివర- "ఈ యధ్యాయం బెవ్వరేని పఠించిన వినిన సర్వపాప విముక్తులగుదురు" అని కలదు దీనినిబట్టియిది మూలమునగల యధ్యాయము ననుసరించి రచింపబడినట్లు స్పష్టము.

ఓ మిత్యాది మహాపురాణేస్కాందే, సేతుఖండే బేతాళవరద తీర్థ ప్రశంసాయామ్ సుదర్శన సుకర్ణ శాపమోక్షణం నామ నవమోధ్యాయః"

ప్రారంభము:

శ్రీ వాగార్యారమణుల

శ్రీ వాగార్యారమణులఁజేతః ప్రీతిన్

శ్రీ వాగార్యా త్వంబులు

మా వసతుల నిల్పుకొ అకు మతినుతి యింతున్

ఇందలి కవి స్తుతి కొత్తపోకడ నున్నది-

సి మూర్తియై చెలువొందె ముఖ్యపేశల శబ్ద
శాసనుండగు నన్న సత్కవీంద్రు
డసువుగా విల్లసిల్లె నల సోమయాజియుఁ
బటుతరావయవాళి భాస్కరుండు
పొనఁగఁగట్టిన యట్టి పట్టంబు పోతన
పింగళిసూరన రంగు పూత
అలసాని పెద్దన విలసదాత్మస్థితి
శృంగారముల ప్రోవు వెంగళప్ప
గీ॥ జగతి కవితామ తల్లికి (జాగ్రవద?)
కనుచుఁగొనియాడునట్టి యాయాంధ్రకవుల
నభినుతించెదఁ దత్ప్రసాదాతిశయము
తోడుగావుత మత్కవి తో క్తికనుచు

పై కవిస్తుతినిఁబట్టి యీతడు క్రీ. శ. 1600 కు తరు వాడనుట స్పష్టము-ఇక నీ గ్రంథము, ప్రాచ్యః శాలలో గల తాళపత్రముల నుండి యుద్ధరింపబడినది. కాబట్టి కవి 1700-1800 ప్రాంతముల వాడుకావలెను-

శాకనగరమనగా "కూరపాడు" పైని పేర్కొనబడిన సాధార్ణ సంవత్సరము 1850 కి ముందు 1790-1730-1670 ప్రాంతములోనేదియైన కావచ్చును. భావి పరిశోధనవలన నిశ్చితమగును.

తెలుగున సేతు ఖండములు - సేఁ మనగా రామేశ్వర క్షేత్ర మాహాత్మ్యము.

1. రామేశ్వరక్షేత్రమాహాత్మ్యము ఏనుగులక్ష్మణకవి (ముద్రితము మంజువాణి 1904)

2. సేతుఖండము - దామెర వెంకటరాయ కవి (అముద్రితము) - (R 543)

3. సేతుఖండము - వరదరాజు నందికేశ్వర కవి (అముద్రితము)

ఇది కీ శే॥ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారి తండ్రియైన వెంకటప్పయ్యగారి ప్రేరణచే రచితము.

ఇందుకొమఱ్ఱాజు వారి వంశవృత్తాంత మంతయు గలదు. (R 676)

ఇవియన్నియు పద్యకావ్యములే -

(R41)

4. సేతుఖండము - పద్యకావ్యము గ్రంథకర్త పేరు తెలియదు

కొంతభాగము లభించినది. (R 241)

109 తాళపత్రములు గలవు.

## వరదరాజు నందికేశ్వరకవి (క్రీ. శ. 1800)

"సేతుమాహాత్మ్యము" అను పేర రామేశ్వర క్షేత్ర మాహాత్మ్యమునునీ కవి యైదాశ్వాసముల ప్రబంధముగా రచించి కృష్ణా మండలమున పెనుగంచి ప్రోలు[1]న వెలసిన శంభులింగేశ్వరునకు కృతిగా సమర్పించెను.

ఈ కృతి తెలుగుదేశమున మహాప్రసిద్ధిజెందిన ప్రథమ విజ్ఞాన సర్వస్వ నిర్మాత కీ. శే కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావుగారి తండ్రి యైన కొమఱ్ఱాజు వెంకటప్పయ్యగారి ప్రేరణచే రచితమైనది-వారివంశ

1. ఈ వాడు పార్థివ లింగపూజ ప్రొద్దున నొక్క సారియే చేయుదురు-రాత్రి కొందరు చేయుదురు కాని; నందికేశ్వర కవి త్రికాలముల-అనగా-మధ్యాహ్నముకూడ చేయుట విశేషము. ఈ పూజ మిక్కిలి మహత్త్వము గలది. కీ. శే, నాజనపలు సుందరము - పార్థివ లింగ పూజాధురంధరులు వారు దీని మహత్తును ప్రత్యక్షముగా నిరూపించినారు. ఒక పూట చేయుటకే యిది కొన్ని గంటలు పట్టును. పార్థివ అనగా మట్టితో లింగమును నెప్పటికప్పుడు చేయవలెను. గాని ముందుగా చేసి పెటుకొని యుంచుకొనరాదు-

వృత్తాంతమంతయు నీ గ్రంథమున వర్ణితమైనది.

ఆ వెంకటప్ప గారొకనాడు కవిని బిలిపించి యిట్లనిరి.

నన్నుఁ గౌశికమునినాథగోత్రపవిత్రు
వరదరాజాన్వయవార్ధి చంద్రు
జోగేశ్వరార్యాత్మజుని లచ్చమాంబిక
గర్భ సచ్ఛుక్తి ముక్తాఫలంబు
రాజేశ్వరాగ్రజు రత్నయ శ్రీ రామ
సహజన్ము వైదికాచార నిరతుఁ
గాలత్రయార్చిత ఘనపార్థివేశ్వర
షడ్వర్ణ మంత్రైక జపధురీణు

గీ. నిగమశాస్త్ర పురాణ విన్నిఖిల విబుధ
మానసాంభోజ విభ్రమన్మధు లిడధిపు
సరసకవితా విధిజ్ఞు సత్సంగతిజ్ఞు
నందికేశాఖ్యుఁబర శివానందసౌఖ్యు.

వితత పాపౌఘ నిష్కృతి నేర్పఱించెడి
సేతుఖండంబుఁ బ్రసిద్ధిఁగాఁగ
నీవు దెనిఁగించుచే వింటి నోమహా
కవివర్య ! మన్మనః కాంక్షదీఱ

గీ. తప్త జాంబూనదాను సంధాన కరణి
గన్నమణివోలె బగతి ప్రకాశమందు
గాన తత్ గ్రంథమును పెనుగంచిప్రోలు
శంభులింగేశునకు గృతి సల్పుమయ్య.

వరదరాజు నందికేశ్వర కవి కౌశిక గోత్రుడు-లచ్చమాంబా జోగేశ్వరుల పుత్రుడు - వైదికాచార రతుడు- త్రికాలముల పార్థివలింగపూజ .చేసెడివాడు- శైవాగమపూర్ణవేది - ఈతని గురువు జ్ఞానానంద స్వామి యని గద్యవలనఁ తెలియు చున్నది.

ఇది శ్రీ మద్రాజ రాజేశ్వరీ వరప్రసాద లబ్ధ కవితా ధురీణనిగమాగమపారీణ జ్ఞానానందగురుచరణారవింద మకరందపానమాన సేందిందిరోభయ సాహిత్యానందా పస్తంబ సూత్ర కౌశికగోత్ర జోగేశ్వరార్య పుత్ర లచ్చాంబికా గర్భపయః పారావార కుముదమిత్ర రాజేశ్వరాగ్రజానుగ్రహపాత్ర నందికేశ్వర నామ విద్వత్కవీశ్వర ప్రణీతంబయిన సేతుమాహాత్మ్యంబున సర్వంబును పంచమాశ్వాసము సంపూర్ణము"

8.1

## పెనుగంచిప్రోలు వర్ణన

సీ॥ అఖిలాంధ్రదేశ మధ్యావనస్థలకంఠ
భూషణం బయ్యె నేపురవరంబు
భ్రమరాంబికానాథ భవనాంత్యదిగ్భూమి
భాసిలు చుండు నేపట్టణంబు
పుణ్యపయః పరిపూర్ణమౌ సహ్యజ
దనరారు నే పురిదక్షిణమున
కూలంక షాంబు కల్లోల మే ద్గలనది
ప్రవహించు చుండు నే నగరిచెంత

గీ॥ ఈశినీ భర్త శంభులింగేశమూర్తి
యుద్భవంబందె నే కటకోత్తమమున
నద్ది దనరారునిఖిల కళాభిరతి వి
రించి పురిఁబోలు శ్రీ పెనుగంచిప్రోలు

## కొమర్రాజువారి వంశము

1. భారద్వాజ గోత్రమున, కొమర్రాజుదయించెను- వీరు నియోగులు

2. ఆతని కొడుకు శంకరు డుదయించెను-ఈతడు ముదిగొండ వీరభద్రారాధ్యుని వలన దీక్షనంది యారాధ్యుడయ్యెను.

శంకరుడు గొప్ప తపశ్శాలి - ఘోరభైరవులు దారి చూపుచుండగా, మూడుమారులు శ్రీశైలపర్వత ప్రదక్షిణగావించెను.

3. శంకరుని మూడవ కొడుకు నాగేశ్వరుడు వాసిరెడ్డి వెంకటాద్రినాయనివారిమంత్రియై ప్రసిద్ధికెక్కెను.

4. నాగేశ్వరుని పుత్రు లైదుగురిలో లక్ష్మణరాయడు గోలుకొండ నవాబుల మంత్రి చందులాలు మంత్రియై దేశాధికారియయ్యెను.

5. లక్షణరాయని కుమారుడు - వెంకటప్ప — ఈతడేకృతిప్రేరకుడు - ఈయన - తన తండ్రిపేరు కుమారునికి పెట్టెను ఆతడే - కీ॥ శే॥ వెంకట లక్ష్మణరావు. 1

---

1. ఆంధ్ర సాంస్కృతిక పునరుజ్జీవనమునకు హేతు భూత త్రైనమూర్తిత్రయము కందుకూరి, కాశీనాధుని, కొమ్మర్రాజువారలలో, కొమర్రాజువారి వంశమును గూర్చి- వారి విశేషములను గూర్చి- వెంకట లక్ష్మణరావుగారిని గూర్చి విపుల పరిశోధనచేసి ప్రామాణికమగు చరిత్ర ఆంగ్లేయ భాషలో వ్రాసియున్నాను. "The History of the Komarraju Family' అని దాని పేరు. అది ముద్రితము కావలసి యున్నది.ఆవంశీయులను గూర్చి సంపూర్ణముగ పరిశ్రమ చేయుటకు రెండేండ్లు పట్టును కాని యట్టి యవకాశము నాకు లభింపలేదు.

నందికేశ్వర కవి "శివతత్త్వసుధానిధి" అనుపేరి యొక పద్యకావ్యము రచియించి యున్నాడు – అది ముద్రితము – ప్రస్తుత గ్రంధ మముద్రితము

R 676

ఇది సేతుఖండము లన్నింటిలో చాల విపుల మైనది గ్రంథమున 7320 పంక్తులున్నవి. ప్రారంభ పద్యము శైవపరమే.43

"శ్రీ శాలిన్విధి విష్ణు
ముఖ్యసుమనశ్శ్రేణీ శిరోరత్నరే
ఖాశోభాంచిత పాదపద్మ
హిమవత్ గ్రావేల్సుతా ధర్మప
త్నీశృం గారిత వామ భాగు
విలసత్తేజోనిధిన్ శంభులిం
గేశాఖ్యన్ శివునాశ్రయించెద
మనోభీష్టార్థసంసిద్ధికై

## భాగవతుల రామయ్య క్రీ. శ. 1800

ఈతడు శ్రీరంగమాహాత్మ్యమును పద్యకావ్యముగా రచియించెను బ్రహ్మాండపురాణమునుండి గ్రహింపబడిన యీ కథన మెన్ని యాశ్వాసములలో పూర్తియైనదో తెలియరాదు- ఉపలబ్ధమలైన గ్రంథములో రెండాశ్వాసములున్నవి. ఇది నల్లపాటి రమణ ప్రధానున కంకితము. ఆతడు గౌతమ గోత్రుడు. అన్నయామాత్య పుత్రుడు–ఇంతకన్న విశేషములు తెలియరావు.

రామయ కవిని అతడు పిలిపించి యిట్లన్నాడు.

చ. అవనిఁదినర్చు సంతతుల యందు
బుధుల్ కృతినెక్కుడంద్రురం
గ విభు చరిత్ర నీవు కృతిగా
నిడినన్నలరింపుమయ్య భా
గవత(మహాన్వయాంబునిధి
కైరవ బాంధవ) బుచ్చనాహ్వ యా
ర్యవరతనూభవాగ్రభవ
రామకవీ! పరిభూతకాకవీ!

ద్వితీయాశ్వాసాంత గద్య–

ఇది శ్రీ మద్రామచంద్రవరప్రసాద లబ్ధకవిత్వ విచిత్రశాండిల్య గోత్ర పవిత్ర శ్రీమద్భాగవతుల సుధాసాగర కుముదమిత్ర బుచ్చన్నార్యపుత్ర గుడజన విధేయరామయనామధేయ విరచితంబైన శ్రీరంగమాహాత్మ్యంబను మహా ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము"

ప్రారంభము :

మ॥ జనలోకాధిప మమ్ముగాంచి యట
యుష్మద్వంశ కూటస్థుడై
ననశిన్యాప్తుడు మౌనులార
వినుడీనాశీక గర్భాలయం
బున నేనొక్కదినంబు నందరిగి
సంపూర్ణేందు బింబోపమా
నను శ్రీ రంగనిఁబూజచేసి పర
మానందంబు సంధిల్లఁగన్

తా॥ ప్రతి. సంఖ్య 40

*తెలుగున శ్రీరంగ మాహాత్మ్యములు –*

1. చెన్నమల్లు శ్రీ గిరి – పద్యకృతి – అలభ్యము
2. భైరవకవి – ,, ముద్రితము
3. కట్టావరదరాజు– ,, ,,
4. ముకుందయోగి– , ద్విపద ,,
తం॥ 323
5. రాజగోపాలకవి – కందములు – అముద్రితము
6. విజయరంగచొక్కనాధుడు వచనము – ,,
7. గుంటుపల్లి జగన్నాధకవి పద్యకావ్యము ,,

(R24!)

## గుంటుపల్లి జగన్నాథకవి (క్రీ.శ. 1800)

ఈతడు "శ్రీరంగమాహాత్మ్యము" అను నాలుగాశ్వాసముల ప్రబంధమురచించి సృష్టికరణకులజుడైన మక్కవలక్షణాఖ్యున కంకితము చేసెను. జగన్నాథ కవియు సృష్టికరణకులజుడే-అతడు నాగేంద్రగోత్రుడు వాధూలగోత్ర కందాళ వేంకటాచార్యుల శిష్యుఁడు. విశాఖపట్టణ మండలమున నున్న నందాపురమునవెలసిన వల్లభ నారాయణస్వామి భక్తుడు – ఈనందాపుర మామండలమున జంఝావతీ నదీతీరమునగలదు. జగన్నాథ కవికి ముకార వంశజుడైన వస్త్వార్య గురుడని పేజొక గురువుకలడు. ఈతడు మత సంప్ర

దాయములు తెలిపినవాడు కావచ్చును - ఆశ్వాసాంత గద్య—

ఇది శ్రీ వల్లభ నారాయణస్వామి కరుణాకటాక్ష వీక్షణ సంలబ్ధ సరసకవితా పాత్ర నాగేంద్రగోత్ర పవిత్ర గుంటుపల్లి లక్ష్మణాహ్వాయ సుపుత్ర శ్రీ మత్కందాళ వేంకటాచార్యవర సత్కృపాపాత్ర సాధుజన విధేయ జగన్నాథ నామధేయ ప్రణీతంబైన శ్రీరంగమాహాత్మ్యంబను మహా ప్రబంధంబున సర్వంబును జతుర్థాశ్వాసము. తా. ప్ర రౌద్రిసం. కార్తిక బ ౪ నాటి రాత్రి-బలివాడ రామన్న ఈ కృతివ్రాసి కృతిపతి కర్పించెను.

R 247

ఈ కృతివ్రాసిన బలివాడ రామన్న లేఖన కవులలో నొకడు.

పైని పేర్కొనబడిన రౌద్రి. క్రీ॥శ॥ 1860ది కాక అంతకు ముందు క్రీ॥శ॥ 1860 లోనిది కాబట్టి కవి యాకాలమువాడే.

## శ్రీరంగ మాహాత్మ్యము

తెలుగు భాషలో మొదట శ్రీరంగమాహాత్మ్యమును రచించిన కవి చెన్నమల్లు శ్రీగిరి. క్రీ॥శ॥ 1315 ప్రాంతమువాడు. అతనికృతిలభ్యముకాలేదు.1 తరువాతి శ్రీరంగమాహాత్మ్యమును రచించిన కవి

1. ప్రబంధ రత్నావళిలో 4 పద్యములు గలవు. 457-466

2. నా సమగ్ర ఆంధ్ర సాహిత్యం. సమీక్ష భారతి 1966 ఫిబ్రవరి, పుట

## పింగళి సూరన

సూరన "ఇటమున్ గారుడ సంహితాదికృతులన్" అని తన రచనలలో గారుడ సంహితయొకటియని ప్రభావతీ ప్రద్యుమ్నమున చెప్పియున్నాడు ఇది నేటి సాహిత్య చరిత్రకారు లనుకొనునట్లు - "ఉత్తర ఓఘాయిత్యపురాణం" కాదు. ఇందునూఅధ్యాయములలో శ్రీరంగ మాహాత్మ్యముకలదు. కాబట్టి దీనికి శతాధ్యాయియని పేరు. కట్టా వరదరాజు తన శ్రీరంగ మాహాత్మ్యమున దీనిని స్పష్టపఱచినాడు.

"సనాతన గారుడ సంహితా శతాధ్యాయి
తెనుఁగు సేయ దొక దక్షుఁడె"

"వరద రాజేంద్ర ప్రణీతంబైన గారుడ పురాణ శతాధ్యాయి శ్రీ రంగమాహాత్మ్యంబను మహాప్రబంధంబునందు సర్వమును దశమాశ్వాసము ప్రతి యాశ్వాసాంత గద్యను నిట్లేకలదు-

కాబట్టి పింగళి సూరన గారుడసంహిత శ్రీ రంగ మాహాత్మ్యమని తెలుసుకొనవలెను2-

## వంగీపురము సీతారామాచార్యుడు క్రీ.శ1750

సీతారామాచార్య కవి కృతులు రెండు మనకు లభ్యమగుచున్నవి. రెండును వైష్ణవ మతమునకు సంబంధించినవే-

1. ఆచార్య రత్నహారము- 2 జగన్నాథ మాహాత్మ్యము-ఈ రెండింటిలో జగన్నాథ మాహాత్మ్యము న నీతని వంశ వృత్తాంతము వివరముగా గలదు.

ఆత్రేయ గోత్రమున రామానుజుడు

ధర్మన

ఈ ధర్మన లాంగూల గజపతీంద్రుని సభలో ప్రతివాదులను గెలిచి విశిష్టాద్వైత మతము ప్రతిష్ఠించెను – అందుకాతడు 'కుతారపురము' అను నగ్రహారము నిచ్చెను.




పై వారిలో మూడవ వాడైన సీతారామాచార్యులు ప్రస్తుత గ్రంథకర్త. ఈతని గురువు కందాళ వేంకటాచార్యుడు.

లాంగూల గజపతిచే సమ్మానితుడగు ధర్మన్నకు గ్రంథకర్త సీతారామాచార్య కవి 10వ తరము వాడు. లాంగూల గజపతి గజపతులలో ప్రథముడు. కపిలేశ్వరగజపతి అని ప్రసిద్ధుడైన ఈతడు క్రీ. శ. 1434 నుండి క్రీ.శ.1468వరకు ఓఢ్రదేశము పాలించినవాడు తరమునకు 25 సంవత్సరములు లెక్కించిన క్రీ.శ. 1450+250 క్రీ.శ. 1700 ప్రాంతమగును. ముప్పది ఏండ్లయిన క్రీ.శ. 1730-50 ప్రాంతమగును.

కవి తండ్రి వీరరాఘవాచార్యుడు కేతవరమున కలిదిండి తిరుపతిరాజు మంత్రియై రాజకార్యములు నిర్వహించెను.

## కవితా రచనలు

కవి వంశీయులలో కవి పెదతండ్రి "మద్రేశ్వర కన్యాపరిణయము" అను ప్రబంధము రచించెను అది లభ్యముకాదు

సీతారామకవి తన యిరువదవ యేట లక్షణా పరిణయమును రచించెను. ఇది కానరాలేదు. ఆ వెనుక ధర్మాంగద చరిత్ర మూడాశ్వాసములుగా రచించెను. అదియు లభ్యము కాలేదు. ఆ వెనుక జగన్నాథ మాహాత్మ్యము రచించెను. జగన్నాథ మాహాత్మ్యము వెనుక ఆచార్యరత్నహారము. కావున అది కవి రచనలలో చివరిది–

జగన్నాథ మాహాత్మ్యము స్కాందపురాణ పురుషోత్తమ ఖండమునకు తెలుగుసేత - ఎనిమిదాశ్వాసములలో విపులముగా ఆ క్షేత్ర మాహాత్మ్యము వర్ణితమైనది. వ్రాత గ్రంథము చివరనిట్లు గలదు.

చ. వరపతి మందపాటికులవారిధి
 చంద్రుడు రామభద్ర రా
టృర మనురక్తి నీలగిరి కాంతు
 మహత్త్వము వ్రాయుమన్న వ్రా
సె రహిని దత్సుతుండు దివసేశ్వర
 నామధరుండు క్రోధి వ
త్సరమున బుష్య పౌర్ణమిని
 సౌమ్యసువాసర మందు సర్వమున్.

క్రోధి పుష్య శు ౧౫ బుధవారము– (R 970

## ఆచార్య రత్నహారము

ఇది వైష్ణవాచార్యుల చరిత్రలను సమగ్రముగా దెలుపు పద్యకృతి–రెండు తరంగములుగా విభక్తము– వీనియందు, రామానుజ ప్రభ దివ్యసూరిప్రభ అను భాగములు ప్రథమ తరంగమున నున్నవి–రెండవ తరంగమున పూర్వాచార్య ప్రభ గలదు.

తాళపత్రప్రతి (R 624)లో నిట్లున్నది.

"నందననామ సంవత్సర మాఘశుద్ధ నవమీ బుధవారం నాటి సాయంకాలానకు యీ ప్రపన్నామృతం కుప్పిలి కుప్పటగారి చంద్రయ్యగారు వ్రాశిన పుస్తకం చూసి ఈగోపినాధు వ్రాశెను"

ఆచార్యరత్నహారము– ముద్రితమైనది– ఆంధ్ర వాఙ్మయ సూచిక–

ఈ ముద్రితప్రతి రాజమహేంద్రవరము గౌతమీ గ్రంథాలయమున గలదు.

## తాడేపల్లి రామస్వామి– (క్రీ.శ. 1800)

సంస్కృతమునందలి పురుషోత్తమ క్షేత్రమాహాత్మ్యమును నైదాశ్వాసముల ప్రబంధముగా రామస్వామి కవి రచించినాడు– ఈతడు లక్ష్మణార్యుని పుత్రుడు– మంతెన కృష్ణరాజనునాతని యాదేశమున నీకృతి రచించెను– ఆతని వంశ వర్ణన మిందుగలదు– పురుషోత్తమక్షేత్రమనగా జగన్నాథక్షేత్రమాహాత్మ్యము ఈ కృతి జగన్నాథస్వామికే అంకితము– ప్రబంధ లక్షణములన్నియు పాటింపబడినవి గ్రంథాంతమున నిట్లున్నది.

క॥ శ్రీ నీలాచలపతి స
న్మానము మదిగోరి పుష్పమాలిక వలెనే
నే నొనరించిన గ్రంథము
భూనుత గతి దత్పదాబ్జముల కర్పింతున్

కల్పలతిక. వరమంతెన కృష్ణమహీధర స
త్కర సారస పూజిత నీల మహీ
దరమందిర సుందర పాహివయో
ధరరూప గదాధర ! లోకధరా !

గద్య. "ఇది శ్రీమదుభయ భాషా కవితాధౌరేయ తాడేపల్లి లక్ష్మణార్య భాగధేయ రామస్వామి నామధేయ ప్రణీతంబైన పురుషోత్తమ క్షేత్ర మాహాత్మ్యంబను మహాప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము."

కవి కృతిపతిని కృష్ణరాజని కృష్ణభూవరుడని వర్ణించినను నీతడు క్షత్రియుడు కాడు - కళింగ దేశమున ప్రసిద్ధిజెందిన సృష్టికరణ లేక శిష్టకరణ కులీనుడు. కాగితపు ప్రతి. R 193 132 పుటలు– పుటకు 20–22 పంక్తులు.

## తెన్నేటి సీతారామకవి– (క్రీ. శ. 1800)

"నీలాచల మహత్త్వము" అను నైదాశ్వాసముల ప్రబంధమును రచించిన తెన్నేటి సీతారామకవి– విశాఖ మండలమున విజయనగరము దరినున్న శ్రీరామ

తీర్థ క్షేత్రవాసి- వెలనాటి కులజుడు- ఆప స్తంబ సూత్రుడు- కౌండిన్య గోత్రుడు దివాకరామాత్యునకు ఎఱ్ఱమాంబకు పుత్రుడు- వైష్ణవ సంప్రదాయాను యాయి- ఈతడు శాపాను గ్రహసమర్థుడట- తన్ను గూర్చి యిట్లు చెప్పుకున్నాడు-

సీ॥ స్థిరకీర్తి శ్రీరామ తీర్థాది శ్రీజాన
కీరామమూర్తి పాదార వింద
సేవా సమాసక చిత్తుండ శ్రీహనూ
మదుపాసకుండ మృదు మధుర వచన
రచనా చమత్కార రమ్య వినోదుండ
సాహస సాత్త్విక సరసమతిని
స్వామి సీతారామ నామాంకితుఁడ ధాత్రి
వెనఁదిట్టినపుడు దీవించునపుడు

గీ॥ కినుక వచ్చెనేని కీలి కీలావళి
మిడుతఁ జేర్చినట్టు మడియఁజేతు
కరుణ వచ్చెనేని గంగా ప్రవాహంబు
పొంగినట్లు సిరులఁ బొదలఁజేతు.

నీలాచల మహత్త్వమనగా శ్రీ జగన్నాథ క్షేత్ర మాహాత్మ్యము- ఈ గ్రంథము శిష్టకరణ కులజుడైన గోపినాథ పట్నాయకుని కంకితము- ఈ పట్నాయ కుడు కోర్కొండభట్టరు జగన్నాయకగురు శిష్యుడు- ఈ కృతిపతి వంశ వృత్తాంత మిందుగలదు

*గద్య:* ఇది శ్రీ రామతీర్థధామ జానకీరామ పాదార వింద ధ్యానానంద హృదయ సుఖాభ్యుదయ సరస కవితా పేటి తెన్నేటి వంశరత్నాకర హిమకర దివాకరామాత్య సీతారామనామాత్య ప్రణీతంబైన నీలా చల మాహాత్మ్యంబును పవిత్ర చరిత్రంబునందు సర్వం బును పంచమాశ్వాసము-" (R.577)

నీలాచల క్షేత్రమనగా జగన్నాథ క్షేత్రము.

## రామాయణ కథలు

### పండితారాధ్యుల నాగలింగారాధ్యుడు
### (క్రీ॥ శ॥ 1700)

ఈతడు పట్టాభిరామ విలాసము అను నైదాశ్వాస ముల మహాప్రబంధము రచించి మానూరి వేంకటరాయ డను మంత్రికి అంకితము చేసెను- కృతిపతియైన ఈ వేంకటరాయడు మాధ్వ బ్రాహ్మణ వంశీయుడు తెలుగు దేశ చరిత్రలో క్రీ. శ. 1700 ప్రాంతములో ప్రసి ద్ధుడు- వినుకొండ, బెల్లముకొండ, కొండవీడు- అను మూడు దుర్గములను పాలించినవాడు- ఆతడు క్రీ శ. 1680 లో కొండవీటి యొద్దనున్న హౌబుగణేశుపేట యందు నూతనముగా దేవాలయము నిర్మించి అందు పట్టాభిరామదేవుని ప్రతిష్ఠించెను. నాగలింగారాధ్యు డీ వృత్తాంతము నీ కృతియందు పంచమాశ్వాసమునచెప్పి యున్నాడు. తక్కిన నాల్గాశ్వాసములలోను శ్రీ రామా యణ కథ వర్ణితమైనది. అవతారికలో కృతిపతి వంశ వర్ణన సంపూర్ణముగ నున్నది.

నాగలింగారాధ్యుడు, పండితత్రయములో ఆద్యుడైన శ్రీపతి పండితుని వంశీయుడు- శంభులింగపౌత్రుఁడు- వీరనారాధ్య పుత్రుడు- ఆతని గద్య.

"ఇది శ్రీసరస్వతీసతీ నిరంతరానుకంపా సంపాదిత కవితా మాధురీ ధురీణ కౌశిక గోత్ర పవిత్ర శ్రీపతి పండితారాధ్య వంశః పయః పయోరాశిరాకాసుధాకరా యమాన, విద్వత్కవి కంఠీరవ శంభులింగారాధ్య పౌత్ర వీరనారాధ్య సత్కవిపుత్ర సకల సుకవిజన విధేయ నాగలింగాభిధేయ ప్రణీతంబైన పట్టాభిరామ విలాసంబను మహాప్రబంధంబున సర్వంబునుబంచమా శ్వాసము.

పై గద్యను బట్టి నాగలింగారాధ్యుని తాతతండ్రులు విద్వత్కవులని తెలియుచున్నది-

కవి తన్ను గూర్చి యిట్లు చెప్పుకొన్నాడు-

సీ. నాటకాలంకార నైపుణ్యగణ్యుండు
సరస సాహిత్య విశారదుండు
సంస్కృతాంధ్ర ద్విభాషా వ్యాకరణ వేత్త
షడ్విధ ప్రకృతి భాషాచణుండు
బంధ కవిత్వనిబంధనాభిజ్ఞుండు
చిత్ర కవిత్వ విశేషశాలి
సమధిక యమకాది చాతురీ ధౌరేయుఁ
డచల జిహ్వా నిరోష్ఠ్యాదినిపుణుఁ

గీ. డమిత శాంతుఁడు చతురకావ్య ప్రణీత
పండితారాధ్య వంశసంభవుఁడు శంభు
లింగ పౌత్రుండు వీరేశలింగ పుత్రుఁ
డంగజాకారి నాగేశలింగ సూరి.

పై పద్యమును బట్టి సంస్కృతాంధ్రములలోనే కాక షడ్విధప్రాకృతములయం దీతడు పండితుడని

తెలియుచున్నది- దీనితో చతుర్విధ కవితలు చెప్పగల సామర్థ్యమున్నవాడు - 'అంగజాకారి' అన్న విశేషణ మాతడు చాలాచక్కగా నుండెనని స్ఫురించుచున్నది-

ఈ గ్రంథమునకు ముందీతఁడు భోజరాజ చరిత్ర రచించినట్లు తెలియుచున్నది.

క॥ "రాజులు మెచ్చఁగ సత్కవి
రాజులు మెచ్చంగ భోజరాజ చరిత్రం
బోజ రచించితి వన్నిటఁ
బూజితుఁడవు నాగలింగ బుధజనమౌళీ"

అని కృతిపతి ప్రశంసించినాడు- కాని గ్రంథము లభ్యము కాలేదు ఈ తాళపత్ర ప్రతికి గాకితమువ్రతి సంఖ్య R. 1008 కలదు R/6

## కొమ్మాజీ సోమనాథ శిల్పాచార్యుడు (క్రీ. శ. 1800)

తెలుగు సాహిత్యమున ప్రాచీనకాలమునుంచి విశ్వకర్మకులజులైన మహాకవులు విలసిల్లిరి- వారిలో నిరంకుశోపాఖ్యానకర్తయై నిరవద్య కవితా విద్యా విశారదుడై యశము గడించిన కందుకూరి రుద్రకవిని గూర్చి మాత్రమే మనము కవి చరిత్రల మూలమున తెలుసుకొన్నాముగాని తక్కినవారిని గూర్చి మనకు తెలియనే తెలియదు- వారిలో చాలమంది కవిచరిత్రల కెక్కలేదు- వీరిలో ప్రథముడు

## సూరడు (క్రీ. శ, 1118)

విశ్వకర్మకుల వల్లభుడగు సూరడు శ్రీగిరిపశ్చిమ ప్రాంతమును పాలించినవెలమండరాజు వలన, మహాప్రధాని స్థితి వహించినవాడు- మహాశూరుడు కూడ- తనరాజునకు వైరియైన పండరాజును జయించినవాడు వజ్రదండకనోజు కుమారుడైన యాతడు- తన రాజు పేరనొక శాసనము వేయించినాడు. అది పద్యమయము-

శాసన రచనము ప్రథమ పురుషయందుండుటచే సూరడే దీనికి కర్త. "సూరన శాసనము అని అందే యొకచో నున్నది కాబట్టి విశ్వకర్మకులజులలో సూరడు తొలి[1] కవి"

## మమ్మనాచార్యుడు

శ్రీనాథ మహాకవి ప్రౌఢదేవరాయని యాస్థానమున "సమ్ముఖమున దయజూచు మమ్మనుకవి" అని పేర్కొన్న యాతడీయనయే సంస్కృత విశ్వకర్మ పురాణకర్త.

ఇంకను తెలుగువిశ్వకర్మ పురాణకర్తయగు వీపూరి వేంకటాచార్యులు[2] -శివరాత్రి మాహాత్మ్య ప్రబంధకర్తయగు చక్కనార్యుడు, మార్కండేయ విలాసకృతికర్తయైన కాళకవి మున్నగు కవులెందఱో యున్నారు. వీరినిగూర్చి పరిశ్రమ జరుగవలసిన యావశ్యకత యున్నది. సూచన ప్రాయముగా నుదహరించినాను.

కొమ్మాజీ సోమనాథ శిల్పాచార్యుడు. తెలుగున "విచిత్ర రామాయణము" అను పద్యకావ్యము రచించిన మహాకవి. దీనిని నా జనకులు సంపాదించి క్రీ.శ. 1896లో ముద్రించుటకు[3] నొక కరపత్రము వేయించినారు. కాని అప్పటి పరిస్థితులలోనది సాధ్యము కాలేదు.

సోమనాథ శిల్పాచార్యుడు శ్రీకాకుళ మండలమున పార్వతీపురనివాసి ఇప్పటికి నూఱేండ్ల క్రిందటనుండినవాడు- అప్పటి జయపుర ప్రభువగు విక్రమదేవ గజపతి చేతను పార్వతీపురము జమీందారు ధనంజయ ధాత్రాజు చేతను సమ్మానితుడు-

తనను గూర్చి- "గురు విబుధజన శిక్షితాభ్యాస

---

1. తెలుఁగు కవుల చరిత్ర తృతీయఖండము. పుట 185-186.

2. తెలుగుదేశమునశిల్పశాస్త్రపారంగతులని ప్రఖ్యాతిజెందిన- ప్రశస్తసాహిత్య విద్వాంసులు శ్రీకొండూరి వీరరాఘవాచార్యులు గారు విశ్వకర్మ పురాణమును గూర్చి-భారతి 28సం. 12లో వ్రాసియున్నారు- వారే పెందోట పురవరాధీశ్వరులను గూర్చి (నాగర ఖండ పద్యకావ్యకృతిపతులు) వ్రాసియున్న వారి విశ్వకర్మ కులజులగు కవి పండితులను గూర్చి పరిశోధన చేయుదురు గాత.

3. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము- గ్రంథ సూచి III R. 506 దీనిని అచ్చునకుసిద్ధముగా వ్రాయించిన ప్రతియే- ఇందున్నది. ఇందు కొంత భాగము "పంచానన" పత్రికయందు ప్రకటితమైనదని విని యున్నాను. కాని ఆ పత్రికలు నాకు లభించలేదు.

శిల్పకవిత్వ ప్రముఖ నిఖిల విద్యా విశారదుండనై"
అనియు-

"....న పళతి జపియించి తఖిల
దైవతోపా సి సలిపితి దాన ధర్మ
వ్రత తపోధ్యయనము లనవరత మొనర్చి

తఖిల విద్య లెటింగితినైన మఱియు" అనియు చెప్పుకొనుటచే నీతడు మహాకవియే కాక, మహా భకుడు మహాపురుషుడు' అని తెలియుచున్నది. గద్య కూడ దీనిని ధ్రువపఱచుచున్నది.

"ఇది శ్రీ మహామాహేశ్వర దివ్య చరణార వింద ధ్యానానంద కందళిత స్వాంతనిశాంత కాశ్యపస గోత్ర పవిత్ర వీరేశ్వర శిల్పాచార్యపుత్ర నిఖిల శిల్ప విద్యావిజ్ఞాన కళా ధౌరంధర్య సోమనాథ శిల్పాచార్య ప్రణీతంబైన శ్రీ మద్విచిత్ర రామాయణం బను మహా కావ్యంబున నుత్తర ఖండంబు నందుఁ దృతీయా శ్వాసము"

ఇది పూర్వ, ద్వితీయ, ఉత్తర- ఖండములు అని 3 భాగములు క్రమముగా-8 13-3, మొత్తముమీద 24 ఆశ్వాసములుగల మహా కావ్యము. ఇది యనల్పమగు కవితా శిల్పము గలది.

"శ్రీ కైవల్య పదార్థ సిద్ధికొఱకై సేవింతు
సద్భక్తితోఁ
బాకారి ప్రముఖా ఖిలామర శిరో
భాగాగ్ర కోటీర ర
త్నైకోద్భ్రాజిత దుగ్ధ గద్గగిత
దీప్తోత్కృష్ట సత్పాద నా
ళీక ద్వంద్వము గల్గు భక్తజనపాళిన్
శూలి న శ్రాంతమున్
రాజీవాసన దివ్యముఖ్యులకుఁ
జేరన్ రాని కైవల్య వి
భ్రాజత్సౌఖ్యముఁ గోరి శంభు
కృతిక ర్తంగా రచించెన్ వచ
శ్శ్రీ జెల్వారఁగ జానకీరమణు
చారిత్రంబు సద్భక్తిఁ గొ
మ్మాజీ వంశపయోధి సోముడగు
సోమాభిఖ్యు డుర్వీస్థలిన్
పాండున్పపాల నందనులు పార
దహీర పటీర చంద్రికా
పాండుర పద్మ చందన విభాసిత
కీర్తివిహారు లున్నతా
ఖండల వైభవోజ్జ్వల లఖండిత
శౌర్యయుతు ల్సమస్త భూ
మండలనాథ సేవితు లమానుష
సత్య గుణాఢ్యు లెంతయున్.

వాల్మీకి రామాయణమును గూర్చి తెలుగున యొక వాఙ్మయ మున్నది, గాని, 'విచిత్ర రామాయణము'ను గూర్చి- దాని విశిష్టతను గూర్చి వివరములేవు. దీని మూలము ఒరియా భాషలో సిద్ధేంద్రయోగి రచించినది. సోమనాథ శిల్పాచార్యుని కృతి విపుల పీఠికా విశేష ములతో సుపరిష్కృతమై ముద్రితమగునేని, అది తెలు గున రామాయణ వాఙ్మయ చరిత్రకేగాక రామాయణ విమర్శ వాఙ్మయమున కొక యలంకారమగును.

## 3. హాస్య ప్రబంధములు-కవులు

## గోవర్ధన రామయ్య (క్రీ. శ. 1815)

హాస్యరస ప్రధానమైన- 'అర్భిలోభి సంవాదము' అను పద్యకావ్యము రచించిన రామయకవి వృత్తాం తము తెలియరాదు.

ప్రారంభము :

క॥ శ్రీ గణనాయక భవహర
సాగర గంభీర భక్త సంరక్షణప
ర్వాగమ పూజిత భయహర
నాగేంద్ర మునీంద్ర సేవ్య నాథ మహేశా

క॥ శ్రీ వసుధా ప్రాణేశ్వర
జీవన రుహపత్ర నేత్ర చిత్తజ జనకా
దేవేంద్ర వినుత కేశవ
గోవింద ముకుంద ఘోర గుట్టనృసింహా.

వ. ఒకనాడు పశ్యాచారియను విప్రుండు ప్రాతః కాలంబున లేచి స్నాన సంధ్యాద్యనుష్ఠానంబుదీర్చు కొని సుఖాసీనుడై కూర్చుని యున్న తనకు శిష్యుడగు లోకాచారి సాష్టాంగదండప్రణామంబులాచరించి ముకు ళిత కరుండై యిటనియె.

సీ॥ అని లోకచారి తన్నడిగిన కన్నుల
నానంద తోయంబు లపుడు జాఱ
వినవయ్యఁ జెప్పెద విబుధేంద్ర పురికన్న
వొలుపొందు నక్షత్రపుర మనంగ
ఆ పట్టణం బేలు హాట కొంగుండను
నరనాయకుం డను నమర యశుడు
ఆ రాజుఁజూత మంచాయిలాపురి నుండి
దీర్ఘ కేశుం డను ద్విజు డొకండు
గీ॥ వచ్చుచును ముందఱను యొక్క గృహము
.... .... .... ....
చూడ లేదంచు మదిలోన చోద్య మంది
యప్పుడడిగెను నొక విప్రు నవనిసురుడు.

చివర:

క॥ గోవర్ధన రామయ్యయు
గావించిన యర్థిలోభి ధర్మము విని సం
భావన యివ్వని వాఁడే
కేవల హీనుండు వాఁడు కీర్తిరహితుఁడున్

క॥ వినినను వ్రాసిన బదివిన
మనమునఁ దలచిఁన లభించు మహిత శుభంబుల్
ధన ధాన్యవస్తు వాహన
మనుపమసత్కీర్తియుక్తి నందును ముక్తిన్.

లుబ్ధయాచక సంవాద రూపమైన యీకృతియందు వ్యావహారికభాష వాడబడినది- గ్రంథాంతమున నిట్లు గలదు.

“శిరుగాపురం బుచ్చయ్య తమ్ముడు మల్లయ్య స్న౧౨౩౪ (1234 లో) వ్రాసి యిచ్చినది- కేసవర శివయ్య”

దీనిని బట్టి కవికాలనిర్ణయము చేయవచ్చును. స్న 1234 అనగా ఫసలీ. నేటి ఫసలీ సంవత్సరము 1387. కాబట్టి 1387లో1234 పోయినచో 153 మిగులును. క్రీ. శ. 1968 లో 153 సంవత్సరములయిన క్రీ.శ 1815లో ఈ కృతిరచితము (R 94.)

ఇది తాళ పత్రప్రతి

## రేకపల్లి మహాదేవకవి (క్రీ॥శ॥ 1830)

ఇతడు చంద్రరేఖా విలాపమునను బోలిన హాస్య ప్రబంధమును రచించిన కవి. ప్రారంభమున హాస్య



రచనా చతురులు, శాపానుగ్రహ సమర్థులైన కవుల నిట్లు పేర్కొన్నాడు.

క. వినుతింతు రామలింగని
ఘను వేములవాడ భీమకవిని దలంతున్
గొనియాడుదు శ్రీనాథుని
ననవరతము జగ్గరాజు నభినందితున్.

దీనినిబట్టి ఈతడు కూచిమంచి జగ్గకవికి తరువాతి వాడు- క్రీ.శ. 1800 ప్రాంతంవాడు.

పిళ్ళా వేంకట నరసయ్య యను వైద్యునిపై రచితమైన హాస్య ప్రబంధమిది.

సీ. తన దుర్యశంబను ఘనతమాల లతల
కఖిల దిశలు ప్రాకువై తనర్పఁ
దన దురుణ వినీలమణినికరమునకు
బ్రహ్మండ భాండంబు బరిణ గాఁగఁ
దన జారతా నిమిత్తములకు ద్రవిడవై
దికపుఁబ్రధాని సాధకుఁడు గాఁగ
దనదు కౌటిల్య వ రనలకుఁబూరాడ
పాత్రుండు నుపదేశ భట్టుగాఁగ
గీ. వసుధఁ జెన్నారెఁ బిళ్లాన్వవాయ హీన
మానవాగ్రణి సకల దుర్మార్గ వేది
విప్రజన ధన భక్షణాతిప్రియుండు.
దురితముల తోడు వల్లూరి నరిసిగాడు

ఇట్టి కృతిపతి కవిని పిలిపించి యిట్లన్నాఁడు-

క. నను రేకపల్లి సత్కుల
వననిధి చంద్రుని గిరీశవర కరుణాసం
జనిత కవిత్వ విశాలునిఁ
గనుగొని యిట్లనియె నధిక కౌతుకమతియె

సీ॥ రచియించితివి పతివ్రతల మహత్త్వ వ
ర్ణన గల ధర్మాంగద నృప చరిత
ముచ్చరించితివి విద్వచ్చయంబులు మెచ్చ
రాణించు బసవ పురాణ మహిమఁ
గావించితివి చమత్కారానుసార ప్ర
బంధంబులును జాటుపద్యవితతు
లొనరించితివి సమ యోచిత వాగ్గుంభ
సంభృతార్థానూన శతక సమితి

గీ॥ రాజ రాజాది పరిషద్విరాజ మాన
విబుధమండల విబుధ కవిత్వ నిధివి
భళిర నీపాటి సత్కవీంద్రులును గలరె
సుగుణ సాంద్ర మహాదేవ సుకవి చంద్ర

కవి రచించిన పై గ్రంథములు- ధర్మాంగదచరిత్ర బసవ పురాణము నేడు కానరావు- భేషజమును గూర్చిన యీ క్రింది పద్య మిందలి రచనకు మచ్చు తునక

సీ॥ తొలుత వైద్యము సేయఁదొడరుచోఁగాను రి
నరసింగరాయని నామ మడఁచె
నామీఁద బ్రౌఢవైద్యము చేసి జంపని
వెంకయ్య యసువులు వీడఁజేసి
పదపడి స త్తెప్ప పంతులుగారికి
బ్రాణముల్ గొనెడి మాత్రలనొసంగె
పిమ్మటస్టవైష్ణవ తిమ్మయ్య చెయిసూచి
యముని సేవారతి కనిచిపుచ్చె
గీ॥ ఆహహ ; నీ భేషజంబు ప్రాణాంతమయ్యె
ననుచు జనములు సెప్పుదు రనుదినంబు
గురుధనాహార; పిళ్ళటం కురుకుమార!
ఘోర బహుబాంహ! వెంకట నారసింహ!

పైని చెప్పిన వ్యక్తులలో కానుకు రివారు, జంపని వారు విజయనగర వాసవ్యులు - కృతిపతి విశాఖ పట్టణములో నివసించేవాడు. కానుకు రివారు మాధ్వులు -సంపన్న గృహస్థులు, పై నరసింగరావుగారి మనుమలు-క్రీ. శ. 1910 సంవత్సర ప్రాంతమునకే పెద్దవారు. కాబట్టి కవి-1800-1850 ప్రాంతమువాడు. కృతిపతి మనుమని కొడుకు క్రీ. శ. 1920 ప్రాంతమున "పాత్రుడుగారు"ని ప్రఖ్యాతి చెందిన వైద్యుడై విశాఖ పట్టణములో నుండేవాడు. ఇది తాళపత్రప్రతి- **R 986**

## 4. మాలికారచనలు -

## గొల్లవర్తి వెంకనమంత్రి (క్రీ,శ1760)

రామాయణ కథను "వికచోత్పలమాల" యను పేరితో 'ర' కారప్రాసతో 1926 పంక్తులలో రచించిన గొల్లవర్తి వెంకనమంత్రి ధర్మమంత్రి హంవీరుని పౌత్రుడు - వేంకటనృసింహునికి రామాంబకు పుత్రుడు - ఈతఁడు అభినవతీర్థుల శిష్యుడు - కార్య ఖడ్గ ప్రవీణుడు- శ్రీ వత్సగోత్రుడు.

ప్రారంభము :

శ్రీ రమణీమణీ కుచకుశేశయ
కోశల సత్పటీరకా
శ్మీరనిశాకురంగమదమిశ్రిత
కుంకుమ సాంద్రచంద్రనీ
హారపయో ఘుమంఘుమ ఘుమాయిత
వక్షసుధాబ్ధి కుందమం
దారతుషార పారద సుధాకర
హార శతార తారడిం
డీర శరద్బలాకహపటీర సి
తాంబుజ తారహారగో
క్షీర సురాపగా విమలకీర్తి
వలక్ష విదూర కంసచాణూర .

అంతము :

చేరుదురంచు ముందు
మునిశేఖరుడైన ప్రచేత సాత్మజుం
డారసి కూర్చినట్టి యితిహాసము
సంకుచితంబుగాఁగఁ దా
నేరిచినట్లు శ్రీహరిని నెమ్మనమందుఁ
దలంచి మ్రొక్కి మం
దార మరంద గుంఫిత సుధా
మయ శబ్ద విచిత్రచాటు వా
గ్ధోరణిమీఱ వత్సముని గోత్రలలాము
డభిన్నవ తీర్థమౌని కం
ఠీరవ శిష్యవర్యుఁ డవనీధర
ధైర్యుఁడు ధర్మమంత్రి హంఁ
వీరవరేణ్యు పౌత్రుఁడు నవీన
చరిత్రుడు సద్వివేకమం
జీరుడు దార వేంకటనృసింహ
కిశోరుఁడు రామమా దర
స్మేరముఖీ తనూజుడు విచిత్ర
గుణౌఘుఁడు కార్యఖడ్గవి
ద్యారుచిరప్రవీణుఁ డతి తంత్ర
ధురీణుఁడు కృష్ణపాద ప
ద్మోరు గళన్మరంద రసమూర్మి
చరత్ భ్రమరాయ మాన గం
భీరమనో వికాలుఁ డతి విస్మయ
శీలుఁడు సంస్కృతాంధ్ర భా

షా రమణీయ వాత్సరథి చంద్రుఁడు
వేంకన మంత్రి చంద్రుఁ డిం
పూరరచించినట్టి వికచోత్పల
మాల్యమనంగ నొప్పు సీ
తా రఘురామ చంద్రుల కథా
సుమదామము భూతలంబునం
దారవిచంద్ర తారకమునై నుతి
కెక్క జెలంగుఁ గావుతన్.

ఇందు 2800 ఉత్పల మాలికాపాదములున్నవి. ఉత్తర కాండ కథలేదు – వెంకన్న మంత్రి తెలుగునే మొదట మాలికాకథాకావ్యము చెప్పిన కవి– దీని వెనుక మాలికలో చెప్పబడిన మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి త్రైపదేంద్ర గురు చరిత్ర వెలసినది – ఈ విషయమును గూర్చి తరువాత చూడుడు.

పైని పేర్కొనబడిన అభినవతీర్థమౌని – విరూపాక్ష పీఠాధిపతియైన అభినవ శంకర భారతీ తీర్థులైన యెడల–వెంకనమంత్రి కాలము నిర్ణయింప వచ్చును. అ భి న వ శ ం క ర భారత తీర్థులు. శా. శ. 1687 క్రీ. శ. 1765 లో విరూపాక్షపీఠాధిపతులైరి* – కావున వెంకన మంత్రి – ఆ కాలము వాడు, భావి పరిశోధన వలన నింకను బలపడ వచ్చును.

## వెంకనమంత్రి – మాలికా కవిత్వం

ఆశు, మధుర, చిత్ర, విస్తర కవిత లను చతుర్విధ కవితల[1]లో ఆశుకవిత్వశాఖలోనిది మాలికాకవిత్వము– పురాణములు మున్నగు ప్రక్రియలు– ఆశు కవితలో చేరినవే– ఇది నన్నయ్య నాటి నుండి వచ్చుచున్న సాహిత్య సంప్రదాయము– అయినను నేటివరకు దీనిని గూర్చి పరిశోధన జరుగలేదు–

వెంకనమంత్రి కృతిలో 2,200 పంక్తులు గలవు, ఏక ధారగా నేకప్రాసతో నిట్టిరచనకవికిగల యమేయ కవితా సామర్థ్యము, విశదీకరించును. ఈ మాలికా కవిత్వమునకు మూలపురుషుడు – అల్లసాని పెద్దన.

అతని, "పూత మెఱుంగులున్" అన్న సింహావలోకనోత్పలమాలికతో నీ శాఖ ప్రారంభము– ఇది ఏకప్రాసతో 30 పంక్తులున్నది–ఉత్పలమున నాలుగు పాదముల కన్న హెచ్చుండ రాదు. అయినను పెద్దన నూతన పంథాత్రొక్కినాడు– అందునకే రాయలువారు ఆయనను – "ఆంధ్రకవితా పితామహుడు"

అను బిరుదముచేతను గండపెండారము తోడను సత్కరించినారు[2].

మాలికా కవితచేతనే– ఆధునిక యుగమున– కీర్తి గ డి ం చు ట చే– మండపాక పార్వతీశ్వరశాస్త్రి (1833–1897) కి "అభినవాంధ్రకవితాపితామహుడు–" అన్న బిరుదము వచ్చినది–ఈయన మాలికా రచనము లన్నియు "అముద్రిత గ్రంథ చింతామణి" అను పత్రికలో ప్రకటితములైనవి. కొన్నింటిని మాత్ర ముదాహరించుచున్నాను–

1. త్రైపదేంద్ర గురు చరిత్రము– ఉత్పలమాల బిందుపూర్వక'ద'కారప్రాస– 560 పాదములు.

2. ఉపన్యాస విలాస భూషణము– ఉత్పలమాల– ద్విత్వవకార ప్రాసము 320 పాదములు.

ఈతదుత్పలమాలికలనేగాక – శార్దూల – స్రగ్ధరా మాలికలు చెప్పినాడు.

1. కొక్కొండ వారికి విజ్ఞప్తి–"క"కార ప్రాస శార్దూల మాలిక, 148 పంక్తులు.

2. బిల్వేశ్వరీయ కృతిప్రశంస – బిందుపూర్వక టకార ప్రాసతో 116 పంక్తులు.

మండపాక కవికి మాలికాకవిత్వమన్న మంచినీళ్ళ ప్రాయము–మచ్చునకు నాలుగు మాత్రమే చూపితిని.

పార్వతీశ్వర శాస్త్రిని గూర్చి – ప్రత్యేక పరిశోధన చేసిన–మాలికా కవితా శాఖా చరిత్ర – సమగ్రముగా వెలువడుట కవకాశము గలదు – అట్టి పరిశోధనకిది దిఙ్మాత్ర సూచన.

## తిరుమల లక్ష్మణముని–(క్రీ. శ. 1550)

"ముముక్షుజన కల్పము" అను విశిష్టాద్వైత మత గ్రంథమును సీస పద్యములతో పదునొకొండు ప్రక

*. శ్రీ మచ్ఛంకరాచార్య చరిత్రము, కనుపర్తి మార్కండేయశర్మ. 1932 పుట 26. (R. 43

1. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర – ద్వితీయ ముద్రణము (పుటలు 13-17)

2. పెద్దన–మనుచరిత్ర భారతి–జూన్. 1960.

రణములుగా రచించిన లక్ష్మణముని క్రీ.శ. 1473 లో జన్మించి, 95 యేండ్లు జీవించి. క్రీ. శ. 1568 లో వైకుంఠమున కేగెను[1] - ఈతడు అద్దంకి సింగరాచార్యుని శిష్యుడు- ఇది విశిష్టాద్వైతమత సంప్రదాయములను అర్థవాదోప బృంహితముగా మృదువైన సీస పద్యములలో తెలుపు విశిష్ట కృతి- ప్రతి సీస పద్యమున-కవినామము భాసిల్లుచుండును- ధ్యేయుఁడని చెప్పె లక్ష్మణదేశికుండు! అడియు లక్ష్మణముని వరు డానతిచ్చు, వరలు లక్ష్మణముని తమ పరమ కృపుఁడు, ఇత్యాదిగా వచ్చుచుండును-ఈతని గురువగు అద్దంకి సింగరాచార్యుడు మనవాళ మహాముని శిష్యుడగు ఏట్టూరి సింగరాచార్యుల శిష్యుఁడు-

సీ॥ అఖిల వేదాంత రహస్య ప్రవర్తకా
చార్య పరంపరా జన్మభూమి
చేతనా చేతనశేషి వరవ్యూహ
విభవాంతరాత్మార్చ వేషధారి
స్వేచ్ఛాగృహీతనిజేష్టవిగ్రహయోగి
నిఖిల హేయప్రత్యనీకమూర్తి
భోగలీలార్థ విభూతిద్వయేశ్వరుం
డఖిల కల్యాణ గుణాకరుండు
గీ॥ అతఁడు ఫణిశాయి గరుడవాహను డతండు
అతఁడు లక్ష్మీశుఁ డానంద మతఁడు తానె
అతఁడు కారణ కార్యాంతరాత్మ యొకఁడె
ధ్యేయుడని చెప్పె లక్ష్మణదేశికుండు.

ఇచట విశిష్టాద్వైతమత ప్రవర్తకులైన శ్రీరామానుజాచార్యులు లక్ష్మణ నామధేయులుకాన - కృతికర్త మత ప్రవర్తకుని పేరు, రెండును ప్రతిపద్యమున నెలకొన్నవి. ఇది సీసపద్య శతక కావ్యమనవచ్చును. ఇన్ని సీసములున్న కృతి తెలుగున వేరొకటిలేదు.

దీనికి ప్రతిపద్య తాత్పర్యముతోనున్న వేఱొక ప్రతి గలదు-అది అసంపూర్ణము. ఒక్క ప్రకరణము మాత్రమే గలదు. దాని లేఖన కాలము "ధాతు నామసం॥ మాఘనెల ౧౽ది వరకు సంపూర్ణం జాలయ చే(వ్రా)లు" జాలయ యనునతడు లేఖరి - ఇదివైష్ణవ మతమునకు ముఖ్య గ్రంథమగుటచేత దీనికి 2161 నుండి 2167 వఱకు ఆఱుప్రతులు గలవు.

R 217-a-2651
R 907-R994

## 5. శాస్త్రీయ గ్రంథములు-కవులు-వైద్యము
## పేదయ - (క్రీ. శ. 1460)

ఈతడు "ఆయుర్వేదార్థ సంగ్రహము" అను రెండాశ్వాసముల వైద్యశాస్త్ర గ్రంథము రచించెను - ఇది కాంచీపురమునందలి శ్రీ వరదరాజుస్వామికి కృతి.

శ్రీరమణీ ప్రియరమణునిఁ
గారుణ్య గుణాభిరాము ఘనఘనదామున్
నీరజ నాభున్ గొలుతును
గారుడగమ నేకవరదుఁ గాంచిపురీశున్.

ఇందలి గద్య

ఇది శ్రీ గోవిందవరప్రసాదలబ్ధ వాగ్విభవ అనంతామాత్య సంభవ పేదయ ప్రణీతంబయిన ఆయుర్వేదార్థ సంగ్రహ ప్రబంధంబునందు క్షయ రోగ నిదానంబును.... అతిసారగ్రహిణి నిదానంబును విషయంబులు గల ద్వితీయాశ్వాసము.

ఈతఁడు - భోజరాజీయము - అనంతఛందస్సు రసాభరణము వ్రాసిన అనంతామాత్యుని కొమారుడు- గద్యకూడ తండ్రి ననుసరించినదే - చూడుడు- అనంతామాత్యుని గద్య :

"ఇది శ్రీవాణీ వరప్రసాదలబ్ధ వాగ్విభవ తిక్కనామాత్య సంభవ" ....అనంతనామధేయ ప్రణీతంబైన" ఇందు "ఇది శ్రీ గోవింద వరప్రసాదలబ్ధ వాగ్విభవ అనంతామాత్య సంభవ" అని యున్నది. ఈ గోవిందుడు - అనంతామాత్యుని గురువు. కావున నీతడు క్రీ. శ. 1460 ప్రాంతమువాడు అనంతుఁడు 'శ్రీమద్గోవిందగురుప్రభులదయ' అనివ్రాసికొన్నాడు.[1]

1. ఈతడు శ్రీముఖ సంవత్సరమున జన్మించి శా.శ 1490- విభవ సంవత్సరమున మరణించినట్లు యీ కృతిలో పదియవ ప్రకరణమున చెప్పబడినది. (మా. ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగార సూచిక (సం, 2. భాగము 3. తెలుగు) ఉపోద్ఘాతము పుట 11 (1917)

1 R 113 తాళపత్ర ప్రతి - R 996(b) ఇందు పై గద్యలో "అనంతామాత్యసంభవ సుజనవిధేయ కృష్ణయ నామధేయ ప్రణీతంబైన ఆయుర్వేద సార సంగ్రహము' అని కలదు.

తెలుఁగున ఆయుర్వేద వాఙ్మయమునకు సంబం ధించిన పద్య కావ్యములలో నిది మొదటిది-తక్కినవి

1. శరభరాజీయము - తుళ్ళూరి శరభరాజు- ముద్రితము -
2. రసప్రదీపిక - ముడుంబి వేంకటాచార్యుడు- (R 175· R 937 (b) 175 సంఖ్య ప్రతి సమగ్రము
3. భేషజకల్పము - చిలకమఱ్ఱి వేంకటాచార్యులు (R 940)
4. అష్టాంగహృదయము -మండఁచుండి లింగయ్య (R 940 c) ఈతడు ఎలకూచి బాలసరస్వతికవిమహోపా ధ్యాయుని శిష్యుడు (R 94) b)
5. భిషక్సుధార్ణవము - కంభంపాటి వెంకటభట్టు R 349 R 667 లో 9 వ ఆశ్వాసము మధ్య వఱకు గలదు.
6. శారీరతత్త్వము- పులవర్తి కణ్వేశ్వరుడు R 6)1 ఒక ఉల్లాసము.
7. ఆంధ్ర చింతామణి-దేవులపల్లి చిన నరసన్న మంత్రి D 2406
8. కాయ చికిత్సలు - వీరకృష్ణుడు D2442
9. వైద్యచింతామణి - ధేనువుకొండ జోగన D 2458

## జ్యో తి ష ము

## చరిగొండ హొన్నయ్య (క్రీ. శ. 1550)

"జ్యోతిషరత్నాకరము"అను పేర జ్యోతిశ్శాస్త్రము నకు సంబంధించిన సకల విషయములను దెలుపు కావ్యమును రచించిన కవిహొన్నయ, ఈ గ్రంథమున తన్ను గూర్చి యొక పద్యము నిట్లు చెప్పుకొన్నాడు.

"శుభ కవితా విశేష గుణ
శోభితుడన్ జరిగొండ రామయ
ప్రభునకుఁ జెన్నమాంబకును
భవ్య సుపుత్రుఁడ హొన్నయాఖ్యుఁడన్
సభికుడ యాజ్ఞవల్క్య ముని
శాఖిని జ్యోతిషకావ్యమంతయున్
రభసము తోడుతన్ దెనుగు
రమ్యసులక్షణ మొప్పఁజెప్పెదన్

పైదానిని బట్టి కవి యాజ్ఞవల్క్య శాఖీయుడనియు చెన్నమాంబ రామయలు తలిదండ్రులని తెలియు చున్నది- వాఙ్మయమున ప్రసిద్ధులైన తెనాలి కవు లందఱు నీ శాఖీయులే. కృతిపతి తన్ను పిలిపించిన సందర్భమున నిట్లుగలదు.

సీ. సత్కవిత్వంబున సభల విద్వత్కవుల్
వినుతింప నిమ్మహి వెలసినావు
సకల పురాణాది సంహితార్థంబులు
అర్థనిర్ణయముగా నరసినావు
శైవరహస్యాది సారస్య వార్ధిలో
నానందముగ నోలలాడినావు
వనము తటాకంబులొనరించి కృతులచే
నియత సద్ధర్మముల్ నిలిపినావు

గీ. నీవు మాకు హితుండవు నిఖిలకార్య
సముదయంబులు రచియింప సరసమతివి
రమ్యచారిత్ర చరిగొండ రామనార్య
మంత్రి సత్పుత్ర హొన్నయ మహిత చరిత.

హొన్నయ్య సత్కవిత్వము చేతనే గాక- సకల పురాణ సంహితార్థములు తెలియుటచేత ప్రసిద్ధుడు-శైవ మతరహస్యములు గ్రహియించినాడు- సప్తసంతానము లలో వనమూ, తటాకము, కృతి యొనరించిన వాడు- కాని యీ విషయములో నిర్ణయించుటకు మనకు వివరములు లభ్యము కాలేదు- ఇతని కృతి పైది యొక్కటియే లభించినది - యీతడు భారద్వాజ గోత్రుడు-

## - కృ తి ప తి -

ఈకృతి రంగరాజుసింహాద్రి అను మంత్రి సత్త మున కంకితము - ఈతడు హరితసగోత్రుడు అన్నయ మంత్రి పుత్రుడు - ఇందు సింహాద్రి వంశ వర్ణన మున్నది గాని యందు చారిత్రక విశేషములేవియును లేవు -

## - కా ల ము -

ఈకవి కాలము నిర్ణయించుటకు కవి యిందుచేసిన పూర్వ కవిస్తుతి కొంత తోడ్పడగలదు.

సీ॥ సరవితో శబశాసనుని నన్నయభట్టు
సుగుణాఢ్యఁ దిక్కన సోమయాజి
లలిత శ్రీరామ వరలబ్ధ బమ్మెర పోత
నమిత సత్కవిని శ్రీనాధసుకవి
ముక్కంటి సూను వేములవాడ భీముని
భాషా విచక్షణు భాస్కరేంద్రు
సుభగునెఱ్ఱాప్రెగ్గ సోమనాధుని దండి
రామాయణ శ్రేష్ఠ రంగనాధు
గీ॥ గౌరనాహ్వాయు భైరవు గాచుబోచు
........యాది కవుల
మహిత పండితులగు వరమాన కవుల
సంతతంబును సద్వాక్య సరణిచేత
గోరి నుతియింతు మత్కృతి కొనలుసాగ——

గీత పద్యము సరిగాలేదు–అయినను గౌరన, భైరవు లను పేర్కొనుటచే నీతడు క్రీ. శ. 15 వ శతాబ్ది తరువాతివాడు–ఇంకను కొంచెము దగ్గఱగ నిర్ణయించు టకు వీలున్నది.

కృతిపతిగురుని వర్ణించుచు నిట్లు కవి చెప్పి యున్నాడు.

గీ॥ అతడు దాసులకిహపర మర్థినొసగు
లక్షణో కుండు తిర్మల లక్ష్మణార్య
డమితపుణ్యుని సంప్రదాయకులలోన
నలరెగురు భక్తిచేత సింహాద్రివరుఁడు

దీనినిబట్టి సింహాద్రి మంత్రి విశిష్టాద్వైత సంప్ర దాయానుసారి. ఈ తిరుమల లక్ష్మణముని, ఆదిరామా నుజాచార్యులుగాక "ముముక్షుజన కల్పము" రచించిన తిరుమల లక్ష్మణముని అయినచో సింహాద్రి మంత్రి క్రీ. శ. 1550 ప్రాంతము వాడగును. లక్ష్మణముని జీవితమున నాతని కాలము క్రీ.శ. 1473–1568 అని నిర్ణీతమైనది. కవి ఆ కాలము వాడే– భావి పరిశోధన వలన ఇంకను బలపడవచ్చును.

## గ్రంథ విషయము

జ్యోతిషశాస్త్రము – నాలుగు లక్షల గ్రంథమని, అందలి సోమసూర్య సిద్ధాంతములు, వారాహగార్గ్య వాసిష్ఠములు, ఆ విషయము లన్నింటిని సంగ్రహిం చినవని తాను వాని ననుసరించి రచించితినని కవి యిట్లు చెప్పినాడు–

క. వసధిమణులు మాలిక చే
సిన క్రియనే సోమ సూర్య సిద్ధాంతములో
ఘనసారం బెల్లను గూ
ర్చనుమతితో రత్నమాల యనిరి మునీంద్రుల్

క. పారీణత తమ కొలదిని
వారాహమునందు గార్గ్యవాసిష్ఠమునన్
వారు రచించిన క్రియనే
నారూఢిన్ పంచకావ్య మలర రచింతున్.

ఇందు పంచకావ్యము లనగా నైదాశ్వాసములని యర్థము ఇందైదాశ్వాసములే యున్నవి.

ఇందు ప్రభవాది ఫలములు, దశాభుక్తి ఫలములు, శకున ఫలములు ముహూర్త విషయములు – క్షౌర రజస్వలా సీమంత నామకరణ పట్టాభిషేక నవవస్త్ర మహా సంక్రాంతి ఫలవాస్తు ప్రకరణ నవగ్రహ,దేశాధి పకేతుజాతక విషయములు సంపూర్ణముగ వివరింప బడినది.

ఈ కారణము చేత దీనికి లిఖిత ప్రతులు నాలుగు కలవు. రెండ సమగ్రములు అవి R 125, 266,829, 908 – చివర తాళపత్ర ప్రతి చివర–

"రాక్షసనామ సంవత్సర నిజ భాద్రపద శుగంలు భిక్షావర్తి సిద్ధరామప్ప కుమారుడు చింన్న శరభయ్య బసప్ప వ్రాసుకున్న జ్యోతిష రత్నాకరం సంపూర్ణం" అని కలదు. వారము లేక పోవుట చేత కాల నిర్ణ యమున కనువుగాకున్నది.

## చరిగొండ కవులు

చరిగొండ తెలింగాణాలో నున్నది. చిత్రభారత కృతికర్త చరిగొండ ధర్మన్న ప్రసిద్ధుడే – అతడు తిమ్మనామాత్య పుత్రుడు–ధర్మన్నకు హొన్నయ కవికి సంబంధము లేదు– ధర్మన్న కౌండిన్య గోత్రుడు – హొన్నయ్య భారద్వాజ గోత్రుడు– ధర్మన్న గాక చరిగొండ నృసింహ కవి వేఱొకడు కలడు – అప్పకవి.

చ. వెలగకు వెగ్గయంచు నరవిం బరిగొండ
నృసింహు డాడఁగా
మొలకకు మొల్కయంచు కవి ముఖ్యుడు
దుద్రపపల్కదోసమే

భళి భళి మంచి మాటయె ప్రబంధము నా
జలరాశి యందులో
పల నెరసుల్ గ్రహింతురె యపారములౌ
మణులెల్ల నుండఁగన్. S. 114

అని చరిగొండ నృసింహ కవిని పేర్కొన్నాడు - ఈత డే గోత్రీయుడో వివరములు లేవు

## జ్యో తి ష గ్ర ం థ ము లు

తెలుగున జ్యోతిషమునకు సంబంధించిన పద్య కృతులున్నవి. వానిలో మొదటిది- "వేములవాడ భీమకవి జ్యోతిషఫల గ్రంథము."

ఇది వేములవాడ భీమకవి సంస్కృత గ్రంథము నకు తెలుఁగు. 1

### సస్యానందము

ఇది దోనయ కవి రచించినది-దీనినిగూర్చి తొలుత నేనే తెలిపితిని.

### జ్యోతిష రత్నాకరము

పైని వివరింపబడినది.

### జాతక ప్రదీపిక

సూరయామాత్య పుత్ర అయ్యలార్య ప్రణీతము. ఈతడు కాశ్యప గోత్రుడు, భద్రగిరీశుడు పేర్కొన బడినాడు- మొదటి రెండాశ్వాసములు 3 వ ఆశ్వాస మున కొంతభాగము కలదు (R 285)

### యోగ చంద్రిక

డింగరి భాష్యకారా చార్యకృతము (R 700)

## సంగీతము-గీతగోవిందము-ఆంధ్రానువాదములు

### ఋగ్వేదికవి వెంకటనారాయణకవి

### (క్రీ. శ. 1730)

ఈతడు కార్వేటినగర సంస్థానమున విలసిల్లినకవి. ఇది పదియాశ్వాసముల గ్రంథము- సప్తమాశ్వాసాంత గద్యయిది.

ఇది శ్రీమదన గోపాల కృపాలహరీ విశంకట కటాక్షవీక్షాసమాసాదిత క్షోదక్షమ లలితాకవితాలతాల వాల తాభాసి, వాసిష్ఠ వంశకీర్తి ప్రతిష్ఠా సంపాది ఋగ్వేది రామ ధీమత్కుమార తిర్మల సుధీమణి సుధా జలనిధాన కల్పతరువ దప్ప కొండార్యవర పౌత్ర వెంకటపతి సుకవి పుత్ర చిత్ర భాషానిరాఘాట నాట కాలంకార మర్మకర్మ బ్రహ్మవాదితా కుమారి లకుల కుమార కవిరాజ కంఠీరవబిరుదాంక వేంకటనారా యణార్యప్రణీతంబైన గీత గోవిందాభిధాన కృతి ప్రధానంబునందు అనాగత నారాయణంబను సప్తమా శ్వాసము. (R 882)

తెలుగు దేశము నందలి స్వదేశ సంస్థానములలో కార్వేటినగరమొకటి.ఇదిచిత్తూరిమండలముననున్నది. క్రీ. శ. 1730 ప్రాంతమున నీ సంస్థానమును పాలించిన కనవరాజు కవి పండితపోషకుడై కృతు లంకితము గొనెను-కనవరాజు పోషించిన కవులలో ఋగ్వేదికవి వెంకటాచలపతికవి ముఖ్యుఁడు. ఆతడు, తన చంపూరామాయణ[1]ము రాజన్యునికే కృతి యొసంగెను.ఈ చంపూరామాయణమున నొకచో నీ వెంకట నారాయణ కవి ప్రశంసగలదు.

మ॥ కుటిలారి ద్విరదావళీవి
దళన క్రూరాసి పారీంద్రకై
యట కౌమారిల కాపిలాది
బహుశాస్త్రాభిజ్ఞు ఋగ్వేది వెం
కట నారాయణ సత్కవిప్రముఖ
సంఖ్యావన్మ రాళచ్ఛటా
పటువాగారభటీవిభాసురస
భాపద్మా కరాహస్కరా (3-156)

పై పద్యమునుబట్టి వెంకట నారాయణ కవి షడ్దర్శనముల నెఱింగిన విద్వాంసుడని తెలియు చున్నది. కైయటము - వ్యాకరణము - కౌమారిలము- కుమారిల భట్టప్రోక్తము పూర్వమీమాంస-కాపిలము- (సాంఖ్యము) వేంకటాచల కవి చెప్పిన విషయములు

---

1. దీనికి తంజావూరు పుస్తక భాండాగారమున - మద రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున ప్రతులున్నవి. ఇది చాలా విలువైనది - అన్నియు నీసపద్యములు ఇందు వేముల వాడ భీమకవి పుట్టుక దినము క్రీ, శ. 47 1147 అనికలదు. ఇది పారసీ భాషలోకి భాషాంతరీకరింపబడినది. - (R196)
దీని వివరములు వేములవాడ భీమకవి చరిత్రమున గలవు.

[1]. ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకటితము - భోజచంపువు నకు ప్రశస్తానువాదము పునర్ముద్రణము చేయదగినది.

పై గీత గోవిందగద్యతోసరిపోవుచున్నవి"కర్మబ్రహ్మ వాదితా కుమారిలకులకుమార "అనునది కౌమారిల" విశేషణమునకు వ్యాఖ్య వేంకటనారాయణకవి, నాట కాలంకార సాహిత్య విద్యయందు ప్రవీణుడని ఇక సంగీత శాస్త్రమున నాతండు, నిష్ణాతుడైనట్లు గీత గోవిందానువాదమే తెలుపుచున్నది.

ఈతనికి "కవిరాజ కంఠీరవ" అను బిరుద మున్నది ఈతడు కసవరాజు విద్వత్సభామాన్యుడు ప్రస్తుతము మనము చంపూరామాయణ కర్త ఋగ్వేది వేంకటాచలకవి. ఈతనికిగల సంబంధము కనుగొన వలసి యున్నది.

## వేంకటాచలపతి గద్య యిట్లున్నది

ఉమామహేశ్వర వరప్రసాద సమాసాదిత సరస కవితావిలాస వాసిష్ఠ వంశకీర్తి ప్రతిష్ఠా సంపాదక- ఋగ్వేది కవి తిరువేంగళార్య కలశరత్నాకర సుధాకర జగద్విఖ్యాత కవిరాజ కంఠీరవ బిరుదాంక వేంకటాచలపతి ప్రణీతంబైన చంపూ రామాయణం బను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

పై గద్యను బట్టి వెంకటాచలకవి వశిష్ఠ గోత్రుడని ఋగ్వేదికవి తిరువెంగళార్య పుత్రుడని, కవిరాజ కంఠీరవ బిరుదాంకుడని తెలియుచున్నవి. వెంకటనారాయణ కవి వంశ వివరమును బట్టి వంశక్రమ మిది.

ఋగ్వేది కవి రామధీమణి
|
1. తిరుమలుడు
|
అప్పకొండార్యుడు
|
2. తిరుమలుడు
|
వెంకటపతి
|
వెంకటనారాయణ

పై వంశములో అప్పకొండార్యుని కొడుకు తిరుమలుడే వెంకటాచలకవి తండ్రి తిరువెంగళార్యుడు-అప్పుడు వంశ క్రమమిట్లుండును.

2. తిరుమలుడు-(తిరువెంగళార్యుడు)
|
వెంకటపతి — వెంకటాచలపతి
|
వెంకటనారాయణ కవి

దీనినిబట్టి చంపూరామాయణ కర్త గీతగోవింద కర్తకు పిన తండ్రియని తెలియుచున్నది. ఇరువురకు కవిరాజ కంఠీరవ బిరుదమున్నది. వెంకటనారాయణ కవి విశిష్ట ప్రతిభావంతుడగుటచేత ప్రత్యేకముగా వెంకటాచల కవి పేర్కొన్నాడు. వీరి వంశీయులలో కూటస్థ పురుషుడగు, రామనకు తక్క తక్కిన వారందరు వెంకట నామధేయులగుట గమనార్హము—

వెంకటనారాయణకవి గీతగోవిందము - చంపూ రామాయణ కృతిపతియైన వెల్లంటి కసవరాజునకే అంకితము- ఆ విషయ మీ క్రింది పద్యమువలన తెలియుచున్నది-

శా॥శ్రీ రాధావనితాది వల్లవ మృగాక్షీరాజి విద్యుల్లతా
వారంబై .... ... ........యెద దీవ్యన్నీల ధారాధర
స్ఫారాకారత నుండునా మదన గోపాలుండు
వెల్లంటి కా
వేరీ జ్మావర నందనుం గసవరాట్కంఠీరవుం
బ్రోవుతన్.

వెంకటనారాయణ కవి గీతగోవిందము రచించుటకు పూర్వము ని క్రింది రచనలు చేసిన ట్లవతారిక వలన తెలియుచున్నది.

1. లక్షణా పరిణయము } ఈ రెండును సంస్కృత
2. కృష్ణ విలాసము } గ్రంథములు.

"లక్షణా పరిణయ కృష్ణ విలాసాది సంస్కృత ప్రబంధంబులు"

3. మదనగోపాల విజయము తెలుగు కృతి-దీనిని గూర్చి కవియిట్లు చెప్పినాడు.

"మదనగోపాల విజయరసోత్తరంగిత త్రిలింగ భాషాకృతి ప్రతానంబుల నుపమోత్ప్రేక్షా ముఖార్థాలంకార, వృత్యనుప్రాసాది శబ్దాలంకార భాసురధ్వనిగుణీభూతవ్యంగ్య చిత్ర విచిత్రిత ప్రఖ్యాతోత్పాద్య మిశ్ర వృత్తి విఖ్యాతంబుగా రచించి"

## గీత గోవిందము

"రసిక మనోరంజన నిదానంబును, రమణీయ రాధికారమణ శృంగారాపదానంబును, విద్వజ్జనానంద సంధానైకతానంబును మృదు మధుర పదవితాన .... సకల సద్గుణ నిధానంబగు గీత గోవిందాభిధానకృతి ప్రధానంబు"

దశమాశ్వాసగద్యలో "చతుర చతుర్భుజమను దశమాశ్వాసము" అని కలదు— దశమాశ్వాసము తరువాత — ఏకాదశాశ్వాసము కొంత భాగమున్నది — అందుండి చివరిపద్యములు —

ఉ॥ పానుపు చెంతకుంబనెడు
భామినిఁజూచి సఖీవితానముల్
లేనిపనిన్ రచించుకొని
లేచి వైచనన్‌రమా
జాని మొగంబు కంతురణ
సంజ్ఞతఁగన్గొనత త్ప్రియాశి సం
తానము తోడ నిల్వేడలె నానయు
నానయుఁ బూనెనో యనన్

క॥ మస్తూరీ కృత లోలా
కస్తూరీ తిలక ఫాల కంస విఫాలా
మస్తక భృత శిఖివాలా
హస్త కవిత వేణునాళ హాటక చేలా
(D 2520)

## అష్టపదులు

### గద్వాల సోమభూపాలుడు (క్రీ. శ. 1760)

కవి పండిత పోషకుడు, ప్రసిద్ధుడునగు గద్వాల సోమభూపాలుడు గీతగోవిందము నాంధ్రీకరించినాడు. ఈతడు తిక్కనవారికంటె వ్యాఖ్యాన రూపమున అనువదించినాడని చెప్పవచ్చును. ఆతడనుసరించిన పద్ధతులివి.

1. ఒక్కొక్క అష్టపదికి :
ఒక సంస్కృత శ్లోకము
ఒక తెలుగు ద్విపద లేక పద్యము
ఒక చూర్ణిక
ఒక దరువు లేక పదము

ప్రియేచారు శీలే అను అష్టపదికి అనువాదము

చారుశీలే ప్రియే చారుశీలే
ముంచమయి మానమనిదానం
సపది మదనానలో
దహతి మమమానసం
దేహి ముఖకమల మధుపానం

శ్లో॥ ఇహైవ మదనానలోదహతి
మాన సందేహిమే
స్ఫురద్వదన పంకజ స్ఫుట
మరందపానం ముహుః
విముంచమయి దారుణం కృతమ
కారణం మానమ
ప్యనారత రతిప్రియే రమణి
చారుశీలే ప్రియే

## చంపకమాల

మదన మహానలంబు పలుమారు
దహింపఁగఁ జేసె నా మదిన్
వదన సరోజ దివ్య మధుపాన
మొసంగు మకారణంబుగా
పదరిన కోపమున్ విడిచి బాగుగ
మత్ప్రియురాలవైన యో
మదవతి చారుశీల నను మన్నన
సేయవె రాధికామణీ!

## పదం — ముఖారి

చలమేల బాలా చారుశీలా చెలువైన ప్రియురాలా
వలపేని కాక కేవల మింత దయ లేక
కలికి నా మది వీఁక కనలఁ జేసెనిఁక
తళుకైన నీ మోము దమ్మి పానకము
తలఁచిన నొసగుము తాళను నిమిషము— చ॥
పలుమారు నించుక భాషించితివేని
పలు జిగి మెఱుగు వెన్నెల చిన్నెలమించు
తొలగించు చాలా
అఖిలమై కలయు చీకటు లాతలిరాకు
మోవి తేనెలకై నీ మోము నెల దృ
క్చ కోరము నలరింపఁ జేయును— ॥చ॥

## చూర్ణిక

అయి రాధికే చారుశీలే ప్రియే సంప్రతి మదన దహనోదహతి మమ మానసందేహి వదన సరోజ మధుపానం। మాన మప్య నిదానం విముంచకించిదపి వచసి యది దంత మౌక్తిక కౌముదీ తిమిర మతి ఘోరం హరతు స్ఫురదధరశీధవేతవానన యామినీ శశిలోచన చకోరం రోచయతు.

## అష్టపది

ఇతి చటులచాటు పటుచారు మురవైరిణో రాధికా మధివచనజాతం జయతు పద్మావతీరమణ జయదేవ కవి భారతీ ఫణితమితిగీతం.

శ్లో॥ గద్వాల సోమనరపాల మణిప్రణీతం
పద్మావతీంద్ర జయదేవకవీంద్రగీతమ్
రాధామధిప్రథిత మాధవసూక్తిజాతం
మాధుర్యచాటుఫణితం జయతు ప్రభూతమ్.

ఉ॥ ఈవగమించి సోమధరణీశ్వర
సూనుఁడు సొంపునించి ప
ద్మావతికిం బ్రియుండయిన
తజ్జయదేవప్రియోక్తి రాధికా
దేవినిగూర్చి పల్కు వసుదేవ
తనూభవ చాటు పాటవ
శ్రీ విలసద్వచస్థితినిఁ జెన్నగు
గీతము వేడ్కఁజేయుతన్.

### రాగము-ద్విజావంతి

ఏమిచోద్యమమ్మ యెంచగ
నెవ్వని తరమమ్మ
ప్రేమలీల గద్వాల కేశవస్వామి
సత్కృతి మహత్వము చూడఁగ
ధరగద్వాల నృపాలక
సోమమహేశ్వర కృతమై
తిరముగాను పద్మావతీంద్ర
జయదేవ కవిసరస్వతి
ఇరవుమీఱ నీ కరణి నతి మనోహర
మధుర సరుచిసారము
మీఱ రాధికనుగూర్చి మురహరుని
చటుల వచన జాతము
సరసగతి యీ గీతముఁ జదివిన
నరుల కిహముపరము గలుగజేయును....
చలఁగు నీలాగు గద్వాల
చెన్నకేశవుని కృపనువెలయ
సోమనృపతి రచితామై
జనులారా। యిలలోను వెలయుగావుత
సరస పద్మావతీ రమణ
జయదేవకవి భారతి
యిరవుఁగా రాధికానుగూడ
... లారా మురహరుని వచనజాతాము-

## చూర్ణిక

శ్రీ మద్గద్వాల కేశవ ప్రసాద సమాసాదిత........ నిర్భేదన ప్రతాపేన విరచిత బహుళాగ్రహార భాసుర భూసురాశీర్వచన ప్రభావసంప్రాప్తనిరవధికసామ్రాజ్య వైభవేన ప్రభుశిఖామణినా సోమ భూపాల రాయమణినా ప్రణీత....రసానుభూతం మురారే రాధికామభివచన జాతం పద్మావతీ రమణ జయదేవకవి భారతీఫణిత మితి గీతం జయతు [1]

## అష్టపదులు
## ఓగిరాల వెంకటరత్నదాసు

ఓగిరాల వెంకటదాసు కృష్ణామండలమున కదళీపురమను నామాంతరముగల కళ్లేపల్లి నివాసుడు. అచ్చట నెలకొనియున్న మదన గోపాలస్వామికి కృతిగా. అష్టపదులను పద్య, సంకీర్తన రూపమున పరివర్తనము చేసియున్నాడు.

మొదలు :

శ్రీకృష్ణోత్తర నిమ్నగావరుణది
క్సీమామణిప్రోజ్వలత్
ప్రాకారాంతర రత్నపీఠతల
విశ్వామిత్ర సంస్థాపిత

---

1. ఈ గద్వాల సోమ, భూపాలు డీకృతినే గాక - హరిభట్ట రచితమైన సంస్కృత "రతిరహస్యమును మూడాశ్వాసముల పద్య కృతిగా నాంధ్రీకరించి యున్నాడు. ఇది శ్రీ నిడదవోలు శివసుందరేశ్వరరావు. విపులపీఠిక. (ఇందు కామశాస్త్ర వాఙ్మయ చరిత్రగలదు( తోమపరాసు కల్చరల్ బుక్కుడిపో వారు ప్రకటించిరి. వెల 10. రూ.

స్వాకారోభయ పార్శ్వభోజనృప
కన్యా సత్యభామా త్తశో
భాకశ్రీ కదళీపురీ మదన
గోపాలాకృపాంభోనిధీ

శ్లో॥ మేఘైర్మేదుర మంబరం
వనభువ శ్యామా స్తమాలద్రుమై
ర్నక్తం భీరురయం త్వమేవ
తదిమం రాధేగృహయం ప్రాపయ
ఇత్థం నందనిదేశితశ్చవితయోః
ప్రత్యధ్వకుంజ ద్రుమం
రాధామాధవ యోర్జయంతు
యమునా కూలేరహః కేళయః

శా॥ శ్రీకృష్ణుండు నిశన్ భయాత్ము్ఁ
డనమించెన్ మిన్ఘనాళిందమా
లాకీర్ణాసితముల్ వనావసులు
నట్లొటన్ హరిన్నీవె రా
ధా కావింపు గృహస్థుఁగా
ననిన నంద ప్రాజ్ఞనల్లేఁగు రా
ధా కృష్ణాంగజ కేళిలొప్పు
యమునా ధ్వద్రూట జచ్ఛాయలన్

మంగళారతి. పంతువరాళిరాగము. ఆదితాళము

మా రాధాకృష్ణులకుఁ జెలులు జయ
మంగళమని యనరే। హారము క్త ఘన
సారు జలదగు। భూరిపశ్చిరము
లారసిగె కొని[1] మా రాధాకృష్ణులకు
౧౦ కదళీవరపుర। నవనులగుచు నె
మ్మది వెంకటరత్నదాసు నేలెడి
మా రాధాకృష్ణులకుఁ జెలులు జయ
మంగళమని యనరే

(R 197)

పైని పేర్కొనబడిన కదళీపురము – నేడు కృష్ణా మండలమున – చల్లపల్లివద్దనున్న కశ్యేపల్లి – దీనిని బట్టి కవి కృష్ణామండల వాస్తవ్యుడు. ఈ కృతికి మూలమైన తాళపత్ర ప్రతిప్రాతదియగుటచే తిరిగి వ్రాయించబడినది. కవి యిప్పటికి రెండు వందల యేండ్ల క్రిందటివాడు[1].

1. జయదేవుని గీతగోవిందము కీ॥ శే॥ అభినవ జయదేవ చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు ఆంధ్రీకరించి యున్నారు – ఇది యథామూలము – (క్రీ శ॥ 1960)

## 6. వచన కావ్యాలు

ప్రసిద్ధ వచన రచయితయైన కళవెనంజరాజు వచన కృతులు (1) హాలాస్యమాహాత్మ్యము (2) కాశీ మహిమార్థదర్పణము అను రెండింటిని మాత్రమే వాఙ్మయ చరిత్రకారు లెఱుగుదురు. కాని ఆతడింకను మూడు వచన కావ్యములను రచియించి యున్నాడు. అవి యింతవఱకు సాహిత్యలోకమున కపరిచితములు– వాని వివరములు–

### 1. బ్రహ్మోత్తర ఖండము

నంజరాజు హాలాస్యమాహాత్మ్యమునందువలె – తన యితర కృతులందును– కృత్యాది ఆశ్వాసాద్యంతములు పద్యములతో వ్రాసియున్నాడు [1] బ్రహ్మోత్తర ఖండమున నట్టిపద్యములున్నవి. ఇందైదాశ్వాసములు. ఇరవై రెండు అధ్యాయములున్నవి. ప్రతి యధ్యాయము చివర గద్య యున్నది. ఈ గ్రంథమున పదవ యధ్యాయమున గద్య యిది.

"ఇది శ్రీ భారద్వాజ గోత్రాభిరామ ఋక్శాఖానువ ర్తి మహాశూరసేనాధిపతి కళవె దొడ్డ మహీపాల పౌత్ర వీరరాజ పుత్ర, ధైర్యాతిశయ తిరస్కార కాంచనాహార్య, దళపతి దేవరాజ సోదర్య, విద్వజ్జన కల్పభూజ నంజరాజ ప్రణీతంబైన స్కాందపురాణాంతర్గతంబగు బ్రహ్మోత్తరఖండంబునందు ఋషభయోగి మహిమాను వర్ణనంబను పదియవ అధ్యాయము[2].

(R 1542)

### 2. గరళపురీ మాహాత్మ్యము

ఇది మైసూరునందు గల శైవ క్షేత్రమగు "నంజన్ గూడు" అని దాని మహిమ దెల్పు కృతి– "నంజన్ గూడు" అను కన్నడ పదమునకు 'గరళపురి' అనునది సంస్కృతీకరణము. పూర్వోక్త కృతులవలె నిందును అవతారికా – ఆశ్వాసాద్యంత పద్యములు గలవు. ఒక్కటి ఉదాహరించుచున్నాను–

1. హాలాస్య మాహాత్మ్యము అవతారికాపద్యములు నేను నా దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయమున అనుబంధములో నిచ్చి యున్నాను.

2. బ్రహ్మోత్తర ఖండమునకు శైవవాఙ్మయమున విశేష ప్రచారము గలదు – తెలుగున దీనిని ద్విపద పద్యకృతిగా పది మంది కవులు రచియించి యున్నారు.

మాలిని: హరిణ పరశుహస్తా అంచితేజః ప్రశస్తా
సరసిజ భవ వంద్యా సర్వలోకాభి నంద్యా
పరమశుభచరిత్రా భాసమాన త్రినేత్రా
గరళనగరవ ర్తీ శ్రీమన్నంజుండ మూర్తీ.

ఈ గరళపురీశ్వరుడగు నంజుండేశ్వరుడే కళువె వంశీయుల కారాధ్యదైవము నంజరాజు పేరీదేవుని వలన వచ్చినదే[1]

ఇందు పన్నెండధ్యాయములు గలవు.

గద్య : ఇది శ్రీ భారద్వాజ గోత్రాభిరామ బుక్కాభూనవ రి మహీ శూరసేనాధిపతి కళువె దొడ్డమహీపాలపౌత్ర, వీర రాజపుత్ర విద్వజ్జన కల్ప భూజ నంజరాజ ప్రణీతంబైన స్కాందపురాణాంతర్గత గరళపురీమాహాత్మ్యంబునందు ప్రథమాధ్యాయము.

ఇందలి వచన రచన చక్కనిది. మచ్చునకు గొంత యుదాహరింతును.

"పూర్వంబునందు కాంచి యనియెడి సర్వలక్షణ సంపన్నయగు నొకానొక బ్రాహ్మణ వధూటి గలదు అవ్వేలందిని బ్రాహ్మణ పుత్రుండును వేద వేదాంగ పారంగతుండును, నగు శివధర్ముండనువాడు వివాహం బగుటయు కాంచియను నమ్మించుబోణి పతిభక్తి పరాయణయయ్యును, శివమంత్ర ధ్యాన నిరంతర యయ్యును, శివపూజా సమాసక్త చిత్తయయ్యును రుద్రాక్షమాలికాభరణ యయ్యును జపాభస్మధారిణియె వెలయు. అనంతరంబ యొక్క నాడక్కువలయాక్షి జపధ్యాన పరాయణయైయుండ, శివధర్ముండమ్మంద గమన నవలోకించి ఏమి సేయుచున్న దానవు, తనకు పాద ప్రక్షాళనార్థంబు శీఘ్రంబుగా సలిలంబు దెమ్మనుచుం బలుక నా పొలంతి తన మగని మాట యాకర్ణించి యతనితో నిష్ఠురంబుగా "ఇపుడు నే జపధ్యానంబు గావించు చున్నదాన - ఈ ఈ జపధ్యానంబు దీరిన పిమ్మట మీకు పాదప్రక్షాళనకుందగిన సలిలంబులు, దెచ్చియిచ్చెదనని వచించుటయు. శివధర్ముండను నమ్మౌని ముఖ్యుండు తన పత్నినుడువుల కాగ్రహవ్యగ్రుండై దానిం బ్రహరించి యాక్షణంబ దేహాంతరం బరిగె" (3149)

1. కళువె నంజరాజు తండ్రి వీరరాజు పేరనున్న "వీరన ఛందస్సు" అను ఛందోలక్షణ గ్రంథమునకు "గరళపురి ఛందస్సు" అని పేరు - దీని ప్రతి ఆంధ్ర సాహిత్య పరిషద్భాండాగారమున నున్నది.

## శివభక్తి విలాసము

నంజరాజు వచన రచనలలోకెల్ల నిది పెద్దది. ఇందైదా శ్వాసములు 76 అధ్యాయములున్నవి; పై రచనలవలె, కృత్యాది - ఆశ్వాసాద్యంత పద్యములు గలవు-గద్య :

"ఇది శ్రీ మహిశూర సేనాధిపతి కళువె దొడ్డ మహీపాలాత్మజ వీరరాజ తనూజ విద్వజ్జన కల్ప భూజ నంజరాజ ప్రణీతంబైన స్కాందోప పురాణంబున హరదానముని ప్రోక్తంబగు భక్తవిలాసంబునందు బరమేశ్వరుండు సనకాదులకు మోక్షమార్గోపదేశంబు గావించె ననునది డెబ్బదాఱవ యధ్యాయము"

ఇందు తమిళదేశ శైవభక్తులగు" అరువత్తు మువ్వురు నయనార్ల కథలు గలవు-ఇందు సుందరమూర్తి నయనారున కధికముగా ప్రాముఖ్య మీయబడినది - శైలికి గ్రంథ ప్రారంభము నుండి కొన్ని పంక్తు లుదాహరించుచున్నాను.

ఆంధ్రభాషను వచనంబుగా రచియించెదనంచు నంజుండాహ్వయిశంభునకు సమర్పితంబుగానా యొనర్పంబూనిన శివభక్త మాహాత్మ్యంబునకు గథాక్రమం బెట్టిదనిన

నామాంతర పరమైయున్న గంగాదిసకల నదులకుం గల జలంబులకు సముద్రంబు సంకోచంబుగాక నధిష్ఠానంబై ! యెవ్విధంబున నుండునో, అవ్విధంబున సకలాగమపురాణ స్మృతీతిహాస మంత్రంబుల యందుగల నామాంతర పరంబులగు శబ్దంబులకు మహాదేవుండగు పరమేశ్వరుండె తాత్పర్యవిషయంబై యుండునంతమాత్రంబెగాదు వేదాదియందును వేదాంతంబునందును, ప్రణవంబుచేత ప్రతిపాద్యుండై వెలయు ఉపనిషత్పురాణాగమంబులు శివవిషయంబుగా నధికంబగుట వలనను, శివేశానేశ్వర మహాదేవ శబ్దంబుల చేత ప్రతిపాద్యుం డగుట వలనను, వర్ణంబుల యందు బ్రాహ్మణ వర్ణంబు గలవాడగుటవలనను విష్ణ్వాది సకల దేవతా పూజ్యుండయ్యును, విష్ణ్వాది సకల దేవతలకు చక్రాది వరప్రదానంబు సలుపుట వలనను పరమేశ్వర విజ్ఞానయోగంబుచేత సనకాదులు నిత్యముక్తులగుటవలననూ బరమేశ్వరుడే జగత్కర్త

అప్పరమేశ్వరునందే సకల స్మృతీతిహాసపురాణంబు లకు తాత్పర్యంబు

భక్తి, మందభక్తి, మధ్యమభక్తి, ఉత్తమభక్తి అని మూడు తెఱగులు. (R 1610)

ఆంధ్ర వచన వాఙ్మయమున నీ రాజకవికి సమున్నత స్థానము గలదు.

## తంజావూరి సరస్వతీ మహలు పుస్తక భాండాగారము

1. అంబరీషోపాఖ్యానము – తిరుమలార్యుడు (క్రీ॥ శ॥ 1630)

మహాభాగవతమునందలి అంబరీషునికథను ప్రత్యేక ప్రబంధముగా వ్రాసినవారిలో తిరుమలార్యుడు మొదటి వాడు–ఇందైదాశ్వాసము లున్నవి. ఆశ్వాసాంత గద్య యిట్లున్నది.

"ఇది శ్రీమత్పరాశర భట్టజలధి రాకాశశాంక చిక్కయాచార్య నందన రఘునాథ దేశికపాదారవిం దేందిందిరాయమానసశేషము నారాయణార్యనందన వెంగమాంబాగర్భ శుక్తిముక్తాఫల నానావిధ కవిత్వ నిర్వహణ సర్వం కషమనీషాధుర్య, తిర్మలార్య ప్రణీతంబైన యంబరీషో పాఖ్యానంబను మహా ప్రబంధంబునందు బంచమాశ్వాసము"

పై గద్యనుబట్టి ఈతఁడు విశిష్టాద్వైతి యనియు శేషము వెంగమాంబా నారాయణ దంపతుల పుత్రు డనియు – చిక్కయాచార్యనందను డైన రఘునాథా చార్యునికి శిష్యుడనియు తెలియుచున్నది.

గ్రంథావతారికలో మరికొన్ని విషయములు కలవు.

సీ॥ ననుశేషమన్వయు నారాయణార్య సం
భవుని పరాశర భట్టరాఖ్య
ఘనకులచ్ఛాత్రుని కౌండిన్య గోత్రుని
ధర చతుర్విధ కవితా విహార
సర్వంకష మనీష సం పూజ్యు తిర్మల
నాముని గన్గొని ప్రేమ పలికె
రూఢిఁగైకొనగఁ నిరోష్ఠ్య ప్రబంధంబు
నిచ్చి వారలు వేంకటేశ్వరునికిఁ

గీ॥ గన్రమ పద గుణ కల్పనా గౌరవంబు
గొంచు కృతిఁజేసి ప్రీతినిప్పించ వలయు
మాకు నాచంద్ర తారార్క మహిత మగుచుఁ
గీర్తి వర్తిల మత్కులస్ఫూర్తిఁగాగ

తిర్మల కవి కౌండిన్య గోత్రుడని – ఒక నిరోష్ఠ్య ప్రబంధము రచించినాడన్న రెండు విశేషములు పై పద్యమువలన తెలియుచున్నవి – అయితే, ఆ నిరోష్ఠ్య ప్రబంధము నామమేదో మనకు తెలియ లేదు.

ఈ ప్రబంధము సుంకపల్లి కోదండరామ మంత్రి కంకితముకాని, కృతిపతి వంశవర్ణనలో చరిత్ర కుప యోగించు నంశములులేవు. ఇక నీ కవి కాలనిర్ణయము చేయుటకు గద్యయే యాధారము—

గద్యలో పరాశరభట్ట వంశీయుడగు చిక్కయా చార్యుని కొమారుడైన రఘునాథాచార్యుని శిష్యుడనని చెప్పుకొనుటచేత కాలము కనుగొనుట సులభము – ఈ చిక్కయాచార్యుడు – తెనాలి రామకృష్ణుని గురువైన చిక్కయాచార్యుడే.

వాక్కాంతాశ్రయ భట్టరు
చిక్కాచార్యుల మహాత్ము, శ్రీగురుమూర్తిన్
నిక్కపు భక్తి భజించెద
నిక్కావ్య కళా కలాప మీడేఱుటకున్,

(పాండురంగ మాహాత్మ్యము 1-17)

ఈ చిక్కయాచార్యుడు– క్రీ.శ. 1550 ప్రాంతము వాడు. తిర్మలార్యుడు, ఈ చిక్కయాచార్యుని కొమా రుని శిష్యుడు – క్రీ. శ. 1550 ప్రాంతమున కొక తరము, 25 లేక 30 సంవత్సరములు లెక్కించినచో తిర్మలార్యుడు క్రీ. శ. 1580– లేక క్రీ. శ. 1600 ప్రాంతము వాడు కావచ్చును– కీర్తిశేషులు మానవల్లి రామకృష్ణ కవిగారు ఈతని గూర్చి వ్రాయుచు– "ఈ తిరుమలయ్య విజయరాఘవ నాయకుని కాలములోని వాడు" అని తెలిపియున్నారు[1]. కాని పైన చూపిన యుపపత్తినిబట్టి తిరుమలయ్యవిజయరాఘవ నాయకుని కాలములోనివాడు కాడు– విజయరాఘవ నాయకుని కాలము క్రీ. శ. 1633 – 1673 (R 31)

1. తెనాలి కవులు. వ్యాసము – ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 1914, పుటలు 99-703.

## 2. ఉదయనోదయము
## నారన సూరన (క్రీ. శ. 1480)

తెలుగున ప్రబంధ సాహిత్యోదయమునకు నాంది ప్రస్తావనయైన యీ యుదయనోదయ కృతి—ఇంత వఱకు ముద్రితము కాలేదు. కృతిరచనా కాలము కృష్ణరాయలకు పూర్వము క్రీ. శ. 1480 ప్రాంతము–ఐదాశ్వాసముల ఈ రసవ త్ప్రబంధమునకు తంజా వూరి పుస్తకశాలలో మాత్రమొక్క ప్రతిగలదు. దానినుండియే, కీర్తిశేషులు మానవల్లి రామకృష్ణకవి గారొక ప్రతి వ్రాసికొనిరి. దీనిని ముద్రించుటకువారు ప్రయత్నము చేసినట్లు శ్రీరంగ మాహాత్మ్యమున (1912) వారి ప్రకటననుబట్టి తెలియుచున్నది. కాని వారు ముద్రింపలేదు – కీర్తిశేషులు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు నొక ప్రతి వ్రాయించి–దీని ముద్రణమునకు హెచ్చరించిరి. [2]

ఆంధ్ర ప్రబంధపరిణామ చరిత్రను తెలిసికొనుట కత్యంతోప యుక్తమైన యీ కృతికి నొక పరిష్కృత ప్రతి తయారుచేసి ముద్రణమునకు సిద్ధపఱచితిని – దీనినిగూర్చి యొకపర్యాయము పత్రికా ముఖమున – తెలిపితిని. ఇందలి కవితారచన రుచి చూపుటకు వసంతవర్ణన నుండి కొన్ని పద్యములను ప్రకటించు చున్నాను. అయినను నేటివరకిది వెలుగులోనికి రాకపోవుట. సాహిత్యోపాసకుల దురదృష్టము–ఇందలి యితివృత్తము కాళిదాసు మేఘసందేశమున సూచించిన ఉదయనునికథ. ఇందైదాశ్వాసములు గలవు (R-139)

### వ స ం త వ ర్ణ న

ఉదయనోదయము నందలి కవితాప్రౌఢిమ తెలి యుటకు పై వర్ణననుండి కొన్ని పద్యము లుదాహరించు చున్నాను

మ॥ విరహగ్లానికరంబు; భాజనసుఖావేశంబు నానావనీ
తరువల్లీ తనుసిద్ధి, షట్పదసముత్సాహంబు నిర్జీవిత
స్మరసంజీవనసిద్ధవిద్య పికవాఙ్మౌనవ్రతోద్యాపనం
బరుదెంచెన్ మధుమాస మంచితలతాంతామోది
తాశాంతమై

మ॥ పునరుజ్జీవన మంత్రముల్ మృతమనో
భూభూమిభృన్మౌళికిన్
స్తనితఁబుల్ మధు దుర్దినంబులకు,
భాస్వత్సామిధేనుల్ వియో
గ నికాయస్మర వహ్నికిన్, మధుమ
హీక్షిత్సేనకుంగాహళల్
విన వచ్చెన్ కలకంఠ కూజితములు
ద్వేలంబులై తోటలన్

### మందానిల న ర్తకుడు

మ॥ అవి ఝుంకార రవంబు వొంగ
వినదంబై యింపుఁబాటింపఁగో
కిల బాలా కమనీయ కోమల
కుహూ గేయంబులం గూడ, మం
జుల మందానిల నర్తకుండు
మదన క్షోణీశు మ్రోలం గళల్
విలసిల్లన్ మధు వేళఁ జూపె
వన వల్లీ లాసికాలాస్యమున్

గీ॥ విరియు బొండు మల్లె విరులలో నెలదేంట్లు
వ్రాలి చూడ్కి-కుత్సవం బొనర్చె
విషమ శరుని రాజ్యవిభవంబు వనలక్ష్మి
కన్ను విచ్చి చూచు చున్న మాడ్కి–

శా॥ ధమ్మిల్లంబుల బొండుమల్లెల
విరుల్దైవారఁ బాలింప్లపై
గమ్మందావులు పొన్నమొగ్గల
సరుల్గంపింప, లీలారసం
బిమ్మైమీఱఁగఁ గర్వపర్వ
ములుగాహిందోళరాగంబులన్
సమ్మోదంబునఁ బాడిరిందు
వదనల్ చంచల్లతాడోలలన్

### న వో ఢ

ఆ॥ వె॥ కుచములందియుచ్చుకొమ్మ రోమావళి
చెంతఁజేరనీదు సుంతయేని
కూడకూడదనదు కొండంతపనికి, చీ
మంతపనికి నేల యింత పెనఁగ–

2. అముద్రిత గ్రంథములు – భారతి జూన్ 1949.
3. ఉదయనోదయ ప్రబంధము–భారతి. ఆగష్టు 1961.

## వనమాలీ విలాసము

నారన సూరన మఱియొక కృతి వనమాలీ విలాసము- ఇది సమగ్రముగా లభింపలేదు [1]. దీని ప్రతి తంజావూరిలో లేదు- మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది. మనకు లభ్యమైనంత భాగము జూడగా నిందలి కవితయు ప్రశంసనీయముగానున్నది కవి యొకడేగాన, ఉదయనోదయముతో దీనిని చేర్చితిని-

సూరన ఉదయనోదయమునుండి, వనమాలీ విలాసమునుండి, క్రీ. శ. 1700 ప్రాంతమున రచితమైన ప్రబంధమణి భూషణము అను సంకలన గ్రంథమున పద్యము లుదహరింపబడుటచేత, వీని ప్రచారము తెలిసికొనవచ్చును- వనమాలీ విలాసము నుండి కొన్నిపద్యముల నుదాహరించుచున్నాను.

ఉ॥ గొజ్జగి నీరుపోసి సమకూర్చిన
చందనవారిఁ దోచిలా
మజ్జక తాళవృంతముల మాటికిఁ
ద్రిప్పఁగ రాలు శీకరం
బజ్జలజాక్షు చెక్కుఁగవ యందు
దనర్చె ముఖేందు సుజ్వరం
బుజ్జన సేయఁగూడఁబడియున్న
యము ప్రకరంబు చాడ్పునన్ (1 ఆ)

చ. మెఱయుఁ గపోల పాలికలమీఁదఁ
జలన్మణి కుండలద్యుతుల్
గిఱికొన ఫాలభాగమునఁ గించి దు
దంచిత నర్తనంబులై
నెఱికురులింపు సేయఁ గమనీయ
విలోచనలూఁచి యాదలన్
కొఱవి భవద్వ్యళోగరిమ కోమలి
మాటికి చెప్పు చుండఁగన్ (2 ఆ)

1. ప్రస్తుతము దొరికిన ప్రతి యసమగ్రమైనను-ఇందునాల్గాశ్వాసములున్నట్లుగా వీరేశలింగంగారి ఆంధ్రకవుల చరిత్రము నుండి తెలియుచున్నది. (మూడవభాగము సంఖ్య 100) వారి వద్ద సమగ్రప్రతి యుండెనుగాబోలు. అది నేడెచ్చటనున్నదో? వారు నాల్గాశ్వాసములనుండి పద్యములు నుదాహరించినారు. అవియును ఈనాటి పరిశోధకులకు పరిచితములుగావు కాబట్టి యుదాహరించుచున్నాను.

చ. కలమధురంబులైన కలకంఠ వచోర
చనా నిగుంభనం
బులు విని సిగ్గునం బలుకు పూనిక
లెల్లను బోవడించి మూ
గల వలె నోళ్ళుమూసికొని కానలసీమలఁ
జేరియున్న కో
కిలములు బుజ్జగించి పలికించు మధూ
దయ మాత్మ సంగతిన్ (3 ఆ)

ఉ. తొల్లియు మోసపోయితివె తోయరు
హానన పెక్కు మాటలో
చెల్లమదీయ ధౌర్త్యముల చేతనె
యిప్పుడు నమ్మనౌనె నీ
యుల్లము సారెనెత్తు లిడుచున్నది
యీ క్రియ నాడుమంచు నా
కల్లతనంబు లింతటివిగాఁ
దలపోయ నరాళకుంతలా (4 ఆ)

శా॥ ఆ లంకాపుర మేరుశైలతట
పర్యంతావనీ నాథులా
శాలక్ష్మీ శ్రవణావతం
సితయశశ్ఛాయాగుళుచ్ఛుల్ మునుల్
ప్రాలేయద్యుతి భానువంశజులు
లీలాపుష్ట ధన్వాకృతుల్
బాలా నీకయి కూడినా రిచట నో
పద్మాక్షి వీక్షింపవే_

### సేతువు

గీ॥ నవ్వుఁదత్సేతు ఖండంబు నలిన వదన
దాశరథి కట్టి చేసిన తప్పుదలఁచి
సారెసారెకు వికచ ప్రసార సవిధ
తటసమాన కనూత్న ముక్తామిషమున

గీ॥ ఆ రసాతల పర్యంతమైన సేతు
మూలమాధారముగ వచ్చి ముదితభోగి
కామినీతతి చదువుమై గగురుపొడువ
నచట రఘువీర జయశాసనాక్షరములు

### తామ్రపర్ణి

చ॥ నెలఁతుక తామ్రపర్ణి యను
నిమ్నగయమ్మల యావనీధర
స్థలవిలసత్ప్రతీర తరు సంచిత
సౌరభ శైత్యలబ్ధిచేఁ

బొలిచి విలాసలీలమెయి భూరి
గుణాకర వల్లభత్వమున్
వలనుగఁబూనుచుండు ప్రతి
వాసరమున్ జలరాశి సంగతిన్.

## కా వే రి

శా॥ చోళద్రావిళ పాండ్యరాజ్య మహీ
భృచ్ఛుద్ధాంతాకాంతాపయః
కేళీస క్తతరంగ రాగిత
కురంగీనాభి నీలీభవ
ల్లీలావారిభరాభిరామ యయి
కాళిందీనదిం బోలుచున్
గ్రాలుం భూనవవేణికా విధ
మునన్ కావేరి లీలావతీ.

## వై ఘ. (వేగవతి)

మ॥ ప్రవహించు న్నిరతంబు తత్పుర
వర ప్రాంత క్షమా వీథి వే
గవతీ నామ తరంగిణీ తటి
జగత్కల్యాణి ప్రాతఃశుచి
ప్లవ ఖేలద్రవిళాంగ నా కుచ తటీ
పర్య స్త కస్తూరి కా
ద్రవ చర్చా నిల వారి పూర
యగుచున్ రాజీవ పత్రేక్షణా

క॥ కలహంతరి తాకృతిఁగో
మలి పొలుచుఁ దదంతికమున మజ్జద్ద్రవిళీ
లలిత ఘన స్తన ఘుసృణా
విల వీచిక యగుచుఁ దటిని వేగవతి యనన్

## కాంచీ పట్టణము

ఉ॥ కాంచన వప్రదీధితిని కాయముచే
వసుధావధూటి కి
భ్యంచిత కుంకుమచ్ఛదన భంగి
ముఖంబున నత్తు కొల్పుచున్
చంచలనేత్రి దక్షిణ దిశాస్థలిఁ
జూడఁగ నొప్పు నెంతయున్
గాంచి యనంగఁ బట్టణ మఖండ
మహా మహిమాభిరామమె

## కంపాతీరస్థ శివుడు

శా॥ కంపా సైకత వేదికా స్థలములన్
గ్రాలున్ గ్రతుధ్వంసి సై
లింపక్ష్మాధర చాపుఁడై ందవ కళా
లీలావతంసుండు దృ
క్సంపోద్భర్జిత మీనకేతుఁడు
జటా జాగ్రద్వియద్వాహినీ
ఝుంపావీచి భరాకులాఖిల దిశా
జాలుండు లీలావతీ.

## శ్రీ ర ం గ ము

ఉ॥ మంగళదివ్యమూ ర్తికి రమాకుచ
కుంభపటీర వాసనా
చంగిత చారువక్షునకు సర్వ
చరాచర భూత భ ర్త కు
త్తుంగ భుజంగశాయికిఁ జతుర్భు
జ భాసికి నున్కి పట్టు శ్రీ
రంగముఁ జూడ నొప్పుగుఁ గురంగ
విలోచన త త్తటంబునన్

## స్త్రీ వ ర్ణ న

చ॥ మరుఁడను నైంద్రజాలికుఁడు
మానిని నీలముఖ స్తనద్వయీ
నిరుపమ కోహళీయుగళి నించి
జగజ్జన కందుకత్రయిం
బరిపరి రీతులన్మెఱఁగి పల్కుఱు
జూపునిజైక పంచనా
పరత జగజ్జనంబులకుఁ బద్మ
విలోచన యేమి చెప్పుదున్

ఉ॥ బంతులువట్టిలోని దళభావముఁ
జూపెఁబసిండి కుండలున్
దంతుల కుంభముల్ జరిగెఁ
దామర మొగ్గలు విచ్చెజక్కవల్
చింతవహించెఁ దాళములు
చేపడె, బిల్వఫలంబు లెండె న
య్యింతి కుచద్వయంబునకు
నీడు జగంబుల గల్గనేర్చునే.

చ॥ పడ(తి సవర్ణభావ మహిమం
దెమలించు భవత్కరంబు వి
ప్పుడతనరారు నీ నృపతిపుంగవు
హ స్తముతోడ(గూర్చెదే(
బడిబడి మానసంబులను బ్రాకెడి
రాగ లతామ తల్లికిన్
బొడమిన పల్లవ ద్వితియభూతి
నొనర్చదె వేయునేటికిన్ [1]

1. పై రెండును ముద్రితమగునేని - ఆంధ్రప్రబంధ పరిణామచరిత్ర కర్త్యంతోవయుక్తములగును భక్తజానపారిజాతము.

## గుంటూరి రాజగోపాలకవి

(వాగ్గేయ కారాగ్రణి)

ఈతడు రచించిన "భక జన పారిజాతము" అను ప్రబంధమునకు రెండు అసమగ్రప్రతులు తంజావూరి పుస్తక శాలలోనున్నవి. రెండింటియందు నాలుగాశ్వాసములు సంపూర్ణముగానూ, ఐదవాశ్వాసములో కొంత భాగముగలవు.[1] పూకృత్యావతారికలో వంశక్రమమిట్లు గలదు.

1. గ్రంథసంఖ్య 202.203.




గ్రంథమున ఆశ్వాసాంతగద్య యిట్లున్నది.

"ఇది చింతామణి మంత్రి జపలబ్ధ చతుష్షష్టి కలా కలాపాభిరామ గుంటూరి రామకృష్ణకవి సార్వభౌమ నందన గోపాల విద్వత్కవీంద్రతనయ వేదాది విద్యా మనీషా విశేషాభి రామరాజగోపాల వాగ్గేయ కారాగ్రణి ప్రణీతంబైన భక్త జనపారిజాతంబను మహాప్రబంధంబునందు( జతుర్థాశ్వాసము-"

పై గద్యవలన రాజగోపాలకవి విద్యా విశేషములేగాక

అతని తాత తండ్రుల ప్రతిభావిశేషములుతెలియుచున్నవి. తాత గుంటూరి "రామకృష్ణయ". రామకృష్ణకవి యని విశదమగుచున్నను, అత దే కృతులు రచించెనో- అవతారికలో లేదు. ఆతడు "చింతామణీ మంత్ర జప సిద్ధుడు. [1] ఆ మంత్ర ప్రభావమువల్ల

1. చింతామణీ మంత్రము చతుష్షష్టి కళా సిద్ధిప్రదము. ఈ మంత్ర మాహాత్మ్యమును గురించి శృంగార నైషధము. 6 ఆ. 17-20 పద్యములు చూడదగును. సరస్వతిదేవి ఈ చింతామణి మంత్రము నలున కుపదేశించినది.

అతడుచతుష్షష్టికళా విశారదుడైనాడు.[2] తండ్రి గోపాలయ్య కవీంద్రుడే- అతని కృతులు తెలియరావు—

తాత తండ్రులే గాక తన వంశీయులందఱును కవులే యైనట్లుగా నీ క్రింది పద్యము వలన తెలియుచున్నది.

"మీ తండ్రియుఁ దాతయు ము
త్తాతయుఁ దద్గురుఁడు ధరణితనయేశ్వరులై
ఖ్యాతిగఁ గృతు లొనరించి రు
దీతత మనిసేయువారి తెలుఁగున నీవున్"

తన వంశ విశిష్టతనిట్లు చెప్పుకొన్నారు

"వెలనాఁటి కీర్తి కలమము
లిలనాఁట నెసంగ పేరు నెనసిన గుంటూ
రెలమినలమి బలిమి కలిమి
చెలిమిన్నకు నునికియనఁగఁ
జెలఁగుచు మెఱయన్"

రాజగోపాలకవికూడా 'వేదాది విద్యలు' నేర్చినవాడేగాక-సంగీత శాస్త్ర ప్రవీణుడగుటచేత "వాగ్గేయ కారాగ్రణి" యైనాడు- ఈతని సంగీత కృతులు మనకు లభ్యము కాలేదు.

కాలము

అవతారికలో నీతని కాలమును గూర్చి తెలిసికొనుట కాధారములు లేవు- కాని దక్షిణ దేశమున ప్రవర్తిల్లిన సంగీత శాస్త్రజ్ఞులుచరిత్ర మూలమున మనమాతని కాలనిర్ణయము చేయుట కాస్కారము లభించినది-

దక్షిణ దేశమున వాగేయ కారులలో

"పల్లవి గోపాలయ్య"

చాలా ప్రసిద్ధుడు — పల్లవి పాడుట యం దీతని మించిన వారెవ్వరూ లేకపోవుట వలన, సంగీత ప్రపంచమున నీతని కాబిరుదము స్థిరపడినది. ఈతని గూర్చి-"సంగీత సంప్రదాయ ప్రదర్శిని" అను గ్రంథమున నిట్లు వ్రాయబడినది—

"ఈతడు ఔత్తరాది బ్రాహ్మణుడు-వీరి పూర్వులు గుంటూరి ప్రాంతములనుండి వచ్చి తంజావూరి పరిసరములలో స్థిరపడిరి"

దీనిని బట్టి—రాజగోపాల కవి తాత తండ్రులు గుంటూరు విడిచి, ఆ కాలమున సంగీత సాహిత్య విద్యలకు-వేదశాస్త్రములకు నిలయమైన తంజావూరు చేరి-అచ్చట చిరనివాస మేర్పరుచుకొన్నారు. రాజగోపాలకవి-మనుమడు శ్రీ త్యాగరాజ స్వామివారికి సమకాలీనుడు-ఈతడే బహు నాటక కర్తయగు మెరతూరి వేంకట రామశాస్త్రి : త్యాగరాజస్వామి క్రీ. శ. 1798-1833 లో తంజావూరిని పాలించిన మహారాష్ట్రి రాజగు శరభోజీ కాలమువారు — ఈతని మనుమని కాలము క్రీ. శ. 1800 అయినచో రాజగోపాలకవి- క్రీ. శ. 1740 ప్రాంతము వాడగును [1]

భక్తజన పారిజాతమున-పరమ భాగవతుల చరిత్ర వర్ణితమైనది - ప్రశస్తమైన రచన - సంపూర్ణముగ లభ్యము కాకపోయినను ముద్రింపదగినది.

ఇది శ్రీరామున కంకితము.

"శ్రీభూమి తనుజాతనూలతకు
సద్భింబ్రాబుదాపై జగ
త్సౌభాగ్యప్రదమైన లక్షణ
మరుజ్జాత ప్రకాండంబు ల
క్ష్మీ మ్భవ్యంబును నౌ సమస్త
ఫలద శ్రీరామ కల్పద్రుమం
బా భోగస్థితి మీఱ ధీరజన
కారాధారమౌ గావుతన్

# అడయారు గ్రంథాలయము

చెన్నపట్టణము - అడయారులో దివ్యజ్ఞాన సమాజము వారి పుస్తక భాండాగారములో తెలుగు గ్రంథములున్నవి. వానికి ప్రత్యేకముగా సూచికలు లేవు- మనము స్వయముగా చూచుకొన వలసినదే అన్నియు తాళపత్ర గ్రంథాలే - శిశుపాలవధకు లభ్యమైన మొదటి యాంధ్రీకరణము పోచిరాజు వీరన్న కృతి యిచ్చట నొక్కచోటనే కలదు - ఇంకను కొన్ని సుగుటూరి వారికి సంబంధించిన రచనలున్నవి - ఇందున్న రెండు పెద్ద శైవ వాఙ్మయ సంబంధములైన మహా గ్రంథాలను గూర్చి తెలుపుతున్నాను.

2. చతుష్షష్టి కళల వివరణమునకు. చూ. శబ్దరత్నాకరము ప్రశంస.

1. దీనిని గూర్చిన సంపూర్ణ వివరములకు చూడుడు. నా దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము - 302 - 306 పుటలు.

## స్కాందోప పురాణము
## హరభక్త విలాసము

వచన కావ్యములలో - నంజరాజు స్కాందోప పురాణము (శివభక్తి విలాసము)ను గూర్చి యీవఱకే తెలిపితిని - ఆ స్కాందోప పురాణమునే ప్రశస్త పద్య కృతిగా - అత్తలూరి పాపకవి హరభక్త విలాసము అను పేర రచియించి యున్నాడు -

ఇది యెనిమిదాశ్వాసముల మహాకావ్యము- ఆశ్వాసాంత గద్య- "ఇది శ్రీ చెన్నమల్లికార్జున కటాక్ష లబ్ధకవితా మాధురీ ధురీణ కౌశిక గోత్ర పవిత్ర శ్రీ గిరి రాజ పుత్ర సుకవి జన విధేయ పాపయ నామధేయ ప్రణీతంబైన స్కాందోప పురాణంబను మహా కావ్యంబునందు పంచమాశ్వాసము"

స్కాందోప పురాణమగు నీ హరభక్త విలాసము సంస్కృత భాషలో నున్నది- దానినే- నంజరాజు వచన కావ్యముగాను, పాపకవి పద్య కావ్యముగాను రచియించి యున్నారు. ఇందు తమిళ దేశమున శైవ భక్తులగు- అరవత్తు మువ్వురు నయనారుల చరిత్రలు గలవు-

పాపకవి హరభక్త విలాసము మూడు వేలకుపైగా పద్యములున్న కృతి. ఇందు మొదటి ఆశ్వాసమున- 740 పద్యములున్నటు తెలియుచున్నది. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో దీని కొక అసమగ్ర ప్రతి గలదు [1]. అందు ప్రథమాశ్వాసముః పై 740 పద్యములు గాక- ద్వితీయాశ్వాసమున 330 పద్యములు దాక గలవు. దీని సంపూర్ణ ప్రతిపై అడయారు గ్రంథాలయమున తప్ప మఱెచ్చటను లేదు. (30-B-14)

అత్తలూరి పాపకవి యీవఱకాంధ్రకవుల చరిత్రలో వర్ణితుడైనాడు. ఈతని చెన్న బసవపురాణము శైవ వాఙ్మయమున ప్రసిద్ధకృతి - హాలాస్య మాహాత్మ్యాది బహు గ్రంథకర్తయు. బ్రౌన్ దొరవారి ఆస్థాన పండిత కవులలో నొకడునైన మల్లంపల్లి బుచ్చికవి. పాపకవి మేనల్లుడైనట్లుగా నీ గ్రంథమునుండి తెలియుచున్నది.

1. వివరణాత్మక గ్రంథసూచికలు. IX సంపుటము- వేదాంతము. సంఖ్య 2273.

ఉ॥ మల్లమపల్లి వంశజుఁడుమా
వరభక్తిపరుండు నాదు మే
నల్లుడు సంస్కృతాంధ్ర కవనా
ఢ్యుడు బుచ్చయసత్కవీంద్రుడు
త్పల్లమనీషనీకృతికిఁ బొందుగ
సాయమొనర్పఁ జెప్పితిన్
తెల్లముగాగ దిద్ది ధరణిం
బ్రబలింపుడు దీని సత్కవుల్.

పై పద్యమువలన బుచ్చికవి, పాపకవి మేనల్లుడగుటయే గాక హరవిలాస భక్తరచనలో తోడ్పడినట్లు తెలియుచున్నది. ఇది శ్రీశైల మల్లేశ్వరునకు కృతి.

శా॥ శ్రీవాణీశ ముఖామరుల్
గొలువగా శ్రీభ్రామరీయుక్తుఁడై
శ్రీ వర్ధిల్లెడు శ్రీనగాగ్రమున
నర్థిన్నిల్చి లోకంబు లెం
తే వాత్సల్యము మీఱ నేలెడి
మహాదేవుండు మల్లేశ్వరుం
డావిర్భూత దయాకటాక్షమున
మమ్మత్యంతమున్ బ్రోవుతన్

ద్వితీయాశ్వాసమున రెండు పద్యములు -

ఉ॥ నాగుడుఁ దత్క్రమం బెఱిఁగి
నందనుఁ డొక్కరుఁడైన లేకనే
నీ గతి నెట్టులుండగ సహింతు
నటం చటుదాను గుంది యి
చ్ఛాగతి వేటలాడుటయు
సర్వసుఖంబులు మానియున్న నా
లాగు గ్రహించి పొక్కుచుఁ
గులంబున గల్గిన పెద్దలయ్యెడన్

ఉ॥ ఆతనిఁజేరనేగి యిటులాడి-
నెంజిలి చెందకాత్మజో
ద్భూతికిఁగారణంబయిన
త్రోవ యొకండు ఘటింతుమేమురు
మ్మీతరి నంచువాని వెలయించి
రయంబునఁ బుక్కఱాంతికో
పేత వనస్థలంబులకుఁ బ్రేమ
మెయింగొనిపోయి యచ్చటన్

చిన్నయసూరి తన నిఘంటువున - నిందుండి ప్రయోగములు గ్రహించుటచేత యిది ప్రశస్త కవిత గలది యని చెప్పవలెను.

## బసవ పురాణము

పిడుపర్తి సోమనాథ కవి పద్య బసవ పురాణము వాఙ్మయ చరిత్రకారులకు పరిచితమైనదే- అది పాల్కురికి సోమనాథుని ద్విపద బసవ పురాణమునకు పద్యానువాదము[1]- ఈ బసవ పురాణము పద్యకృతియే. దీనిని రచియించిన కవి- శ్రీపతి పండితారాధ్య మహాదేవకవి విజయవాడ యందుగల శ్రీపతి పండితారాధ్యపీఠాధిపతి ఈ బసవ పురాణము పిడుపర్తి బసవ పురాణమువలె, ఏడాశ్వాసములు గల కృతియే యైనను- అంతకన్న చాలావిపులముగానున్నది.దీనినియేకైకసంపూర్ణప్రతి- అడయారు గ్రంథాలయములో మాత్రమేయున్నది[2].

ఈ గ్రంథ ప్రతిని సుప్రసిద్ధ శైవ కవియగు పోచిరాజు వీరన లిఖించి గ్రంథాంతమున నీ పద్యము వ్రాసెను-

చ. రసికుఁడు పోచిరాజకుల రంజనుఁ
దీవని నామపట్టణా
వసథుఁడు వీరమంత్రి వ్యయ వత్సర
ఫాల్గున మాసమందునీ
బసవ పురాణమాంధ్ర కృతపద్య
కవిత్వము వ్రాసియిచ్చె ధ
ర్మ సుగుణ కీర్తిశాలియగు మామిడి
వెంకయ వైశ్యమౌళికిన్

పై పద్యమునుబట్టి ప్రతిలేఖన కాలము క్రీ. శ. 1826. కాని గ్రంథ స్థప్రమాణములనుబట్టి — కృతి రచించిన మహాదేవ కవి-అప్పటికి రెండు తరములు ముందువాడు. క్రీ. శ. 1750 ప్రాంతమీతని కాలము. ఆశ్వాసాంత గద్య—

"ఇది శ్రీమద్విజయ వాటికామల్లేశ్వర కరుణా ప్రసిద్ధలబ్ధ కవితాధురీణ శ్రీపతి పండితారాధ్య సింహాసనారూఢ జగన్నిరూఢ సంప్రదాయార్ణవ పూర్ణరాకా సుధాకర, మహాదేవారాధ్య పౌత్ర, శంభులింగారాధ్య పుత్ర శివభక్తజన విధేయ మహాదేవ నామధేయ సత్కవిప్రణీతంబగు బసవ పురాణంబునందు ప్రథమాశ్వాసము."

కృతి బెజవాడ మల్లేశ్వరునకంకితమేగాక కృత్యావతారికలో బెజవాడ విశేషముగా వర్ణితమైనది. ఈ అవతారిక చాలా పెద్దది. ఇందు 126 పద్యాలున్నవి.[3] ఇందు శ్రీపతి పండితుడు, శివలెంక మంచెన పండితుడు మల్లికార్జున పండితుడు అన్న పండితత్రయ ప్రశంసలున్నవి. ఇందుండి కొన్ని పద్యము లుదాహరించుచున్నాను. వీని వలన కవితా శైలియు తెలియ నగును.

శా॥ శ్రీ కల్యాణగుణాకరాశ్రిత
జనాస్తి క్యోల్ల సద్బుద్ధిని
ర్వైకల్యార్జిత భక్తియోగమహీ
తైశ్వర్యాతి సౌఖ్యప్రదా
లోకాధార హిమాచల ప్రియా
సుతాలోకేక్షణాహ్లాద నే
నీకున్ మ్రొక్కెదనిష్టసిద్ధి కొరకై
నిత్యంబు మల్లేశ్వరా

ఉ॥ శ్రీ జయవాటికానగర శేఖర
మధ్యమ దివ్య మందిర
భ్రాజిత వామరత్నమయ బంధు
ర పీఠనిషణ్ణ కృష్ణవే
ణీజల నిత్యసేచన వినిర్మల
పూజన మల్లికేశ ! నిన్
బూజ యొనర్చెదన్ మదిని బొంగుచు
సర్వఫల ప్రదాయకా.

---

)ంగం పంతులుగారి - ఆంధ్రకవుల చరిత్ర- తృతీయ భాగము సంఖ్య 40.

తెలుగుదేశముననే కాక భారత వర్షమునకంతయు ప్రప్రథమ చారిత్రక పరిశోధకుడైన కావలి వెంకట బొర్రయ్య- అత్తలూరి పాపకవి శిష్యుడు. (చూ. కావలి వెంకట బొర్రయ్య జీవితము- త్రిలింగ - 3-4-1948

1. పిడుపర్తి సోమనాథుని కృతి పద్య బసవపురాణము ముద్రితమైనదేగాని యిప్పుడు లభించుటలేదు.దీనికి సుపరిష్కృతమైన ముద్రణమొకటి అత్యంతావశ్యకము. ద్విపదబసవ పురాణమునే తువాతప్పక అనువదించుటచే ద్విపదబసవ పురాణపాఠ భేదముల కది యుపయోగించును.

2. 32- బి- 14. అనుసంఖ్య మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోను ఒక ప్రతియున్నది.గాని అది అసమగ్రము; గ్రంథ పాఠములతోనున్నది, (R 359)

3. పరిశోధన 8 సం॥ జూన్, జులై 1955-6-22 పుటలు

శా॥ నీవేందీవర పత్ర సుందర రుచిన్
నిర్జించి వెల్గొందు దీ
ర్ఘాలోలంబులు............ ...............
గ్లీలన్ వెల్వడు మాడ్కి తోనొసఁగు
కల్మిన్ సజ్జన శ్రేణికిన్
జాలా కాంచనదుర్గ యాసుదతి
నీ సద్భార్య మల్లేశ్వరా.

ఆ. వె. ఇంద్రకీల పర్వతేంద్ర సన్నిధి భూమి
వెలయుచున్న కృష్ణవేణి దరిని
విజయవాటి యనగ విశ్రుతంబగు పురం
బందు మల్లికేశు నాలయమున.

శ్రీపతి పండితుడు, విజయవాడలో శమీవృక్షమున అగ్నినంతను నిక్షేపించిన విషయమునిట్లు కవి వర్ణించి యున్నాడు.

శా॥ పంచక్రోశవినిర్ణయ స్థల
పరిభ్రాజన్మహా పట్టణో
దంచ ద్వహ్నిని దెచ్చి యా
ముదియపై హత్తించి శమ్యగ్రమం
దుంచెన్ శంభు నివాస మధ్యమున
నత్యుగ్ర ప్రభావంబునన్
మించెన్ దగ్గురునాథుఁ డప్పుడు
సమున్మీల లలాటాక్షుఁడై

ద్విపద బసవపురాణ మిట్లు ప్రశంసితమైనది.

ఆ॥వె॥ సొరిదిపాలకుఱికి సోమనారాధ్యాభి
ధానవీరశైవధనుడు మున్ను
ద్విపదకావ్యముగను దెనుఁగున రచియించె
బసవ సత్పురాణ మసదృశముగ

గీ॥ కలయబహువీర శైవ సద్గ్రంథ రచన
గోరి యొనరించు శ్రీ పాలకురికి సోమ
నాథుఁడాదిగ గలుగు పినాకధరుని
కవివరుల సన్నుతించెద సవినయముగ.

తెలుగున బసవని మహిమలను భక్తుల కథలను హృద్యముగా చెప్పు నీ పద్య కృతికి ఆంధ్ర శైవవాఙ్మయమున నొక స్థాన మున్నది.

ఇంకను గొన్ని గలవు గాని గ్రంథ విస్తర భీతిని విరమించితిని. పాఠకలోకమును మన్నింప గోరుచున్నాను.



# తంజావూరు నాయకరాజులు
# ఆంధ్ర వాఙ్మయము

విజయనగర రాజ్యపతనానంతర మాంధ్ర వాఙ్మయము మధుర, తంజావూరు, పుదుక్కోట, చెంజి, మైసూరు మున్నగు దక్షిణదేశ రాజ్యములందు కూడ వర్ధిల్లుట సంభవించినది. వీనిలో మధుర, తంజావూరు నాయక రాజ్యములు ముఖ్యముగా పేర్కొనఁదగినవి. విజయనగర రాజులు తఱుచుగా మహమ్మదీయ రాజులతోఁ బోరాడవలసి యుండుటచే వారికి విస్తృతములైన సేనలును ధనమును ఆవశ్యకములగు చుండెను. భూమినుండివచ్చు నాదాయమును సైన్యపోషణమునకై వినియోగించు నుద్దేశముతో రాయలు దేవదేయ బ్రహ్మదేయములు తప్ప మిగిలిన గ్రామముల నన్నింటిని భండారవాడ గ్రామములు, అమర గ్రామములు అని రెండు తెఱఁగులుగా విభజించి, యుద్ధములు సంభవించునప్పుడు నిర్ణీత సంఖ్యగల గజాశ్వ బలములతోవచ్చి సాయపడవలెననియు, నేఁటేఁటఁ గొంత ధనము కప్పముగా నొసంగవలెననియు నమర గ్రామ నాయకులకుఁ గట్టడిచేసెను. రాక్షస తంగడి యుద్ధానంతర మావహిల్లిన యరాజక పరిస్థితులలో బలవంతులైన అమర నాయకులు పరిసరములందలి అమర గ్రామముల నాక్రమించుకొని స్వతంత్ర రాజ్యములు స్థాపించిరి. ఇట్టి వానిలో మధుర, తంజావూరు రాజ్యములు ముఖ్యమైనవి. శత్రుభయ మంతగా లేకపోవుటచే నీరాజ్యములనేలురాజులు సారవంతములైన భూముల నుండి వచ్చు నాదాయమును యధేచ్ఛముగా ననుభవించుచుఁ సంగీత సాహిత్య వినోదములతో సుఖముగాఁ గాలక్షేప మొనరించు చుండిరి. విజయనగర రాజ్య పతనా నంతరము మహమ్మదీయు లొనరించు చుండిన దుండగములు సహింపలేక పలువురు కవి గాయక నర్తకాదులు దక్షిణమునకు వలసపోయిరి రసికులైన నాయకరాజులు వారికాశ్రయమిచ్చి పోషించిరి. ఈ విధముగా దక్షిణ దేశమాంధ్ర వాఙ్మయాభివృద్ధి కాస్పదమగుట సంభవించెను.

తంజావూరు నాయక రాజుల పోషణమున నాంధ్ర వాఙ్మయవాహిని త్రివేణియై ప్రవహించినది. పద్యము గేయము, యక్షగానము అనునవి యా త్రివేణులు. అప్పటి పద్యకావ్యములు ప్రబంధములే. గేయ రచన యప్పుడు విరివిగా సాగుటకు యక్షగానములలో నవి ప్రధాన స్థానము నాక్రమించుటయే కారణము. సంకీర్తనలు అధ్యాత్మ కీర్తనలు ఏలలు, దరువులు, పదములు అందు ప్రధానములైనవి. అప్పుడు కొఱవంజి, దేశి, చేపదము, జక్కిణి, జోగి, చిందు మున్నగు నాట్య చౌదములకనుగుణముగాఁ బ్రత్యేకములైన గేయములను బాడెడివారు. యక్షగానమొకరూపక విశేషము. విజయ రాఘవుఁడు మొదలగువారు తమ యక్షగానములను నాటకము లనియే వ్యవహరించిరి. ఇవి క్రీ।శ॥ 12 వ శతాబ్దినుండియు ప్రచారమున నుండెనని చెప్పుట కాధారము లున్నను అప్పకవికిఁ బూర్వపు లాక్షణికు లెవ్వరును వానిని పేర్కొని యుండ లేదు. మొదట కుఱవలను నాటవిక జాతివారు వానిని ప్రదర్శించు చుండెడి వారనియు, పిమ్మట జక్కులు లేక యక్షులు అను వారు వానిని జేపట్టుటచే వానికి యక్షగానము ని పేరువచ్చెననియు కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తెల్పియున్నారు. కొఱవంజిని (ఎఱుకతను) తొలుత యక్షగానములలోఁ బ్రవేశపెట్టిన వారు తంజావూరి వారేయనియు, నందుచే కొఱవల మూలమున యక్షగానములు లుత్పన్నములయ్యె ననుట యుక్తము కాదనియు, నవి మత ప్రచారమునకై ప్రభవించి తొలుత కొయ్య బొమ్మల మూలమునను, తోలుబొమ్మల మూలమునను ప్రదర్శింపబడి, తరువాత మానవ ప్రదర్శితములైన

డా. దివాకర్ల వేంకటావధాని
18/4 R. T., బరకత్పుర హైదరాబాదు.

మూగ నాటకములై, పిమ్మట గద్య పద్య గేయము లతోఁ గూడి యక్షగానము లయ్యెననియు బౌద్ధ యుగము నుండియు జక్కులు లేక యక్షులు అనఁ బడు నొక తెగ వారాంధ్ర దేశమున నివసించుచుండి రనియు, వారి వలననే యక్షగానముల కాపేరు వచ్చి యుండుననియు, నిట్టివి సంస్కృతమునఁ గూడ నుండె ననుట కాధారము లుండుటచే నివి కేవల దేశి రచనలనుట యుక్తము కాదనియు, తెలుఁగు నందలి యక్షగానములను జూచి తమిళులును కన్నడు లును అట్టి వానిని దమ తమ భాషలలో రచించి రనియు శ్రీ డా. నేలటూరి వేంకటరమణయ్యగా రభి ప్రాయపడుచున్నారు. తంజావూరు కవులు యక్ష గానములలో బెక్కు మార్పులు చొప్పించి వానికి వన్నె కలిగించిరి. వానిలోఁ గథాగల్పనము కంటె పాత్ర పోషణమునకే ప్రాధాన్య మెక్కువ.

తంజావూరు నాయకరాజ్యము మాట వినఁగనే స్మృతి పథమునఁదోచువాఁడు రఘునాథ నాయకుఁడు (1614 – 1633) రాయవారివలె నితఁడును సాహితీ సమరాంగణ సార్వభౌముఁడే. ఇతఁడు సుమారు నూఱు గ్రంథములు రచించెనఁట ; కాని వానిలో రామాయ ణము. వాల్మీకి చరిత్రము అను రెండు మాత్రమే లభించుచున్నవి. ఆ రామాయణమైనను బాలకాండ మందలి నాల్గవ ఆశ్వాసములోని కొంత భాగమువఱకు మాత్రమే కానఁబడుచున్నది. కథ కోసల దేశ వర్ణన ముతో మొదలిడి పుత్రకామేష్టితో ముగియుచున్నది. ఇందలి కవిత్వము రసవద్వర్ణనములతోడను, మధుర మంజుల పద ప్రయోగములతోడను గూడి మనోహర ముగా నున్నది. ద్వితీయాశ్వాసమున ఋశ్యశృంగుని కథను రచించుటలో రఘునాథుఁ డప్రతిమాన మైన కౌశలము ప్రదర్శించియున్నాఁడు. మధురవాణి తాను రఘునాథుని రామాయణమును సంస్కృతీకరించినట్లు చెప్పుకొన్నది.కాని యది పరిమాణమునఁజిన్నదగుటచే నీ రామాయణమగునో కాదో నిర్ణయించుటకు వీలు లేకున్నది.వాల్మీకి చరిత్ర మాదికవి వాల్మీకిపూర్వజీవిత మునువర్ణించుమూఁడాశ్వాసములప్రబంధము.గ్రంథాదిని గల యతిదీర్ఘ మైన తీర్థాదివర్ణనమును, తృతీయాశ్వాస మందలి రంభోర్వశీపరాభవ వృత్తాంతమును రమ్యము లయ్యును వస్త్వైక్యమునకు భంగముకలిగించుచున్నవి. ఇందలి వర్ణనలును, శైలియు ప్రౌఢములుగానున్నవి.

శృంగార సావిత్రి యని రఘునాథుని పేర ముద్రితమైన ప్రబంధ మాతఁడురచించినదగునో కాదోచెప్పజాలము. సాహిత్య రత్నాకరమున యజ్ఞనారాయణ దీక్షితుఁడు రఘునాథుఁడు యామద్వయమున పారిజాతాపహరణ కావ్యమును జెప్పి తండ్రిచేఁ గనకాభిషేక గౌరవము నొందె యుండెనని వ్రాసి యుండుటచే నతఁ డాశు కవి త్వమునఁ గూడ దిట్టయని తెలియుచున్నది. రఘునాథుడు అచ్యుత రాయాభ్యుదయము, నల చరిత్ర అను రెండు ద్విపదకావ్యములను గూడ రచించెను. ఇందు మొదటిది పేరునుబట్టి ఆతని తండ్రియైన అచ్యుత నాయకుని చరిత్రయని తోచుచున్నది. నల చరిత్ర యెనిమి దాశ్వాసములలో నలదమయంతుల వృత్తాంతము సమగ్రముముగా వర్ణింపబడినది. ఇందు నలదమయంతుల వనసంచార వర్ణనము మిక్కిలి రమ్యముగా నున్నది. యజ్ఞనారాయణ దీక్షితులు "శ్రీ రుక్మిణీశ్రీకృష్ణ వివాహ యక్షగానం ప్రబంధ పినైక భేదాన్" అని చెప్పియుండుటచే రఘు నాథుడు రుక్మిణీపరిణయమును యక్షగానములును గూడా రచించినట్లు తెలియుచున్నది. కాని యది యము ద్రితము.

రఘునాథుని కొలువునందలి కవులనే కాక యా కాలపుఁగవుల కందఱికిని దలమానికమని చెప్పదగిన వాఁడు చేమకూర వేంకటకవి. ఇతఁడు సారంగధర చరిత్ర, విజయ విలాసము అను రెండు ప్రబంధము లను రచించి రఘునాథునికే అంకితము కావించెను. ఇందు రాజరాజనరేంద్రుని భార్య చిత్రాంగి తన సవతి కొడుకు సారంగధరుని వలచిన వృత్తాంతముతో, గూడిన సారంగధర చరిత్ర ఆతని ప్రథమ రచన, ఇందలి కవిత్వము హృద్యముగానే యున్నను వస్తు స్వభావమునుబట్టి రసాభాసమున కాకరమై కొంత జుగుప్స కలిగించుచున్నది. రెండవదైన విజయ విలాసమున పాండవ మధ్యముండైన విజయుఁ డులూచి, చిత్రాంగి, సుభద్ర అను ముగ్వురు జవ్వను లను బరిగ్రహించి కావించిన విలాసములు మూడా శ్వాసములలో వర్ణింపఁబడినవి, భారతము నందలి కథనే గ్రహించి దానిని సరస మనోహరములైన వర్ణనలతోడను మధుర గంభీరములైన భావముల తోడను, అద్భుతములైన శ్లేషచమత్కారముతోడను ఓహో యనిపించు నను ప్రాసయమకాది శబ్దాలంకా



శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి; శ్రీ నన్నపనేని వేంకట సుబ్బారావుగార్లతో

డని దీనిభావము. మఱియు నిచట విద్యారణ్యులవారు తమ భాష్యమును విస్తరింపఁజేసి యిట్లు సెలవిచ్చిరి. ఓ కర్షకులారా: మీరు నాగళ్ళను కూర్చుకొనుఁడు, కాండ్లను వృద్ధిఁజేసికొనుఁడు. దున్నుటచే నుపయుక్తమైన ఈ స్థానమున బీజములఁ జల్లుఁడు. ఇవి మంచి విత్తులు. సత్ఫలము నొసగును.

ఆశీర్వాదరూపమగు మంగళవాక్యముతో నీబీజములు కూడుకొనుఁగాక: మనము వేసిన ఎరువు మొదలగు ప్రయత్నములచే వ్యవసాయము సిద్ధమై మనకు బాగుగ ఫలించుఁగాక: పండినపంట అనతికాలములోనే సంసిద్ధమగుఁగాక: పంట కొడవలిచేఁ గోయఁ పడినదై మన సమీపమునకు వచ్చుగాక: ఈ శ్రుతియందు కృషి కార్యమంతయు సంగ్రహముగాఁ జెప్పఁబడినది.

మఱియు "లాంగలం పవీరవగ్ం సుశేవగ్ం సుమతిత్సరు ఉదిత్కృషతి గామవింప్ర ఫర్వ్యంచ పీవరీం ప్రస్థావద్ర థవాహనం" ఈ మంత్రమునకు విద్యారణ్యులవారు "వజ్రమువలె మిగుల వాడి గలదియు, హాలికులచే సేవింపఁదగినదియు మంచిదని తలంపఁబడుచున్నదియు, మెరకపలములు చదునుజేసి నడచునదియునగు ఈ నాగలి పెద్ద మట్టిగడలను భేదించుచున్నట్లు దున్నుచున్నది." అని తెలిపిరి ఈ శ్రుతియందే ఉత్తరార్ధమున-కృషి ఫల మధికమైన వ్యవసాయదారుఁడు మంచి గోవులను. గొఱ్ఱెలను గుఱ్ఱములను సులభముగ నొందఁగలఁడని కలదు.

ఈ యజుస్సంహిత యెదవకాండ రెండవ పన్నమందలి యెదవ యనువాక బ్రాహ్మణమున "షడ్గవేన కృషతి" మూఁడు ఏరులకు ఆఱువృషభములను గట్టి పశువుల సుఖమునకై యిట్లు దున్నవలెనని దీనిభావము మరియు "కృష్టేవపతి" దున్నిన దానిమీఁద విత్తులు జల్ల వలెనని దీనిభావము "అనుసీతం వపతి"నాగలి జాడ ననుసరించి విత్తనములఁ జల్ల వలెనని దీని భావము. ఇట్లు ఋగ్యజుర్వేదములలో నీవ్యవసాయమును గూర్చి కలదు సాయనాచార్యుఁడు విద్యారణ్యస్వామియు నిట్టి పట్టులు వివరించిరి.

"అనుపశ్య యథాపూర్వే ప్రతిపశ్య తథాపరే
సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమివాజాయతేపునః
కఠోపనిషత్- ప్రథమవల్లి- 6వ మంత్రము.

అర్థము:- పూర్వే=పూర్వులు; యథా=ఏప్రకారముగానో; తథా = ఆ ప్రకారముగా; అనుపశ్య = ఆలోచింపుమా; అపరే=ఇతరులు; యథా = ఏ ప్రకారముగానో; తథా = ఆ ప్రకారంగా ప్రతిపశ్య = ఆలోచింపుమా; మర్త్యః=మనుష్యుఁడు; సస్యమివ = పైరువలె; పచ్యతే=జీర్ణమై మరణ మగుచున్నాఁడు; మర్త్యః=మనుష్యుడు; సస్యమివ = పైరు వలెనే; పునః=తిరిగి; జాయతే = పుట్టుచున్నాఁడు. ఇట్లు ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి.

## మనుస్మృతి

"మనుర్వైయత్కిం చ దవదత్త ద్భేషజమ్"అను ఛాందోగ్య బ్రాహ్మణ మందలి శ్రుతివలన సర్వస్మృతులలో మనుస్మృతి ప్రధానము గావున దానినుండిరైతులకు సంబంధించిన ప్రసంగముల నుదహరించుచున్నాము. కొందఱీమనువును బ్రహ్మపుత్రుఁడని వాకొనుచున్నారు. మఱికొంద రీతనిని "ఏనమేకే వదన్త్యగ్నిం మను మన్యేప్రజా పతిమ్" అనువాక్యానుసారము అగ్నిహోత్రునిగాను ప్రజాపతినిగాను దలఁచు చుండుటచేఁ గొందఱకుఁ బ్రమాణ భూతుఁడయిన కారణమున వీని వాక్యములిం దుపబృంహితములైనవి.

ఈ మనువు సాక్షాత్తుగఁ దాను జెప్పకయే తన-శిష్యుఁడగు భృగు మహర్షిచే నీ ధర్మశాస్త్రమును జెప్పించెను. "తస్యయద్రేతసః ప్రథమం దేదీప్యతే తదసావాదిత్యో ఽ భవత్ యద్ద్వితీయా మాసీ ద్భృగురితి" వహ్నియొక్క మొదటి రేతస్సు- సూర్యుఁడాయెను. రెండవ రేతస్సు భృగువాయెనని- శ్రేష్ఠమగు రేతస్సువలన భృగుండయ్యెనని శ్రుతి ప్రమాణము. ఇట్టి గురు శిష్యులచేఁదెలుపఁబడిన మనుస్మృతి మాదృశులకుఁ బ్రమాణమే మాత్రము గాకున్నను సనాతన ధర్మపరుల సంతృప్తికే వీనిని దార్కాణించుచున్నాము.

శ్లో॥ పశూనాం రక్షణందాన। మిజ్యాధ్యయనమేవచ
వణిక్పథం కుసీదంచ । వైశ్యస్యకృషియేవచ॥
మను. 1 అధ్యాయము. 90

పశురక్షణము, దానము యజ్ఞము, అధ్యయనము, వడిబేరము వ్యవసాయము నివి వైశ్యులకుఁ గల్పింపఁబడెను- దీనివలన బ్రాహ్మణ క్షత్రియులు వ్యవసాయ

మొనర్పరాదను విధితెలియుచున్నది. ఈ పశురక్షణము వ్యవసాయము నీచముగా(బరిగణింప(బడుటచే వైశ్యులాధర్మమును వీడిరి. సేవాధర్ములగు శూద్రులీ వ్యవసాయమును స్వీకరించిరి.

శ్లో॥ ఆచార హీనః క్లీబశ్చ। నిత్యం యాచనక స్తథా
కృషి జీవి శ్లీపదీచ। సద్భిర్నిందిత ఏవచ॥
3. అ. 165

శ్లో॥ ఔరభ్రికో మాహిషికః పరపూర్వ పతి స్తథా
ప్రేతనిర్యాతకశ్చైవ।వర్జనీయాః।ప్రయత్నతః॥
3, అ. 166

శ్రాద్ధాదులను బ్రయత్నముచే వర్జింప(దగినవారు కరకులెరి. "ప్రమృతం కర్షణంస్మృతం" (4. అ. 5.) యాచనము మరణముతో తుల్యము భూగత జంతువులు కర్షణముచే( బ్రకర్షముగ మృతము లగుటచే( గృషిప్రమృతమన(బడెను "నశూద్రరాజ్యేనివసేత్" (4. అ. 61) శూద్రు(డు పాలించుచున్న రాజ్యమందు నివసింపరాదని దీనిభావము.

శ్లో॥ గోరక్షకాన్ వాణిజకాన్।తథాకారు కుశీలవాన్
ప్రేష్యాన్ వార్థుషికాంశ్చైవ।
విప్రాన్ శూద్రవదాచరేత్
మను. 8. అ. 102

పశుసంరక్షకు(డగు బ్రాహ్మణుని శూద్రునివలెనే చూడవలెననిదీనిభావము. "క్షేత్రికస్యాత్యయే"(మను. 8. అ. 243 శ్లో) వ్యావసాయకు(డు తన భూమిని బాగుగా(బడింపక పోయినా దండిoప వలెనని దీని భావము

శ్లో॥ వాణిజ్యంకారయేద్వైశ్యం
కుసీదంకృషియేవచ
పశూనాం రక్షణంచైవ
దాస్యం శూద్రం ద్విజన్మనామ్॥
మను. 8.అ 410

ఇట్లు పెక్కుచోట్ల వైశ్యునకే వ్యవసాయ మప్పగింప( బడినది. నవమాధ్యాయమున 33 నుండి 44 వఱకు పరస్త్రీ సంగమముచే( గలిగిన సంతాన విషయముల(జెప్పుచు క్షేత్రబీజములవిషయమునువివరించెను. "సీరాద్రవ్యాపహరణే" (మను. 8, అ 293) వ్యావసాయికపు(బనిముట్లు దొంగిలించిన వానిని దీవ్రముగా శిక్షింపవలెనని యున్నది.

శ్లో॥ వైశ్యవృత్త్యాపి జీవంస్తు
బ్రాహ్మణః క్షత్రియోపివా
హింసాప్రాయాం పరాధీనాం
కృషిం యత్నేన వర్జయేత్
మను. 10. అ 83

బ్రాహ్మణక్షత్రియులు వైశ్యవృత్తిచే జీవించుచునైన భూమిగతజంతు హింసాప్రాయ, వృషభాధీనమగుకృషినియత్నముచే మానవలెను. అన(గా పశుపాలనము, వడ్డి వ్యాపారము బ్రాహ్మణక్షత్రియులు చేయవచ్చునని దీనిభావము.

శ్లో॥ కృషిం సాధ్వితి మన్యంతే।
సావృత్తి స్సద్విగర్హితా
భూమిం భూమిశయాంశ్చైవ।
హంతి కాష్ఠమయోముఖమ్
మను 10. అ. 84

కృషిని మంచి జీవనమని కొందఱు తలంతురు. కాని ఆ జీవిక ఉక్కుతో(గూడిన నాగలిచే భూమిని బగిల్చి తద్గతజంతువులను జంపునుగావున సాధుపురుషులచే నిది నిందింప( బడుచున్నది.

శ్లో॥ కామముత్పాద్య కృష్యాంతు।
స్వయమేవ కృషీవలః
విక్రీణీత తిలాన్ శుద్ధాన్। ధర్మార్థమ చిరస్థితాన్
మను. 10. అ. 90

తిలవిక్రయము నిషిద్ధముగావున ధర్మకార్యమునకు మాత్రమే విక్రయింప(దగును ద్వాదశాధ్యాయ సముపేతమగు మనుస్మృతిలో నొండు రెండుచోట్లు కృషికవృత్తి నుప స్పర్శనము మాత్రము జరిగెను.

మఱియు వేదాంగమైన జ్యోతిశ్శాస్త్రమందు ఏరువాకకు, విత్తులను జల్లుటకును, గృషిచేయుటకును బ్రత్యేకములైన ముహూర్తములు చెప్ప( బడియున్నవి హలచక్రము, బీజఫణిచక్రము మొదలగు విశేషాంశములు గూడ( గలవు. అట్టి ముహూర్తముల యందు( గృషికార్యములు చేసినవారికి సస్య సమృద్ధి, పంటలు పండుట మున్నగు మంచి ఫలములు కలుగునని చెప్ప(బడినది. ఇట్లు వేద, వేదానువాదక వేదాంగములయందు(గల పై సంగతులు వ్యవసాయముయొక్క ప్రాముఖ్యమును జూపుచున్నవి. అన్నదాన ఫలమే యన్నిదానములలో ముఖ్యమని పరాయతము

నందలి రెండవ యష్టకములోని 8 వ పన్నమున 8 వ అనువాకమున స్పష్టీకరింపఁబడినది. ఈ విషయము నారాయణమునందలి డెబ్బది తొమ్మిదవ యనువాకమునను విశదీకరింపఁబడినది. ఇట్టి మహాఫలమునందుటకు హేతుభూతమైనది వ్యవసాయమొక్కటియే యని చెప్పఁదగి యున్నది.

“కృషితో నాస్తి దుర్భిక్షమ్” అనెడిలోకోక్తి కలదు గానియది “ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః” అన్నట్లు ఇందలి కృషి శబ్దము, ఉద్యోగి శబ్దములు ప్రయత్నార్థమును సూచించునేకాని వేఱుకాదు. ఇట్లు సంస్కృత వాఙ్మయమును పరీక్షించు కొనుచుఁబోయినచో ముప్పాతిక మువ్వీసము కర్షకుని గురించి మేలి రకపు భావన జరుగలేదని పిండితార్థము.

త్రివర్ణముగనున్న యార్యజాతులలోఁ గడపటి వారగు వైశ్యులు కృషి, వాణిజ్య, గోపాలనముల స్వీకరించినట్లు గలదు. వ్యవసాయ మొనర్చినవారు ద్విజన్ములగుచో నంత్యజులక్రిందఁ బరిగణింపఁబడుదురని శాస్త్రములు కంఠోక్తిగా నుడివెను. ఆయీకారణములవలన పుష్పగిరి పీఠాధ్యక్షులగు జగద్గురువులు శంకరాచార్యులవారు బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణ విద్వచ్ఛయనులు మొదలగు పండిత ప్రకాండులసమావేశపఱిచిచర్చించి ధర్మశాస్త్రముల నవలోడనమొనర్చి వైశ్యులకు వేదాధికారము లేదనిరి. ద్విజన్ములయ్యు వ్యవసాయ మొనర్చుటచే నట్టియర్హతను గోల్పోయిరని నిశ్చయించిరి. అన్ని వృత్తులలో నిది నికృష్టమైనదని వారి భావన.

## ఆంధ్ర వాఙ్మయము

ప్రాఙ్నన్నయ యుగమునఁ గల యాంధ్రసాహిత్యమంతయు నష్టము, భ్రష్టమగుటచే రైతును గురించి యేమి వ్రాసియున్నదియుఁ దెలియవచ్చుటలేదు. ఒక యుద్ధమల్లుని బెజవాడ శాసనము దప్ప మఱి యితర ప్రమాణములు గోచరింపవు. సామాన్య జాతులవారిలో నెవ్వరానాఁడు కవులై యుండకపోవచ్చు. ఏది యేమైనను నాఁటివాఙ్మయము లభించుటలేదు. ఈ యజ్ఞాత యుగమున సమాచారమేమియు దొరకలేదు.

ఇఁక నన్నయ యుగమున రైతునుగూర్చి కొంచెము కొంచెముగా బ్రస్తావింపఁబడియున్నది.

కం॥ హీనులగు కర్షకులకును
భూనుత ! ధాన్యంబు బీజములు వణిజులకున్
మానుగ శతైక వృద్ధిన
నూనంబుగ ఋణములిత్తె యుత్తమ బుద్ధిన్
(సభాపర్వము)

తక్కువవారలగు లేదా హీనజాతియగు కర్షకులకు నూటికొక రూకచొప్పున వడ్డికి ఋణములిత్తువా ? యనునర్థమిచట సంగతమైనది. పావులూరిమల్లన తన గణితశాస్త్రమున భూములఁగొలుచునపుడు వ్యావసాయికులఁ గొంతకుఁగొంత సుట్టంకించి విడిచెను. కాని దీనివలన రైతులకు, రైతుసాహిత్యమునకేమి ప్రయోజనము లభింపలేదు. ఇఁకఁ దిక్కన సోమయాజి తన భారతముననొండు రెండు పర్యాయములు రైతుల ప్రసక్తిఁ దెచ్చివిడిచెను. అందొకటి మానవుఁడెంత యత్నించినను దైవము తోడ్పాటులేనిది ఫలసిద్ధి నందదను పట్టున రైతులెంత దున్ని దోఁకి భూమిని బాగు చేసినను తఱితో వానలు గురియక పోయిన పంటలు పండవని వక్కాణించెను ఇందుమూలమున రైతునకు మేలుఁ గీళ్ళేమియు లేవు.

ఇఁకనీయుగములోని వాఁడగు కేయూరబాహు చరిత్రకర్త మంచన హృదయము విప్పి నిర్ద్వంద్వముగా, నిస్సంకోచముగా వ్యావసాయిక వృత్తిని బహుధా శ్లాఘించెను.

సీ॥ ఈ లోకమింతయు నాలుగుపాళ్ళలిం
దొకట భిక్షుకులు సోమకులు నొక్క-
పాలు సేవావృత్తి బ్రతికెడువారు వి
ద్యోప జీవికులును నొక్కపాలు
వ్యవహారమాడెడువారుఁ దస్కరులును
నొకపాలు గర్షకులొక్కపాలు
మొదలి పాళలు మూఁడు బిదపటి పాలిన
యనవరతంబును నపహరించు

నపహరించియు నంతంత కవినశించు
నపహృతంబయ్యునది వృద్ధినందుచుండుఁ
గానఁ దగురాజుకలిగిన గరిసనంపు
జీవనముఁ బోలదొండొక జీవనంబు
—కేయూరబాహుచరిత్రము. 3ఆ 309ప

కులగోత్రముల, జననీజనకుల, గ్రామగృహనామముల బయలుబ్బనీక యిమ్మహాకవి యనిదంపూర

ముగా నిట్లు లభిభాషించుట, కర్షకునిపై నింతటి దృష్టి సారించుట సాహిత్యమున నిప్పటికిఁగానము. ఇందలి ధ్వని యపూర్వమని యభిరూపశేఖరుల యభిప్రాయము, ప్రపంచమున జనమంతయు నాలుగుపాళ్ళు. అందు యాచకులు, యాజికులు, ఒకతెగవారు. జీతమున కుండువారు, చదివి జీతమునకుండువారు ఒక తెగవారు. పై పేటు చేయువారు దొంగలు ఒకజాతివారు. రైతులొక్కరొకజాతివారు, పైమూడుతెగలలో నున్నయారురు నాల్గవతెగవాడైనరైతుధనమునపహరించియుక్షీణతనందుచున్నారు. అపహరింపఁబడియురైతు వృద్ధి నందుచున్నాఁడు. కనుక తగు ప్రభువు గలిగిన వ్యవసాయముబోలు మఱియొక జీవనములేదు.

శ్రీనాథయుగమున నెవ్వరు రైతును గుఱించి సుస్పష్టముగాఁదెలిపిన ఘట్టములు గనుపట్టవు. కోడికూఁతలకై పల్లెపట్టులవర్ణించినవారు గలరుగాని జీవనదాతయగు రైతును గూర్చి రచన సాగించినవారు లేరనవచ్చును. కాని విక్రమార్క చరిత్ర కర్తయగు జక్కన, భోజరాజీయకర్తయగు అనంతామాత్యాదులు సూచనప్రాయముగా రైతుల ప్రసంగములఁదెచ్చిరి.

చం॥ చెఱకును రాజనంబుఁ గృషి
చేయుచునుండెడు నేర్పుకల్మియున్
దఱుఁగని ధాన్యముల్ పసుల
దాఁటులు దోటలుఁ గట్టుబండులున్
గుఱుతిడరాకయుండెడు న
గోచరవస్తుచయంబుఁ దేజులన్
దఱుచుగనీను గోడిగలుఁ
దప్పరి శూద్రుల కొప్పు. నెప్పుడున్.
విక్రమార్క చరిత్ర 1. ఆ. 76 ప.

మంచిగోవులను, గొఱ్ఱెలను, గుఱ్ఱములను గలిగియుండువారు రైతులని చెప్పిన యజుర్వేద సంహిత నితఁడు చూచియుండును. ఇందు తోట మాగాణి పశువులు, బండ్లు, గుఱ్ఱములు మొదలగునవి రైతులకు గలవని వర్ణించుట విశేషము.

శా॥ ఆరామంబులు పెక్కుగలును సునా
యాసంబుగానేచి ము
క్కారుంబండునురాజనంబుఁజెఱకున్
గప్పారుపూఁదేనియన్
నీరెల్లప్పుడు నిండియుండుఁ
జెఱువుల్ నిర్మించుచెల్లన్ బురిం
బౌరశ్రేణికి గోకదంబమునకున్
బాధోవిహారార్థమై
విక్ర - 1. ఆ. 90ప.

చం॥ మునిజన....మునుకొని సస్యసంఘముల మోరను గుద్దలిఁగొంచుసస్యము, గుద్దలి పదములు రైతుసంప్రదాయమునకుఁ జెందినవి.

ఇట్లు రైతుప్రసంగ మెలయించెను,

ఛందోదర్పణము, రసాభరణములు రచించి భోజరాజీయమను నపూర్వ కథలసంపుటిని గావించిన యనంతామాత్యుడు రైతుల నొకచో భూషించి మఱియొకచో దూషించెను. వృషభ వర్ణనమును మహాద్భుతముగ గావించెను. "చటుపెనైన రాజనమును జెఱకును గావింపఁగల మహా కర్షకులును" జ 2. ఆ.47) "ఏముకాఁపువార మెద్దుల మేమెఱుఁగుదుము" (భోజ_4 ఆ. 63 ప) కాఁపు పశుతుల్యుడనని చెప్పికొనెను. ఇది కవిహృదయము.

"చెలఁగి కాల్ద్రివ్విన. నిల వ్రక్కలై భుజంగమ రాజు తలల రత్నములుదొప" (భోజ.6.ఆ.315ప.) ఈ సీసపద్యము హృదయంగమమై రైతు జీవికకాధారమగు వృషభరాజవర్ణనమును దెలిపినది.

శ్రీ కృష్ణదేవరాయల యుగమునకు శిరోరత్నము, తొలి ప్రబంధనిర్మాత, ఆంధ్ర కవితా పితామహుడగు అల్లసానిపెద్దనకవీంద్రుఁడు తనమనుచరిత్రమున రైతునకుఁ బ్రధాన స్థానమును గూర్చెను. ఆయీ కారణముల చేతనే ప్రాజ్ఞులు గొందఱు శ్రీ అల్లసాని వానిని రైతు కవియని వాదించు చున్నారు. ఆ విషయముల నిఁటఁదడవ నప్రసంగమగును. శుద్ధ వైదికుఁడు ప్రవరాఖ్యుఁడు మహా కృషీవలుఁడుగాఁ జిత్రింపఁబడెను.

శా॥ శీలంబుం గులమున్ శమంబు దమముం
జెల్వంబు లేఁబ్రాయముం
బోలం జూచి యితండు పాత్రుఁడని యే
భూపాలుఁడీ వచ్చినన్
సాల గ్రామము మున్నుగాఁగొనఁడు మా
న్యక్షేత్రముల్ పెక్కు చం
దాలంబండు నొకప్పుడుం దఱుగ దిం
టం బాడియుం బంటయున్
(మను. 1. ఆ. 55. ప.)

ఇంటఁ బాడిపంటఁగలవాఁడగుటచే వ్యవసాయము పశుపోషణము గలవాఁడని తెలిపెను. మఱియు కుతుపకాలమున విజయం చేసిన సిద్ధుఁడు గృహస్థాశ్రమము నభివర్ణించుచు కాఁపు సంసారి, కుటుంబి యనుసామాన్య శూద్రజాతి పదముల వాడెను.

ప్రవరాఖ్యరూపముతో వరూధిని కడకువచ్చిన కలియను మాయా గంధర్వుఁడు వరూధినిని విడిచి పెట్టఁదలఁచి తన గృహవిషయములఁ దెలుపుచు.

సీ॥ పై పరామరిక చొప్పడమిఁ బక్వము దప్పి
పండఁబాఱిన పొలమెండఁ బాఱెఁ
గట్టఁగాపింప దక్షతలేమి నూరూర
బందెలఁబడిపోయెఁ బశుగణంబు
వంచనామతిఁ బ్రాడ్వివాకులై పటువు లొ
జ్జల కప్పగించిరి చదువులెల్లఁ
గికురించి రిచ్చిపుచ్చుకొను చోటులవార
లాఁకకు లోనుగా కప్పలేక
గ్రహణ సంక్రమణాదుల రాచనగరఁ
గాసు వీసంబు వెడలమి గ్రాసమునకు
నాధివెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని
లెస్సయుండునె గృహకర్తలేని బ్రదుకు.
మను, 3. ఆ. 129. ప

ఇందు మొదటి రెండు చరణములు పొలము, పశువులను దెలిపెను. మధ్య వైదికవృత్తిని దెలిపెను. కొసకు క్షేత్రములలోని గొన్నింటిని గుదువఁ బెట్టినట్లు దెలిపెను. ఇట్లులాద్యంతముల రైతు జీవనమును విశదీకరించెను.

మను చరిత్ర కావ్యారంభమున శ్రీమన్నారాయణుని వక్షస్థలమున నున్న కస్తూరిని సనందనాది నిజభక్తశ్రేణి కమలా సమీపమున నున్న భూదేవిగాఁ దలచెను. భూమిపై నీతనికెంత యభిమతమున్నదో స్పష్టమగుచున్నది. అరుణాస్పద పురవర్ణనమున "అచటి నాలవ జాతి హాలముఖాత్తవిభూతి నాదిభిక్షువు భైక్షమైన మాన్పు" నని రైతులుధనపతికన్న మిన్నలని విశదీకరించెను. కావ్యము కొసనుండి ప్రాముఖ్యమును వెలయించు భరతవాక్యమును సైతము — "వానలు పరవితో వర్షించె. సస్యముల్ వేళ్ళఁ గొల్పుగ విఱ్ఱవీఁగిపండె" స్వారోచిషమనువు రాజ్యపాలనమున తఱినసరించి కురియువానలతోఁబైరులు మిక్కుటముగఁ బండెనని తెలిపెను. ఇట్లు పెద్దన రైతు మీఁది సానుభూతిని వేయిమడుంగుల వెలయించెను. మంచనపిమ్మట రైతుపై నభిమానము గలవాఁడు పెద్దన యనియే చెప్పనొప్పును.

ఆంధ్రవాఙ్మయమున సుస్థిర స్థానమంది సర్వవిధముల సుకవియని శ్లాఘింపదగిన మహామనస్వియగు పింగళిసూరన తన కళాపూర్ణోదయమున మాగాణి తోటల నభివర్ణించెను.

చం॥ చెఱకును రాజనంపు వరి
చేలును దట్టపుఁబోకమ్రాకులుం
దఱచగు పూవుఁదోఁటలును
దమ్మి కొలంకులు నేటి కాల్వలుం
బఱపగ నారికేళవన
పంక్తులు మామిడి తోఁపులుంగడున్
మెఱయుచు నాత్మకున్ ముదము
మెచ్చును నచ్చెరువున్ ఘటింపగన్
కళా-ద్వి-143 ప.

మణికంధరుఁడు తీర్థయాత్రలఁ గావించుచు చోళమండలమును బ్రవేశించెను. అఁట నాత్మకు ముదము, మెచ్చు అచ్చెరువు, ఘటించు సకలవిధములగు వ్యావసాయిక క్షేత్రముల సందర్శించెను. ఈ చూచినది కల్పిత పురుషుఁడగు మణికంధరుఁడు కాక సూరన యని మనకు దృగ్గోచర మగును.

ఇందే కళాపూర్ణునకు తలిదండ్రులకు సుగాత్రీశాలీనులు తోఁట పనివారుగా మెలఁగిరి. సామాన్య కర్షక జీవిక ఇందు పొడగట్టును. స్త్రీ పురుషులు తోఁట పనులు చేయు విధమును తలస్పర్శిగా గావించెను.

సీ॥ నీ రెత్తువేళల నీరెత్తుఁ బాదు పా
దునకుఁ గాలువలు పొందుగ నమర్చి,
త్రవ్వటంబుల తఱిఁ ద్రవ్వటంబులు వెట్టఁ
దగినట్టి కఱ్ఱు గుద్దలి గడించి,
యెరువుఁ జల్లెడు వేళ నెరువుఁ జల్లు గతాభి
మానుఁడై గంపలఁ దాన తెచ్చి
యంట్లొత్తు పదనున నంట్లొత్తు, నెలమిఁగా
న్పించులేఁ గొమ్మలు వంచి వంచి,
గీ॥ నారు వోయంగ వలయుచో నారువోయుఁ,
గొమ్మనాటంగఁ దగునెడఁ గొమ్మనాటు,
నొకటి నిసువక, యంతకంతకును హెచ్చు
హాలితోడను శాలీనుఁ డవిరతంబు—
కళా-చతు-78 ప.

ఇప్పట్టున రెండు, మూఁడు పద్యములు కవితకు గరిసెనమునకు అవధిగా రచించెను. ఇంతతో విడువక స్త్రీలు తోఁట పనులొనర్చు నప్పటి జానపద శృంగారమును ఇంపితముగా మధురముగా ఒనర్చెను.

సీ॥ తోరంపుఁ జనుదోయి తుళ్ళింతల నిడంగఁ,
దగుచోట్లు గుద్దంటఁ ద్రవ్వి ద్రవ్వి;
వేఁగైన పిఱుఁదు బల్విడిఁ జలింపంగను,
వడి నిట్టునట్టును నడచి నడచి;
యడుసు తుంపురు చెక్కుటద్దంబులను బర్వ.
మళ్ళకు మడవలు మార్చి మార్చి;
నడుము లేఁదీవియ నకనకల్ గుడువ, నిం
పున దగు మోపులు మోసి మోసి;
తే॥ చిఱు చెమటఁ బేర్చు వింతక్రొమ్ముఱుఁగు తోడఁ
గొమరు మేనొప్ప సారెకుఁ గొప్పు కదల,
నేమిటికినైనఁ దామున్న యేఁగి యేఁగి,
యెల్ల పనులు నొనర్చి రింపెసఁగ మెసఁగ.
కళా-చతు-98 ప-

వ్యాసుని ద్రౌపదికి, తిక్కన ద్రౌపది కున్నంతభేదము తోఁట పనులొనర్చు కాళిదాసు శకుంతలకు సూరన సుగాత్రికి కలదని యభిజ్ఞుల యభిప్రాయము. మహాకవి కాళిదాసు మేఘసందేశమున మొదటి సరలో పదునారవ శ్లోకమున జనపద వధూజనము భ్రూవికారానభిజ్ఞలని యనినను రీతిస్నిగ్ధలని శ్లాఘించెను. ఈ సుగాత్రి మాత్రము సర్వకార్యముల ప్రౌఢ యైనట్లు సూరన చిత్రణమున గన్పట్టుచున్నది.

ఇఁక అష్టదిగ్గజములలో నొకఁడై రాయల సకల కథాసార సంగ్రహానువాదక ర్తయై రామాభ్యుదయ రచయితయగు రామభద్రకవి ఆమని వర్ణించుచు వసంతుని రైతుగా సొగసుగా వర్ణించెను.

సీ॥ భూరి కాంతార కేదారముల్ సమకట్టి,
కోడె గాడ్పుల జంటఁ గూడఁ గట్టి
పెలుచగా తాకు బెల్లులు పెల్లగిల దున్ని
తలిరాకు డాలు నీరలవరించి
కలికాంకురంబుల మొలక నారులు నాటి
వెలిగ జాదుల సొంపు కలుపు తిగిచి
కాపుగా సుకుమార కలకంఠి నియమించి
యాయాతరులఁ ద్రోదిసేయనేర్చి
గీ॥ నమ్మిక వసంతుఁడను పేరి కమ్మతీఁడు
నెఱయనెల్లెడ వలరాజు కఱవుదీఱ
సౌర । యామని వచ్చె నాహా యటంచు
జగము తనియంగఁ బుష్ప మంజరులు పండె,
రామా-ప్రథ-51-పద్య

సీతాదేవితో శృంగారకేళి సలుపు శ్రీరామచంద్రుఁడు వివిధబంధవిశేషంబుల పారవశ్యమంది కౌగిటఁజిక్కియలిన మాటలు అత్తయగు భూదేవిని దృష్టియం దిడుకొనినట్లున్నది. ఉపమానమున ప్రత్యేకమంతగా లేకున్ననుఉచితముగా సస్యశాలినియగు క్షేత్రము నభివర్ణించుట మెచ్చఁదగినది.

ఉ॥ పంట వలంతికిం బొడమి
భాసిలు సీతవుగానఁజేలతో
నంటిన ఘర్మవారిఁ బద
నైపుల కోదయ సస్య సంపదన్
గెంటక యుక్కి నీక తగు
నేఁడిట నా వ్యవసాయ మేర్పడెన్
గంటి నిరంతరానుభవ
గౌరవ సౌఖ్యముఁ బండెఁ గోరికల్
రామా. చతు-176 ప

ఇట్లు ఆంధ్ర ప్రబంధముల యందు కంట వత్తిడుకొని చూచిన-కృషికుల విషయములు కానుపించును. సాహితీ రసపోషణుఁడగు రామరాజ భూషణుఁడు వసు చరిత్రమునఁ గృత్యాదిని-

మ॥ బలి చూడామణులందు విష్ణు పదజుల్
పాటించు ధాన్యంపుఁ దీ
ప్పలు చంద్రామృత సాంద్రసేకమునఁ బై
పై మోసు లెత్తంగఁ ద
త్కల మాంకూరము మేయుచున్న నేల జిం
కన్ సారె వారించు వా
రలతోఁ బుట్టువు గంగ పద్మముఖ ని
ర్యద్భృంగ నాదార్భటిన్
వసు-1 ఆ-పద్య-

ఇందర్ధ చమత్కార మెంతయో కలదు. అన్నిటికన్న మిన్నగా వారల తోఁబుట్టువు గంగయని పలుకుట రైతుజాతికి సువర్ణాభిషేకము వంటిది. దీనిని మనమున నిడుకొని చేమకూర వేంకటకవిరాజు విజయ విలాసమున "సహజోదంచత్కులోత్పన్న నాయక రత్నం

బని" రఘునాథ రాయల ప్రేమతోఁజూచుననిఁ వర్ణించుట శ్లాఘా పాత్రము. ఈ వసు చరిత్రముననే భరత వాక్యమున తన కర్తకత్వమును సంపూర్ణముగా వెలయించెను.

సాహితీ సమరాంగణ సార్వభౌముఁడగు శ్రీకృష్ణదేవరాయలు ప్రబంధ యుగమున కథినేత. తన మాతృదేవియగు నాగాంబ రైతు జాతియందుద్భవించుటచే నితనికి వ్యవసాయముమీఁదను వ్యావసాయి కుల మీఁదను మిక్కిలి గౌరవము గలదు. కనుక తన ఆముక్తమాల్యదయందు బహుధా కర్షక వృత్తియభివర్ణింపఁబడినది. మెట్ట వ్యవసాయము మాగాణపు వ్యవసాయము, తోఁటల పెంపకమును గూర్చి ఇతఁడు వివరించిన విషయములు సామాన్య రచయితలకు గోచరించునవి కావు. "రైతు లేనిదే రాజ్యము లేద"ను సూక్తి వీనివలన సుద్భవించినదేమో ? ఈ ప్రబంధ యుగమున రైతు జాతి నీసడించి బ్రతుకగల కవిగాని సామాన్య పౌరుడుగాని లేడనుటలో విప్రతిపత్తి యేమాత్రము లేదు. రాయల రచనల పరిశీలింతము.

కం॥ కోరకిత నారికేళ॥
ఙ్మరుహములు రత్నకుట్టిమంబులఁదోపఁన్
(1-55)

ఇందు మొగ్గదొడిగిన కొబ్బరి చెట్ల నీడలు ముగ్గు ఘటించినట్లున్నవి. ఉత్ప్రేక్ష గలవారికే ఈయుత్ప్రేక్ష చిక్కును.

మ॥ తలఁ బక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కే
దారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకులు
షస్స్నాత ప్రయాత ద్విజా
వలి పిండీకృత శాటి కల్పవిఁదదా
వానంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గన్వెసఁ బాఱువానిఁ గని న
వ్వున్ శాలి గోప్యోఘముల్ (1-65)

ధర్మబోధకు వ్యంగ్య మర్యాద కీ పద్యము అవధి. పై కులములవారు ధర్మభ్రష్టులుగాని నాడు దిగువ కులములవారు ధర్మతత్పరులై యుందురు సుమా ! అను హెచ్చరిక దీనఁ గలదు. రైతులే కాక వారికడ పని చేయువారు నిష్ఠాగరిష్ఠులని తెలిపెను.

66 వ, పద్యమున వడ్ల భేదములఁదెలిపెను. 67 వ పద్యమున వరి వెన్నులు బలము గలవవుటచే వంగి నేలకానెనని తెలిపెను. 68 వ పద్యమున వేరు పనస కాయలు భూమిలోనే పండి పగిలి తేనె లుబుక చేయుచున్నవని భిన్న కట గజములట్లున్నవని ఉత్ప్రేక్షోపమల తన సామర్థ్య మును వెలార్చెను. 69 వ పద్యమున కర్పూరపు టరటి వాసనల గుమాయింపఁజేసెను. 70 వ పద్యమున చెఱకు గానుగలు బెల్లము వండుటలు ప్రధానముగ వర్ణించుచు అంతికస్థములగు ఆకు దోఁటల నభి వర్ణించెను. 71 వ పద్యమున పురాతన తీర్థ కుండములలోని చేఁపలు వానిఁదినుటకై వచ్చిన నీరు కోళ్ళు తత్తీరమునఁగల మామిళ్ళు స్వభావోక్తితో వర్ణింపఁబడినవి.

తాను వర్ణింపఁదలచిన విల్లిపుత్తూరులో జాతి వర్ణనముఁగావింపక శైవాచార పరుఁడగు పాండ్యరాజు నగరమున చాతుర్వర్ణ్యము వారిని వివరించెను. అందు

గీ॥ నృపుల పదహల రేఖల కెల్ల మా భు
జాగ్ర హల రేఖలే మూల మనుచుఁగోటి
కొండలుగ ధాన్య రాసులు పండు వీట
సుజన భజనైక విఖ్యాతి శూద్రజాతి
(ఆ ము 2-36 పద్య)

"శూద్రస్య శుశ్రూషా ఇతరేషాం వర్ణానాం" అని ధర్మ శాస్త్రము ఘోషించుచుండ సుజన భజనైకఖ్యాతిగలదై శూద్రజాతి ఉన్నదని చెప్పుట ఒక ప్రత్యేకత. మా భుజాలమీఁద నాగలిరేఖలుండుట వలననే రాజుల పాదముల హలరేఖ లున్నవని యనుట రైతు సంతుష్టుఁడగుట లోక కళ్యాణమునకు మూదల.

గీ॥ పగయు వగయును లేక యేపాటి గన్న
నలరు సామాన్య సంసారి యగుట మేలు
3-42 ప.

సామాన్య సంసారులు పగలు వగలు లేక నిత్య సంతృప్తులై యుందురని రాయల మేలి సంభావన

గీ॥ సమ్మద దిదృక్షు ఖస్థ రక్షఃపిశాచ
పుంజ మహిభుక్పత్త్రి ప్రభంజనములు
సోఁక వెఱఁబాఱెఁ గళ్యాన శూర్ప వాత
ఘట్టనలఁబాదు పెనుఁబొల్ల కట్టువోలె
4-13 ప.

ఆకాశమున ఉత్సుకతతో చూచుచున్న రక్షఃపిశాచ పుంజము గరుడుని రెక్కల గాలిసోకినంత చేట గాలి

తగిలి కళ్లాన తరకలు పోవునట్లు పోయిరని దీని భావము. కళ్ళములలోని తూరుపారను తేటగా తెలిపెను 4-97 లో ఈతి బాధలలో నొకటగు అతివృష్టి భయము లేకుండునట్లు సూర్యుని చుట్టు పరివేషము కట్టు కట్టినట్లున్నదని తెలిపెను. వెల్లువలకుఁ గట్టలు కట్టియాపుట ప్రభుత్వ ధర్మమని స్పష్టీకరించెను.

ఉ॥ కాలని దున్న నందినయి
గంటలు దున్నక మంటినా, మహా
కాలుని నంది దున్ననయి
కర్దమ మగ్నత లేక మంటినా,
హాలికు లెన్నఁడుం దెగని
యౌరుల చేలును జొక మళ్ళనుం
గా,లలినేరు సాఁగిరిలఁ
గల్లు పసింగొని పేద మున్నుగన్
(4-124)

సమృద్ధియగు వర్షముచే పల్లపు నేలను మాత్రమే కాక మెఱకచేళ్ళగూడ మెత్తబడి నందున ఒక్కసారి దుక్కి పదునైనది. యమునిదున్న తాను నందినై యున్న సేద్యగాండ్రు తన్నుం దోలుకొని పోయి నాగటికిఁ గట్టి యౌరు గంటలు దున్నింతురు. నందిని కానందున నాజోలి రైతులు రాకున్నారనియు ఇఁక శివుని నంది తాను దున్నయై యుండిన జొకు మళ్ళలో దమ్ము దున్నించి యుందురనియు తలచిన వనిభావము. ఏఱు సాగునపుడు అఱక కొక యెద్దుగా గట్టి వ్యవసాయము సాగించిరనియు భావము.

కం॥ వరఁజుబడి రొంపిఁద్రొక్కం
జరణంబులఁజుట్టి పసిఁడిచాయకడుపులం
బొరినీరు కట్టెలమరెను
బిరుదులు హాలికులుదున్నఁబెట్టిరొ యనఁగన్
(4-125)

బురద దుక్కిలో గట్లవెంటరైతులు దున్నుచు, పోవుచుండ నీటిపాములు వారి కాళ్ళకు పెనవేసుకొనినవి. బంగారు వన్నెకల కడుపులు వెలికగపడునట్లుచుట్టుకొనుటచేదుక్కిదున్నుప్రాగల్భ్యమునకుమెచ్చి పుచ్చుకొన్న బంగారపు గండ పెండారములా యనునట్లున్నవనిఉత్ప్రేక్షించెను. లలితకళలలో నేర్పరులగు వారికి గండపెండారము లిచ్చుచుండ రైతుల కెవరీయకున్నను భూమాతయే యొసఁగిన దని తన మక్కువ నెల్ల స్పష్టీకరించెను.

మ॥ వసతుల్వేల్వడి, వానకై గుడిసె మో
వన్‌రాక తా నాని యే
పసగా నిల్చిన జమ్ము గూడఁ బొలమం
బళ్ళోంచుచుం బట్టి పె
న్ముసురు న్నీఁగెడు కాఁపు గుబ్బెతల పె
న్బు బ్బ ల్బు నాన ల్వేలిం
బిసికిళ్ళం బిసికిళ్ల హాలికుల క
ర్పించె న్న భస్యంబునన్
(4-133)

గ్రామిక జాతులగువారిలోను చేతి వృత్తుల వారిలోను బ్రతుకు మగవారికి వారి యాడు వారెంతయో సాయ పడు చుందురు. ఇంత నేమియు దోఁపక దైవ వ్రతములతో యెట్లో కాలక్షేప మొనర్చుకొను ధన వంతుల ఇల్లాండ్ర వలె వీరుండరు. భర్త చేనికడ గుడిసె వేసుకొని యుండ వర్ష కాలమున భార్య జమ్ము గూడతో చద్ది నెత్తుకొని వచ్చి గూటి వాకిటికి గూడ నుంచి భర్తచేతికి చద్దిమూట నందియ్య అంతకు ముందు జొన్న ఊచబియ్యము పిసికిళ్ళు పట్టియుంటచే ఇపుడా గుబ్బెత గుబ్బల పిసికిళ్ళు కావించెను. గ్రామీణ జీవనమెంత విశిష్టమైనది.

ఈ పద్యమునందలి పునాసలను పునాస పంట యందురు. ఈ పెరు పునర్వసు నక్షత్రమున వేయుటచే దీనికి పేరు కలిగెను. నుఱుచు ధాతువునుండి నుఱిపిడి కలిగినట్లు పిసుకు ధాతువునుండి పిసికిడి కల్పించుకొన వచ్చును. ఏదియేమైనను నుఱిపిడి - నుఱుపిళ్లు - పిసికిడి - పిసికిళ్ళు ఇత్యాదులు రైతు జాతి సొమ్ములు. ఎంత కష్టించినను రైతుకు లభించునది అంబలి మాత్రమే కదా! యని రాయల నిర్వేదము.

ఉ॥ రాజః శాలివనే శరావలీ వై జననంబు" వరిరెల్లు పుట్టుకనెల శరత్కాలమని తెలిపెను. 140 వ పద్యమున వరిచేలకై మింట పరుగెత్తుచున్న చిలుకల గుంపుల, సందుల నుండి సాంధ్యరాగమునందిన తెల్లని మబ్బులు పచ్చని ఆకులలో పండబాఱిన దోసపండ్లు గల తోటలపై తుమ్మెదలు వాలినట్లున్నవని వర్ణించెను. ఇట్టి వర్ణన రైతు కవిగాని యెవ్వడు చేయలేడని తెలియుచున్నది. 141 వ పద్యమున జనుపనారను గూర్చి తెలిపెను. 144 వ పద్యమున నారాయణుడు నిద్ర లేచి శేషతల్పమునువీఁడి భూమిపై నడుగిడ భూ దేవి

పుల్కరించినట్లుగా వరివెన్నులున్నవనిఉత్ప్రేక్షించెను. 152వ పద్యమున చెఱకు తోటలను వర్ణించెను.

గీ॥ "దరులు తడివండు బొదువు మూపురములంటు
తెల్లు గంటల నాఁబోతు లుల్లసిల్లె"

తీరములందలి తడివొండు క్రమ్మెడి మూపురములు గల గిత్తల జూచినప్పుడు రాయల తనువు పులకించి యుండును.

గీ॥ గూండ్లకై శాలి మంజరులొనుచు, మూగి,
యంబరంబునఁ బఱచు కీరాళులొప్పెఁ,
బసరు టొందొంటియాకుతోఁ బండఁబాటి
ఛేదభయమున నెగసిన చేలనంగ.

(4-162)

కోఁతకువెఱచి చేలు ఆకసమున కెగసినట్లున్నవని దీని భావము. ఈవర్ణన మత్యద్భుతము. 163వ సీసపద్య మున స్త్రీల కుపమానములుగ చెఱకు తోటలు వరి పైరులు చెప్పుట గమనింపదగిన విషయము. 164 వ తేటగీతిలో గడ్డివాములు కొండలవలె ఆకసమును వఱయు చున్నవని దీని భావము. దీని వలన గొప్ప రైతులు గలరని ఇతని భావన. 165 వ పద్యము వరి గోసి దున్నిన భూమిని రామాయణ పరముగ చిత్రించెను. వీర వైష్ణవ కవియగు నీతఁడు ఉపా సించు రామాయణమును దున్నిన భూమిగ వర్ణించుటచే దీని యందెంత ప్రీతి గలదో తెలియు చున్నది. 168 వ పద్యమున పశు పోషణ విశిష్టతను దెలిపెను. 169 వ పద్యమున వయసు వచ్చిన వృషభరాజముల వర్ణనము గలదు. పశుపోషణమున రచయితకు తనివి తీరనట్లున్నది.

"మును దన సీమ" (4-219) ఈ పద్యమున ప్రభు కృత్యమునకు రైతు కృత్యము సామ్యము గావించి రైతును రాజు నొనర్చెను.

తే॥ దేశవైశాల్యమర్థ సిద్ధికిని మూల
మిల యొకింతైన గుంటకాల్వలు రచించి
నయము పేదకు వరిఁగోరునను నొసంగి
ప్రబలఁజేసిన నర్థ ధర్మములు వెరుఁగు."

దేశమెంత విస్తీర్ణముగ నుండిన అంత ఆదాయము వచ్చును. ఆదాయమున గాను యెంత చిన్న భూభాగ మందైనను జలాధారములు నిర్మించి పరిశుభ్రముగ పంట కాల్వలుత్రవ్వింప వలెను. బీదరైతులకు ధన రూపమైన ధాన్యరూపమైన పన్ను విషయమునసులువు కలిగించి పేదలు వర్ధిలునట్లు చేయవలెను. దానివలన రాజ్యమున అర్థ ధర్మములు పెరుగును. ఈ ధర్మ మావంతయును నేఁటి ప్రభుత్వములు తలపోసిన ప్రజల కెంత మేలు చేకూరునో, గదా ! ఈ రాయల రాజనీతి పరిపాలన దక్షతకు పెట్టని కోటయై విరాజిల్లు చున్నది.

గీ॥ ప్రజనవసి చన్నఁబిలువ, కప్పసులఁగొలుచు
నమ్మి, యిండ్లింధనమ్ముల కాయె, ననెడి
కలనినకైక్కొన యధికారి గల నృపతికి
నేడు దీవులగొన్న సమృద్ధిలేదు

(4-232)

నష్టపడి వ్యవసాయమును మాని పశులను ఇండ్లను విడచి పోవు జనులను ప్రభుత్వాధికారులు ఉపేక్షించి చూడరాదు. వెంటనే ఆ నలిగిపోయిన రైతులకు సాయపడి సేద్యమునకు వలయు ఋణముల నొసగి కోలుకొనునట్లు చూడవలెను. అంతేకాని వారి పశులను ధాన్యమును అమ్మి పూరిగుడిసెల కలపను వంట చెఱకుగా నుపయోగింపవచ్చునని సంతసింప రాదు. అట్లు సంతసించిరేని ఉద్యోగులు అధికారు లగుదురేకాని అధికారులు కారు. ప్రజల కేనాడు ప్రభుత్వము గాని అందున్న ఉద్యోగులుగాని చేటు గోర రాదు. ఆహా ! ఇది యెంతటి రాజనీతి. ఇట్టి పరిపాలన మున మనిన ప్రజలెంత ధన్యులు. 245 వ పద్యమున ప్రభుత్వము వ్యాపారము నెట్లు చూచుకొనవలయునో అట్లే తోట దొడ్డి గనుములఁ జూచుకొనవలెనని దీని భావము. 248 వ పద్యమున ప్రజలను బాధపెట్టి శిస్తు వసూలుచేయరాదని దీని భావము. 282 వ పద్యమున ధర్మార్థ కామములను వానిలో ధర్మమున కెక్కువ వ్యయ మాయెనా పెరుమడికిడిన నీరు రాజనపు మడి కిడినట్లే మేలగునని భావము. ఈ యుపమాన మత్య ద్భుతమైనది. రైతుపై భూమిపై రాయల కెట్టి యభి ప్రాయము కలదో తేటతెల్లమగుచున్నది.

మున్ను రామాయణమును దున్నిన భూమిగ భావించిన ఈ మహాకవి 5-114వ పద్యమున మలయమారుత మును కర్షకునిగ నిరూపించెను. మెట్టవ్యవసాయమున గొఱ్ఱు చెక్కలకు బెజ్జములు వేసి జడ్డిగముతో వెద పెట్టెదరు. జడిగపు పిడతలో వేసిన విత్తనములు కుప్పలు పడక జాలుగా గింజవెంట గింజ పడి అచ్చన

గిల్లలవలె మొలుచును. ఈ విషయము నింత అనుభవముగల రైతు పెద్దగా దెలిపెను. ఇతరుల కిది వల్లమాలిన పని. ఇఁక 5-122 వ పద్యమున మరు లింటికి గుణద్వయ చమత్కృతిని గల్పించుచు చెఱకు తోటల నందు నిరూపించెను. ఈ రీతి ఆముక్తమాల్యదలో రైతుల గుఱించి విశేషము లెన్నింటినో విశదీకరించెను. ప్రపంచ వాఙ్మయమున ఇంతటి రైతు పక్షపాతము గలిగిన కవి మఱియొకఁడు లేడని జయభేరి మ్రోగింపవచ్చును.

ఓర్పుతో,నేర్పుతో పరిశీలించిన దక్షిణాంధ్ర యుగమునను కొంతకు కొంత కర్షక వాఙ్మయము లభింపగలదు. తంజావూరు ప్రభువుల కాలమున కృతులలో శృంగారమునకే ప్రథమ స్థానముఁ గలదు. కాని యప్పటున రైతును ఈసడింపలేదు. హంసవింశతి కర్తయగు అయ్యలరాజు నారాయణామాత్యుఁడు రైతుల ఆచార వ్యవహారములను రైతు కాంతల పని పాటులను తెలియఁజేసెను. పాలవేకరి కదిరీపతి తన శుకసప్తతి గ్రంథములో అఁటనఁట కర్షక సంప్రదాయముల ఎఱిగిఁచెను ఇది పూర్వవాఙ్మయమునఁ గల రైతులఁగూర్చిన విషయములుగల దిఙ్మాత్రము.

## నవ్య యుగము

ఈ నవ్యయుగమున మునుముందు రైతునకు నీరాజనమెత్తిన కర్షక కవి దువ్వూరి రామిరెడ్డిగారు. కవితా హృదయముతో ఆవేదనముతో తమజాతిపూర్వోన్నత్యమును, నేఁటి దయనీయ స్థితిని కనులారఁగాంచి పరితప్త హృదయుఁడై కృషీవలులఁగూర్చి గంటము నెత్తెను. అతఃపూర్వము కొలఁదిగా ప్రక్షిప్తములుగానున్న విషయములను మనమునందిడుకొని రైతునకుగా ప్రత్యేక కావ్యరాజమల్లెను. ఈ గ్రంథమునకు పీఠిక రచించినవారు విమర్శకాగ్రేసరులు, కవిత్వ తత్త్వ విదగ్రణులు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు. "కవి కాఁపు యువకుఁడు. విషయము కాఁపుల జీవితము. దృష్టి అభిమాన ప్రేరితము. కృషీవలుల జీవితమును ప్రధానాంశముగ గ్రహించిన తెనుఁగు గ్రంథములలో నిదియ మొదటిది." అనిరి.

తమ శ్రమముతో తాము జీవించువారు కవులయిన నాఁడు సిసలయిన కవిత రాఁగలదు. విదేశములలో శ్రామికులు కవులై తమ జాతినిఁగూర్చి తాము కావ్యములు విరచించుకొనిరి. అవి తమ వారి కెల్ల హృదయ స్పందనము కావించినవి. ఆ దృష్టితోనే నేను "రైతులఁ గూర్చి వ్రాయు కవిరాజులు నీ తెగయైన నాఁడు" గాక మెఱ మెచ్చులకు వ్రాయ ఫలమేమిఁ గలదంటిని. ఈ ఆధునిక కర్షక వాఙ్మయ విధాత శ్రీ దువ్వూరి రామిరెడ్డి గారి తరువాత ఎన్నదగిన వారు తెలుఁగు లెంక, కళాప్రపూర్ణ, తుమ్మలసీతారామమూర్తిగారు. వీరు రైతులై ప్రత్యేకముగా గ్రంథము వ్రాయకున్నను పెద్దకాఁపు, పఱిగపంట మొదలగు వానిలో తమ రైతు తత్వమును వెలార్చిరి. అందు సంక్రాంతి తలఁపులు చిరస్మరణీయములు.

## భానోదయము

ఈ నవ్యయుగమున పొటమరించిన వెలుఁగున కావల స్వతంత్ర భానుఁడు తన సహస్ర కరముల చాఁచుచు ఏతెంచెను ఆ మహాకవియే కవి బ్రహ్మ ఏటుకూరి వేంకటనరసయ్య. సంపూర్ణ కర్షకవాఙ్మయ బ్రహ్మ శ్రామికజాతి రచనావిధానమును వెలయించిన నవ కవిబ్రహ్మ,జానపదులలోనలిఁగి చికిలీ చేయబడిన మూల మూల జాతీయముల నెల్లవెలికిఁదీసి నూతన వికాసమును చేకూర్చిన ఆధునిక బ్రహ్మ. బ్రహ్మ వాదుల కెదురీఁది విశ్వమానవతా వాదమునకు గళమెత్తి బ్రహ్మ గీతముల నాలపించిన నవీన బ్రహ్మ. రైతు జాతీయులగు బ్రహ్మన్న, నాగమ్మల సాధు చరిత్రలనే రచించి భారతమునకు ప్రతి భారతముగా కవి బ్రహ్మకు ప్రతికవిబ్రహ్మగా నిలువఁబడిన కర్షక బ్రహ్మ. వాఙ్మయ సమాధిలో నిలిచి నిలువెల్ల రంగరించి పలుకుబడులకు మేనులు పులకరింప సాహిత్య యజ్ఞ మొనర్చిన భాషా సోమయాజి కర్షక జనముల పాలిటి కామధేనువై సాహితీ రంగమున అవతరిల్లి బ్రహ్మీభూతుడైన వేంకట నరసయ్యగారు అనిదం పూర్వముగా క్షేత్రలక్ష్మిని క్షేత్రలక్ష్మిగా వెలయించిరి

సీ॥ కాసెవోసి బిగించి కట్టిన మొలపంచ
కుచ్చిళ్ళు పొక్కిటఁ గుస్తరించి
పంట్ల బర్వున తాటిబ్రద్ద జొ జొ వాడ
బుజముపై కావడి పొందుపఱిచి

వారవంపుగఁజుట్టి వదలిన తలగుడ్డ
నడలుచున్న కొలంది చక్కఁబెట్టి
ముంజేతిపై వెండి మురుగదేపనిగ జాఱ
పలుమారు వ్రేళ్ళతోఁ బదిల పఱిచి
ఆ.వె॥ కాళ్ళు తడఁబడంగఁ గండలు సుడియంగ
నడుమువంగి పొట్టముడత వడగ
పండ్లు బిగువు గూఱి పరువెత్తుచున్నాఁడు
జాలిగొలుపు ముసలి కూలి బాబు.

ఇది క్షేత్రలక్ష్మిలోనిది. కూలీలూ, రైతులూ సమాజ రథమునకు రెండు బండి చక్రముల వంటివారు. వీరికి పరస్పర సహకార మవసరము. మాగాణి మెట్ట వ్యవసాయముల ఈ క్షేత్రలక్ష్మిలో స్పష్టీకరించెను. హలము కలము పట్టిన ఈ కవి తన రచనలనెల్ల ప్రధాన వస్తువులుగా కర్షకులనే గ్రహించెను. ప్రేమాలోక మను గ్రంథములో ఒక రైతుకుటుంబపు కరుణామయ గాథను చిత్రించెను.

"రాయఁడెటు చూచినన్ కత్తి భాయిగాఁడు అతని పెండ్లాము అయిదాకు లదన మింక" అని అచ్చపు తెనుఁగుఁదనమును విజ్జి రాల్చెను. ఇట్లు రైతు కవిగా పుట్టి గిట్టెను.

నేను నా పదునాలుగవ యేట కవిత్వమునకు శ్రీకారము చుట్టితిని. పూర్వ పూర్వమున నున్న స్వాములఁ గూర్చిన శతకముల నెల్ల తిలకించి ఆసామినిఁగూర్చి శతకము లేదని బాధ నందితిని. ఆ బాధామయ భావముల నుండియే కర్షక శతకము సముద్భవించినది. ఆ శతకమునకు పూజ్య పాదులగు ఆచార్య రంగా గారు పీఠికను వ్రాసిరి.

చ॥ "భువిఁగల పండితోత్తములు
పొందుగ నీ కథ లెవ్వరేనియుం
దివిరి వచింపఁ బోరు పరదేశ
నివాసుల బాధచేత నీ
వవిసి కృశించి పోయితి కదా!
ధన ధాన్యము లెల్ల నందఁగాఁ
గవుల కలాలు డబ్బుగల గాడిదకే
బలియయ్యెఁ గర్షకా."

అని 1932 లో రైతులోకమున కొక విన్నపము చేసికొంటిని. రైతులు కనులు విప్పుదురు గాత—

—కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ—



# ఆధునిక తెలుగు సాహిత్యం - ప్రమాణాలు

'పురాణ మిత్యేవ నసాధు సర్వం
న చాపి కావ్యం నవమిత్యవద్యం'

అనే కాళిదాస సాహిత్యపరంగా వెలిబుచ్చిన అభిప్రాయం నేటికి అన్వయిస్తూనే ఉన్నది.

సాహిత్యం ప్రాచీనమని, ఆధునికమనీ, కాలాన్ని బట్టీ, తత్వాన్నిబట్టీ రెండు విధాలు.

ప్రాచీన సాహిత్యం అంతా ఉత్తమమైనదనీ, నవ్య సాహిత్యం అంతా అప్రశస్తమైనదనీ చెప్పే వాళ్ళ ధోరణి ఒకటీ – ప్రాచీన సాహిత్యం బూజు పట్టిందనీ, నవ్య సాహిత్యమే చైతన్యవంత మైందనీ చెప్పేవాళ్ళ ధోరణి ఒకటీ – నిరంతరం సాహిత్య రంగాన విన్పిస్తూన్న విపరీత ధోరణులు. ఈ రెండు ధోరణులూ పక్షపాత ప్రేరితాలు. రెండూ పాక్షిక సత్యాలు.

ప్రాచీన మైనంత మాత్రాన ఆ సాహిత్యమంతా ప్రామాణికమనీ, ఆధునిక మైనంతమాత్రాన అప్రామాణికమనీ అనడం సమంజసం కాదు.

కోప తాపాలుమాని, రాగద్వేషాలకు లోనుగాక, పక్షపాత దృష్టితోగాక, సాహిత్య విమర్శకు లాయా యుగ లక్షణాలను సాంఘిక స్థితిగతులను, అభిరుచులను సాకల్యంగా గ్రహించి తాత్వికదృష్టితో సహృదయంతో, సానుభూతితో ప్రాచీన ఆధునిక సాహిత్య సమీక్ష చేయడం అత్యంతావశ్యకం.

అసలు సాహిత్యానికి మూల సూత్రాలంటూ కొన్ని ఉన్నవి. వాటికి క్షతి రానంతవరకూ సాహిత్యం సజీవంగా ఉన్నట్లే క్షీణించినట్లుకాదు.

సహృదయ హృదయ స్పందం కల్గించి ఆలోచనామృతమైన ఆనందాన్ని ప్రసాదించి, ఉపదేశంచేత సామాజికుల్ని సంస్కరించి కర్తవ్యోన్ముఖుల్నిచేసేది ఉత్తమ సాహిత్యం అనిపించుకొంటుంది.

కవి హృదయాంతర్గతమైన వేదన పునాదిగాగలది సాహిత్యం. అది లోక వృత్తానికి దర్పణం వంటిదై ఉంటుంది.

సర్వసామాన్యంగా, సహజంగా మానవుడి ప్రకృతి ఏ కాలంలోనైనా, ఏ దేశంలోనైనా ఒకే తీరుగా ఉంటుంది. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలన్నవి మానవుడి ప్రకృతికి సహజమైనవి. అధార్మిక ప్రవృత్తులకు అపజయమూ, ధార్మిక ప్రవృత్తికి విజయమూ చేకూర్చి కళాత్మకంగా నయమార్గాననడిపించేది ఉత్తమ కావ్యం ఏకాలంలోనైనా, ఏభాషలోనైనా సాహిత్యంలో శృంగార, వీర, కరుణ, బీభత్స, భయానక, హాస్యాద్భుతాలు పొడగట్టుతూనే ఉంటాయి. కాకపోతే ఒక్కొక్క కాలంలో సాంఘిక పరిస్థితుల ననుసరించి ఒక్కొక్క రసభావానికి ఎక్కువ అవసరమూ, అవకాశమూ లభిస్తూ ఉంటుంది.

కాలానుగుణంగా సంఘం మారుతూ ఉంటుంది. భాషా సంఘ సంబంధి కనుక అదీ మార్పు చెందుతూ ఉంటుంది. అభిరుచులు మారుతూ ఉంటాయి. కావ్యాకృతి మార్పు చెందుతూ ఉంటుంది.. రచనా విధానంలోను, కావ్యవస్తువులోను మార్పు ఉండడం సహజం. సంఘాన్ని దిగజారి పోనీయకుండా చేసేంతవరకూ ఆ సాహిత్యం దూషితంకాదు. భవ్యకవితావేశ జన్యమూ ధార్మిక ప్రవణమూ, ఉపదేశ గర్భితమూ అయిన సాహిత్యం ప్రాచీన సాహిత్యంలోనే కాక ఆధునిక సాహిత్యంలోనూ కన్పిస్తున్నంతకాలం సాహిత్య ప్రమాణాలు పడిపోయిన వనరాదు.

సాహిత్య ప్రమాణాలు బాహ్యమైనవనీ? ఆంతర

శ్రీ పిల్లలమర్రి
వేంకట హనుమంతరావు, M. A

మైనవనీ రెండువిధాలు. ఆకృతి, భాష, అలంకారాలు ఛందస్సు, మొదలైనవి మానవుడు వేసుకునే దుస్తుల లాగా బాహిరమైనవి, రసభావం (Poetic thought) ఆంతరమైంది. ప్రధానమైనదీ. ఈ బాహ్యప్రమాణాలు మారినంత మాత్రాన ఆక్షేపించడం అనుచితమౌతుంది ఆత్మజ్యోతి వెలుగుతున్నోందా లేదా అనే చూడాలి. కాలాన్ని బట్టి బాహిరములైన వాటిలో ప్రమాణాలూ మారుతూంటాయి.

ఆధునికాంధ్ర సాహిత్యానికి ప్రాచీన సాహిత్య లక్షణాలను అనువర్తింపజేసి చూస్తున్నందువల్ల కొందరికి సంతుష్టి కల్గక పోతున్నదనడం యథార్థ విషయం. ఆ లక్షణా లన్వయించక పోవడం వల్ల ప్రాచీన పండితుల దృష్టిలో ఆధునిక తెలుగు కవిత్వం అయోమయంగా భాసించింది. అందుకే నేటి కాలపు కవిత్వం నిరసనకు గురి అయింది. అసలు సంస్కృత సాహిత్యమే సాహిత్యంకాని, తెలుగులో సాహిత్యమేమిటి? అనే విపరీత ధోరణి కల వాళ్ళకు ఆధునిక తెలుగు కవిత్వంపైన సానుభూతి, ప్రత్యయం ఎలా కల్గుతుంది? పూర్వమున్న కొల బద్దలు ఆధునిక సాహిత్యాన్ని విలువకట్టడానికి ఎలా పనికి వస్తాయి? వీటి ప్రమాణాలు పాశ్చాత్య సాహిత్యంలోని ఆధునిక సారస్వతంలో అగుపిస్తాయి. దాని ప్రభావం ఆధునికతెలుగు సాహిత్యంలో హెచ్చుగా ఉందికాబట్టి, ఆ ప్రమాణాల్ని అర్థంచేసుకొంటేగాని, కాల పరిమాణాన్ని అర్థం చేసుకొంటేగాని ఆధునిక తెలుగు సాహిత్యంలో పొడగట్టుతూన్న విప్లవ చ్ఛాయ లర్థంకావు.

ఆధునిక తెలుగు సాహిత్యం ఆవిర్భవించి అపుడే ఇంచు మించుగా ఒకటిన్నర శతాబ్ద కాలమయింది. ఆధునిక యుగాన్ని నాల్గు దశలుగా విభజించవచ్చు.

1. ప్రథమ ప్రపంచ యుద్ధానికి పూర్వకాలం.

2. ప్రథమ ద్వితీయ ప్రపంచ యుద్ధాల మధ్య కాలం.

3. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరకాలం.

4. స్వాతంత్ర్య సిద్ధ్యనంతరకాలం.

ప్రథమదశలో ఆధునిక తెలుగు సాహిత్య, సంస్కృత సాహిత్యానువాదంతోను, ఆంగ్లసాహిత్యాను వాదంచేత విస్తరిల్లింది. నూత్న ప్రక్రియల్ని సృజించు కొని పుష్టి పొందింది ప్రహసనం, నాటకం, నవల, వ్యాసం ఉపన్యాసం, విమర్శ, జీవితచరిత్ర మొదలైన ప్రక్రియలు పొడచూపినాయి. ఆంగ్లభాషాధ్యయనం వల్ల ఆసాహిత్య సంపర్కంవల్ల మన సంఘంలోమార్పు వచ్చింది. ప్రాచీన ఆచారవ్యవహారాలపైన తిరుగుబాటు బయలు దేరింది. సంఘ సంస్కారం, భాషా సంస్కారాలు దాని ఫలితాలు. సాహిత్యం ప్రజలకు సన్నిహితం కావాలనే కాంక్షతో పద్యశైలీ సౌలభ్యమూ వచన శైలీ సౌలభ్యము అవసర మైనాయి. గేయా కృతికి గౌరవం కల్పితమైంది. వీరేశలింగం, చిలకమర్తులు - గిడుగు రామమూర్తి పంతులు, తిరుపతి వేంకటకవులు, గురజాడ ఆయా మార్పులకు నాయకత్వం వహించారు విప్లవ కారులకు ఎపుడూ ఎదురీతయే. అంచేతే—

'కొయ్య బొమ్మలు మెచ్చు కళ్ళకు
కోమలుల సౌరెక్కునా?, అనవలసివచ్చింది।

రెండవదశలో భావ విప్లవం పొడసూపింది. ఆంగ్ల సాహిత్యంలోని Romantic poetry పాఠ్య పాఠన క్రమాల్లో ప్రవేశించి యువతరం వారిని బాగా లోగొన్నది. తెలుగులో భావ కవిత్వం ఆవిర్భవించింది. ఆంగ్ల సాహిత్యంలోని కాల్పనిక కవిత్వాన్ని అనుసరిస్తూ, అనువదిస్తూ నూత్న చైతన్యాన్ని కల్పించారు. నవ్యులు, రీతి రాచరికాలమీద తిరుగుబాటు, స్వాతంత్ర్య కాంక్ష, స్వరాష్ట్రాభిమానాలు రేకెత్తాయి. స్వకీయ ప్రణయం, ప్రకృత్యారాధనం దేశభక్తి ప్రబోధం, పతితోద్ధరణం ఇత్యాది భావాలు కాలానుగుణ్యాలై ఆవశ్యకాలైనాయి జాతీయోద్యమం, భాషా రాష్ట్రోద్యమం వీటికి దోహదమిచ్చాయి. ఆత్మాశ్రయ కవిత్వం Subjective poetry ఏలిక వహించింది. కావ్యాల్లో దుఃఖాంతాలూ, (Tragedies) విప్రలంభాలు తావుగొన్నాయి. ఖండకావ్యం నూత్న ప్రక్రియగా రూపొందింది. ఈ కాల్పనిక సాహిత్య ప్రమాణాలు ఆంగ్ల సాహిత్యంలో ఆ రకపు సాహిత్యానికున్న ప్రమాణాలే. ఈ విప్లవానికి రాయప్రోలు ఉపద్రష్ట. వీరి 'రమ్యాలోకం' ఏతల్లక్షణ కావ్యం ఒక విధంగా.

ఈ భావ కవిత్వమూ నిరసనకు గురి అయింది

'కొత్తిమీర కవిత్వం' అన్నవాళ్ళున్నారు. గాలి దుమారాలు లేపినవారున్నారు. సంఘ పరిణామాన్నీ, ఆంగ్ల కాల్పనిక కవిత్వపు తీరు తీయాల్నీ పరిశీలించినమీదట గాని భావ కవిత్వం స్థిరపడిందికాదు. విమర్శకూడ నూత్న చైతన్యానికి గురి అయింది. ఈ విప్లవానికి రామలింగారెడ్డిగారు నాయకుడు. క్రొత్త ప్రమాణాలు క్రమంగా స్థిరపడసాగినవి

మూడవ దశలో కూడా పాశ్చాత్య దేశాల విజ్ఞాన ప్రభావం కావడాన అక్కడి సాహిత్య రంగం లోని ప్రయోగాలన్నీ ఆధునిక తెలుగు సాహిత్యంలో దిగుమతి అవుతూవచ్చి, ఆ దేశాలలో లాగానే ఇక్కడా అనవసకు కారణభూతాలైనాయి. ఇవే Symbolism, Impressionism, Expressionism, Imagism, Dadaism, Surrialism అనేధోరణులు ఫ్రాయిడ్ సిద్ధాంతాలూ ప్రయోగాత్మకాలైనాయి. వ్యక్త,అవ్యక్త, వ్యక్తావ్యక్త ధోరణులు ప్రతిబింబించాయి. ఇవన్నీ యూరపు సాహిత్యరంగాన్ని ఎలా కల్లోలపరిచాయో ఇదేరీతిగా ఆధునికాంధ్రసాహిత్య రంగాన్నీ కలవర పెట్టాయి. ఈరకపు విప్లవానికి శిష్ట్లా- శ్రీ శ్రీలు నాయకత్వంవహించారు ఛందోవిప్లవంత్రిప్రరూపందాల్చింది.

ఛందో బందో బస్తులన్నీ
ఛట్ ఫట్ మని తెంచి
డామిట్ ఏమిట్రా ఇది అంటే

Pray Tis poetry అందాం - అన్నారు,

రష్యావైపు చూపు ప్రసరించింది. ప్రజాస్వామ్య సిద్ధాంతాలు మన స్వాతంత్ర్యేచ్ఛకు దోహదం కల్గించాయి. ఒకప్రక్క Marxist సిద్ధాంతాలు ఆధునికాంధ్ర సాహిత్యంలో ప్రవేశింపసాగాయి. హేతువాదం ప్రబలి Radicalview point వేరూనసాగింది. గోపీచంద్ దీనికి మార్గదర్శకుడైనాడు. అభ్యుదయ కవిత్వం అనే పేర నూత్న ఉద్యమం బయలుదేరి సాహిత్యం ప్రజలకత్యంత సన్నిహితం కాజూచింది. నవ్యులకు అతి నవ్యులకు నూత్న వేదికను ఘటించి గురజాడ గురుత్వాన్ని శిరసావహింప సాగింది. దీనికి శ్రీశ్రీయేప్రవక్తయైనాడు. ఈ రకపు సాహిత్యానికిన్నీ ప్రమాణాలు రష్యా సాహిత్యంలోనే ఉన్నాయి. సాంఘిక వ్యవస్థ కనుకూలించాయి.

నాలవదశలో విభిన్న రాజకీయ పక్షాల ప్రభావానికి సాహిత్యం తలొగ్గింది. అయితే జాతీయ ప్రబోధమూ జమీందారులపై తిరుగుబాటు. ప్రజాస్వామ్య స్ఫూర్తోద్ఘాటనా, విదేశ శత్రుబహిష్కరణమూ, కావ్యవస్తువులై జాతీయ జీవనానికి సాహిత్యంప్రతిబింబంగా నిలవడం గమనింపదగ అంశం. జాతినిలువ ద్రొక్కకో యత్నిస్తున్నది. స్వాతంత్ర్య పరిరక్షణ నిమిత్తం సాహిత్యకులు బహుముఖాల కృషి సల్పుతూ ఉండడం వల్ల మళ్ళీ భారతీయ సంస్కృతి పైనా, సంప్రదాయాలపైనా దృష్టి ప్రబలుతూండడం వల్లా ప్రమాణాలు మారజొచ్చాయి. New-classic అనే నూత్న పరిణామం వస్తోంది. మహాకావ్య నిర్మాణానికి పూను కొని ఉద్యమిస్తూండడం చూస్తాం. దీనికి కురుగంటి, విశ్వనాథ- నోరి ప్రభావం నెఱపుతూ వచ్చారు. ఈ దశలో వచనపద్యం, నూత్న ప్రక్రియ బహుళ ప్రచారంలోకివచ్చింది. ఇందులోను ఒకలయఉంటూండడం గమనించాల్సిన అంశం.

ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రమాణాలు కొత్తవి ఏర్పడుతూ వచ్చాయనీ, జాతీయ జీవనాన్ని ప్రతిబింబించే యత్నం జరుగుతూ వచ్చిందనీ, అందుకు అనుకూలించని ప్రయోగాలు మాసిపోయినవనీ, ఆకృతిలో, భావంలో, భాషలో, వస్తువులో, అలంకారాల్లో, ఛందస్సులో, మార్పులు బాగా వచ్చినవనీ, అయితే అంతస్సు ధార్మికతవేపే చూస్తున్నదనీ అందుకని ప్రమాణం పడిపోలేదనీ చెప్పవచ్చు.

అయితే ప్రచార ధోరణులు, విశృంఖలత్వం, ఒక ప్రక్క ఉండడం మూలాన ఒక కొంత చికాకు కల్గిస్తున్న మాట వాస్తవమే. అసభ్య శృంగారం అపరాధ పరిశోధక వాఙ్మయం, జాతిని కృంగదీసే దుర్లక్షణం. ప్రజలకు చక్కని సాహిత్యాభిరుచి అలవడాల్సి ఉంది. లేదా కాలపరీక్షకుడొచ్చి వీటిని నిలువ నీకుండ చేసి తీరతాడు.

నేటి తెలుగు వాఙ్మయంలో బలుపు కన్నా, వాపే కన్పించుతోందని అనవచ్చు. దీనికి మనం ఈనాడు - ఈ కాలంలో అతి సన్నిహితంగా ఉండడాన్ని అలా అగుపిస్తున్నది. ఇది సహజమే. కాల పరీక్షకు నిలిచే సాహిత్యమే నిలుస్తుంది. అలాంటిది ఆధునిక తెలుగు సాహిత్యంలో ఇప్పటికి రాకపోలేదు.

ఇప్పటికి కాల్పనిక కవిత్వం స్థిరపడి పోయింది. 'What is Romantic to-day becomes classic tomorrow' అన్నట్లుగా స్వచ్ఛమైన, రాగరంజిత మైన గానయోగ్యమైన ధోరణి జాతీయ భావ ములు, స్వాతంత్ర్య కాంక్ష, ఇత్యాది గుణ ములుగల కావ్యాలు ప్రామాణికములైనవి, నిలువ కలిగినవికొన్నివుండడం గమనింపదగ్గ అంశం. ముత్యాలసరాలు, కృష్ణపక్షం, హృదయేశ్వరి, తృణ కంకణం- ఎంకిపాటలు - కిన్నెరసానిపాటలు - ఆత్మా ర్పణం, ఫిరదౌసి- తాజమహల్- సింహబలి-లాంటివి ఉత్తమ ఖండకావ్యాలయి నిలచి పోగలట్టివి.

కథానిక రచనలోను ఉత్తమ ప్రమాణాలను సాధిం చిన అంశాన్ని నాగలి, రిక్షావాడు - మొండివాడు, గాలి వాన, చిలుకా గోరింకా, రాగమయి లాంటివి తెలుపు తున్నాయి.

నవలా రచనలో సిద్ధహస్తులైన వ్యులు చక్కని ప్రమాణాలను నెలకొల్పారనడానికి రాజశేఖరచరిత్ర రామచంద్రవిజయం - వేయిపడగలు - మాలపల్లి-బారి ష్టరు పార్వతీశం - హిమబిందు రుద్రమదేవి-చివరకు మిగిలేది- పరమేశ్వరశాస్త్రివీలునామా - కీలుబొమ్మలు- విశాలనేత్రాలు, అల్పజీవి లాంటివి సాక్ష్యాలు.

నాటకరచనలో ఇంకా ఉత్తమ ప్రమాణాలు రావ లసి ఉన్నప్పటికీ పఠన ప్రయోగ యోగ్యతలు రెండూ కలిగిననాటకాలు కొన్ని వెలువడి ఉండడం గణనీయం. పాండవోద్యోగ విజయాలు, చిత్రనళీయం హరిశ్చంద్ర - బొబ్బిలి- కన్యాశుల్కం - రోషనార - ప్రతాపరుద్రీయం కావ్యత్వాన్ని సాధించుకొన్నాయి. ఆధునికాంధ్ర సాహిత్యంలో ప్రమాణాలు పడిపోలేదన డానికి నిదర్శనం, ఈ యుగాన వెలువడిన ఉత్తమ కావ్యాలు భారత, భాగవత, రామాయణాలువునఃఅను వాదంపొంది కవుల శక్తిని నిరూపిస్తూండడమే కాక స్వతంత్ర కావ్య నిర్మాణం జరుపుతూండడం ప్రశం సింపదగినది. బుద్ధ చరిత్ర- రాణా ప్రతాపసింహ చరిత్ర- శివభారతం-సౌందరనందం-ఆంధ్ర పురాణం ఆశోకరాజ్యం- నేతాజీ భారతం- నెహ్రూ కావ్యం. విక్రమాదిత్య- ఆత్మకథ- మొదలైన కావ్యాలు చిర స్థాయి కలినవి. సార్వ కాలీన, సార్వ జనీన లక్షణాలు గలవై ఆధునిక తెలుగు సాహిత్యం గర్వింపదగినదని నిరూపిస్తున్నవి.

సాహిత్యరంగంలో ప్రయోగదశ- అన్నట్టిది ఎపుడూ ఉంటుంది. సృజింపబడిందంతా నిలువదు. తాలుపోతుంది. గింజలే మిగులుతాయి.

అయితే-సజీవ సాహిత్యస్రవంతి ఎపుడూ వట్టి పోదు. ఒకచోట పాయగా కన్పిస్తుంది. ఒకచోట విస్తృతంగా ప్రవహిస్తుంది. ఒకచోట గంభీరంగా కన్పిస్తుంది. ఒకచోట వక్రిస్తుంది. ఒకచోట పరవళ్ళు త్రొక్కుతూ ఒడ్డులను ఒరసికొని బురదతో వన్నె తొడుగుతుంది. ఎప్పుడెక్కడ ఏ విధంగా ఉన్నప్పటికీ ఆ నదీనీరాన్ని గ్రహించి, వడపోసి, పరిశీలిస్తే జీవ కణాలు స్పష్టంగా నిరంతరం గోచరిస్తూనే ఉంటాయి. సాహిత్యం నూతన పరిణామం పొందినా ప్రమాణా లను నిలవపొక్కుకుంటూనే ఉంది.

అయితే ఈ పరిశీలన చేసేందుకు ఓపికా, శక్తి- సహృదయత్వం బాగా ఉండాలి.

"సతాంహి సందేహ పదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తిః"



# బాల సాహిత్యం

్యం ఒక దివ్యత్వం
భావాలకు నవ్యత్వం
ప్రతిపాదించే కాలం
పరిమళాల వాతూలం.

బాల్యం ఎంత నిజమో బాలసాహిత్యమున్నూ అంత నిజం. 'బాల సాహిత్యాన్ని నిర్ణయించి నిర్వచించడం కష్టం' అనేది కూడ అంత నిజం.

ప్రపంచం అనేకతగవులతో దారుణమైనయుద్ధాలతో సదమదమైపోతున్నవి. మనిషికి మనిషికి మధ్య దూరం పెరిగిపోతున్నది. అసలు మానవతఅన్నది ఎక్కడైనా మిగిలియున్నదా అన్న సందేహం కలుగుతున్నది. దీని కంతకు కారకులు పెద్దలు. పిల్లలు కారు.

పిల్లల ప్రపంచం వేరు. పిల్లల ప్రవృత్తి వేరు. వారి మాటలువేరు. పాటలువేరు. ఆటలు వేరు. వారి బ్రతుకుబాటలు వేరు. బాలసాహిత్యం పరిశీలనగా చూస్తే మన కివి అర్థమౌతాయి బాలలు పరిపూర్ణంగా అర్థమౌతారు. దాని వలన మనం పిల్లలకు న్యాయం చేసినవారమౌతాం. మనకు మనం మేలు చేసి కొన్న వారమౌతాం.

ప్రపంచ జనాభాలో సగంమంది పిల్లలే. అందులో కొందరు ఇళ్ళ దగ్గర ఆడుకుంటున్నారు కొందరు బళ్ళల్లో చదువుకుంటున్నారు. వారందరు నేటి బాలలు. రేపటి పౌరులు. కాగా వారికి సంబంధించిన ఈ బాల సాహిత్యాన్ని గురించి తెలిసికోవడం ఆసక్తిదాయకంగానే ఉంటుంది.

ఎవరితోనైనా వారి బాసతో యాసతో మాట్లాడితే ఎంతో ఆనందిస్తారు. పిల్లల విషయంలో యిది మరీ సత్యం. వారి భాషతో మాట్లాడుతున్నామంటే వారితో దగ్గర సంబంధం కూర్చుకుంటున్నామన్న మాట. వారూ మనమూ ఒకటే ? అని నిరూపించుకుంటున్నామన్న మాట. ఇంతెందుకు వారినితప్పకుండా ప్రేమిస్తున్నామన్నమాట. సరిగ్గా బాల సాహిత్య సృష్టిలో యిదే జరుగుతుంది. బాల భాషను పెద్దలు నిర్దుష్టంగా, నిర్దిష్టంగా ఉపయోగించుకోవడం జరుగుతుంది. పిల్లల భాషను భావాలను సరసంగా సానుభూతితో అర్థంచేసికోవడం జరుగుతుంది.

పిల్లలకు ఒక విలక్షణమైన భాషఉంది. ముద్దుగొల్పే ముచ్చటైన భాష ఉంది. అది లేలేతగా ఉంటుంది. ముగ్ధమోహనంగా ఉంటుంది. ఊది ఒత్తి పలికే తొక్కుపలుకులతో వింతగా సాగుతుంది. వినే వారి హృదయాలు చిత్రంగా లాగుతుంది. ఊహలకు ఉనికిపట్టు అది. కౌతుకపు కారణం అది. బాలలకు పుట్టుకతో సంక్రమించిన అపురూప సంపద అది. పెద్దలు దానిని ఆస్వాదించి స్వీకరించి దాని ప్రతిరూప నిర్మాణానికి పూనుకుంటున్నారు. గొప్ప విషయం.

పిల్లలంటే మల్లిమొగ్గలు
తల్లి మనసే విరిసి వెన్నెల
లల్లుకొను జాబిల్లి నిగ్గులు

కదిపితే ఘలు ఘల్లుమ్రోగే
కంచుమువ్వలు మించునవ్వులు

డెందమున ఆనందమెంతో
విందుగూర్చే కందుకమ్ములు

ఉల్లమున చిరు ఊహలెన్నో
పల్లవించే పసిడి తీగెలు

ఊసులెన్నో మోసులెత్తే
బాసకర్థము ప్రాణబద్ధము

అలాంటి పిల్లలను పెద్దలు అనుకరించడంలో ఆశ్చర్యమేముంది? కాని, పెద్దలు ఎంత మేలిమి బంగరు మాటల్లో తమ పాటలు మలచ యత్నించినా బాల

'బాలబంధు'
శ్రీ బి.వి. నరసింహారావు

భావాల స్వస్వరూపాన్ని ప్రదర్శించడం కష్టమే. ఎంతకూ అంతుచిక్కనిది ఆ బాలల ఊహావరణ. విజ్ఞులైన విద్యావేత్తలకీ రహస్యం తెలుసు. ఎంతో కాలంగా వారు దీని అంతు తెలుసుకోవడానికి పరిశోధనలు సాగిస్తున్నారు.

ఈ బాల సాహిత్యం జానపద సాహిత్యంలో ఒక ప్రముఖ స్థానాన్ని ఆక్రమించి ఉంది. నాగరక వాసన అంటని నాటి మానవుని సహజ సరళ మనః ప్రవృత్తికిది దర్పణంగా నిలిచిఉంది. అందులో ఆలోచన పాళ్ళకంటె ఆవేశం పాళ్ళు ఎక్కువ. ఇంద్రియ ప్రేరణ జన్యమైన ఊహలు ఎక్కువ. అందుకే ఈనాటి బాలలు ఆనాటి పెద్దలు ఒకేరకం వారన్నా. ఆనాటి వారందరూ పిన్నా పెద్ద తేడా లేకుండ మాయా మర్మం కుళ్ళు కుచ్చితాలు ఎరగని వారన్నా ఆశ్చర్య పడనక్కరలేదు.

పసి పాపల ఇంద్రియ వ్యాపారం ఎంతో నిశితంగా నిరాతంకంగా జరుగుతుంది. వారేది విన్నా, ఏదికన్నా, ఏదితిన్నా, ఏదితాకినా, వాసన చూచినా అద్భుత ప్రేరణకు ఆనందావేశానికి లోనౌతారు. దీనిని మనం వారి ఆంగిక చలనంలో, వాచిక విన్యాసంలో ఆ మాటకు వస్తే సాత్త్విక భావంలో స్పష్టంగా చూడవచ్చు. అల నాడు ఋషులున్నూ తమ్మతాము ఆపుకోలేని ఆనందావేశంలోనే వేద ఋక్కులు పలికి ఉంటారుకదా! అందుకే బాల్ణి కవితో ఋషితో పోల్చుతారు.

అన్ని భాషల్లో బాలసాహిత్యం వేరూని ఉంది. బాల్యదశ అనేది లేకుండా తరువాతి దశలుండడం అసంభవం కదా! బాల్యదశ ప్రభావం ఆ పిమ్మట దశలమీద ప్రసరించునప్పుడే ఆ దశలలో జీవనాడి స్పందనం క్రమగత వికాసం పరిణామం జరుగుతున్నట్లు, నేటి ప్రౌఢ కవితా రీతులకు బాల సాహిత్యమే ప్రాతిపదిక. అందులో అంకుర ప్రాయంగా కనుపించిన కవిత్వగుణాలే ప్రౌఢ రచనల్లో అనలుగా కొనలుగా అల్లుకొని వ్యాపించాయి. సరళాక్షరసౌష్ఠవం యతి ప్రాసలు, గతిభేదాలు ఆంధ్ర కవితకు అవతారంనాడే అలవడియున్నవన్న సత్యం ఈ బాల సాహిత్యం ప్రస్ఫుటపరుస్తున్నది. పసిపిల్లల మాటలు ఉచ్చరించే తీరులోనే, అక్షరాలు రెట్టించే పద్ధతిలోనే అప్రయత్నంగా నడకలు యతిప్రాస పొందికలు అందుకోవడం గమనింప వచ్చు.

1. అక్కరావే ఆడుకోవే
2. చెలినీవు మల్లిపూవు
3. రంగాయి దొంగాయి రణ రాలుగాయి.

ఉత్సాహావేశంలో ఊపులో యతిప్రాసలు వాటంతటవే వచ్చి పడతాయి. ఈ మధుర మంజుల వాఙ్మయంలో, తీయతేనియ తెలుగులో బాలలు పాడుకొనే పాటలు, వాడుకొనే మాటల మాలికలు, ఎత్తుబడులు ఎన్నని చెప్పగలం.

బాలసాహిత్యంలోని ప్రాచీన గేయ కవితలు కొన్ని మనకు లభించాయి. ఈ రచనా సృష్టి మొదట చాలవరకు అచేతనా కల్పనమే అయి ఉండవచ్చు. ఆ రచనా కాలాన్ని, కర్తృత్వాన్ని నిర్ణయించడం సాధ్యంకాదు. నన్నెచోడునికి పూర్వమే, నన్నయ్యకు పూర్వమే ఇట్టి రచనలు తెలుగులో పుట్టియుండవచ్చు.

ఈ గేయ కవిత్వం ఎలా ప్రారంభమైవుంటుందో, తళుక్కున నక్షత్రం మెరిసినట్లు మనస్సులో ఒక్కసారి మెరిసి ఉంటుంది. మానవుడు తనను తాను ఆపుకోలేని ఆవేశంలో మైమరచి మాటలు ఒక విధమైన లయానుబద్ధంగా పలికి ఉంటాడు. అదే ఇప్పుడు మనకు పాటలుగా ప్రచారంలో ఉన్నది. ఇలాంటి పారవశ్యానికి ఎవరైనా, ఎప్పుడైనా లోనుగాక తప్పదు. కవులైనా కర్షకులైనా పిల్లలైనా తల్లులైనా.

ఈ సృష్టి అతి సహజంగా సరళంగా జరిగిఉండాలి. అవ్యక్తానందంలో జరిగి ఉండాలి. అమ్మలు, అవ్వలు, దాదులు, బాలల్లో బాలలైనప్పుడు, వారి పసిడి పలుకు బళ్ళు అలవోకగా అనుకరించినప్పుడు ఈ వాఙ్మయ సృష్టి జరిగి ఉండాలి. తల్లులు, దాదులు పిల్లలనే అనుకరించడం ఇక్కడ గమనించదగిన విషయం. ఈ రచనలకు సృష్టికి, మాతృకలు బాలలే కనుక బాలలున్నూ వాఙ్మయ బ్రహ్మలనుటలో తప్పులేదు. ఈ దృష్టితో బాల వాఙ్మయ సృష్టిని పుష్టిని పరిశీలింపవచ్చు.

ప్రతి శిశువు ౨త్త, తాత, అమ్మ, మామ, నాన అనే మాటలు నేర్చిన నాటనుంచి, చేతికి దొరికిన దేనినైన ఊతగా గొని పాత్ర మీదో బల్లమీదో అల్ల నల్లన

కొడుతూ, లయ గతిని పాటిస్తూ లలలా ననవా తతతా పపపా అని అర్థాని కందని మాట లుచ్చరిస్తూ కవితాసృష్టికి నాందీవాచకం పలుకుతుంది. అమ్మ ఒడిలో అయ్య సందిటా వున్నప్పుడు బండిమీదో, రైలుమీదో, కారుమీదో ప్రయాణం చేస్తున్నప్పుడు అవ్యక్తాలాపనగా పాట ఫణితి కుపక్రమిసుంది. కాకిని చూచి 'కావు కావు' పిల్లిని చూచి 'మ్యావు మ్యావు' కుక్కను చూచి 'భౌ భౌ' అని మాటలు రెట్టించ నేర్చినప్పుడే పసిపాపలోని కవితా వాసన పసికట్టవచ్చు. పిల్లలలోని ఈ కవితా సృష్టి ప్రభావం తల్లులమీద కూడ పడి, వారిని పిల్లలుగా మార్చి ఈ కవితా ప్రక్రియకు పురిగొల్పుతుంది.

'లయ' అనేది ప్రకృతి ప్రథమావస్థ. బాల్య ప్రకృతికీ అది ప్రథమావస్థే. లయకు పిల్లలు వివశులౌతారు. వారి తనూలతికలు విన్నాణంగా ఊగి తూగుతాయి. లయాన్వితమైన పాటలంటే, తాళగతులంటే పిల్లలకు ఎంతో యిష్టం. 'పాపలంటే ప్రాణమున్న పాటలు' అని ఒక ఆంగ్ల కవి గొప్పగా అన్నాడు. లయ అనేది పిల్లల్లో ప్రాణస్పందన. కథలంటే చెవి కోసుకొనక పూర్వమే లయతో కూడిన పాటలంటే ప్రాణం విడుస్తారు పిల్లలు.

ఈ మధ్య నేను రెండు సంవత్సరాలలోపు బాలిక మీద చిన్న ప్రయోగం చేశాను. ఆ పాప కిప్పుడే మాటలు వస్తున్నాయి. చాలా చురుకైన పిల్ల. సూక్ష్మగ్రాహి. అన్నది అనడం, చేసినట్లు చేయడం —అనుకరణ శక్తి బాగావుంది. అనుకూల సమయం చూచి, పిల్లి పిల్లి పిల్లి, తల్లి తల్లి తల్లి, మల్లి మల్లి మల్లి అన్నాను. తానూ లయతప్పకుండా నవ్వుకుంటూ మురిసిపోతూ నేనన్నట్లు అన్నది నే నూరకుంటే తానిదివరకు నేర్చినమాటలతో మమ్మి మమ్మి మమ్మి నాన్న నాన్న నాన్న అని, ప్రక్కనున్న మమ్మందరిని దిగ్భ్రాంతులను చేసింది. దీనివల్ల పసిపాపలోని లయజ్ఞానము అనుకరణశక్తి ప్రకటితము కావడమే కాక, ప్రత్యేకతకూడా వెల్లడైంది. చిత్రం!

అసలైన సిసలైన బాలరచనల సృష్టి పల్లె వాతావరణాల్లోనే, స్వేచ్ఛావాయువులు పీల్చే పల్లెవాసుల ఉల్లములు పల్లవించిన సమయాల్లోనే జరిగి వుండవచ్చు. లేకుంటే ఆనాడు పల్లెలనీ, పట్టణాలనీ నాజూకు నాగరకతనుబట్టి తేడా లేకపోవచ్చు. అప్పుడందరూ ఒకటే, అందరి కష్టసుఖాలూ ఒకటే. ఆనందం అంచులు దాటి ప్రవహించే పద్ధతి ఒక్కటే. ఈ గేయాలు నాటి ప్రజా జీవిత ప్రతిబింబాలు. నిరాడంబరులు నిష్కళంక హృదయులు అయిన నాటి ప్రజలనుండి వెలువడిన బాలభావాలు ఆటపాటల లయగతులు అల్లరి పద్ధతులు, కొంటెకోణంగితనాలు, హృద్యంగా ఉండేవి.

అప్పటి స్థితి నూహించి నేనల్లిన పల్లెటూరి పిల్లలు అన్న గీతం.

పల్లెటూరి పిల్లలం మేము, మా
వల్ల గాదటంచు చెప్పబోము.

చెట్టు లెక్కగలము పెద్ద
గుట్ట లెక్కగలము మేము :
పట్టుదలకువస్తే, ఇక
పెట్టినదీ పేరు మేము

చెఱువులందు కాల్వలందు
చెలగి పెద్ద నదులయందు
ఈదగలము నేర్పుతోను
ఎంతో కడు ఓర్పుతోను.

ఆటల పోటీలయందు
అందె వేసినట్టి చేతు
లండి మేము ఎవ్వరైన
రండి మమ్ము గెల్చిపొండి

పాటలంటె భజనలంటె
నాటమైన కథలంటె
మేటి మగలమయ్య మేము
మెప్పుకూడ పొందినాము

పండుగలకు పబ్బాలకు
పండిన పంటకాలకు
దండుగ లేకుండ మేము
తగిన జవాబీయగలము

మోసాలకు దోసాలకు
దాసుల మే మసలుకాము
రోసమంటె మాదెనొమ్మ
కాసుకుపై గురుతు సుమ్మ

అంతసూటిగా దాపరికంలేకుండ చెప్పడం పల్లెపట్టులందున్న పిల్లలకే చెల్లు. నాగరక ప్రపంచాన గల నాజూకు పిల్లలలా చేయరు చెప్పరు.

మనం బాలగేయాలు విన్నప్పుడు పాడుకున్నప్పుడు పవిత్రమైన బాల మనస్కత నందుకుంటాం. కల్లా కపటం తెలియని పిల్లల ఉల్లంతో క్షణకాలం మన గలుగుతాం. తారంగం తారంగం. అంటూ తన్మయత చెందుతాం. 'వానా వానా వల్లప్పా' అంటూ చేతులు తలపైనుంచుకొని గిరగిర తిరుగు తున్నట్లు భావించు కుంటాం. ఈ పాటలు మనకు భవ్యమైన బాల్యాన్ని ప్రసాదిస్తాయి,ఒక అద్భుతమైన అలౌకికమైన ప్రపంచాన్ని ప్రత్యక్ష పరుస్తాయి. పారిజాత పరిమళాలు, పక్షుల కలకూజితాలు, గానాలు నాట్యాలు, రంగు రంగుల రమ్యహర్మ్యలతోకూడిన ప్రపంచమది. మరో ప్రపంచమది. అక్కడున్న ప్రతీదాని తీరేవేరు, అనాయాసంగా అందు ప్రవేశించి, నిర్భయంగా నిలిచి ఆనందిస్తాం.

ఏడు సాగరాలమధ్య
ఎంతో ఘనమైన దీవి
బాల లోక మొకటి అందు
చాల పేరుమోసి ఉంది.

రాజు అంటు వేరెలేడు
రాజెవడికి వాడె చూడు
పనులన్నీ చకచకమని
పరుగులతో జరుగుచుండు.

పూలు వాడవా తావున
గాలి చెడదు ఆ తావున
వింత ప్రకృతి గలిగిన, వా
సంత మెపుడు ఉండుకతన

పిట్టనైన లోకువెంచి
కొట్టబోరు అట నెవ్వరు
పువ్వునైన నవ్వుతాల
పుణుకబోరు అట నెవ్వరు.

భయము బెంగ కలత వెలితి
బాల లచట ఎఱుగ రెవరు
అందరికీ అన్ని ఉండు
అంద రొకటిగానె ఉండు.

అంద రొక్కచేను, ప్రేమ
బంధ మొక్కచేను అచట
'మన వలెనే అందరునూ
మన వలెనూ' అనుచుంట.

పసి బాలునిలోని కవి ఏ శాస్త్రజ్ఞునికీ అంతుచిక్కని అనంతలోకాలు, అతి విచిత్ర మాయాలోకాలు క్షణ క్షణం దర్శిస్తాడు. నింగి నీలి సాగరాలు తన బంగారు ఓడలో పయనించి రంగు రంగుల రత్నరాసులు అందులో నింపుకొని వస్తాడు. ఆనంద ప్రక్రియలో ఇది అతనికి సాధ్యం. దీనినే బాలమనస్కత, కవిత్వ తత్త్వ రహస్యం అంటారు. ఇది అనుభవానికి ఆవలి స్థితి. యోగులందుకొన్న దివ్యమనస్థితి అయితే బాలుడు పెరిగి పెద్దవాడై ఈ స్థితికి దూరమైనా, ఈ జ్ఞాపకాలకు మాత్రం దూరంకాడు.

బాలకవి ఊహల్లో పరమాద్భుతాలు గోచరిస్తాయి. పక్షులు పలుకుతాయి. జంతువులు రెక్కలతో, ఎగురుతాయి. దేవతలు ప్రత్యక్షమౌతారు. బ్రహ్మరాక్షసులు కనబడతారు. దారులన్నా, దూరాలన్నా భయముండదు. గాలిలో ఎగిరినా, నీటిలో మునిగినా ఏ ప్రాణితో ఏ విధంగా మసలినా అపాయముండదు. అవధి నెరుగని ఊహకిది అందే విషయమే. చిత్ర చిత్ర ఛందస్సుల నడకలలో తన ఆవరణ నేర్పరచుకొని ఊహించలాలపై ఊయల లూగుతుంది. రంగుల రాగాలు వింటుంది. అనురాగాలు అందుకొంటుంది.

ఊహ లేని బిడ్డను ఊహించడమే దారుణం.ఊహకు గల స్థానం చాల ఉన్నతమైనది, సున్నితమైనది.ఊహ లోపలినుండి బైటికి విలక్షణ గతిలో ఉరుగుతుంది. కోరిక అన్నది పిల్లల్లోగాని పెద్దల్లోగాని ఒక బలవత్తరమైన విషయం. అది మనస్సులో కలగగానే మాటగానో పాటగానో వెలువడడానికి తహతహలాడుతుంది .ఆ వ్యక్తీకరణమే కవిత్వమనిపించుకుంటుంది.

కవిత్వ మనేది మన కనాదిసిద్ధంగా వస్తున్నది. మహా మేధావుల మస్తిష్కాలనుండే ఉత్పన్నం కావడంలేదు. పసిపాపల తొక్కు పలుకుల్లోనూ కావలసినంత చిక్కుతున్నది. కవిత్వంలోని లయగతి మన మనస్సులపై చెరగని ముద్ర వేస్తుంది. జ్ఞప్తి నుండడ మనేది కవిత్వాని కొక విశిష్ట లక్షణం. ఒక కవి రచన లోని పలుపాదాలు ఉదాహరణలుగా ఉపయోగింపబడు

తున్న వనేది దాని గొప్పదనానికి నిదర్శనం. ఊహ ఉన్నతంగా అందంగా అపురూపంగా ఉంటే మన స్సుకి గట్టిగా హత్తుకుంటుంది. అచ్చు కవకాశమే లేని నాడు కవితా ఖండిక లనేకం ఆ నోటా ఆ నోటా పాడుకుంటూ పదిలపర్చబడినాయి. ఛందస్సులోని వైవిధ్యం మనస్సు నుర్రూతలూగిస్తుంది. నూతన సృష్టికది తోడ్పడుతుంది.

కవిత్వానికి ద్వివిధాశయాలున్నాయి. ఒకటి ప్రయోజనాత్మకత. రెండు రసాత్మకత. అందమైనది ఆనందహేతువు. అందానికి ఉపయోగానికి సంబంధ మున్ననాడే కళకు అర్థముంటుంది. రసాత్మకమైనది ప్రయోజన శూన్యం కానక్కర లేదు. ప్రయోజనాత్మక మైనది రసవిహీనం కానక్కఅలేదు. ఈ రెండు లక్షణాలు కలిగియున్న కవిత్వమే శ్రేయం ప్రేయం కూర్చుతుంది. ఈ బాలగేయ పద్ధతి అటు వంటిది. ఎంతవారికైనా అంతలో బాల్యాన్ని ప్రసా దిస్తుంది. ఆనందాన్ని అందిస్తుంది. ఇది మనిషిని బ్రతుకునుండి పలాయతుణ్ణి చేయదు సరికదా అతణ్ణి బ్రతుకులోనికే పలాయతుణ్ణి చేస్తుంది. అంటే అతడు కూర్చుకొన్న కృత్రిమాలనన్నీ ఒలిచి, తిరిగి బ్రతుకు లోనికి పదిలంగా ప్రవేశపెడుతుంది. ఇదే తిరిగి పుట్టడం, అన్న బైబిలులోని మహావాక్యం.

మనం కేవలం ఒక కాలానికి స్థలానికి మాత్రమే చెందిన వాళ్ళం కాదన్న విశాల భావాన్ని బాల సాహిత్యం కనువిప్పు జేస్తుంది.

i అక్కలు చెల్లెంఢ్రన్న దమ్ములం
ఒక్క రెమ్మ విరిసేటి పువ్వులం।

ii ఆటల పాటల వెలుగుల
బాటలజను మిత్రులం
చీమకైన కీడెఱుఁగని
చిన్ని చిన్ని పవిత్రులం:

iii మతమూ వర్ణం ఏదైతేనే?
దేశం జాతీ వేరైతేనే?
మన మందరమూ మానవులం।
ఈ భూమికి కామందులం
మనమందరమూ సోదరుం
ఒకే వృక్షమ్ము చివురులం।

అందరమూ ఒకటే అనిచెప్పడం అందమైన గొప్ప ఊహ. ఉన్నతమైన ఉద్దేశం.

బాలల ఊహలకు సరైన వెలగట్ట షరాబులెవరు? అమ్మను, మామిడమ్మను, బొమ్మనుసమానంగాభావించి ప్రేమించగల బిడ్డనేరీతి సమ్మానించగలం?

అమ్మన్నా బొమ్మన్నా
అంత ఇష్టమేమొనాకు।
అమ్మలాగె బొమ్మకూడ
అన్నీ సైగలెనాతో।।

అమ్మలాగె మామిడమ్మ
కొమ్మకొమ్మ బిడ్డలమ్మ
బిడ్డలున్న మామిడమ్మ
దొడ్డ తల్లి కాదటమ్మ

ప్రతివాడు కవితా రసపానంచేయగలవాడే. 'కవిత నాస్వాదించలేని నాగరకుడు నైలునదిలేని ఈజిప్టు వంటివాడు' అని ఒకకవి చమత్కరించాడు. రసవిహీన జీవితాన్ని కోరుకొని అనాది ఆటవిక మానవస్థితికి దిగజారడానికి ఎవరైనా ఒప్పుకుంటారా?

బాల కవితలు చదవడమంటే బాలలను క్రొత్తకను లతో(క్రొత్తదృక్కోణం నుండి)చూడడ మన్నమాట బాల కవితలు వినడమంటే బాలలు విషయాలు క్రొత్త చెవులతో వినడ మన్న మాట. బాలలతో మాట్లాడడ మంటే ఆత్మతోఐక్య సంధానం కావడ మన్న మాట. ఇంత గొప్ప అనుభూతిని మనకు కలిగించే బాలలు బాల రచనా శిల్పులు ధన్యులు.

అంతులేని అడవి వంటి తెలుగు భాషనుండి అందమైన ఉద్యానవన హృద్యతను సంతరించుకొని పరిమిత రూపాల్లో ఈ బాల సాహిత్యం మనకు ప్రసన్న మౌతున్నది. ఏచో వల్లరులు వన్నె చిన్నె లతో ఆలరారు తున్నవి. పరి కల్పకులు పలువురు వారి వారి అభిరుచులబట్టి పాటల పుప గుత్తుఎను ఎంపొందిస్తున్నారు. అందిస్తునా రు. ఈ కవితా విలసనానికి కావలసింది ప్రతిభ పరిశ్రమ- పవిత్రమైన బాలహృదయం. విషయాన్ని తేలికైన భాషలోఉంచి, ఇంచు కించుక త్రుంచి, నడుమ నడుమ విశ్రాంతికై ఎత్తు పలుకు లమర్చి, గీతాలల్లితే రమ్యంగా, రస స్ఫోరకంగా ఉంటుంది. అందుకోవడానికి అనుకూలంగా

ఉంటుంది. తాళలయాను బద్ధమైన మాత్రా ఛందస్సు చిత్తరంజక మౌతుంది.

కొన్ని తాళ గతులలో మాటలు, ఆటలు క్రింద సూచింపబడినాయి. ఇవి పిల్లలకు ఉత్సాహాన్నిస్తాయి. ప్రయత్నానికి పురిగొల్పుతాయి.

## 3 అక్షరాల - గతి

| | |
|---|---|
| కరి - మధుకరి | పతి - పరపతి |
| విరి - ఆవిరి | నతి - ఆనతి |
| దరి - సుందరి | గతి - సంగతి |
| గడి - అంగడి | నది - చిన్నది |
| దడి - సందడి | పది - ద్రౌపది |
| మర - తామర | నెల - వెన్నెల |
| తెర - కతెర | వెల - కోవెల |

## 4 అక్షరాల - గతి

| | |
|---|---|
| బిలము - గబ్బిలము | తరము - అంతరము |
| జలము - కజ్జలము | భరము - బంభరము |
| వనము - యౌవనము | రేడు - నేరేడు |
| జనము - భోజనము | జాడ - గురజాడ |
| నరము - వానరము | తారు - జలతారు |
| సరము - వాసరము | బేలు - తాబేలు |
| గళము - మంగళము | డాలు - పగడాలు |
| కణము - కంకణము | వాణి - తరవాణి |
| ధనము - ఇంధనము | రాణి - పారాణి |

## 5 అక్షరాల - గతి

| | |
|---|---|
| సుధ - వసుధ | అంజలి - గీతాంజలి |
| దధి - ఉదధి | గీతము - సంగీతము |
| కరి - మకరి | దారము - మందారము |
| బరి - శబరి | వారము - పరివారము |
| గతి - జగతి | కారము - ఉపకారము |
| వతి - సవతి | వాసము - సావాసము |
| గడ - రగడ | హాసము - ఇతిహాసము |
| నగ - సెనగ | తాళము - పాతాళము |
| లిపి - చిలిపి | సాయము - వ్యవసాయము |

## 7 అక్షరాల-గతి

| | |
|---|---|
| పటము - కపటము | కరము - కారము |
| మఠము - కమఠము | సరము - సారము |
| వరము - సవరము | మనము - మానము |
| కరము - మకరము | కలము - కాలము |
| లయము - నిలయము | రాలు - వరాలు |
| భయము - అభయము | సాలు - రసాలు |
| వనము - కవనము | కీలు - వకీలు |
| రణము - కరణము | కారు - షికారు |
| జగము - భుజగము | ఆకు - చిరాకు. |

## 9 అక్షరాల - గతి

| | |
|---|---|
| అంజలి - పతంజలి | రసాలు - సరసాలు |
| రంగము - తరంగము | వరాలు - నవరాలు |
| అంగము - పతంగము | రణాలు - కిరణాలు |
| సారము - ప్రసారము | అణాలు - మరణాలు |
| వారము - సువారము | వనాలు - పవనాలు |
| రాగము - పరాగము | భయాలు - అభయాలు |
| యోగము - ప్రయోగము | గతాలు - స్వగతాలు |
| అందము - మరందము | మతాలు-కమతాలు |
| కుందము - ముకుందము | ఘనాలు - జఘనాలు |

బాలురకు పామరులకు తుమ్మెద పదాలు, కోవెల పదాలు, కూనలమ్మ పదాలు మొదలైనవి అనుకూలంగా ఉంటాయంటే అందులో ఎత్తు పదాలుండటమే కారణం. తాళగతి నిబద్ధమైన గీతాలను బాలబాలికలు పాల మీగడల్లా ఇష్టంతో స్వీకరిస్తారు. ఈ పలుకు బళ్ళు. ఛాయలు' నడకలు, రుచులు కరవై నేటిబాలలు తెలుగు భాషలోని తీయదనం తెలిసికోలేని దుస్థితి నున్నారు

అలనాటి అవ్వలు అమ్మలు దాదులు అసలు చదివే నేర్పనివారు. నిజమైన గురువులుగా ప్రారంభ గురువులుగా నిత్యం వారు ఉయ్యాలలూపుతూ, జోలలు పాడుతూ, కథలల్లి చెప్పుతూ, కవ్విస్తు నవ్విస్తు, నీతులూ మరి లోక రీతులూ వత్సలకు వలసినవన్ని బోధించేవారు. అందులో అనంత విషయాలుండేవి. అవన్నీ ఊహలతో వాస్తవాలతో నిండి ఉండేవి.

నిజానికి అమ్మ ఒడిలోనే మనం గుడినీ బడినీ ఒకేసారి దర్శించి ధన్యత చెందవచ్చు.

అమ్మ ఒడి చదువుల బడి మా
యమ్మ ఒడి నా కోక గుడి

అమ్మ చూపును ఒంపడి దై
వమ్ము కంపెను త్వరపడి.

అమ్మ చెప్పిన సుద్దులు అని
శమ్ము ఒప్పిన బుద్ధులు

అమ్మ పెదవులహాసము ని
త్యమ్ము మాకు వికాసము.

అమ్మ మంజుల భాషణం, శ్రా
వ్యమ్ము వీనుల భూషణం

అమ్మ హృది అనురాగము, ది
వ్యమ్ము భవ్యము యోగము.

అమ్మ చల్లని కరములు, దా
నమ్మునకు ఆ కరములు

అమ్మ చరణ తలమ్ములు, క్షే
మమ్ము పండు పొలమ్ములు.

అమ్మ కన్నుల కాంతులు, లో
కమ్మునకు సుఖశాంతులు

అమ్మయే నా సర్వము, ధై
ర్యమ్ము బలమూ గర్వము.

పరియాచకం పట్టించడం పిల్లలకు బహుప్రీతి. హాస్యం పిల్లలకు జన్మతోవచ్చిన అభిరుచి. ఈ తరగతికి చెందిన పాటలు మునుపున్నవి —

(i) పంతులు పంతులు పావుశేరు మెంతులు.

(ii) చేయబోకు తప్పు చేస్తేకాలిచెప్పు

(iii)వదినగారు వదినగారు. వండినచోటకుండనాకేరు

(iv)బావగారు ప్రతిభగలవారు. నిండిన సభలో పిండి బొక్కేరు.

(v) అబ్బాయి నెత్తిమీద గోరింక చెప్పకు చెప్పకు నీవింక–ఇలాంటివి ఈ కాలంలో నే వ్రాసినవి కొన్ని

(i) చింతచెట్టు తొర్రలోన చిలకఉన్నది.
తాతబోడి బుర్రమీద పిలకఉన్నది.
తాతకాళ్ళ మున్నజోడు కిర్రుమన్నది
చింత తొర్రలోని చిలక తుర్రుమన్నది.

(ii) మాలోకం మామయ్యకు
ఈలోకంలో ఎవ్వరు
సాటిరారు పోటిలేరు
చాయల నిలబడలేరు

(iii) బస్తీ వీధులు గస్తీ తిరిగి
బడాయి బావ లడాయి తెచ్చె

(iv) అత్తవారింటికి కొత్తల్లుడొస్తే
కొత్త సున్నము పూత మెత్తండి బాగ

(v) అత్తమామల పూజ బత్తితొ చేస్తాడు
ఇల్లరిక మొచ్చిన అల్లుడయ్య

కర్తలపేరు తెలియని ప్రాచీన బాలగేయాలు కావలసినన్ని నేటికీ ఆ నోటా ఆ నోటా వినవచ్చేవి– నాలుగు స్తంభాలపాట, సందె గొబ్బిపాట చక్కిలిగింత పాట, నలుగుపాట, బుజబుజ రేకులపాట, గోరుముద్ద గుజ్జుముద్ద పాట, చందమామరావె పాట, అమ్మముద్ద నాన్నముద్ద పాట జోలపాటలు, నేతిలో నేరేడుపండు, కాళ్ళాగజ్జీ కంకాళమ్మా. చెమ్మచెక్క, దాగుడుమూత, ఒప్పులకుప్ప, దొంగవో దొరవో, అట్లతద్దోయ్, హాయిహాయి ఆపదలుకాయి, రక్ష రక్ష సంధ్య రక్ష, మొదలైన పాటలు, కంచి కామాక్షమ్మ పదంలో అంత్యప్రాసల సొగసు అద్భుతం కూనలమ్మపదాలు గుణంలో మిన్న. ఇవి మధ్యాంధ్రం లోని వంటారు. తమిళంలోని అవ్వయార్ పదాలుకూడ ఇలాంటివే అంటారు. ఈ పాటలకు మంచి ప్రశస్తి ప్రచారం ఉన్నది.

ప్రౌఢ కవులు కొందరు ఈనాడు రచించినట్లే, పూర్వం ఏనుగు లక్ష్మణ కవివంటివారూ బాలగేయాలు రచించారు. పెద్దాపురం రాజకుమారునిమీద అతడు రచించింది–

అప్పా రావోయీ ఒప్పుల కుప్పా రావోయీ
తప్పాటడుగూ లిడుచూనూ మా తండ్రీ రావోయీ
అంగి లో పాలా నీ బొజ్జా ఆకలి గొన్నాదీ
బంగారూ నా తండ్రీ నీకూ పాలు పొసేనూ॥

అలాంటిదే మరొక పాట–

చిన్నారి పొన్నారి చిరుత కుర్రడ రారా
అయ్య రాజా చక్కనయ్య రార

అల్లారు ముద్దుల పిల్లవాడా రార
అప్ప రారా కూర్మి కుప్ప రార

ముత్యాల క్రోవిరా ముచ్చట్ల దీవిరా

కన్నకాచీ రార గారాలకూచి రా....

పాటల్లో భాషకు అలంకారాలు అధికంగా ఉండ కూడదు. వాటికి పెట్టని సొమ్ములు రాగ తాళాలు ఉండనే ఉన్నాయి. పద్యాల్లోని భాషకున్న బిగి బిగి సమాసాలు, అన్వయాలు పాటల్లో పనికిరాదు. ఉంటే రాగతాళాల సందడిలో పడి అర్థంకాకుండా పోతుంది. అందులోనూ బాలగేయాల్లో ముదురు పదాలు కఠిన పదాలు అసలే ఉండకూడదు, అలతి అలతి మాటలు అతి తేలవి ముద్దూ ముచ్చట గొల్పేవి ఉండాలి.

బాల గేయాల కిప్పుడు మంచి ప్రచారం ఉంది పత్రికల్లో తగిన స్థానమీయబడుతున్నది రేడియోలో పిల్లల కార్య క్రమాల్లో బాలగేయాలు విరివిగా ప్రసారం చేయబడుతున్నాయి. సినిమాల్లోకి కూడా ఈ గీతాలు చోటు చేసుకున్నాయి. ఎంత ప్రచారం ఎన్నిమార్గాల సాగుతున్నా ఇవి బాలల నెంతవరకు ప్రతిబింబిస్తున్నవి, బాలల శ్రేయస్సు కెంత వరకు తోడ్పడుతున్నవి, అనేది ప్రశ్నగానే నిలిచిపోయింది. అది పెద్దకథ నావ్యక్తి గతాభిప్రాయం.

మాకు ముందు గురజాడ అప్పారావుగారు, కందుకూరి వీరేశలింగంగారు, వేంకట పార్వతీశ కవులు, చింతా దీక్షితులుగారు, ఈ బాల సాహితీ రంగంలో కృషి చేశారు. మా కాదగ్యం వారు. అన్మవాదులం -అంటే శ్రీ చిరంజీవి, శ్రీ కవిరావు, శ్రీ వేజండ్ల, శ్రీ అలవర్తి, శ్రీ మద్దులూరి నేను అనేకులం ఈ క్షేత్రంలో కవితా వ్యవసాయం సాగిస్తున్నాం. ఫల సాయం ఆంధ్రులకందించి వారి ఆశీస్సులందు కుంటున్నాం. బాలలకై బాలలమై రచనలు సాగిస్తున్నాం.

భారత సర్కారు బాల రచనలకు పోటీ నెరపి బహుమతులిచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ వ్యాసకర్త రచించిన 'పాలబడి పాటలు' అన్న పుస్తకానికి 1958 లో పారితోషికమిచ్చింది. ఇది కొంత వరకు హర్షించతగ విషయమే కాని చాలదు. బహుమతులందుకొన్న పుస్తకాలను భారత ప్రభుత్వమే బాధ్యత వహించి అందంగా అచ్చువేయించి తగిన వెలకు బాలలకందిస్తే బాగుంటుంది. న్యాయంగా ఉంటుంది. ప్రచురణ కర్తలకు రచయితలకు దీన్ని వదలివేస్తే జరగ వలసిన మేలు జరగదు.

బాలగేయాలకు తగిన బొమ్మ లుండాలి. గేయం అంతః ప్రవృత్తిని తెలిపితే బొమ్మ బాహ్య ప్రవృత్తిని (తత్వాన్ని) తెలుపుతుంది. పాటకు ఆట ఎట్టిదో, పాటకు బొమ్మకూడ అట్టిదే. ఆటకూ పాటకూ బొమ్మకూ అవినాభావ సంబంధముంది. ఆడేబొమ్మలు బాలలు ఆడని బాలలు బొమ్మ లనిపించు కుంటారు. బొమ్మల పుస్తకాలు పిల్లల నెంతగానో పిలిచి ఆకట్టుకుంటాయి. పాడుకొమ్మంటాయి. ఆడుకొమ్మంటాయి. ఆనందంగా ప్రొద్దు గడప మంటాయి.

పిల్లలయెడ పెద్దలమైన మన బాధ్యత గురుతరమైనది. మన ఇష్టానుసారం వాళ్ళను మలచగల మనుకోవడం పొరపాటు. పిల్లలంటే మైనంకాదు, మన్ను కాదు, పిల్లలంటే మల్లిమొగలు. ఉద్వేగంగా ఉరకలు వేసే వాళ్ళ భావాలను ప్రోదిచేసి మంచి మార్గాల్లో మళ్ళించగలిగితే ధన్యులం.

బాల భాస్కరుని ప్రాభాతం బాల్యం. పిల్లలను సంతోషపెట్టడం తప్పుకాదు; బాధపెట్టడం తప్పుగాని. పిల్లలయందు తల్లిచూపే సహనం మనం అలవర్చుకోవాలి. ఉపాధ్యాయులు తప్పక నేర్చు కోవాలి.

అందరినీ ఒక్క మూసలో తయారు చెయ్యాలనుకోవడం ప్రకృతి నరికట్టడం. ప్రత్యేకతను చంపడం.

పిల్లలను ప్రేమించడం పెంచడం ఒక ఫాషను కారాదు. అహానికది చిహ్నం కారాదు.

బాలలను ప్రేమిస్తున్నావంటే నీలోని బాల్యాన్ని నిత్యం నిలుపు కుంటున్నావన్న మాట. ఆదరించి అతిశ్రద్ధగా పోషించుకుంటున్నా వన్న మాట.

పిల్లలే లేకుంటే వల్లకాడయ్యేదీప్రపంచంఎన్నడో! బిడ్డల కంటే దొడ్డ వరా లేమిటి?

పిల్లలీ ప్రపంచానికి వచ్చింది జనాభా పెరుగుదలకు కాదు. మన హృదయ వైశాల్యం పెంచడానికి, మన శక్త్యుత్సాహాలను సక్రమంగా సంపూర్ణంగా వినియోగ పర్చడానికి.

పిల్లలు నిన్ను జాగ్రత్తగా పరిశీలిస్తూ ఉంటారు. ప్రశ్నలడుగుతూ వుంటారు. నీలోని మంచి చెడుగులను లెక్కగడుతూ ఉంటారు. జాగ్రత్త.

చిన్నవి కన్నులు ఉన్నవి ఎన్నో
నిన్నే కనుచు నిన్నే కనుచు ;
చిన్నవి చెవులు ఉన్నవి ఎన్నో
నిన్నే వినుచు నిన్నే వినుచు
చిన్నవి చేతులు ఉన్నవి ఎన్నో
నీవలె చేయుచు నీవలెచేయుచు, జాగ్రత్త
పిల్లలు ఎప్పుడు సోమరులు కారు.
ఆడేపిల్లలు అలసట నెరుగరు
ఆడని వా రానందమునెరుగరు

అతి ఎన్నడు పిల్లల యెడకూడదు. పట్టు విడుపు లుండాలి. మెత్తదనంతో కొంచెం కరుకుదనం కలుపు.

వాళ్ల ముద్దుముచ్చట్లుకని ముగ్ధులు కానివారెవ్వరు?
పిల్లలకే అల్లరి తెలుసు
పిల్లలదే మల్లెల మనసు
అల్లరి మల్లెలు కొల్లగజల్లీ
ఎల్లరినీ రంజించుట తెలుసు.

అల్లరి పిల్లలుచేస్తే అందంగా ఉంటుంది. అదే పెద్దవారు చేస్తే అనర్థాల నిస్తుంది. అల్లరి చేయుట అనునది పిల్లలలో సహజగుణం ; పెద్దలలో మాత్రం అది పెడబుద్ధికి నిదర్శనం.

తన తప్పునకు తాను సిగ్గుపడితే బిడను దండించవలసిన పనేముంది ? ఒక మహా బలశాలి క్రోధాగ్ని కంటె ఒక పసివాని మౌనవేదన మనలను దహిస్తుంది.

బిడ్డలనుండి బలవంతముగా గౌరవ మన్ననలు అందుకోవడాన్ని అభిలషించకు. వాళ్ళ కోపాగ్ని కెన్నడు గురిగాకు.

పిల్లల్లో ఉన్న సుగుణాలకు ముందు వారి నభినందించు. లేనివాటికై పిమ్మట కృషిసాగించు,

కృత్రిమాలు కుతంత్రాలు, అంధాలు అన్యాయాలు భేదాలు వాదాలు చిన్నపిల్లలకు ఉగ్గుపాలతో రంగరించి పోయకు.

పిల్లల్లో తల్లితండ్రులు తిరిగిపుడతారు,
జీవితంలో బాల్యమొక స్వర్ణయుగం.
కలీల్ జిబ్రాన్ చెప్పినట్లు పిల్లలు —

నీ చేసిన బొమ్మలుకారు
నీ కడుపున కలిగిన వారు :
మాటాడక కూర్చుండుటకు
మరి కదలక పడియుండుటకు.

ఒక మార్గం మాత్రము నీవు
ఒక గమ్యం వారికి కావు
ఊహలు ఉన్నవి వారికి
ఉన్నతిని చేరడానికి.

కోరకు నీవలె వారిని
కూర్చి తీర్చి ఉంచాలని
కోరి యత్నించు వారిని
గొప్ప గనుకరించాలని

వంగిన విలు నీ తీరు
వదలిన బాణాల్ వారు
జీవితమటులే నిరతం
భావివైపు జను త్వరితం

వారి తనువు లవి వసించుకొఱకై
వసతు లెన్నొ సమకూర్చగలవు
వారి తలపులవి వాసించుటకై
వసతు లేమి సమకూర్చలేవు.

బాల సాహిత్యాన్ని గురించి వివరించడమంటే బాలల గురించి వారి ప్రవృత్తుల గురించి వివరించడమే అవుతుంది.



# జానపద సాహిత్యము

జానపద మంటే పల్లెటూరు. జానపద సాహిత్య మనగా పల్లె పదములు. ఇవి కేవలము పల్లెలకు మాత్రమే సంబంధించినవికావు. పల్లెల్లో ఆశువుగా ప్రచారమైన సాహిత్యము.

దీనిని ఎప్పుడు ఎవరుసృష్టించారో తెలియదు. పర్వత శిఖరాల నుండి పడే జలపాతములు ఎచ్చట పుట్టినవో తెలియబడనట్లే, ఈ జానపద కవితాస్రవంతి ఎవరి నుండి వెలువడినదో కనుగొన జాలము. వారు తమ పేరు ప్రఖ్యాతులు, శక్తిసామర్థ్యములు, ప్రకటన కొరకే పదములను పాడలేదు. తమ అనుభవానందముల బహిర్గతము చేయుటకు మాత్రమేకోకిలవలె గాన మొనర్చిరి.

తొల్లింటి ఋషులు ప్రకృతిని గాంచి పారవశ్యము నొంది ఋక్కులను గానమొనర్చినట్లు, తమ కష్టసుఖాలలో తన్మయులైన సాధారణ జనులు తమ మనోభావాలను గేయ రూపమున గాన మొనరించిరి. రసహృదయుల దృష్టిలో యిది అమృతసుధ, అమర గానము. సాహిత్యస్రవంతి. మానవహృదయాంతరాళం నుండి సదా ప్రవహిస్తూనే వుంటుంది. ప్రతి జీవియు ఒక కవి. వాని జీవితము ఒక మహారసకాండ అన్నాడొక మహాపురుషుడు.

ఆంధ్ర సాహితీ స్రవంతి రెండు పాయలుగా ప్రవహించింది. మార్గ కవిత దేశి కవిత.

మార్గ కవిత సంస్కృత సంసార సమ్మిళితమై రాజాశ్రయమై పండిత రంజకముగా ప్రవర్తిల్లింది.

దేశి కవిత ప్రజాశ్రయమై, సామాన్య జన విజ్ఞాన వినోదముల కుపయోగపడినది. మార్గ కవిత శబ్దాడంబరము, దూరాన్వయములు లేకపోవుటయేగాక తేనె సోనలొలుక బాడుకొనుటకు పరవశత్వము నొందుటకు ఆవిర్భవించినదే దేశి కవిత.

రచన:

శ్రీ గొర్రెపాటి వేంకట సుబ్బయ్య

ఈ దేశికవితా సంబంధియే జానపద కవిత. సాహిత్యమును లాక్షణికులు పండితులు అనాదృతవాఙ్మయ మన్నారు.

పద్య ప్రబంధములకంటే యీ జానపద గానమున రసానంద మధికమని రసజ్ఞుల ప్రశంస. అందుచేతనే వీనిని మధుర కవిత లన్నారు.

ఈ సాహిత్యం జంగంకథలు, ఏల పాటలు సుద్దులు– యింక ననేక విధముల ప్రవర్తిల్లినది.

మన కవు లనేకులు సంధ్యా వర్ణనలు గావించిరి. అవి అధికంగా వారి పాండిత్య ప్రకర్షను ప్రకటించునవిగాని అంతకంటే అన్యము కాదు. యీ సూర్యనారాయణ స్తవము గమనించండి.

"పొడుసూ బాలుడూ పొన్న పువ్వూఛాయ
పొన్నపూవూ మీద పొగడపూవూఛాయ
శ్రీ సూర్యనారాయణ మేలుకో
హరి సూర్యనారాయణ మేలుకో॥
ఉదయిస్తు బాలుడూ వుల్లిపూవూ ఛాయ
ఉల్లి పూవూమీద ఉగ్రంపు పొడిఛాయ
శ్రీ సూర్యనారాయణా
గడియెక్కి బాలుడూ కంబపూవూ ఛాయ
కంబపూవూమీద కాకరీ పూఛాయ
శ్రీ సూర్యనారాయణా
జామెక్కి బాలుడూ జాజిపూఛాయ
జాజిపూవుమీద సంపంగె పూఛాయ
శ్రీ సూర్యనారాయణా

ఈ మాదిరిగా గాన స్రవంతులను వెలార్చారు జానపద కవులు. ఇది యొక గొప్ప పదచిత్రము హృదయోద్వేగ జనితమైన ఆనంద తరంగము.

అందలము కోరింది కుందనపుకుచ్చు
అతిభోగికోరాడు అత్తవారిల్లు
పల్లకీ కోరింది పచ్చన్నికుచ్చు
పరదేశి కోరాడు పంచ టరుగుల్లు

ఇందులో – లోకానుభవము, మారుతూన్న, జన

సామాన్యపు కష్టసుఖాలు. వారిభావ స్రవంతులు సాంఘిక సాంప్రదాయములు యింక యెన్నోవిషయ ములుమనకు అవగాహన మగుటతోబాటు భూతకాలము నకు అద్దము పట్టినట్లుగా తోస్తుంది.

సమస్త ప్రాణికోటికి అన్నదాత యైన కృషీవలుని కృషికిఏరు ఆధారము. అట్టి రైతు స్వాతివానకు ముత్యపు చిప్పవలె ఎదురు చూస్తూవుంటాడు ఎప్పుడు యెదవేద్దామా అని ఏరుముందా ఏరువాక ముందాయని రైతుల్లో ఒక సామెత వున్నది. ఏరువాకను గూర్చి యిలా గానమొనర్చిందొక రైతుబిడ్డ.

ఏరువాకొచ్చింది ఏరువాకమ్మా
ఏళ్ళు నదులూ పొంగి వెంబడే వచ్చాయి
నల్ల మేఘాలలో నాట్యమాడింది.
కొండ గట్టుల మీద కులుకులాడింది.
ఇసుకనదిలో దూరి బుసలుగొట్టింది.
పాడుతూ కోయిలా పరువులెత్తింది.
ఆడుతు నెమళ్ళూ అలసిపోయాయి.
నవ్వుతూ మా అయ్య బువ్వతిన్నాడు
ఏరువాకొచ్చింది ఏరువాకమ్మ
ఏళ్ళు నదులూ పొంగి వెంబడే వచ్చాయి.

ప్రవాస దుఃఖితురాలైన ఒక పల్లెపడుచు ఏరు రావాలనీ ఏరురాగానే బావ వస్తాడనీ లాలిస్తాడని యిలా పాడుకుంటుంది.

తొలకరి ఒక మబ్బుతొంగి చూచింది
మబ్బులో ఒక మెరుపు మెరసి పోయింది
పెరటిలో ఒక జల్లు కురిసి వెలిసింది
ఏ కొమ్మమీదనో ఎండతాకినపిట్ట
ఏటి త్రోవలు పట్టి ఎగరి పోయింది.
ఏరువాకా నాటి కేడాది దాటింది.
ఎదురుచూచీ గుండె చెదరిపోయింది.
పిట్ట పెట్టా ముద్దు పెట్టుకున్నాయి.
గోవులన్నీ యిల్లుచేరుకున్నాయి
ఏటి గాలికి చిలుక లెగిరిపోయాయి.
ఎందుకో నా ఆశ లిగిరిపోయాయి.

జానపద సాహిత్యంలో స్త్రీకి వున్న ప్రాముఖ్యం, ప్రాబల్యం అధికంగా కనబడుతుంది. ఆమె ఆడు బిడగా, కోడలుగా, భార్యగా, తల్లిగా అనేక రూప ములసంసార రంగమం దంతటా తానై విహరిస్తుంది. ఆరితేరిన అనుభవశాలిగా కనబడుతుంది.

ఈ సాహిత్యంలో తల్లిగా ఆమె అనేక గేయాలు గాన మొనర్చింది.

రావె రావే చిలుక రత్నాల చిలుక
పల్లెలకు నీ వేగి తెచ్చినా పండ్లు
చిన్ని మా అబ్బాయి చేతి కందిమ్మ.
రావేమె చిలుక ఓ రామ చిలుకా
వాడలకు నీ వేగి పండ్లు తేవేమి?
వాడలకు నీ వేగి తెచ్చినా పండ్లు
మా చిన్ని అబ్బాయి చేతి కందిమ్మ.

ఇలా తమ సంతానాన్ని గురించి అతి మనోహ రంగా పాడుకొన్నారు గతకాలమునాటి ఆ తల్లులు

అత్తా కోడండ్ల ఈ సంవాదమును ఆలకించండి.

కోడలా కోడలా కొడుకు పెళ్లామా
పచ్చిపాలమీద మీగళ్ళు యేవి.
వేడి పాలా మీద వెన్నలు యేవి.

దానికి కోడలు చెప్పే సమాధానమూ వినదగినదే.

అత్తరో ఓ యత్త ఆరళ్ళ యత్త
పచ్చి పాల మీద మీగడుంటుందా
వేడి పాలా మీద వెన్న లుంటాయా
నూనె ముంతల మీద నురుగులుంటాయా

అని సమాధానం చెబుతూ యిరుగు పొరుగును పిల్చి యిలా అంటుంది.

ఇరుగు పొరుగు లారా
ఓ చెలియ లారా
అత్తగా రారళ్లు చిత్తగించండి
పెత్తనము లాగేస్తె పేచీలు పోను

అందుచేతనే అత్త లేనీ కోడలూ పుత్తమూరాలూ కోడలూ లేనత్త గుణమంతురాలు- అని స్త్రీలలో చలామణి యైనది.

జానపద సాహిత్యమంటే యింగ్లీషులో 'ఫోక్ సాంగ్, అనీ 'ఫోక్‌లోర్' అనీ అంటారు. తెలుగులో "మహాజనగానమనీ" సాంప్రదాయ విజ్ఞాన మనీ చెప్ప వచ్చు. మయూర సింహాసనం పోయినా, కోహినూర్

వజ్రం పోయినా విచారించనక్కరలేదు. వాటినిమనం తిరిగి సంపాదించవచ్చును.

ఈ సాహిత్య సంపద మాత్రము అట్టిదిగాదు. నవ్యనాగరికత ప్రభావమున, మనకు, పదములూ, పాటల యం దుండు, మక్కువ తగ్గిపోయినది. అసలు అనాగరికతయే లుప్తమై కొత్తనాగరికత రూపొందు చున్నది. ఇంక నివి మన నాలుకలపై నాట్యమాడ జాలవు. కనుక వాటినన్నిటిని మనము గ్రంథస్త మొనర్చ వలసిన అవసర మున్నది

ఈ జానపద సాహిత్యపు. ఆవశ్యకతను గమనించి జర్మనీలోని 'గేటే' మహాకవి వంటి వారు, దీనిని బహు వ్యయప్రయాసల కోర్చి ముద్రించారు.

ఇంగ్లాండులో సంప్రదాయక విజ్ఞాన సంపాదనా సంఘమను పేర 1878సం.లో ఒక సంఘము ఏర్పడి దేశములోని ఈ పూర్వ విజ్ఞానమును సేకరించి ముద్రించి జాగ్రత్త పెట్టిరి.

ఐర్లండులో, యువజనులు దేశమంతా సంచారము గావించి దీనిని పదిలమొనర్చుకొన్నారు. మన దేశంలో రవీంద్రుడు యీ కవితా మాధుర్య ముగ్ధులై కొంత కృషిని గావించిరి దేవేంద్ర సత్యార్థి (ఈయన వంగీయుడు) దేశ సంచారము గావించి వివిధ రాష్ట్రములయందలి జానపద సాహిత్యమును సేకరించిరి.

మనలోకూడా కొంతమంది కొంత కృషి గావింపక పోలేదు. వేటూరి ప్రభాకరశాస్త్రి, ఓకుమళ్ళ అచ్యుతరావు, కామేశ్వరరావు పురాణం సూరిశాస్త్రి, చిలుకూరి నారాయణరావు, చింతా దీక్షితులు, నేదునూరి గంగాధరం, ఎల్లోరా, బి. రామరాజు మున్నగువారు కొంత గణనీయమైన కృషియొనర్చి యుండిరి.

చేయవలసింది యింకనూ చాలా వున్నది.

సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమువారివలె, మన ప్రభుత్వముకూడా యీ సాహిత్యాన్ని సంపాదించి సంపుటాలుగా ప్రకటించవలసిన బాధ్యత చాలా వున్నది.



# రవీంద్ర 'గీతాంజలి' విశిష్టత

రవీంద్రనాథ ఠాగూర్ మొదట తన గీతాంజలిని బెంగాలిలో పాటలుగా రచించెను, రాగతాళములతో మెట్లు అమర్చుకొని పాడుకొనుటకు వీలుగా. ఈ బెంగాలీ గీతాంజలి ద్వారా ఆయనకు వంగదేశమం దెంతయో కీర్తి లభించెను. తదుపరి ఆయన ఇంగ్లండ్ స్టీమర్‌లో వెళ్ళుతూండగా స్నేహితుల ప్రోత్సాహమువల్ల ఆ బెంగాలీ గీతాంజలిలోని ఒక్కొక్క పాటనూ ఇంగ్లీషులో వచనంగా వ్రాసెను. ఈ ఇంగ్లీషు గీతాంజలే అతనికి గొప్పపేరు తెచ్చి నోబిల్ బహుమానము లభించటానికి కారణమయ్యెను. ఈ ఇంగ్లీష్ రచనలో నూటమూడు గీతికలున్నవి. అవిపద్యపాదములతో లేకపోయినను ఒకరీతి లయతో, ఒక ప్రత్యేకమైన సొగసుతో, చదువుటకూ, వినుటకూ కూడ ఎంతో ఆనందదాయకములుగా వుండును. గణయతి ప్రాసలనుసరించుట వల్ల కవితకు కొంత కట్టుబాటుండును. ఇంగ్లీష్ గీతాంజలిలో అట్టికట్టుబాటు లేక కవి తన భావములను సొంపైన పదములలో వర్ణించును. కాని ప్రతి గీతిక లోను ఒకరీతిలయ ఉంటుంది. మాటలు ఏరి కూర్చినవై యుంటవి. కవితను ఆరాధించే దేవుని కొన్ని సమయాలలో స్నేహితునిగాను, కొన్నిచోట్ల ప్రియునిగాను కొన్నిచోట్ల రాజాధిరాజుగాను వర్ణించును. కొన్నిచోట్ల ఒక విశిష్టమైన పద్ధతిని విగ్రహారాధనను, సంప్రదాయసిద్ధములైన పూజలనుతక్కువగానే గణించును.

నా పాటకు నగలు లేవు అలంకార మసలే లేదు
నగల గలగల మన కలయికకు అంతరాయం
కలిగించదూ
మణి కింకిణీ రవముతో నీ రహస్య ప్రియ వచ
నాలు ఎలా వినిపిస్తాయి ప్రభూ !
.... నీ ఎదుట నిలిచినంతనే నేను కవిననే
అహంభావము ఇట్టే జారిపోతుంది ... మహనీయ
కవి పుంగవా ! నీ పాదముల వద్దనే నాకు తావు
నా జీవితాన్ని నవనవ వేణు దండమువలె
తీయగా, స్పష్టముగా నీ వొగడ్త నాలాపింప నిమ్ము
—అని ఒక గీతిక

పై గీతికలో భక్తిని ప్రకటించుటలో ఎటువంటి ఆర్భాటము ఉండరాదు అని స్పష్టమౌతుంది.

మరొక సందర్భంలో రవీంద్రు డంటారు.

చాలించవోయి ! ఈ జపతపాలు ఈ మంత్రోచ్చారణా. ఈ దివ్యనామసంకీర్తనా ! ఈ నిర్జన దేవాలయపు తలుపులన్నీ బిగించుకొని చీకటి మూల ఒక్కడవు ఎవరిని గూర్చి పూజ చేస్తున్నావు ? కళ్ళు తెరచి చూడు. నీవనుకున్న దేవుడు నీ ఎదుట లేడు సుమా !

అతడెక్కడున్నాడా ! ఓపికతో కటికనేలను
దున్నుతూన్న పంటకాపుఉన్నచోట ! కొండలను
పిండికొట్టి బాటపథమును చదును చేసేచోట.
ఎండనక, వాననక, ఎల్లప్పుడు వారితోనే
ఉంటాడు అతను, దుమ్మునిండిన దుస్తులతో
నీ పట్టుబట్టలు వదలి ఈమన్నులోకి రావోయి!

అంటూ సంప్రదాయసిద్ధమైన ప్రార్థనా మార్గాలను వదలివేయమంటాడు ఇలా :

దీప ధూపాలను మానివేసి పూలకానుకలను
దూరంగా పెట్టినీవ్యర్థధ్యానమునుచాలించుయిక.
ఇటురావోయ్ ! నీపట్టు పీతాంబరాలు
మాసిపోయి చిరిగినంత మాత్రాన మునిగిపోయి
నదేమిటి? దేవదేవుని ముఖాముఖి కలుసుకొని
అతనితో చేరి చెమటోడ్చి శ్రమించు ! !

రచన :
శ్రీ ఆచంట జానకిరామ్

ఈ ప్రపంచములో ప్రతి ఒక్కరికీ ఒక నిర్దిష్టమైన పని ఉన్నదని దానిని శక్తివంచన లేక చేయవలెననీ ప్రబోధము.

ఒకచోట; అపురూపమైన ఈ లోకపు మహోత్సవంలో పాల్గొనమని నన్ను ఆహ్వానించావు. నా జన్మ తరించినది. ఉత్సవాన్ని కళ్ళారా చూచాను. ఆనందగీతమును చెవులారా విన్నాను. ఈ మహోత్సవంలో నా వాద్యమును చేతనైనంత అందముగా వినిపించాను.

ఇక నేను లోనికి రావచ్చునా.... నా మౌన సంకీర్తనంతో నిన్ను కన్నుల పండువుగా దర్శింపవచ్చునా ప్రభూ !

కొన్ని సత్యాలను అపురూపమైన కథలుగా వర్ణించి చెపుతాడు రవీంద్రుడు. తన గీతాంజలిలో బిచ్చగానికీ ఆశ ఎక్కువ-ఇదిలోక ప్రతీతి. మహారాజు వేంచేస్తున్నాడు. తనకేమో దొరుకుతుంది. అనే ఉత్సాహంతో రాజధానికి ఎదురుగా వెళతాడు ఒక బిచ్చగాడు. అనేకులు మహారాజుకు అనేకములైన కానుక లిస్తూండగా రథము బిచ్చగాని వద్దకు వచ్చేసరికి అంత ఎత్తునుంచి రాజు రథము దిగివచ్చి బిచ్చగాని ఎదుట నిలచి "నీవు నాకేమిస్తావు?" అని అడుగుతాడు. బిచ్చగాడు తన జోలెనంతా వెతికి అన్నింటికంటె చిన్నదైన బియ్యపగింజ నిస్తాడు. రాజు ఆ కానుక తీసుకొని తరలి వెళ్ళిపోతాడు. సాయంత్ర మయ్యాక ఇక భిక్షాటన చాలించి బిచ్చగాడు చెరువు గట్టుకు చేరి, అక్కడ కూర్చుని తన జోలెను బోర్ల పోసి ఆరోజంతా ఎంత గడించాడో చూచుకుంటాడు తనకుదొరికినబియ్యముతో పాటూ నలుసంత-అంటే మహారాజుకు తానిచ్చిన ప్రమాణం గింజంత-బంగారం కనుపిస్తుంది. అప్పుడు బిచ్చగాడు చాలా బాధపడతాడు. మహారాజుకు తన జోలెడు ధాన్యాన్ని ఇస్తే అంతటి బంగారమూ వచ్చి ఉండేదేమోనని.

రవీంద్రునికి మృత్యువంటే భయములేదు. ఈ దేహము ఒక ఇల్లని, ఆ ఇల్లు వదలిపోక తప్పదనీ పదేపదే అనేక విధాల చెపుతాడు. ఒకచోట ఎంతాయో గొప్పభావమును ప్రకటిస్తాడు ఇలా :

"నాకు సెలవైనది మరి ఇక నన్నుసాగనంపరా
నా స్నేహితులైన మీరు ! తలవంచి నమస్కరిస్తున్నాను మీకు నన్ను దీవించి పంపండి.
ఇదిగో ! నేనింతవరకూ ఉన్న ఇంటితాళపుచెవులు
వానిని మీవద్దనే ఉంచండి,
ఈ ఇంటిపైన నాకు ఎటువంటి
హక్కులేదు. నేనుకోరేదల్లా మీ చల్లని దీవెనలు

అని చెపుతూ, ఇలా ముగిస్తాడు ఆగీతికను;

......రాత్రంతా వెలిగిన దీపము ప్రమిదలో
గజ గజ వణికి పోతోంది.

ఇంకొక్క క్షణంలో దీపం ఆరిపోతోంది ఆ మాట నిశ్చయము నేను ఎదురు చూస్తు వుండిన పిలుపు రాగానే వచ్చినది- నా అంతిమయాత్రకు నేను సిద్ధముగా ఉన్నాను !

జీవితములోని వింత వింత విశేషాలను తాను అనుభవించాననే, కాని ఆ విధముగా లౌకికుడైనా ఆ జీవిత రంగము నందేవస్తుమయమై రూపములతో నిండిన లోకములోనే రూపహీనుడైన వ్యక్తిని దర్శించాను అంటాడు ఎంతో ఆత్మవిశ్వాసముతో ఇలా;

చిత్ర విచిత్రములై నిముష నిమిషమూ మారిపోతూన్న వింత రూపములతో నిండిన కోటానుకోట్ల ఆటవస్తువులతో కిక్కిరిసిఉన్న ఈ నృత్యశాలలో తనివితీరా ఆడుకొన్నాను.

రూపహీనుడైన ఒక మహావ్యక్తిని కన్నులార దర్శించాను మానవ స్పర్శకు అతీతమైన ఆ మహనీయుని ఆలింగనముతో నా దేహములోని ప్రతి అణువూ చైతన్యమయమై ప్రతుళ్ళింతలాడుతోంది. ఇక ఏ నిమిషమైన ఈ తెరజారినా జారవచ్చును. ఇదే నా తుది పలుకు !

దేవునికి ఇంత దగ్గరగా వచ్చిన మానవులు చాలా అరుదు.

తన అనుభవాలను ఎంతో అందమైన మాటలతో వర్ణిస్తాడు. గీతాంజలి ఒక భక్తి ప్రధానమైన కావ్యమైనా ఇందలి కవిత్వముకూడా చాలా గొప్పది. ఉప

మానములు కొన్ని మనలను ఆశ్చర్యచకితులనుజేస్తవి. కాని ఇన్నాళ్ళూ ఎంతో గూఢమైనవీ, సాధారణులకు తెలియ రానివి అనే సత్యములుగా ఎంతో రమ్యమైన పదజాలంతో అందరికీ అర్థమయ్యే తీరున వర్ణిస్తాడు. రవీంద్రనాద్ టాగూర్. జీవితంలో ఉత్సాహాన్ని కలుగజేస్తు మృత్యువంటే భయము లేకుండా జేస్తాడు. దేవుడంటే ఎక్కడో దూరాన ఉన్నవ్యక్తి అనే భావానికి బదులు దేవుడు మనలోనే ఉన్నాడని మనము ఆలోచించే ప్రతి ఆలోచనా చేసే ప్రతిచేష్టా దైవసంకల్పితమైనదని స్పష్టము చేస్తాడు.

ఎన్నో విషయాలు చెప్పినాక తన తుది వేడుకోలుగా అంటాడు రవీంద్రుడు గీతాంజలిలో :

రూపరస శబ్ద స్పర్శగంథములతో తేలియాడిన నాసన నిన్నుగురించిన మహాకీర్తనగా విశ్వ ప్రపంచమును తాకిన నీ పదపద్మములవద్ద మోకరిల్లనిమ్ము.

... నేను పాడిన పాటలన్నీ నిశ్శబ్దమైన ఒక మహా గానముగా, ఏకమై – లోకమును ఆవరించిన శబ్దరహితమహాసముద్ర, ఘోషతో మిళితమై

నిన్ను మనసార కీర్తింపనిమ్ము :

గీతాంజలి భాగవతమువలె శిరసావహింపతగినది. సాహిత్య రీత్యా ఇది ఒక మహాకావ్యము.



# హేతువాదము దాని వైశిష్ట్యము

హేతువాద Rationalist దృష్టినిగురించి హేతుశీలాన్ని Rationality గురించి అనేక అపోహలున్నాయి. అవి ఆది మానవులలో లేవని, ఇటీవలి పరిణామాలేనని కొంతమంది భావిస్తారు. కేవలము నాస్తికులకు మాత్రమే అవి పరిమితమై ఉన్నవని, ఆస్తికులకు వానితో నిమిత్తంలేదని ఒక ఆలోచన ఉంది. ప్రతిదానికి కారణాలు వెతుక్కుంటూ కూర్చుంటే చాలాసమస్యలకు పరిష్కారం దొరుకదని, మానవ జీవితమే కుంటుపడుతుందని కొందరి భయం.

ఇట్టి సంకోచాలకు, సందేహాలకు మూలకారణం "హేతుశీలం" అంటే ఏమిటో అవగాహన చేసుకోకపోవడమే. అదేదో బయట ఉండే వస్తువనీ, హేతువాది Rationalist అయిన మానవుడు దానిని ఎరువు తెచ్చుకుని, ఎరువు నగగా వాడుకుంటాడనే దురభిప్రాయం, ఇట్టి అనుమానాలకు, అభిప్రాయాలకు దారితీస్తుంది.

వాస్తవానికి హేతుశీలం ప్రతిమనిషి తత్త్వంలోనూ ఒక భాగం, ఒక ప్రధానాంగం. అది లేనిది మానవుడు జీవించ లేడు. ప్రవర్తించలేడు ఆ మాటకు వస్తే మానవజాతికే కాదు ప్రాణికోటి కంతకూ హేతుశీలం ఒక విశిష్ట లక్షణం. మన చుట్టూ ఉన్న ప్రకృతి నియమబద్ధంగా నడుస్తూ ఉందని మన మందరమూ గమనించిన విషయమే. ప్రతి ప్రాణి ప్రకృతి విన్యాసంలో ఒక అంగం అయినప్పుడు ఆ ప్రకృతిలోని నియమబద్ధత ప్రాణికోటిలో ప్రతిబింబిస్తుంది నియమబద్ధమైన ప్రాణి జీవితం హేతుశీలాన్ని పొందక తప్పదు. హెగెల్ అన్నట్లు ఆకాశంలోసూర్యుణ్ణిచూచి అతని చుట్టూ పరిభ్రమిస్తున్న ఉపగ్రహాలను చూచి, మానవుడు ఆలోచనా పరుడైనాడు. ప్రతి దానిని సహేతుకంగా పరిశీలించడం మొదలుపెట్టాడు. ఆ పరిశీలన ఫలితమే సూర్యుని చుట్టూ మిగతా గోళాలు తిరుగుతున్నవని మానవుడు తెలుసుకోగలగడం. శాస్త్రీయదృక్పథం మానవునితోనే ప్రారంభమైంది.

అయినప్పటికి శాస్త్రం Science దర్శనం Philosophy వేరు వేరు రంగాలలో పని చేసవని, వాటి పరిధిలు వేరనీ, వాటికి పరస్పర సంబంధం పెద్దగా లేదనే దురభిప్రాయం కూడా ఒకటి ఉంది. శాస్త్రం ఈ ప్రపంచానికి సంబంధించిందని, దర్శనం పర లోకానికి సంబంధించిందనే విశ్వాసం ఈ అభిప్రాయానికి కారణం. గడచిన మూడు నాలుగు శతాబ్దాలలో శాస్త్రం ఏ రీతిగా అభివృద్ధి చెందిందో చదువుకున్నవారందరకూ తెలిసిన విషయమే. శాస్త్రీయ విజ్ఞానం పెరిగినకొద్దీ దాని విలువను మానవులు తెలుసుకోవడం మొదలుపెట్టారు ప్రసిద్ధశాస్త్రవేత్తలు సి వి రామన్ గారన్నట్లు "మనం శాస్త్రీయ యుగంలో జీవిస్తున్నాం. విద్యుత్తును, మోటారు శకటాలను, విమానాలను సృష్టించి. శాస్త్రం మానవాళికి ఎనలేని సేవచేసిందని మాత్రమే చాలా మంది భావిస్తున్నారు. అది పూర్తి సత్యంకాదు. వాస్తవానికి గడచిన రెండు శతాబ్దాలలో శాస్త్రం కల్పించిన నూతన దృక్పథాన్ని చాలా మంది గుర్తించడంలేదు. విశ్వసందర్శనంలోనే అది మనకు క్రొత్త దృష్టిని క్రొంగ్రొత్తశక్తిని ప్రసాదించింది।

కనుకశాస్త్రం, దర్శనం వేరువేరు కాదు. దర్శనం కూడా ఒక శాస్త్రమే మిగిలిన శాస్త్ర పరిశోధనల ఫలితంగా దార్శనిక విజ్ఞానం ప్రభావిత మౌతుంది. మార్పు చెందుతుంది. వాస్తవిక పరిస్థితులను పరిశీలించే శాస్త్రంతో దర్శనానికి సంబంధం లేక పోతే, దర్శనం వల్ల మానవుని నిత్యజీవితంలో ఎట్టి ఉపయోగము వుండదు. మానవ జీవితానికి అది

శ్రీ ఆవుల సాంబశివరావు
హైకోర్టు జడ్జి, ఆంధ్రప్రదేశ్

ఉపయోగం లేకుండా పోతుంది. నిజానికి మానవుని జిజ్ఞాసనుండే దర్శనం ఆరంభం అయింది. తన చుట్టు వున్న విశ్వాన్ని అర్థం చేసుకోడానికి మానవుడు ప్రయత్నించడం దానికి కారణాలు వెతుక్కోవడం ఆరంభమయిననాడే దార్శనికదృష్టికి కూడా బీజోత్పత్తి అయింది. విశ్వ రహస్యావిష్కరణా సంరంభంలో మానవుడు విజ్ఞాన దాయకాలయిన శాస్త్రాన్ని, దర్శనాన్నికూడా వెలారించాడు.

అది మానవుని ఆలోచనలు ఏ పరిధిలో వుండేవో మనం కొంతకు కొంత అవగాహన చేసుకోవచ్చును. తొలి దినాలలో ఉన్న మానవ సమాజ చరిత్ర దీనికి ఉపకరించగలదు. అదన్ని కాక మానవుడు ఈ నాడు ఎంతటి నాగరికతను సంతరించుకొని వున్నప్పటికీ అది మానవుల స్థాయిలో ఇప్పటికీ జీవించే అనేక తెగలు అడవులలో, అరణ్యాలలో ఉన్నారు. వారి పరిస్థితిని పరిశీలించినా, ఆదిమానవుని పోకడలు కొంతవరకు ద్యోతకం కాగలవు వీటిని పరీక్షించిచూస్తే ఒక్క విషయం స్పష్టమవుతుంది. తను, తనచుట్టూఉన్న ప్రకృతివినా, మరొకశక్తి అన్నిటికీ అతీతంగా ఒకటి ఉన్నదనే ఆలోచన వారిలో లేదు. "దేవుడు," "ఆత్మ", అనే భావాలు వారిలో ఎక్కడా కనిపించవు. దైవసంబంధమైన చింతన మనిషిలో ఆరంభంలో కాక తరువాత దశలలో మొదలైనట్లు అగుపిస్తున్నది. దైవచింతనతోనే మానవుని ఆలోచనారీతులు ఆరంభమైన వనుకోడం తప్పు, అనుకోకతప్పదు.

అది కాకపోయినట్లయితే, ఆధ్యాత్మిక దేశంగా చెప్పుకోబడుతున్న ఒక్క మన భారత భూమిలోనే కాక, ప్రాచీన నాగరికతగల అన్ని దేశాలలో కూడా 'విశ్వం ఎలా అవతరించింది?', 'ఎందు కవతరించింది?' అనే ప్రాథమిక సమస్యలతోనే దార్శనిక విచారణ ప్రారంభమై వుండేది కాదు. ప్రాచీన భారత చరిత్రే కాకుండా, మిగతా ప్రపంచం కంటే ముందుగా మానవజాతి పురోగమనాన్ని సాధించిన చైనా, గ్రీస్, ఈజిప్టుదేశాల పూర్వసంస్కృతినికూడా పరిశీలిస్తే ఈ సత్యం సుబోధక మవుతుంది. విశ్వ రచనకు తీరుతెన్ను లేమిటో అవగాహన చేసుకోడానికే అక్కడి తత్వవేత్తలు కృషిచేసినట్లు కనిపిస్తుంది. ఈ సమస్యలకు తోడుగా 'ఈ జీవితం తరువాత ఏమిటి?' అన్న ప్రశ్నలో కూడా వారు నిమగ్నులైనట్లు అగుపిస్తున్నది. దీనినిబట్టి మానవుడు జిజ్ఞాసా భావంతోనే తన ఉనికిని ప్రారంభించినట్లు తనను ఆవరించివున్న ప్రకృతిని, విశ్వాన్ని అవగాహన చేసుకోడానికి 'ఎందుకు', 'ఏమిటి' అన్న ప్రశ్నలతో ఉద్యుక్తుడైనట్లు స్పష్టంకావడంలేదా? ఆదినుండివున్న అతని హేతుశీలం ఆవిష్కృతం కావడంలేదా?

భారతీయ సమాజం ఒక కపిలునితోనూ, కణాదునితోనూ మొదలుకాలేదు ఆ మాటకువస్తే ఆదివేదమైన ఋగ్వేదాన్ని రచించిన ఋషులకంటేకూడా అది ప్రాచీనమైంది. థేల్స్, డిమోక్రిటీస్, ప్లేటో, సోక్రటీస్ మొదలైన తాత్వికులకంటే చాలా ముందుగానే గ్రీస్‌లోని జాగృతి తొలకరించినదని చరిత్ర చదువుకున్నవారందరకూ సువిదితమే. ఆ రీతిగానే మన జాతి చరిత్రలోకూడా జరిగిందని ఊహించడం సబబు. అందుకు భిన్నంగా భారత సంస్కృతి ఉద్భవించిందని అనుకోడానికి ఆధారాలు ఏమీ కనుపించవు.

అయితే యిక్కడ ఉన్న ఇబ్బందిని ఒకదానిని గుర్తించక తప్పదు. మనిషి మానవాకృతితో రూపొందిన తొలి దినాలనుండి జరిగిన చరిత్ర మనకు అందుబాటులో లేదు కనుక తొలి మానవుని ఆలోచనా విధానం ఎలా పెరుగుతూ, విస్తృతమవుతూవచ్చిందో రూఢిగా నిర్ణయించడం కష్టం. వేదకాలానికి ముందు మనుష్యులు ఏ విధంగా జీవించారో, ఆలోచించారో, వ్యవహరించారో తెలుసుకోడానికి ఆధారాలు లేవు. అలాగే మిగతా దేశాల అతి ప్రాచీన చరిత్ర కూడా లభ్యం కావడం లేదు. ఇవి లేనప్పటికీ, ఒక్క విషయం మాత్రం నిస్సంశయంగా కనబడుతున్నది. దార్శనిక చర్చ ప్రారంభించిన తాత్వికులు మొదట్లో తమచుట్టూవున్న భౌతిక పదార్థాలను, వాస్తవికతను గురించి ఆలోచించారు. కానీ ఆధ్యాత్మిక విషయాలతో తమ పరిశీలన ఆరంభించలేదు. తమ జీవితంమీద ఎంతో ప్రభావాన్ని కలిగివున్న భూమి, అగ్ని, ఆకాశము, జలము, వాయువు మొదలైన భౌతిక పదార్థాల పరమార్థాన్ని కనుగొనడానికి వారు చేసిన ప్రయత్నంతో, దార్శనిక విధానం మొదలైంది. నాగరిక ప్రపంచంలో

జీవిస్తున్న మనకు, అనేక సౌకర్యాలు ఉండటంచేత ఆదిమానవులు అగ్ని, వర్షం, వరద, తుఫాను మొదలైన ప్రకృతి శక్తులతో ఎలా సహజీవనం చెయ్యవలసి వచ్చిందో వాటి ఉధృతానికి ఎలా లోను కావలసి వచ్చిందో ఊహించడం కొంత కష్టం కావచ్చు. మనకు నిప్పుపెట్టె ఉండటంచేత అగ్నిని కల్పించడం తేలికయింది. తొలి మానవునకు రాయి రాయి కలిపి కొడితే నిప్పు పుడుతుందని అనుభవంవల్ల కానీ తెలియలేదు. అలా ఉత్పన్నమైన నిప్పు ఎల్లవేళలా లభ్యమయ్యే పద్ధతిని వారు తిరిగి వెతుక్కోవలసి వచ్చింది. ఈ రీతిగా అగ్నిని గురించిన జ్ఞానాన్వేషణ పెరిగింది. జీవితావసరాల నిమిత్తమై మానవుడు సత్యాన్వేషి అయినాడు. భౌతిక వాతావరణం నుండి విజ్ఞానాన్ని సత్యాన్ని సంతరించుకోడం ప్రారంభించాడు.

ఈ సమస్యను మరొక దృక్పథంనుంచి కూడా పరిశీలించవచ్చు. శరీర పరిణామం Biological evolution ప్రాణము Life ప్రాణి సంతతి ఎలా ఆవిర్భవించినవో, మారినవో, పెరిగినవో సూచిస్తున్నది. ప్రాణి వర్గాలలో ఉన్న వ్యత్యాసాలను మనం గమనించవచ్చు. అట్టి వ్యత్యాసాలు రెండు విధాలుగా కనిపిస్తవి. ఆకారం Structure లోను ప్రవర్తన Behaviour లోనూ, ఈ భేదాలు ప్రధానంగా గోచరమవుతాయి. వాతావరణ Environment ప్రభావానికి చలించడం ప్రాణంయొక్క మొదటి లక్షణం. ప్రాణంలేని వస్తువు వాతావరణానికి చలించదు.

శరీరం పరిణామం చెంది మానవాకృతినిదాల్చింది. ఆకారం క్రొత్తది కనుక దాని ప్రవర్తన, చైతన్యం కూడా నూతన పరిణామాన్ని పొందినయి. ఆ క్రొత్త పరిణామమే బుద్ధి Intelligence ఈ బుద్ధి లక్షణం క్రింది తరగతుల ప్రాణికోటిలో కూడా సూక్ష్మంగా నైనా లేకపోలేదు. అయితే చుట్టూవున్న వాతావరణానికి చలించే React విధానంలోనే మానవుని విలక్షణత ఇమిడి వుంది, కేవలం యాంత్రికం Mechanicalగా ప్రవర్తించడం మానవుడు చేయలేని పని. యాంత్రికంగానే కాకుండా అతని ప్రవర్తన, జిజ్ఞాసా భావంతో కూడా కూడి ఉంటుంది. ప్రతి సంఘటన ఎందుకు జరుగుతుందో తెలుసుకుందామనే కుతూహలం మానవుని చైతన్యంలో ఒక ప్రధాన భాగం అయిపోయింది. అది హేతువాద దృష్టి. హేతుశీలత అందులోనుండే అన్ని శాస్త్రాలు, దర్శనాలు, విజ్ఞానాలు పుట్టుకువచ్చినయి. కనిపిస్తున్న ప్రతి విషయం యొక్క నైజాన్ని తెలుసుకోవాలన్న కుతూహలమే విజ్ఞానానికి మూలాధారం.అదే శాస్త్రీయ దృక్పథానికి దారి తీసింది.

వాస్తవిక ప్రపంచాన్ని అర్థం చేసుకోవాలనే తృష్ణ అప్రత్యక్షమైన ఆధ్యాత్మిక Metaphysical వాదానికి ఎలా దారి తీసిందో తేలికగా ఊహించుకోవచ్చును. తనను ఆవరించి ఉన్న ప్రకృతిలోని అనేకవిషయాలకు,సంఘటనలకు ఆదిమానవుడు తేలికైన సమాధానాలు చెప్పుకోలేకపోయాడు.తికమకపడ్డాడు. అయితే ఏదో ఒక కారణం వెతుక్కుంటేనే కాని అతని పరిశీలనా తృష్ణ తృప్తి చెందలేదు. అందుకని ప్రకృతికి అతీతమైన శక్తి ఏదో ఒకటి ఈ విశ్వాన్ని నడిపిస్తున్నదని అప్పటికి సమాధానం కుదుర్చుకున్నాడు. అప్పటి అతని విజ్ఞానానికి అందినంతలో మరొక పరిష్కారం దొరకలేదు. అయితే గమనించవలసిన విషయం ఏమిటంటే- ఈ పరిష్కారాన్ని అన్వేషించుకోవడంలో కూడా అతని జ్ఞాన తృష్ణ హేతుశీలతే పని చేసినయి.

శాస్త్రీయ పరిశీలన ఒక ప్రతిపాదన, ఒక ఊహ Hypothesis లేనిది సాధ్యం కాదు. పరిశోధనలో ఆ ఊహ వాస్తవమని సత్యమని ఋజువు కావచ్చును లేక లభ్యమైన జ్ఞానాన్ని బట్టి అది సబబు కాదని, యథార్థము కాదని రూఢి కావచ్చును. అలా రూఢి అయినప్పుడు అట్టి ఊహాలను త్యజించవలసివుంటుంది. విశ్వ రహస్యాలను అవగాహన చేసుకోగల విజ్ఞానం మానవునికి లేనంత కాలం అట్టి అప్రత్యక్షమైన ఆధ్యాత్మిక Metaphysical ఊహలతోనే తృప్తిచెందవలసి వస్తుంది. కానీ అవి ఊహలు Hypothesis అని మాత్రం మనం మరువరాదు. ప్రతిదానికి ఏదో ఒక కారణం లేనిది జరగదు అన్న ఆలోచనలతో ఆరంభించి మూలకారణాలను అన్వేషిస్తూ అట్టి జ్ఞానసముపార్జనాయాత్రలో మానవుడుజేరిన ఒక మజిలీ మాత్రమే ఈ ఊహాగానం అన్నవిషయం ఎన్నటికీ మరువరానిది.

మానవ సమాజం భౌతిక వాతావరణంలో జీవి

స్తుంది. భౌతిక పరిస్థితులు మానవ జీవితంలో చాలా సంబంధాన్ని కలిగివుంటయి. వర్షాలుకురవాలి.పంటలు పండాలి. వర్షాలు లేక పోతే పంటలు పండవు. వర్షాలు ఎలా కురుస్తున్నాయి? ఎందుకు కురుస్తున్నాయి? ప్రకృతి నియమబద్ధమై ప్రవర్తించడం కనిపిస్తున్నది. ఆ నియమబద్ధత మానవ నిర్మాణం కూడా కాదని తెలుసునేవుంది. మరి వీటి కన్నిటికీ, కారణం ఏమిటి? ఎవరు? ఈ ప్రశ్నలయితేవున్నవి కాని, వాటికి సంతృప్తికరమైన సమాధానాలు చెప్పుకోగల విజ్ఞానం, ఆనాటి మానవులకు లేకపోయింది. వీటికి ఒక కారణం ఉండాలికనక, అది మానవాతీతమై ఉండాలికనక, మానవాతీతమైనశక్తి ఏదో ఉన్నదని ఊహించుకుని, మనస్సుకు సమాధానం కుదుర్చుకున్నారు. తాము నియతితోకూడిన జీవితాన్ని గడుపుతున్నారు. కాబట్టి నియమబద్ధమైన ప్రకృతిని నడిపే శక్తికూడా తమ ఆకారంలోనే ఉంటుందని భావించి మానవాకృతిగల భగవానుని ఆనాటి మానవులు ఊహించుకున్నారు. ఈ మజిలీ చేరడానికికూడా చాలా కాలం పట్టింది. అంతకుముందు ప్రకృతిలోని ప్రతి విషయానికి ప్రత్యేకశక్తి ఉంటుందని భావించబడ్డది. అగ్నిని, వాయువును విద్యుత్తును వేర్వేరు శక్తులుగా భావించి ఆరాధించే ఋగ్వేద భావాలు ఈ కాలం నాటివే అని అనుకోవచ్చు కణాదుడు, కపిలుడు తమ దర్శనాలను వ్రాసే నాటికి, ఈ భావాలు మరికొంతపరిణామం చెంది వాస్తవిక, భౌతిక సత్యాలమీదనే దృష్టిని కేంద్రీకరించడం జరిగింది ఆ తాత్వికులిద్దరు భౌతిక ప్రపంచాన్ని అనేక విభాగాల క్రింద విభజించారు. విశ్వరహస్యాలను, విశ్వంలో ఉన్న వస్తు సంచయ సహాయంతోనే తెలుసుకోవాలిగాని, అందుకు భిన్నమైన విచారణతో కాదని వారు భావించారు. గ్రీక్ తాత్విక విచారణకు పితామహుడుగా పరిగణించబడుతున్న థేల్సు కూడా మన కణాద, కపిలుల వలె భౌతిక విషయాలకు భౌతిక కారణాలే ఉండి ఉండాలని తలచాడు. ఆయన దృష్టిలో అన్నిటికీ మూలం జలం. అన్నీ అందులో నుండే జనించినయి. ఆయన సమకాలీనుడైన హిరాక్లిటోస్ సృష్టికి మూలాధారం అగ్ని అన్నాడు. మన తాత్వికులు పంచభూతాలనుండి సృష్టి పుట్టుకు వచ్చిందని తలంచారు. ఈ తాత్విక విచారణలో ప్రారంభదశను సూచించేవే ఉపనిషత్తులు.

మానవుని ఊహాగానం విస్తరించి అనేక దేవుళ్ళను సృష్టించుకుంది. అయితే మళ్లీ తిరిగి ప్రశ్న తలయెత్తింది. 'ఈ దేవుళ్ళనందరను సృష్టించిందెవరు?' అని. ఈ దేవుళ్ళు ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నారు? మరొకరీతిగా ఎందుకు ప్రవర్తించడంలేదు? వీరి నైజమేమిటి? వీరి విధానమేమిటి? ఈ ప్రశ్నకు సమాధానంగానే మతాలు పుట్టుకువచ్చినయి. దేవుళ్ళ చిద్విలాసాలని భావించబడే విషయాలను వివరిస్తూ, మానవాళిలో ఈ మతాలు ప్రబలినయి. అందువల్లనే ప్రతిమతానికిఒక మతిశాస్త్రం Theology ఉంటుంది. దేవుడే సృష్టికార్యాన్ని నడుపుతున్నాడని ఆ శాస్త్రం చాటుతు వుంటుంది ఈ విధంగా దేవుళ్ళు, మతాలు ఉత్పన్నమైనయి.

మానవుని జిజ్ఞాసాభావం, హేతుశీలం, అతని జీవితాన్ని విశ్వాసాలను, ఆశయాలను నడుపుతూ, వాటిని విస్తరింప చేస్తూ వచ్చినాయి. తన చుట్టూ ఉన్న విశ్వాన్ని అర్థం చెప్పుకోడానికి ఆదిలో అతి పరిమితంగా ఉన్న విజ్ఞానం చాలనందున, ప్రకృతికి అతీతంగా ఏదో ఒక మహత్తరశక్తి వుందని మనస్సు కుదుర్చుకోవలసి వచ్చింది. పదార్థ విజ్ఞానం పెరిగిన కొద్దీ విశ్వ రహస్యాలు మానవునకు అవగతం కావటం మొదలైంది. యూరప్‌లో 15 16 శతాబ్దాలలో జరిగిన రినైజాన్సు ఉద్యమంతో మానవ జీవిత యాత్రలో నూతన శకం ఆరంభం అయింది. మత దురాచారాలకు తట్టుకోలేకను, మత వ్యవస్థతో తృప్తి చెందలేకనూ, మానవ మేధస్సు కొంగ్రొత్త ఆలోచనా పద్ధతిని ఆరంభించింది. భౌతికాతీతమైన శక్తులలో నమ్మకం సన్నగిలి, భౌతిక పదార్థ విజ్ఞానం ఎడల ఆపేక్ష పెరిగింది. విశ్వ రహస్యాలు, పదార్థ విజ్ఞానం నుంచి తెలుసుకోవచ్చునని మానవుడు గ్రహించగలిగాడు. అప్పటినుండి ఆ పద్ధతిలో ఆలోచన, పరిశోధన మెండయింది. క్రమంగా ఈ పరిశోధన పెరగడంతో అనేక సత్యాలు అవగతమవుతున్నవి దానితో అజ్ఞానంలో ఉండగా కల్పించుకున్న ఊహలు Hypothesis పడలిపోయి నూతన వికాసం ఉదయించింది. సృష్టికారణాలను వెతుక్కునే సంరం

ఖంలో దేవుళ్ళను సృష్టించుకున్న మానవులు, పరిజ్ఞానం పెరిగిన పిమ్మట, దేవుళ్ళు నిజంకాదు. వారితో ఎట్టి నిమిత్తం లేదనే ఎరుకను సంతరించుకుంటున్నారు. దేవుళ్ళకు సృష్టికర్త అయిన మానవునకు, ఆ భావానికి స్వస్తి చెప్పడానికి కూడా అధికారం ఉంది ఐతేఅందుకు కావలసినపదార్థవిజ్ఞానం కావాలి.ఆవిజ్ఞానం ఈనాడు త్వరితగతిని విస్తృతమవుతున్నది ఈమధ్య డాక్టర్ ఖోరానా Dr. khorana కనిపెట్టిన జీవకణాల రహస్యం, సృష్టిరహస్య పరిశోధనలో విప్లవాత్మకమైన మార్పులను సాధించింది. ఈ నాడు అనేక దేశాలలో ప్రాణాన్ని life గురించి జీవకణాలను గురించిన పరిశోధనలు ఉమ్మరంగా సాగుతున్నాయి. కొద్దిరోజులలో మానవుడు పరిశోధనాగారంలో laoraotory లోనే ప్రాణాన్ని సృష్టించగలడు.

హేతుశీలి అయిన మానవుని విజ్ఞానయాత్ర ఈ విధంగా సాగుతున్నది అయితే మానవ మేధస్సుకు, విజ్ఞానానికి ఒక అంతిమ సత్యం అంటూలేదు. సత్యం కోసం జ్ఞానంకోసం మానవుడు జరిపే అన్వేషణ అనంతమయింది. అతని లోనిహేతుశీలం సతతం అతనిని పురిగొల్పుతూనే వుంటుంది. జిజ్ఞాస కలిగిస్తూనే వుంటుంది తనదృక్పదాలకు పరిశోధనలకుదారితీస్తూనే ఉంటుంది మానవునకు చైతన్యాన్ని కలిగించే శక్తి అతనిలోని హేతు శీలం.

పై వివరణలో నుండి కొన్ని సత్యాలు సుబోధకమవుతున్నవి. మానవుడు దేవుని చేతులోని కీలుబొమ్మ కాదు. దేవుడనే భావాన్నిమానవుడే కల్పించుకున్నాడు. కనుక దేవుడు పురాణాలలోని మన్మథుని లాగా మనోసంభవుడు. మానవ జీవితంమీద ఆ భావపురుషునకు అధికారంలేదు. ఊహాజనితమైన ఒక శక్తి ఊహకున్న బలమేగానివేరేలేదు. ఊహను విడనాడినప్పుడు ఆ శక్తికూడా అంతరిస్తుంది. ఆ పిమ్మట దానికెట్టి ప్రభావము ఉండదు.

తరువాత భౌతిక వాతావరణం, పరిస్థితులు, మానవునిమీద చాలా ప్రభావాన్ని కలిగి ఉంటాయి. అయితే, ఆ పరిస్థితుల ప్రభావాల అనుపానులను మానవుడు అవగాహన చేసుకున్న పిమ్మట, ఆ పరిస్థితులను, ప్రభావాలను అతను తనకు అనుకూలం చేసుకోవచ్చును. సంకల్పమే ఉండాలి గాని పరిస్థితులను తనకు అనుకూలంగా మలచుకోగల శక్తి మానవున కున్నట్లు స్పష్టమౌతూ ఉంది కనక పరిస్థితులకు మానవుడు బానిస కాడు; యజమాని.

మరొక విషయం కూడా స్పష్ట మవుతున్నది. ప్రపంచంలో భౌతిక పదార్థ సంపద వున్నది. అయితే ఆ పదార్థాల నైజం, ఉపయోగం మానవుడు తెలుసుకోవాలి. తన కొరకు, మానవ కల్యాణం కొరకు వాటిని వినియోగించుకోవాలి. దానికి అతనిలోని ఉపజ్ఞ పరిశీలన, పరిశోధన మొదలైన శక్తులు అవసరం. అవి లేకపోతే ఎంతటి విలువైన సంపద కూడా నిష్ప్రయోజనం. వాస్తవానికి ఒక పదార్థానికిచ్చే విలువ మానవుడు దానికి కల్పించే ఉపయోగాన్ని బట్టి నిర్ణయమవుతుంది అందుచేత మానవుని భావాలకు, భావనాశక్తికి, విశిష్టమైన, అమూల్యమైన స్థానముంది.

ఈ నిర్ణయాలనుబట్టి తేలుతున్న సారాంశం :— మానవుడు తన జీవితానికి తానే కర్త. తన బ్రతుకు దారులకు మరొక మార్గదర్శిలేడు; మరొక నాయకుడు లేడు. తన జీవితం, బ్రతుకు, భవిష్యత్తు, తన చేతుల లోనే వుంది. వాటికి సుందర రూపాలను సృష్టించుకోడానికి కానీ లేక వికృత రూపాలను కల్పించుకోడానికి కానీ తానే సూత్రధారుడు. మేధాసంపన్నుడైన మానవుడు, తన బ్రతుకుబాటనేకాక,సంకల్పించుకుంటే విశ్వగమనాన్నే తీర్చిదిద్దగలడు. చంద్రలోకయానం చెయ్యగల మనీషి, సూర్యలోకాన్ని కూడా చేరగలడు.

ఈనాడు ఆవిష్కృతమౌతున్న విజ్ఞానం ఇంతటి మహత్తరమైన భవిష్యత్తును సూచిస్తున్నది ఆ మహోదయ శుభసమయ మిది. తాను నెరవేర్చనున్న మహత్కార్యానికి మానవుడు ఆయత్తం కావాలి; సంసిద్ధుడు కావాలి. అందుకు అతనిలోని హేతుశీలం ఎంతగానోఉపకరిస్తుంది.అతనిగమనాన్ని సుగమంచేస్తుంది.

ఆ బృహత్కార్యానికి మానవుడు సిద్ధం కావాలంటే తనను బంధించి పీడించే బంధాలనుండి విముక్తిని పొందాలి. దేవుడు, మతం, కులం ఇవన్నీ తన సమాధానంకొరకు తానే నిర్మించుకున్న వ్యవస్థలు. అవి ఈనాడు తనను తనతోటివారితో కాని వానినిగా, వారినుండి పరాయివానినిగా చేస్తున్నాయి. మనిషికీ మనిషికీ పొరపొచ్చాలు కల్పిస్తున్నాయి. మానవ జీవితాన్ని కలుషితం చేస్తున్నాయి. సబబును ఎరిగిన

మానవుడు, హేతుశీలి అయిన మానవుడు తన ప్రగతికి, విశ్వమానవ ప్రయత్నానికి అంతరాయాలైన ఈ భావాలను విడనాడవలసి ఉంటుంది. తానుకల్పించుకున్న వ్యసనాలనుండి విముక్తుడు కావలసిఉంది.

అలాగే భాష, ప్రాంతీయ జీవితం, సంస్కృతి, మానవులు తమ సదుపాయం కొరకు నిర్మించుకున్న అంశాలు. వాటిని మనిషి హద్దుపద్దులలో పెట్టుకోవాలి గాని, వాటికి బానిస అయి లొంగిపోకూడదు ఎక్కడ వున్నా మానవుని నైజం మౌలికంగా ఒకటే కనుక, నియమబద్ధం కనుక అన్ని భాషలలోనూ, సంస్కృతులలోనూ ఒక ఏకత్వం గోచరమవుతుంది. మానవుడు చూడాలే కాని భాషా శాస్త్రవేత్తల, సంస్కృతివేత్తల పరిశోధనలను పరిశీలించాలే గాని, ఈ సత్యం ద్యోతకమవకుండా పోదు.

ఈ వ్యత్యాసాలను పెంచుకునే కదా మనుష్యులు తగవులాడుకుంటున్నది; యుద్ధాలు చేస్తున్నది; ఒకరిని ఒకరు హింస పెట్టుకుంటున్నది. ఒకరికి ఒకరు కాకుండా పోతున్నది తనలోని హేతుశీలం మరుగున పడకుండా ఉంచుకోగలిగితే మానవుడు, తానులోనైన ఈ ప్రలోభాలను గ్రహించగలడు. కొంతమంది తక్కువవారనీ, హీన కులసులనీ, మరికొంత మంది గొప్పవారనీ, ఉన్నత కుల సంజాతులనీ అనుకోడానికీ నల్లవారూ, తెల్లవారూ వేరు వేరని భావించడానికీ హేతుశీలికి సాధ్యమౌతుందా? కావడానికి అవకాశం లేదు. అలాగే కొంతమంది, కొన్నిదేశాలు అష్టైశ్వర్యాలతో తులతూగుతూ వుంటే. మరికొంతమంది కొన్ని దేశాలు దుర్భర దారిద్ర్యానికి, అవమానాలకు లోనుకావడం హేతువాది సహించగలడా? సహించలేడు. అతనిలోని సబబు, ఆ సబబు సంతరించిపెట్టే న్యాయ దృష్టి అతనిని అట్టి విషమ వ్యత్యాసాల యెడల, విముఖుణ్ణి చేసయి వాటిని అంతమొందించేందుకు కృత నిశ్చయిణ్ణి చేసయి.

పై భావంలో నుండి మరొక ఆలోచన ఉత్పన్నమవుతుంది ఈ అనారోగ్యకరమైన వ్యత్యాసాలను అంతమొందించడం ఎలా? అన్నదే ఈ ఆలోచన. దానికి పరిష్కార మార్గం మనిషిలోని హేతుశీలాన్ని చంపి, మానవతను నలిపివేసి అతనిలోని పశుత్వాన్ని రెచ్చగొట్టి దౌర్జన్యచర్యలకు దింపడం ఒకటేనా? మనుష్యులనువర్గాలుగాచీల్చి ఆ వర్గాలమధ్య ఆరనియుద్ధాన్ని నడిపించడం మినహా మరొకదారిలేదా? ఆ మార్గమే శరణ్యమైతే మనిషిలోని హేతుశీలం నశించి మూర్ఖత్వం ముదరదా? సబబుపోయి మూఢత్వం హెచ్చదా? ఆ రీతిగా పెరిగేవర్గాలు. మత కుల ప్రాంతీయ తత్వాలతో పుట్టుకువచ్చిన వర్గాలకంటే, పర్యవసానంలో భిన్నంగా ఉంటవా వాటి ప్రభావాలు వేరుగాఉంటవా? మానవాళిని చిన్నాభిన్నము చిందర వందరచేయవా? ద్వేషపూరితమైన మానవుడు వర్గాల క్రింద చీలి తన జీవితాన్ని దుర్భరం చేసుకోడా?

మానవునిలోని సబబు మరొక మార్గాన్ని సూచిస్తున్నది. 'తానుతప్పుచేస్తే దేవుడుచూస్తాడు శిక్షిస్తాడు' అనేభయంకంటేఆతప్పుతనకూతనచుట్టూవున్నమానవ సమాజానికి హానికరమని తెలుసుకునే ఇంగితజ్ఞానం ఉన్నతమైంది, శాశ్వతమైంది కూడా! మానవునిలో ఇమిడి వున్న హేతుశీలం ఇట్టి ఇంగితజ్ఞానాన్నిప్రసాదిస్తున్నది. మనిషికి న్యాయదృష్టిని, శీల సంపదనూ సంతరించి పెడుతున్నది. హేతుశీలం మూలంగా మనిషిలో నైతికభావం పుడుతుంది. అట్టి నైతిక స్థాయిని మనుష్యులలోపెంచి సామాజిక న్యాయాన్ని Social - Justice సమాజ కల్యాణాన్ని సృష్టించుకోవడం ఎందుకు సాధ్యంకాదు? అప్పుడు మానవాళిలో పరస్పర గౌరవం, అవగాహన అనురాగం పెరగవా? మానవ జీవితం ఆనందమయం కాదా? ఆలోచనాపరులందరూ ఈ సమస్యను కూలంకషంగా చర్చించాలి. నిగ్గు దేల్చాలి

ఈ విధంగా హేతుశీలం మానవుని సహజలక్షణమై అతని జీవితాన్ని ప్రభావితం చేస్తున్నది. నిత్య జీవితంలో అతనికి ఏడుగడై మార్గదర్శి అవుతున్నది. అందుచేత ప్రతి ఒక్కరు తమలోని హేతుశీలం పరిస్థితుల ప్రభావాలకు లోనై మరుగుపడకుండా అఖండంగా వెలిగే జ్యోతిరీతిగా పోషించుకోవాలి. శాస్త్రీయ దృక్పథాన్ని అలవచ్చుకోవాలి. ఈ హేతుశీలాన్ని శాస్త్రీయ దృక్పథకాన్ని తన నిత్యజీవితంలో వినియోగించు కోగలిగితే మానవుడు ఔన్నత్యాన్ని సాధించగలడు. ఉన్నత పథాల విహరించగలడు. అందుకుముందుగా తన శక్తిని, నైజాన్ని మానవుడు గుర్తించగలగాలి.

# దర్శనములు

రచన:

**పండిత గోపదేవ్**

'దృశిర్ ప్రేక్షణే' అను ధాతువునకు 'ల్యుట్' ప్రత్యయము చేర్చిన 'దర్శనము' అను పద మేర్పడు చున్నది దేనిచే చూడబడునో - తెలియబడునో అది దర్శనమని చెప్పనగును. జ్ఞానము కలిగించునది దర్శన మని భావము.

మానవుడు తెలిసికొను స్వభావముకలవాడు. 'మను' ధాతువునకు అవబోధనమని అర్థము. కావున మానవు డన తెలుసుకొనగలవాడని స్పష్టమగుచున్నది. ప్రపంచ దేశములందుగల బుద్ధిమంతులైన మానవులు తాము తమ చుట్టునున్న వస్తువులను విశేషముగా తెలిసికొన యత్నించుచు వచ్చిరి. వారు తెలిసికొనిన క్రమమును తెలుపునవియే దర్శనములు. మనుష్యుడు బాల్యదశయందుకూడ తన చేతికందిన వస్తువున్క్రింది మీదిచూచి అవేమో తెలిసికొన యత్నించుటచూతుము. కొందరు బాలురు తమ చేజిక్కిన పదార్థమును ముక్కలుచేసి, దాని యవయవములను దానినుండి వేరుచేసి, అది యేమో తెలిసికొన యత్నింతురు. పెద్దల కా బాలురు తమకందిన వస్తువులను పాడు చేయు చున్నట్లు కన్పించును. కాని యిది సత్యము కాదు. బాలుర కా వస్తువేమో తెలిసికొన కోరికకలిగి దాని యవయవములు విడదీసిన, యది ఏమో తెలియు నని అట్లుచేయుదురు. బాలుర ఈప్రవృత్తి వారిలోగల జిజ్ఞాసాభావమును తెలుపుననుట ఆలోచకులకు తెలి యని విషయము కాదు. అట్లే పెద్దల యందును 'తా ననేమి ? తన చుట్టునున్న పదార్థములేమిటి ? రాత్రియందు ఆకసమున మినుకు మినుకు మనుచు నానావిధ కాంతులనీను పదార్థము లేమిటి ?' అను జిజ్ఞాసలు కలుగుచుండుట యప్రసిద్ధము కాదు. ఇట్టి జిజ్ఞాసా ఫలితమే నేడు దర్శన పదముతో వ్యవహ రింపబడు సాహిత్యము.

వస్తువులను తెలిసికొనుటకు ప్రయత్నించుట మానవ స్వభావము. అయినను అందరు వస్తు యథా ర్థత్వమును తెలిసికొనుట సులభము కాదు. బాహ్య పదార్థములు, స్థూలముగా నున్నంత వరకు, అవి మనుజుని ఇంద్రియముల (త్వక్కు చక్షువు, శ్రోత్రము జిహ్వ ఘ్రాణము) చే గ్రహింపబడును. వాని స్థూల రూపము ఇంద్రియ గోచరమగునని భావము. కాని మనకు స్థూలముగా కనబడు నా వస్తువుల వాస్తవిక రూప మదియేనా ? ఆ రూప మెల్లప్పుడు నట్లే యుండునా ? మనకు తెలియబడునది వస్తువా ? వస్తువు ధర్మములా ? ఒకానొక వస్తువు ఒకనా డుండునట్లు మరియొకనా డుండ దేల ? అను నిట్టి ప్రశ్న లెన్నియో మానవ మస్తిష్కమున నేర్ప డును. వీటి కన్నింటికి సమాధానములే దర్శనములు.

వస్తువును విశేషించి తెలిసికొనగోరు వ్యక్తి ఈ వస్తువు మూలరూప మేమో తెలిసికొనగోరును. తనకు స్థూలముగా గోచరించు పదార్థమును పరికించిన కొలది యిది యనేక తత్త్వములతో కూడియున్నట్లు తోచును. ఏ తత్త్వములతో నది ఏర్పడిందో, యా తత్త్వములు దానికి మూలపదార్థములై యుండును. వాని సంయోగ విశేషము వలన నది ఏర్పడినదని నిర్ణయింప నగును. ఇట్లు స్థూల వస్తువును విభజించి, దీని మూల పదార్థములను తెలిసికొనుట దార్శనికుని ముఖ్యకార్యము స్థూలముగా నింద్రియ ములచే నెరుగబడు నీ ప్రపంచమునకు గల మూల తత్త్వములను తెలిసికొను పద్ధతికే దర్శనమని చెప్పిన బాగుండునని తోచుచున్నది. దర్శనములిట్లే లోకమున నెన్నియో యేర్పడినవి. స్థూలజగత్తును జూచి, దీనికి మూల కారణములెయ్యవియో తెలిసికొన యత్నించిన మహనీయులలో కొందరు, ఈ ప్రపంచమునకుమూల కారణ మొకటియేఅనియు మరికొందరుకాదురెండనియు అదియును కాదు మూడని కొందరు నిర్ణయించి యున్నారు. దర్శనముల నధ్యయనము చేసినందున తెలియు విషయ మింతకు మించి యుండదు.

దర్శనము ఒక్కటి కాదు. అనేకములు. పాశ్చాత్య దర్శనములు, ప్రాచ్య దర్శనములు, ఆస్తిక దర్శన

ములు, నాస్తిక దర్శనములు, బౌద్ధ దర్శనములు, జైన దర్శనములు, అని యెన్నియో దర్శనములు ఉపలబ్ధము లగుచున్నవి. వైదికులలో వేదములకు ఉపాంగములని చెప్పబడు షడ్దర్శనములు అతిప్రసిద్ధములు.

పుష్పదంతుని 'శివ మహిమ్నస్తోత్రము'న సాంఖ్య, యోగ పాశుపత, వైష్ణవ దర్శనముల ప్రసక్తి చూడనగును కౌటిల్యుని అర్థశాస్త్రమునందు సాంఖ్య యోగ లోకాయిత దర్శన నామములు కనబడును. గురుగీత యందు గౌతమ, కణాద, కపిల పతంజలీ, వ్యాస, జైమినులచే వ్రాయబడిన షడ్ దర్శనముల నామములు చూడనగును. సర్వ సిద్ధాంత సంగ్రహము నందు శంకరాచార్యులు లోకాయత అర్హత, బౌద్ధ, న్యాయ, వైశేషిక, భాట్టప్రభాకర మీమాంస సాంఖ్య, యోగ వేదాంతములను గూర్చి ప్రసంగించుట చూడ నగును. పైనజూపిన దర్శనములన్నియు, భారతీయ దర్శనములనియే చెప్పనగును. ఇందు న్యాయ, వైశేషికములు సాంఖ్యయోగములు, పూర్వోత్తర మీమాంసలు (మీమాంస, వేదాంత దర్శనములు) అను ఆరును షడ్ దర్శనములనియు, షడ్ శాస్త్రములనియు చెప్పబడుచున్నవి. భారతీయ దర్శనములలో నియ్యవి ఆస్తిక దర్శనములనియు వ్యవహరింపబడు చున్నవి.

మానవులలో వస్తువులను విశ్లేషించి, వాని మూల కారణములను తెలిసికొనవలెనను కోరిక కలుగుటకు కారణమేమై యుండును ? మానవుని ప్రవృత్తులు— అతడొనర్చె కర్మలు నిష్ప్రయోజనము లెన్నడును కావు. ప్రయోజనము లేని క్రియలందు, మానవులకు ప్రవృత్తి కలుగదు కావున పదార్థ విశ్లేషణ ప్రవృత్తియు, స్వప్రయోజన మనక తప్పదు. ఆ ప్రయోజనమేమి ? లోకమునమానవుడు జీవితముననెన్నియో సుఖదుఃఖముల ననుభవించును,సుఖము నభిలషించును. దుఃఖము నభిలషింపడు. ప్రతి వ్యక్తియు సుఖము నభిలషించి, దాని ప్రాప్తికొరకు ప్రవృత్తి కలవాడగును. దుఃఖము నభిలషింపక దానినుండి నివృత్తుడగును. ఇట్లు జీవితకాలమంతయు తనకు ప్రియకరమగు సుఖప్రాప్తికై యత్నించును. దుఃఖమునుండి పూర్తిగ విడివడనంతవరకు, మానవుడు తన యత్నమునుండి విరమించడు. కావున, మానవ జీవితమునకు, దుఃఖవిముక్తి, సుఖప్రాప్తి లక్ష్యమని యెంచవలసి వచ్చుచున్నది. ఇట్టిలక్ష్యమును సాధించుటకే దార్శనికుడు తనబుద్ధి బలము నుపయోగించి, ప్రపంచ మూలతత్త్వముల నన్వేషింపదొడగును ఈ తత్త్వాన్వేషణమే దర్శన శాస్త్ర లక్ష్యము. తత్త్వ జ్ఞానమే దుఃఖ నివృత్తికి, సుఖప్రాప్తికి ముఖ్య సాధనము. కావుననే ఆస్తిక దర్శనముల కన్నింటికీ నొక లక్ష్యమున్నట్లు చూడనగును అదియును పరమ తత్త్వము పరమేశ్వర సాక్షాత్కారమే. అందువలననే ఉపనిషత్తులలో—

> 'తమాత్మస్థం యేను పశ్యంతి ధీరాః
> తేషాం సుఖం శాశ్వతమ్, నేతరేషామ్'

అని వివరింపబడినది.

మానవుడు అనుభవించు దుఃఖము లన్నింటిలో మృత్యు దుఃఖ మత్యంత దారుణమైనది. దానికి భయపడి నంతగా మానవు డితర దుఃఖమునకు దేనికిని భయపడడు. మానవునికి కావలసినది, మృత్యుపర్యంత దుఃఖములనుండి విముక్తియే కాదు అతనికి శాశ్వత సుఖము— ఆనందము—కూడ కావలసియున్నది; జీవుడు దుఃఖముల నుండి విడివడి, అనుభవ రహితుడై యుండజాలడు. శాశ్వత సుఖము – ఆనంద ప్రాప్తి యతనికి ముఖ్యము. అతని కట్టిస్థితి లభించుటకై, పరమేశ్వరుని సాక్షాత్కారము నకు మించి మరియొండు ఉపాయము – మార్గము లేదు. దానినే మంత్రవర్ణము లిట్లు వర్ణించు చున్నవి.

> 'తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి
> నాన్యః పంథా విద్యతే ఽయనాతు'

భారతీయ దర్శనము లిట్టి సాధ్యమును సాధించుటకే తత్త్వాన్వేషణము నారంభించినవి. కావుననే గోతముడు ".... తత్త్వజ్ఞానాత్ నిఃశ్రేయసాధిగమః" అని తన దర్శనమున సూత్రించి యున్నాడు.

దార్శనికులెల్లరు తత్త్వ జ్ఞానము కొరకు ప్రయత్నించునట్లు దర్శనశాస్త్రములను చదివినమీదట బోధపడును కావుననే జ్ఞానము కలుగుటకు గల సాధన సంపత్తినిగూర్చి ప్రతిదర్శనమునందునుచర్చించుటయు చూతుము జ్ఞాన సాధనము లేక జ్ఞానముకలుగనేరదు కావున జ్ఞానము కలుగుటకు గల సాధనము ఏవి ? జ్ఞానమునకు 'ప్రమ' యని నామాంతరము. ప్రమను

కలిగించునది ప్రమాణము. ఇట్లు ప్రమాణమన జ్ఞాన సాధనమని యర్థము. ప్రమాణము మూలమున తెలియ బడునది ప్రమేయ మనబడును. ప్రపంచతత్త్వము లన్నియు ప్రమేయముగాను వానినితెలుపు దానిజ్ఞానమును కలిగించు సాధనములు ప్రమాణములనియు వ్యవహరింపనగును. అందువలననే దర్శనము లందు ప్రమాణ ప్రమేయ భేదములతో రెండు విధముల తత్త్వ జ్ఞానము కొరకు యత్నించియున్నట్లు స్పష్టమగును. దర్శనము లలో ప్రమాణములకు సంబంధించిన చర్చ విశేషించి చూడనగును. దర్శన కర్తలలో ఒకరు ఒకే ప్రమాణమును, కొందరు రెండు ప్రమాణములను, మరి కొందరు మూడు ప్రమాణములను ఇంక కొందరు నాలుగు ప్రమాణములను ఇట్లు ఎనిమిది ప్రమాణముల వరకు జ్ఞాన సాధనములుగ నంగీకరించిన వారు ఉన్నారు వస్తువు-తత్త్వముయొక్క-సత్యాసత్యములను నిర్ణయించుటకు ప్రమాణము తక్క మరి యొండు సాధనమే లేదు. దీనిని బట్టి దర్శనములందు ప్రమాణములకు గల మహత్త్వమును చదువరు లూహింపగలరు.

ప్రమాణములకు భారతీయ దర్శనకర్తలు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము శబ్దము, ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావమునని నామకరణము చేసి యున్నారు. ఇవియే ప్రమాణములు- విశ్వమున గల ప్రతితత్త్వము ఈ ప్రమాణములలో నేదేని యొక ప్రమాణముచే తెలియదగినదై యుండవలెను. అట్లు తెలియబడని నాడా తత్త్వమునకు ఉనికి సత్తయే లేదని యర్థము. ఉనికిలేని తత్త్వము ప్రమేయము కానేరదు. ఇట్లు ప్రమాణ గమ్యమైన తత్త్వము తదుపరి లక్షణాదులచే వివరింపబడును ప్రమాణము మూలమున వస్తువు తెలియబడి దానిని గ్రహించుటకగు ప్రవృత్తి సఫలమయిన నాడా వస్తుతత్త్వము సిద్ధించును. అది సత్యముగా గ్రహింపబడును

కావుననే దార్శనికులు "లక్షణ ప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః, నతుప్రతిజ్ఞా మాత్రేణ" * లక్షణ ప్రమాణముల మూలమున వస్తువు సిద్ధించును. కాని యొక రొక వస్తువు వున్నదని ప్రతిజ్ఞ చేసినంత మాత్రమున దాని యునికి సిద్ధింపదు' అని చెప్పుదురు.

భారతీయ దర్శనములను ఆస్తిక, నాస్తిక భేదములతో రెండు విధముల విభజింప వచ్చును.

చార్వాక, బౌద్ధ, జైన దర్శనములు నాస్తిక దర్శనములనియు, న్యాయ, వైశేషిక, సాంఖ్య యోగ, పూర్వోత్తర మీమాంసలు ఆస్తిక దర్శనములనియు వ్యవహరింపబడును.

## 1. చార్వాక దర్శనము

జడవాదులను చార్వాకులందురు వీరు ప్రపంచ పదార్థములన్నియు జడములేయనియు, చేతనమన పదార్థమొండు లేదనియు చెప్పుదురు. ప్రత్యక్ష ప్రమాణమును మాత్రమే వీరు అంగీకరింతురు- అనుమాన ప్రమాణములు నిశ్చిత వస్తు తత్త్వమును తెలుపజాలవని వీరు చెప్పుదురు.

ప్రత్యక్షమువలన భౌతిక జగత్తు తెలియును పృథివి, జలము, అగ్ని, వాయువు, అను నాలుగు భూతములనే వీరంగీకరింతురు. ఆకాశము నంగీకరింపరు. ప్రాపంచిక పదార్థములన్నియు నీ నాలుగు భూతముల సమ్మేళనమువలన నేర్పడుచున్నవి. నేను లావుగా, సన్నగా, అందముగా ఉన్నాను నాకు జ్వరము వచ్చినది. నేను కుంటి, గ్రుడ్డివాడను. నడువ లేను' అను నిట్టి ప్రయోగములనియు శరీరమునేకదా బోధించును. అంతకుమించి చేతనమనునది ఎక్కడ నున్నది. అదియే లేనప్పుడు ఈశ్వరునకు ప్రపంచమున ఉనికి ఎక్కడ నుండి వచ్చును? భూత సమ్మేళనము వలననే శరీరము అందు జ్ఞానాది గుణములు నుద్భవించును. జ్ఞానేచ్ఛాది గుణముల కాధారముగ నొక చేతన పదార్థ మంగీకరించుట వ్యర్థము. ఆ ధర్మము లన్నియు శరీరమునకు చెంది నవే యని చార్వాక మతము. శరీరముతో బాటు చేతనాది ధర్మములుగూడ నశించును. మరణానంతరము మిగులున దేమియు నుండ దందురు

ఈ శరీరముతో ననుభవించు సుఖములకు మించి మరియొండు అలౌకిక సుఖమేమియు లేదు.

"అంగనాలింగనా జన్య సుఖమేవ పుమర్థతా"
'స్త్రీ పురుష శరీర సంబంధము వలన కలుగు సుఖమే పురుషార్థము. ఈజన్మమున సాధింపదగినదంతకుమించి యేమి యున్నది? మనుజులనుభవించు సుఖములన్నియు

దుఃఖములతో కూడియుండును. కావున ఆ సుఖము లను కూడా దుఃఖములుగనే భావించి వానిని విడుచుట బుద్ధిమంతుల లక్షణముకాదు. లేని ఈశ్వరుని ఆరాధించి యేదోశాశ్వత సుఖమునునుభవింప గోరుట, మూర్ఖత యగుననియు అందులకే యమనియమాదులను పాటించుచు, శరీరమును కృశింపచేయుట యంత కంటె అజ్ఞానమనియు, చార్వాకులభిప్రాయ పడుదురు.

## 2. జైనమతము

జైన మతప్రవర్తకులు తీర్థంకరులు. వీరు మహావీరస్వామి ప్రభృతులు ఇరువదినాలుగురు. వీరు చార్వాకుల వలె కాక ప్రత్యక్షము, అనుమానము, శబ్దము, అను మూడు ప్రమాణముల నంగీకరింతురు. జైనుల దృష్టిలో ప్రత్యక్షమువలన భౌతిక పదార్థముల జ్ఞానము కలుగును. అనుమానము వలన ఆకాశము, కాలము, ధర్మము, అధర్మము తెలియునందురు.

జైనులు ఆకాశముతో కలిసి అయిదు భూతముల నంగీకరింతురు. ఆకాశము, కాలము ధర్మము అధర్మములే కాక, ప్రత్యక్షానుమాన ప్రమాణముల ద్వారమున సజీవ పదార్థములందు చేతన పదార్థము కలదనియు, నది జీవుడన బడుననియు అంగీకరింతురు. ప్రత్యక్షము మాత్రము అంగీకరించిన పక్షమున జడ పదార్థా సంయోగము వలన చేతన ముద్భవించుననుటకు ప్రత్యక్ష దృష్టాంతమే లభింపదు. కావున అనుమాన ప్రమాణ మంగీకరింపక తప్పదందురు. జీవుడు లేకున్న శరీరము చలింపనేరదనియు వారు వ్రాక్కుత్తురు.

జైనులు ప్రాణులలోనే కాక, వృక్షాదులందును జీవులున్నట్లు అంగీకరింతురు. ప్రతి జీవునకును అనంత దర్శనము, అనంతజ్ఞానము అనంతవీర్యము, అనంత సుఖము పొందుటకు శక్తి కలదందురు. ఈ శక్తి యుక్తులన్నియు, జీవులకు స్వాభావిక గుణములని వారి మతము. జీవుల ఈ యాంతరిక స్వరూపము, వారి కర్మల మూలమున దాగియుండును. జీవులు కోరి, కర్మద్వారమున శరీరములను ధరింతురు. ఇట్లు జీవులు బంధనమున బడుదురు. కర్మలను వీడి బంధముక్తులగుదురు. ముక్తులైన జీవులు స్వాభావిక గుణములతో ప్రకాశింతురని జైనులంగీకరింతురు.

తీర్థంకరుల జీవనము, వారి యుపదేశములును మోక్ష ప్రాప్తి సర్వ విధముల సంభవము లగుటకు ప్రమాణములు. వారు మోక్ష ప్రాప్తికి మార్గ ప్రదర్శకులు.

1. సమ్యక్ దర్శనము- జైన మహాత్ముల ఉపదేశము లందు శ్రద్ధాభావము.

2. సమ్యక్ జ్ఞానము- వారి ఉపదేశముల యథార్థ బోధ.

3. సమ్యక్ చరిత్ర : నైతికనియమానుకూలాచరణము నను మూడును ముక్తికి సాధనములు. ఇందు సమ్యక్ చరిత్రయనగా- అహింస సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము నను యమములను పాలించుటయే.

జైనులు ఈశ్వరు నంగీకరింపరు. తీర్థంకరులే వారికి ఈశ్వర స్థానీయులు తీర్థంకరుడు ఈశ్వరుని వలె సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు నని అంగీకరింతురు. జైనుల జీవునకు తీర్థంకరులే యాదర్శ స్వరూపులు.

జీవుల యెడ దయా భావము కలిగియుండుట జైన మతస్థులకొక విశేషగుణము. జైన దార్శనికులు ప్రతి వస్తువును అనంత దర్శకమనియందురు. ప్రతి వస్తువు దృష్టి భేదకారణముగా భావాత్మకము, అభావాత్మకము నగును. వస్తువుయొక్క సత్యత, మనదృష్టి విశేషముపై అధారపడి యుండును. కావున జనులు తమ అభిప్రాయమును ప్రకటించుటలో జాగరూకత చూపవలెను. అభిప్రాయమును ప్రకటించుటలో అసత్యత రాకుండునట్లు చూడవలెను. వ్యక్తి తన యభిప్రాయమును ప్రకటించునపుడు తన ఉక్తికి 'స్యాత్' — 'కావచ్చును' అను పదమును జోడించుట యుక్తమందురు. అట్లు చేయుటవలన ఇతరుల అభిప్రాయము కూడ సత్యము కావచ్చుననుటకు అవకాశముండునని వారి భావము.

జైన దర్శనములు ఈశ్వరాస్తిత్వమును అంగీకరింపవు. కాని అనేక తత్వములు యునికి నంగీకరించును. బాహ్య జగత్తుయొక్క అస్తిత్వము నంగీకరించును

## 3. బౌద్ధ దర్శనములు

బుద్ధ భగవానుడు చేసిన యుపదేశముల నాధారము చేసికొని దర్శనముల రచన జరిగినది. బుద్ధుడు

మానవులకు గలుగు జరామరణ రూప దుఃఖములను జూచి దుఃఖితుడై, ఆ దుఃఖ కారణముల నెరిగి వానిని రూపుమాప గోరి బహుకాలము తపమాచరించెను. అంతమున నతనికి బోధ కలిగి బుద్ధుడైనాడు ఆ బోధ సారము ఆర్యసత్య చతుష్టయ మన దగును.ఆ సత్యము లెవ్వియన :- (1) దుఃఖము, (2) దుఃఖ కారణము, (3) దుఃఖహాని, (4) దుఃఖ నాశనమునకు ఉపాయము.

లోకమున దుఃఖము నంగీకరింపని వారు లేరు. కాని బుద్ధుడు దుఃఖమనునది కొండొక విశేషావస్థలో నేర్పడునది యని యెంచబడు అయ్యది సర్వావస్థల యందును సర్వదా సర్వజీవులు, ప్రపంచము ననుభవించుచున్నారని బుద్ధుని సూక్ష్మదృష్టి కవగత మయ్యెను. కావున సుఖానుభూతియు వాస్తవమున నతని దృష్టిలో దుఃఖమే యగుచున్నది.

దుఃఖము కారణములేక కలుగదు. కారణము లేక యేదియు కలుగదని బుద్ధునిభావము. ప్రపంచ వస్తువు లన్నియు కార్యకారణ భావబద్ధములని యాతని సిద్ధాంతము.

అందువలన వస్తువులన్నియు అనిత్యములే. జన్మ జరామరణాది దుఃఖములుకూడా నిత్యములు కావు అవియు కారణజనితములే. జన్మమునకు కారణము తృష్ణ. అది సాంసారిక విషయముల వంకకు ఆకరించును. అజ్ఞానమువలన మనుజులలో తృష్ణయేర్పడును. విషయముల యదార్థ జ్ఞానము సంపాదించి, వాని క్షీణికతను, దుఃఖజనకతను గుర్తించిననాడు జనులకు తృష్ణ కలుగదు. అదిలేని యెడల పునర్జన్మముండదు. జన్మయే లేనినాడు దుఃఖములుండవు. వాని కంతము - నాశము కలుగును. మూడవ సత్యము దుఃఖనాశము. దుఃఖకారణము నశించిన దుఃఖము నశించును.

నాల్గవ సత్యము దుఃఖనాశనమునకు ఉపాయము. ఇయ్యది అష్టమార్గ మనబడును. ఇందు ఎనిమిది సాధనములున్నవి. 1. సమ్యక్‌దృష్టి 2 సమ్యక్ సంకల్పము, 3. సమ్యక్ వాక్కు, 4. సమ్యక్కర్మాంతము, 5. సమ్యక్ ఆజీవము, 6. సమ్యక్ వ్యాయామము. 7. సమ్యక్ స్మృతి, 8. సమ్యక్ సమాధి. ఈ సాధనములవలన అవిద్య, తృష్ణ రెండును నశించును.



అందువలన మనస్సున దృఢత, శాంతి యేర్పడును. ఇట్లు దుఃఖములు నశించి, పునర్జన్మము కలుగనేరదు. ఈ స్థితినే బౌద్ధులు నిర్వాణ మందురు. బుద్ధుని ఉపదేశ సార మంతయు పైన చూపిన నాలుగు ఆర్య సత్యములందే నిహితమై యున్నవి.

బుద్ధునికి తరువాత వారి శిష్యులలో ననేకులు బుద్ధుని యుపదేశాంతర్గత దార్శనిక భావములను వివరించి యున్నారు. క్రమముగా బుద్ధుని అనుయాయులలో ననేక శాఖ లేర్పడినవి.

1. మాధ్యమికవాదము, శూన్యవాదము :- ఈ మతము ననుసరించి ప్రపంచమంతయు శూన్య మన బడును. బాహ్యాంభ్యంతర విషయములన్నియు అసత్ పద వాచ్యములే.

2. యోగాచార మతము- విజ్ఞాన వాదము - బాహ్య పదార్థములన్నియు నీ మతమున అసత్యము లన బడును. బాహ్యమున గోచరించు పదార్థము, చిత్త ప్రతీతికి మించి మరియొండేమియు కాదు. చిత్తము నకు మాత్రమే అస్తిత్వముండును. చిత్తము లేదనుట తగదు. అది లేనినాడు విచారమునకు ప్రసక్తియే యుండదు. అభ్యంతర వస్తువులు లేక చిత్త విచార మేర్పడదు కావున వస్తువు లన్నియు అభ్యంతర ములే, వానికి సంబంధించిన చిత్త ప్రతీతియే బాహ్య పదార్థము. వాస్తవమున బాహ్య పదార్థము లేనే లేదు. ఇదియే విజ్ఞానవాదము.

## 3. సౌత్రాంతికము

ఈ మతము నంగీకరించు బౌద్ధులు, బాహ్యాభ్యంతర వస్తువులు ఉభయములు సత్యములే యందురు. బాహ్య వస్తువులేనినాడు కొండొక వస్తుజ్ఞానము కలుగవలె ననిన బాహ్యవస్తువు నపేక్షింప వలసిన యవసరమే యుండకుండవలెను. మనస్సులోనే వస్తు జ్ఞానము కలుగవలెను. అట్లుగాక బాహ్యవస్తు వపేక్షింప బడుచున్నది. బాహ్యవస్తువులను కూడా నంగీకరింప వలయునని వారి మతము.

## 4. వైభాషికులు

వైభాషిక మతములకు సౌత్రాంతిక మతముతో మిక్కిలి సామ్యముకనిపించును. వీరును బాహ్యాభ్యంతర వస్తుసత్తా నంగీకరింతురు. వైభాషికులు బాహ్య

వస్తువులు ప్రత్యక్షములగు నందురు. సౌత్రాంతికులు బాహ్యవస్తువులను ప్రత్యక్షమనక ఆనుమానికము లందురు.

ధార్మికప్రశ్నల నాధారము చేసుకొని బౌద్ధులలో రెండుసాంప్రదాయము లేర్పడినవి. అందొకటి హీన యానము. మరియొకటి మహాయానము.

హీనయానము దక్షిణ భారతమునందును, బర్మా, అస్సామ్, లంకలలోను వ్యాపించినది. మహాయానము టిబ్బత్ చైనా, జపానులలో వ్యాపించినది. శూన్య వాదము, విజ్ఞానవాదములు రెండును మహాయానాంతర్గతములు - సౌత్రాంతిక వైభాషికములు హీనయానాంతర్గతము లనవచ్చును.

నిర్వాణమననేమి ? అను సమస్యను పరిష్కరించుటలో నీసాంప్రదాయ భేదమేర్పడినట్లు తోచును. నిర్వాణము ద్వారమున వ్యక్తి తన దుఃఖములను నశింపజేయును. కావుననది యభీష్టమని హీనయానులమతము. మహాయానులు నిర్వాణమున కుద్దేశ్యములు కేవలము తనదుః ఖముల కంతముచేయుట కాదు. నిర్వాణమున కుద్దేశ్యము పూర్ణ జ్ఞానము సంపాదించి, తన్మూలమున దుఃఖగ్రస్త సమస్త ప్రాణులను దుఃఖముల నుండి విముక్తులం జేయుటయు ననియంగీకరింతురు.

## ఆస్తిక దర్శనములు :

1. న్యాయదర్శనము : ఈ దర్శనము పదార్థ వాదమునకు చెందినది. ఇదియుక్తి ప్రధానము దీనికి కర్త గౌతమ మహర్షి. ఇందు ప్రత్యక్షాది నాలుగు ప్రమాణములు ప్రధానముగ నంగీకరింపబడును.

1. ప్రత్యక్షము : ప్రతి ఇంద్రియము ప్రత్యక్ష ప్రమాణము అనబడును. ఇంద్రియ జ్ఞానము ప్రత్యక్షము లేక అపరోక్ష మనబడును. ఈ జ్ఞానము ఇంద్రియార్థ సన్నికర్షము వలన కలుగును, కానీ, యిది భ్రమాత్మకము కాని, సంశయాత్మకము కాని, వస్తు సంజ్ఞాశ్రవణము వలన కలిగినదిగా గాని ఉండరాదు.

2. అనుమానము : ఇది ప్రత్యక్ష పూర్వకమగును. ధూమమును ప్రత్యక్షముగా చూచి అది యున్నతావున అగ్ని యున్నదని ఊహించి తెలుసుకొందుము. ఇందు ధూమము, అనుమాపకము, అగ్ని అనుమితము. ఈ అనుమానము ముప్విధములు.

1. పూర్వవదనుమానము:కారణమును చూచి కార్యము నూహించుట మేఘోన్నతిని జూచి రాబోవు వర్షమునూహించుట.

2 శేషవదనుమానము: కార్యమును జూచి కారణమునూహించుట. సుఖదుఃఖములను జూచి తత్కారణము లైన శుభాసుభ కర్మల నూహించి తెలుసుకొనుట. పుత్రునిజూచి తండ్రినితెలుసుకొనుట.

3. సామాన్యతో దృష్టానుమానము : కార్యత్వ సామాన్యమును జూచి కర్త నూహించుట సృష్టియందలి రచనా విశేష. రూపకార్యత్వమును జూచి తత్కర్త యగు పరమేశ్వరు నూహించుట.

అనుమాన ప్రమాణమునందు సాధ్య సాధనములకు గల, నియత సహచర్య జ్ఞానమెంతయు ముఖ్యమగును అగ్నిసాధకమగు అనుమానమునందు, ధూమాగ్నులకు గల నియత సహచర్యము తెలియనివాడు ధూమ మున్నచోట అగ్ని యుండునని ధూమమును జూచి తెలిసికొనజాలడు.

ఉపమానము :- సాదృశ్య జ్ఞానము ఉపమాన ప్రమాణ మనబడును. రెండు వస్తువులలో నుండు సాదృశ్య విజ్ఞానము కలవాడు ఆ సాదృశ్యమున తెలియని వస్తువును తెలుసుకొనును. గోసాదృశ్యము గవయమునం దుండుట జూచి గవయమును తెలిసికొనును.

4. ఆప్తులుచెప్పు వాక్యము శబ్దప్రమాణము : చారిత్రకులుచెప్పు వాక్యములు విని, గతించిన అశోకాది చక్రవర్తుల జ్ఞానము కలుగును. పరమాప్తుడగు పరమేశ్వర ప్రదత్తవేదము శబ్దప్రమాణముగా ఆస్తికు లంగీకరింతురు.

ఇతరములగుఐతిహ్యము, అర్థాపత్తి, అసంభవము, అభావమునను ప్రమాణము లన్నియు, పై నాలుగు ప్రమాణములలో అంతర్భూతములుగా నైయాయకు లంగీకరింతురు.

ప్రమాణము, ప్రమేయము, సంశయము ప్రయోజనము, దృష్టాంతము, సిద్ధాంతము, అవయవము, తర్కము, నిర్ణయము, వాదము, జల్పము, వితండ, హేత్వాభాసము, ఛలము, జాతి, నిగ్రహస్థానము అనుపదునారుపదార్థములనుగూర్చి న్యాయ దర్శనముచర్చించును. ఈ తత్వముల జ్ఞానము నిఃశ్రేయసము- మోక్షమునకు

సాధనమని నైయాయికుల సిద్ధాంతము. వారు జీవేశ్వరుల ప్రత్యేకపదార్థములుగా నంగీకరింతురు. ఇచ్ఛా ద్వేష సుఖదుఃఖ ప్రయత్న జ్ఞానములు జీవాత్మకు లింగములు. ఈశ్వరుడు వ్యాపకతత్వము జీవులకు కర్మఫలముల నొసంగును. అతడు సృష్టి స్థితి లయములకు కర్త.

## 2. వైశేషిక దర్శనము

కణాది మహర్షి ఈ దర్శనమునకు కర్త. ఈ దర్శనంకూడా న్యాయ దర్శనం వలెనే పదార్థ వివేచనము చేయును. ఇదియును తత్వజ్ఞానము వలననే ముక్తి లభించునని అంగీకరించును.

ద్రవ్యగుణ కర్మసామాన్య విశేష సమవాయి భావములు పదార్థములనియు, వానియథార్థ జ్ఞానము వలన ముక్తిలభించునని వైశేషిక సిద్ధాంతము.

ఈదర్శన కర్తయు జీవేశ్వరులను భిన్న పదార్థములుగా నంగీకరించును. న్యాయదర్శనమున వర్ణింపబడిన ,ఇచ్ఛాద్వేషది గుణములేకాక, ఉచ్ఛ్వాస నిశ్వాసములు నిమేషోన్మేషములు. జీవనము, మనోగతి, ఇంద్రియాంతర వికారములు కూడ జీవలక్షణములుగా నీ దర్శన మంగీకరించును ఈశ్వరుని స్వరూప విషయమున న్యాయ వైశేషికములందు వైమత్యములేదు. జీవేశ్వరులను నవియు ద్రవ్యములేయని కణాదుడంగీకరించును. అవికల్పిత భావపదార్థములు కావు.

ప్రపంచము, తదతపదార్థములు నన్నియు పరమాణువుల సంయోగ విశేషమువలన నేర్పడునని వైశేషిక మతము. పరమాణువు లనేకములు. ఆ పరమాణువులును వరస్పర భిన్నములనియు, వానియందలి భేదమును నిరూపించుటకు, వానిలో విశేష నామక పదార్థ మొండు కలదని కణాదు డంగీకరించును.అందువలననే యీ దర్శనమునకు వైశేషిక దర్శనమని పేరు కలిగినట్లు దార్శనికులు చెప్పుదురు.

పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, కాలము, దేశము, ఆత్మ, మనస్సు అనునవి ద్రవ్యములు.

రూపము, రసము, గంధము, స్పర్శ, శబ్దము, సంఖ్య, పరిమాణము, పృథక్త్వము, సంయోగము, విభాగము, పరత్వము, అపరత్వము, ద్రవత్వము, స్నేహము, బుద్ధి, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, గురుత్వము, సంస్కారము, ధర్మము, అధర్మము.అను నీ 24 గుణములు, ఇవి ద్రవ్యముల నాశ్రయించి యుండును.

గమనాదులు, కర్మలు, ఇవియును ద్రవ్యము నాశ్రయించియే యుండును. మానవత్వ, పృథివీత్వాదులు సామాన్యములు. ఇయ్యవి జాతి పదముతోను చెప్పబడును.

పరమాణువులలోగల భేదమును తెలుపు పదార్థములు విశేషములు అనబడును. ఇట్లు పైన వర్ణింపబడిన ద్రవ్యాది పదార్థాముల లక్షణ పరీక్షాదులేవైశేషిక దర్శనము.

## 3. సాంఖ్యదర్శనము :-

ఇయ్యది కపిలమహర్షి కృతి. ఇందు ప్రకృతి పురుషుల వివేచనము చూడనగును. ప్రకృతి,పురుషులు స్వతంత్ర సత్తగలవై యున్నవి.

పురుషుడు చేతనుడు. చైతన్యము ఇతనికి స్వరూపము. ఇతడు శరీరము, మనస్సు, ఇంద్రియములు అనువాని కన్నిటికంటే భిన్నుడు. ఇతడు నిత్యుడు, ఇటి చాతనములు ఎన్నియో ఉన్నవి. ఇవియే జీవపద వాచ్యములు.

ప్రకృతి జడతత్వము: ఇది ఈ ప్రపంచమునకు ఉపాదానకారణము. నిత్యము, పరివర్తన శీలముకలదై పరిణామము బొందుచుండును. సత్వరజ తమస్సులను నవి దీని స్వభావము. ఇవి గుణపద వాచ్యములు. సృష్టికి పూర్వమివి సామ్యావస్థయందుండును. అప్పుడే ప్రకృతి పదముతోనవి చెప్పబడును. సత్యమే ప్రకాశము, రజస్సు, చలనము, తమస్సుఅచలనము- ఆవరణక మన దగును.

పురుషుని సాన్నిధ్యము వలన ప్రకృతి, వికృతి కాదొడగును. దానియందు స్థౌల్యము- సత్వరజ తమస్సులలో వైషమ్యము ఏర్పడును. ఇదియే సృష్టికి ఆరంభము ప్రకృతినుండి ఏర్పడు సృష్టి క్రమములో మొదటి సృష్టి మహత్తత్వము. ఇయ్యది బుద్ధి అనబడును. దానినుండి అహంకారము, దానినుండి పంచ తన్మాత్రలు, పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు మనస్సు జనించును అటుపై పంచ తన్మాత్రలనుండి పంచస్థూలభూతములు, పృథివ్యాదులు జనించును. ఇట్లు ప్రకృతి 24 తత్వములుగాలెక్కింప

బడును. పురుష డొక తత్వము, కలిసి పంచవింశతి 25 తత్వములు సాంఖ్య శాస్త్రమున ప్రసిద్ధములు.తత్వ సంఖ్యను బట్టి యే సాంఖ్య దర్శన మనబడును.

పురుషుని సాన్నిధ్యముచే బుద్ధి చేతనాయమానమై సమస్త కార్యములు చేయుననియు, బుద్ధిచే చేయబడు కార్యములు, జీవునకు ఉపలబ్ధమగుననియు అందువలన తానే కర్తయని, జీవు డెంచుననియు సాంఖ్యులు చెప్పుదురు. ఇట్లు బుద్ధికి తనకు గల భేద మును గు రింపక యున్నంతకాలము జీవుడు ప్రకృతి బద్ధుడై ప్రాకృతికములగు పదార్థ సంయోగంవలన సుఖ దుఃఖముల ననుభవించు చుండును.తాను వేరు, బుద్ధి వేరుఅని జీవునకు వివేకము కలిగిననాడు జీవుడు బంధ ముక్తుడై కైవల్యుడగును. ప్రకృతి పురుషవివేకమే ముక్తికి సాధనము.

ఈ దర్శనమును కొందరు నిరీశ్వరమందురు.వైదికులు అయ్యది అంగీకరింపరు. సాంఖ్యము శృతి ప్రామాణ్యము నంగీకరించును. కావున నయ్యది నిరీశ్వరవాదము నంగీకరింపదు. "ఈశ్వర సిద్ధేః" అను నీ సూత్రమునకు ప్రత్యక్ష ప్రమాణముతో నీశ్వరుడు సిద్ధింపడని యర్థము. కాని ఈశ్వరుడు లేడనుట ఈ దర్శనాభిప్రాయము కాదు. అనుమాన శబ్ద ప్రమాణ ములచే సిద్ధింపబడు పరమేశ్వరుని,సాంఖ్యము నిరాకరింపదు. పరమేశ్వరు నంగీకరింపని పక్షమున "ఈశ్వరా సిద్ధేః"అనిసూత్రింపక,"ఈశ్వరాభావాత్"అనికపిలుడు సూత్రించియుండెడివాడు.

ముఖ్యముగా నీదర్శనమున, ప్రకృతి, జీవులు అను వానినిగూర్చి విశేషముగ వివరింపబడినవి. ఈశ్వర విషయమంతగా చర్చించబడదు.

## 4. యోగదర్శమున :

ఇయ్యది పతంజలి మహర్షికృతము. సాంఖ్యయోగ ములు రెండును విశేష సామ్యము కలిగియుండును. ఇందు:

"క్లేశకర్మ విపాకాశయైః అపరామృష్టః
పురుష విశేష ఈశ్వరః"
"తస్యవాచకః ప్రణవః"

అనునిట్టి సూత్రముల మూలమున పతంజలి మహర్షియోగ దర్శనమున ప్రత్యేకముగా నిర్దేశించి యున్నాడు. ఈ దర్శనము ఈశ్వరుని సాక్షాత్కార మునకు వలయు సాధన సంపత్తినిగూర్చి వివరించును. ఇయ్యది అష్టాంగ యోగమనియు చెప్పబడును.యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు అంగములు.

చిత్తవృత్తులు నిరోధించుటయే యోగము. చిత్త వృత్తి నిరోధము – చిత్తైకాగ్రత సమాధియనబడును. సంప్రజ్ఞాతము, అసంప్రజ్ఞాతమునని సమాధిద్వివిధము. సంప్రజ్ఞాత సమాధి యందు ధ్యానకర్త, ధ్యేయములు విడివిడిగా భాసించును. అసంప్రజ్ఞాతమున నా భేదము తెలియ బడక, ధ్యేయము మాత్రము తెలియబడును.

యోగదర్శనమునందు ఈశ్వర సాక్షాత్కారమునకు వలయు సాధన సంపత్తి, సాక్షాత్కార ప్రయోజనము విశేషముగ వర్ణింపబడినవి.

## 5. పూర్వమీమాంస :

ఈ దర్శనమున రచించిన మహర్షి జైమిని. ఇతడు వ్యాస శిష్యుడు. ఈ దర్శనము సహస్రాధికరణములు కలిగి, మిగిలిన దర్శనము లన్నిటికంటెను బృహత్కాయము కలిగియుండును.ఇందు వైదిక కర్మకాండ విశేషముగ చర్చింపబడినది మరియొక విధముగ నిది బ్రాహ్మణ వాక్య సమన్వయ మనవచ్చును. నానా విధ యజ్ఞములు, వాని ప్రక్రియలు, వాని విధులు యిందు చూడనగును.

మీమాంసకులకు వేదము అపౌరుషేయము. అది నిత్యము. ఈ దర్శనమున ప్రమాణములను గూర్చి విశేషముగ చర్చింపబడును.

జ్ఞానము–వేదము–స్వతఃప్రమాణము. వేద విహితమే ధర్మము. వేద నిషిద్ధము అధర్మము. వేద విహిత కర్మలు- సంధ్యాగ్నిహోత్రాదులు ఫలాపేక్ష విడిచి, కర్తవ్య బుద్ధితో నాచరించువారు ముక్తులగుదురు. మీమాంసకులలో నొక యాచార్యుడు ప్రభాకరుడు. ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దమేకాక, అర్థాపత్తి అను అయిదవ ప్రమాణము కూడ నంగీకరించును.

కుమారిల భట్టుమతము ననుసరించువారు. 'అనుపలబ్ధి, అను నారవ ప్రమాణమునుగూడ నంగీకరింతురు. మీమాంసకులు జగత్ సత్యత్వమును, అనేకాత్మ

లను అంగీకరింతురు. ఈశ్వరునిగూర్చి ఈ శాస్త్ర మంతగా చర్చింపదు.

## 6. వేదాంతదర్శనము-ఉత్తరమీమాంస :

ఇయ్యది వ్యాసమహర్షి ప్రణీతము. ముఖ్యముగానిది సృష్టిస్థితి లయములకు కారణమైన బ్రహ్మమును గూర్చి చర్చించును. అందువలననే ఈ దర్శనమునకు బ్రాహ్మణత్రయము లనియు నామాంతరమున్నది. ఉప ఉపనిషతులలో గలవైదిక సిద్ధాంతములను సమన్వయించుట కీదర్శనము విశేషముగ ప్రవర్తించును.

ఈ దర్శనమునకు శ్రీ శంకర, రామానుజ, మధ్వాచార్యాదులు భాష్యములను రచియించి అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతాది సాంప్రదాయములను ప్రచారము చేసి యున్నారు. ఈ దర్శనమునకు సంబంధించిన విషయముల నీ యల్పనిబంధనమునందు, సమగ్రముగా చర్చించుట సంభవముగాదు. అద్వైతాదిమతాచార్యులు, తమతమ భాష్యములందు చర్చించిన విషయములు,ఎంతవరకు సూత్రానుసరణములో, చర్చించుట దుర్ఘటము. ఆయా ఆచార్యులు వేదములను, వేద సిద్ధాంతములను, ఎంతవరకు అనుసరించిరో నిర్ణయించుటకు నిది స్థలముకాదు. వేదాంతదర్శనము చిన్నదికాదు. ఇది యొకబృహద్గ్రంథము. ఈగ్రంథమునకు ప్రత్యేకముగా భాషయందు నేనొక వ్యాఖ్యానము వ్రాసియున్నాను. అచిరకాలములో నది పాఠకుల కందింపజేయగలనని భావించుచున్నాడ.

న్యాయవైశేషికాది దర్శనములకు తెలుగు వ్యాఖ్యానములు వ్రాసి యింతకు పూర్వమే ప్రకటించి యున్నాను. పాఠకులు కొందరైనను వానిని చూచి యుందురు దర్శనముల గూర్చి యొక లేఖ పంపుడని స్వ. శ్రీ. బుచ్చినాయుని స్మారక సంచిక ప్రచురణ కర్తలు కోరుటచే నేనీ వాక్యములు వ్రాసి పంపుచున్నాను. "దర్శనములు" అను విషయము మిక్కిలి పెద్దది. ఒక లేఖయందు ప్రపంచ దర్శనములను గూర్చి వ్రాయుట నాయట్టి అల్పజ్ఞులకు అసంభవము. నాకు పాశ్చాత్య దర్శన జ్ఞానమిసుమంతయు లేదు. ప్రాచ్య దర్శనములలో భారత దర్శనములను గూర్చి పాఠకులకు ఒకింత, దిగ్దర్శనము చేయింప నుద్దేశించి కొన్ని పంక్తులువ్రాసి పంపుచున్నాను

స్వర్గీయ శ్రీ బుచ్చినాయుడుగారి యెడ నాకు గల శ్రద్ధను, ఆదరభావమును ప్రకటించు నీ వాక్య సుమములను గ్రహించి కృతార్థుం జేయుదురు గాక। *



# లలితకళలు

కళ కలకాదు అనటం ఆనాడు సహేతుకమేమో కాని ఈనాడు కాదు.

ఈనాడు కళ అనే దానిలో వాస్తవికత సన్నగిలింది; కల అనేదానిలో వాస్తవికత లావెక్కింది మనోవైజ్ఞానిక గవేషణలద్వారా తేలింది కల అంటే కల్లకాదనీ, కల అంటే వాస్తవమే అని.

కళలో వాస్తవికత తరిగినప్పుడు, కలలో వాస్తవికత పెరిగినప్పుడు కళ కలయే అవుతుంది. నేడు విశ్వమంతా వ్యాపించివున్న ఆధునిక నైరూప్య కళ ఇందుకు నిదర్శనం.

కళకూ లలిత కళకూ వున్న ప్రభేదం ఎక్కడ? ఏ సరిహద్దు గీత కళ నుంచి లలిత కళను వేరు చేస్తుంది? అసలు కళ అనేదానికీ కళ కానిదానికీ వున్న భేదమేమిటి?

కౌశలం లేని పని కళ కాదు; కౌశలంతో కూడుకున్న పని కళ. ఎంత హీనమైన పని అయినా అందులో కౌశలం కనుపిస్తే అది కళయే అవుతుంది. చోరత్వం కూడ కౌశలంతో నిర్వహించబడితే కళయే అవుతుంది.

శూద్రక మహాకవి రచించిన మృచ్ఛకటిక నాటకంలో శర్విలకుడు అనే చోరుడు చారుదత్తునింటి గోడకు కన్నంవేసి సంపదను దోచుకపోతాడు. తెల్లవారి చారుదత్తుడు ఆ కన్నాన్ని చూచి సంపద పోయినందుకు దిగులు పడక ఆ గోడలోని కన్నపు కౌశలాన్ని చూచి మెచ్చుకొంటూ ఆనందిస్తాడు.

ఇక్కడే భేదిస్తుంది కళకానిదాన్నుంచి కళ, ఇక్కడే వేరవుతుంది ఉపయోగ దృష్టినుంచి రసదృష్టి. చారుదత్తుని దృష్టి తనకు జరిగిన నష్టంమీదకాక కన్నంలో గోచరించే సౌందర్యంమీద నిలిచివున్నది. నష్టలాభాలు ఉపయోగ జీవితానికి సంబంధించినట్టివి. సౌందర్యం రసజీవితానికి సంబంధించినట్టిది.

ఒకటి కళకానిది, రెండవది కళ అయినది. అంటే ఉపయోగంతో సంబంధం లేకుండానే రసానందాన్ని ప్రసాదించేది కళ, రసానందం ఎప్పుడు తడుతుందీ అంటే ఒక పనిలోనో, వస్తువులోనో కౌశలం గోచరించినప్పుడు.

కనుక కళ అంటే కౌశలంతో నిండినదీ అని. రసానందాన్ని ఇచ్చేది ఉపయోగాత్మకంగా వుండకూడదని ఎక్కడాలేదు. చారుదత్తుని గోడకు శర్విలకుడు వేసిన కన్నం ఎంత సుందరంగా వున్నదో ఆ చోరునకు అదీ అంత ఉపయోగించిందికూడ, ఆ కన్నం అందుకే రసాత్మకం, ఉపయోగాత్మకంకూడ!

ఇక కళ నుంచి లలితకళ ఎక్కడ భేదిస్తుంది? కమ్మరి పని, కుమ్మరి పని, తట్టలల్లటం, బుట్టలల్లటం చెప్పులుచేయటం, తప్పులుచేయటం, చేసిన తప్పులను ఒప్పులుగా వాదించటం, వంటలు చేయటం మొదలైనవన్నీ కళలే. కాని ఇవి లలిత కళలు కావు. ఇవి ప్రధానంగా ఉపయోగాత్మకమైన స్థూలకళలే కాని సుకుమార భావాన్ని స్పందింపచేసే సూక్ష్మ కళలు కావు. ఇవి ప్రధానంగా శరీరానికి ఉపయోగపడే కళలే కాని మానసిక ప్రకంపనలను కలుగజేసేవికావు.

ఇక సంగీతం, సాహిత్యం నాట్యం, చిత్రలేఖనం, శిల్పం మొదలైన కళలు సూటిగా శరీరానికంతగా ఉపయోగించక శ్రోతల, పాఠకుల, ప్రేక్షకుల మానస కాసారాలలో భావ ప్రకంపనలను కలిగిస్తాయి. వేదనలను, సంవేదనలను రేకెత్తిస్తాయి. అందుకని మిగతా స్థూల కళల కంటే ఈ సూక్ష్మ కళలు లలితమైనవి. అందుకే వీటికి లలిత కళలు అని పేరు. ఏదో అవసరమైన వర్గీకరణ చేయాలిసొచ్చినపుడే కాని, లేనప్పుడు ఈ లలితకళలనుకూడ లలిత కళలనక ఊరక కళలు అనటమే లోకాచారంగా వున్నది, ఈ లలితకళల స్రష్టలను కళాకారులని, ఆర్టిస్టులనీ ప్రపంచంలో అంతటా అంటున్నారేకాని లలితకళాకారులనీ, ఫైన్ ఆర్టిస్టులనీ ఎవరూ అనరు

లలితకళల వివరాలను విశదీకరించేముందు కళా

---

రచన:

శ్రీ సంజీవదేవ్

సృష్టికి ప్రధానమైన సౌందర్యబోధ (Aesthetics) ను గురించి సూక్ష్మచర్చ చేయటం అవసరం.

సౌందర్యం అంటే ఏమిటి ? అదెక్కడుంటుంది ? మానవుని మనసులో వుంటుందా లేక బాహ్యవస్తువులలో వుంటుందా ? సౌందర్యానికి నీతితో సంబంధ మేమైనా వున్నదా ?

మానవునిలో మూడు ప్రధాన శక్తులున్నాయి. ఒకటి ఆలోచనాశక్తి, రెండవది ఇచ్ఛాశక్తి, మూడవది అనుభూతిశక్తి. మొదటిదాన్ని సత్యం అనీ, రెండదాన్ని శివం అనీ, మూడవదాన్ని సుందరం అనీ అనవచ్చు. మానవజీవితంలో ఈ త్రివేణి సక్రమంగా ప్రవహిస్తేనే మానవుడు సజీవంగా జీవించేది.

సత్యం అనేది హేతువాదాన్నీ, శివం అనేది నీతివాదాన్ని, సుందరం అనేది రసవాదాన్నీ సూచిస్తాయి. ఇక్కడ మనకు కావలసింది మూడవది అయిన సుందరం. సౌందర్యం అంటే ఇంద్రియానుభూతి ద్వారా మనసుకు కలిగే తన్మయత.

సౌందర్యం వ్యక్తిగత (Subjective) మా, లేక వస్తుగత (Objective)మా అని ? సౌందర్యం వస్తుగతమైవున్నట్లయితే సుందర వస్తువుల్లో వ్యక్తులందరికూ సమాన సౌందర్యం గోచరించాలి కాని వాస్తవం ఆ విధంగాలేదు. ఒకరికి సౌందర్యం గోచరించిన వస్తువులో మరొకరికి సౌందర్యం గోచరించదు. ఒకరికి తట్టిన సురూపం మరొకరి దృష్టిలో కురూపం.

కనుక సౌందర్యం అనేది వ్యక్తిగతమేకాని వస్తుగతంకాదని అనిపిస్తుంది.

అయితే, అందరికీ సమాన సుందరంగా తట్టే సుందర వస్తువులు కూడ కొన్ని వున్నాయి, గులాబిపూవు ఎవరికి సుందరంగా తట్టదు ? మేఘాల పైని ఇంద్రధనస్సు ఎవరికి మనోహరంగావుండదు ? ఉషఃకాంతులూ, సాంధ్యరాగమూ ఎవరికి లావణ్యంగా తట్టవు ? శరత్ సంధ్యలో ఉదయించిన నెలవంక ఎవరి హృదయాలను చూరగొనదు. ఇవన్నీ అందరికీ సమానసుందరంగానే తడతాయి.

దీన్నిబట్టిచూస్తే సౌందర్యం వ్యక్తిగతమైంది మాత్రమేకాదు వస్తుగత మైంది కూడా అనితేలుతుంది. కనుక సౌదర్యం అనేది వ్యక్తిగతమూ వస్తుగతమూకూడ. అది మానవుని మానసంలోనూ వుంటుంది. బాహ్యవస్తువులోనూ వుంటుంది. వ్యక్తిగత సౌందర్యం భిన్నత్వాన్ని కలిగి వుంటే వస్తుగత సౌందర్యం ఏకత్వాన్ని కలిగి వుంటుంది. వ్యక్తిలో కనుక సౌందర్యంవుంటే సౌందర్యం లేని వస్తువులోకూడ సౌందర్యాన్ని దర్శిస్తాడు.

ఇక సౌదర్యం నీతికి సంబంధించి వుండాలా అని. సౌదర్యం ఆనందాన్నిస్తే నీతి ఇస్తుంది శ్రేయాన్ని. శ్రేయాన్ని ప్రసాదించగల సౌందర్యమే ఉత్తమ సౌందర్యం. శ్రేయాన్ని ప్రసాదించ లేనిది ఉత్తమ సౌందర్యం కాదని కళలో నీతివాదుల వాదన. మంచితనానికంటే మించిన సౌందర్యం లేదంటారు వీరు. సాహిత్యం, సంగీతం, నాట్యం, చిత్రలేఖనం, శిల్పం మొదలైన లలిత కళలన్నీ మానవసమాజానికి శ్రేయం కలిగించలేనప్పుడు అవి ఎంత ఆనందాన్ని ఇచ్చినా అవి ఉత్తమ కళలు కావు అంటారు వీరు. ఈ నైతిక కళావాదానికి చెందుతారు లియో టాల్‌స్టాయ్, గాంధీ మొదలైనవారు.

ఇక రెండవవర్గం వారు శుద్ధకళావాదులు. వీరి దృష్టిలో సౌందర్యానికి నీతితోకాని అవినీతితోకాని పనిలేదు. కళ నీతికి అవినీతికీకూడ అతీతంగా వుండాలంటారు వీరు. నీతిని ప్రచారం చేయటానికి కళలేదు. అదేవిధంగా అవినీతినికూడ ప్రచారం చేయటానికికూడ కళలేదు. కళ ఎందుకున్నదీ అంటే మానవులకు రసానందాన్ని ప్రసాదించి జీవితాలను తన్మయీభావంతో నింపటానికి మాత్రమే కళ మానవజాతికి నీతి అవసరమైతే ఆ పని నెరవేర్చాలిసింది నీతి శాస్త్రంకాని కళకాదు అని ఈ శుద్ధకళావాదుల వాదం. ఈ వాదానికి చెందినవారే బెనెదెటో క్రోచే, రవీంద్రనాథ్ టాగూర్ మొదలైనవారు.

ఈ సందర్భంలో సుప్రసిద్ధ కళా సమీక్షకుడైన ప్రొఫెసర్ హెర్బర్టు రీడ్ సుందరంగా చెపుతాడు.

'Moral values are social values; aesthetic values are human values. Moral values promote and protect a particular way of life; aesthetic values promote and protect life itself, as a vital principle.'

నైతికపు విలువలు సామాజికపు విలువలు అయివున్నాయి, రసాత్మకపు విలువలు మానవీయపు విలు

వలు అయివున్నాయి, నైతికపు విలువలు జీవితపు ఒకానొక ప్రత్యేక మార్గాన్ని ఉన్నతపరచి సంరక్షిస్తాయి. రసాత్మకపు విలువలు జీవితాన్నే స్వయంగా ఉన్నతపరచి సంరక్షిస్తాయి.

కళకూ నీతికి సంబంధం ఉండరాదని కాదు కాని నీతిని బోధించేది మాత్రమే ఉత్తమకళ అని అంటే మాత్రం అది సౌందర్య బోధకే గొప్ప అపచారం అవుతుంది.

వ్యక్తిలో ఇమిడివున్న రసానుభూతి మాత్రమే కళ కాజాలదు. అది అమూర్తమైన అనుభూతిగానే నిలచిపోతుంది. వ్యక్తిలోని రసానుభూతి ఒక భౌతిక రూపాన్ని దాల్చినప్పుడే అది కళ అవుతుంది. ఆ భౌతిక సృజన కంటికి సంబంధించింది కావచ్చు, చెవికి సంబంధించింది కావచ్చు, లేక రెంటికీ సంబంధించిందికావచ్చు, లేక ఇంకా ఏ ఇంద్రియానికి సంబంధించింది అయినా కావచ్చు.

కళను గురించిన సూక్ష్మమైన నిర్వచనం నేనొక సారి ఈ విధంగా చేశాను, "Transformation of impression into expression is art" కళంటే మనసులోని ముద్ర బాహ్యాభివ్యక్తిగా రూపాంతరం పొందటమేఅని.

ఒక్కొక్క కళకు ఒక్కొక్క విధమైన భౌతిక మాధ్యమం (medium) అవసరం. సాహిత్య సృష్టికి పదాలు సంగీత సృష్టికి నాదం, నాట్యానికి గతి, చిత్రలేఖనానికి రంగులు, శిల్పానికి శిలలు కాని ఇంకేమైనా పదార్థాలు కాని అవసరం. ఇవి వుంటేనే కళాకృతి ఆకృతిని పొందేవి. లేనిచో కళాకారునిలో మానససృష్టిగా మాత్రమే వుండిపోతాయి.

ఈ కళలలో కొన్ని శ్రవ్యకళలు, కొన్ని దృశ్య కళలు, కొన్ని మిశ్రమ కళలు. సాహిత్యమూ సంగీతమూ శ్రవ్యకళలు. సాహిత్యాన్ని పూర్తిగా శ్రవ్యకళ క్రింద చేర్చటం కూడ సబబు కాదేమో ఎందుకంటే సాహిత్యాన్ని వినకుండా మనసులో నిశ్శబ్దంగా చదువుకొనవచ్చు. చూచి చదువుకోటం అనేది కంటికి సంబంధించింది కనుక సాహిత్యం. అటువంటి మౌనావస్థలో దృశ్యకళ క్రిందకు వస్తుందా ? చూచి చదవకుండానూ చెవులతో వినకుండానూకూడ సాహిత్యాన్ని లోలోపలే మననం చేసుకోవచ్చుకూడ. అటువంటప్పుడు సాహిత్యం, శ్రవ్యకళా, దృశ్యకళా, రెండూ కాకుండా అయినా వుండాలి. లేక రెండూ అయి అయినా వుండాలి. సంగీతంతోపాటు సాహిత్యాన్నికూడ శ్రవ్య కళగా తీసుకోటమే ఎక్కువ సమంజసమేమో.

చిత్రలేఖనమూ శిల్పమూకూడ పూర్తిగా దృశ్య కళలు. చెవిటివానికి సంగీతం ఆనందం ఇవ్వజాలనట్లే గుడ్డివానికి చిత్ర శిల్పకళలుకూడ ఆనందం ఇవ్వజాలవు. అయితే శిల్పం విషయం వేరు. శిల్పం దృశ్య కళ మాత్రమేకాక స్పర్శనీయకళకూడ. చిత్రానికి ఈ స్పర్శనీయతలేదు. అందువల్ల కన్నులు కనుపించని వ్యక్తికూడ చేతితో శిల్పాన్ని తడివిచూచి ఆనందించ వచ్చునేమో.

శిల్పానికున్న ఈ స్పర్శనీయత నేడు చిత్రించబడుతూన్న ఆధునిక తైలవర్ణ చిత్రాలలో కొంత వరకు గోచరిస్తున్నది. కుంచెతోకాక రంగులను కలిపే చాకుతో చిత్రించే చిత్రాలలో రంగు మందంగా ఉబ్బెత్తుగావచ్చి అందులోని రూపాలు కంటికి కనుపించినంత స్పష్టంగా కాకపోయినా, ఒకమాదిరి అస్పష్టంగానైనా చేతికి తగులుతాయి. ఇవి శిల్పఫలకాలా (Bax - relief) అన్నంత ఎత్తుపల్లాలుగా చేతికి స్పర్శనిస్తాయి.

ఇక నాట్యం ఏ కళ అవుతుంది? నటీనటులు కంటికి కనిపిస్తుంటారు కనుక ఇది దృశ్యకళ. సంగీతమూ మాటలూ వినిపిస్తుంటాయి కనుక ఇది శ్రవ్య కళ. నాట్య ప్రదర్శనానికి హాజరైనవారి కళ్లకూ చెవులకూ కూడ సమానంగా పని కలుగుతుంది. కనుక నాట్యం అనేది శ్రవ్యదృశ్యమైన మిశ్రమకళ.

సంగీత కచేరీకి హాజరైన వారిని శ్రోతలు అంటాం వింటారు కనుక. చిత్రశిల్ప ప్రదర్శనాలకు హాజరైనవారిని ప్రేక్షకులు అంటాం, చూస్తారు కనుక. ఇక నాట్య ప్రదర్శనానికి హాజరైనవారిని ఏమనాలో. వీరిని శ్రోతలందామా అంటే అన్యాయమవుతుంది. కారణం, వీరు వినటం మాత్రమేకాక చూస్తారుకూడ. అందుకని వీరిని ప్రేక్షకులు అందామా అంటే అదీ అన్యాయమే అవుతుంది. కారణం, వీరు చూడటం మాత్రమేకాక వింటారుకూడ. కనుక వీరిని అనాలసింది శ్రోతప్రేక్షకులనో లేక ప్రేక్షకశ్రోతలనో!



తంజావూరు దేవాలయంలో

సరే, దీన్నిపట్టి తేలిందేమంటే కళలు ప్రధానంగా మూడు విధాలని; దృశ్యకళలు, శ్రవ్య కళలు, మిశ్రమ కళలు.

ఈ కళలన్నిటిని గురించీ ఒకే ప్రసంగంలో నేడు మీ సమక్షంలో వివరించాలంటే జానెడింటిలో మూరెడు కర్రను ఇమడ్చబూనటం మాత్రమే అవుతుంది. అందుకని నేటికి దృశ్యకళలతో సంతృప్తి చెందుదాం. అందులోనూ ప్రత్యేకించి చిత్రలేఖనంతో మాత్రమే.

దీన్నికూడ చారిత్రిక దృక్పథంతోకాక సమీక్షాత్మక దృక్పథంతో, దీని నిర్మాణ కౌశలానికి సంబంధించిన మర్మాలను, పరిణమించిన వాదాలను, రూపరూపాంతరాలను, వర్ణవర్ణాంతరాలను అనుశీలిద్దాం.

చిత్రం అంటే ఏదో ఒక సమతలం మీద – అది నూలుగుడ్డ కావచ్చు, పట్టుగుడ్డ కావచ్చు, కొయ్యచెక్క కావచ్చు, చర్మం కావచ్చు, గోడకావచ్చు, ఇంకేమైనా సమతల ప్రదేశం కావచ్చు-రంగులతో రూపాలను లిఖించటం.

దేశాచారాలనుబట్టి, కాలవిశిష్టతలనుబట్టి కొన్ని చిత్రాలలో రేఖలు ప్రాధాన్యంగా వుండటం, కొన్నిటిలో రేఖలు లేకుండా కేవలం రంగులతోనే రూపాలుండటం జరుగుతుంటుంది. మామూలుగా ప్రాచ్య దేశాల చిత్రాలలో రేఖల ప్రాధాన్యతా, పాశ్చాత్య దేశాల చిత్రాలలో రంగుల ప్రాధాన్యతా గోచరిస్తుంది. పాశ్చాత్య దేశాలలోకూడ పునర్జాగృతికి ఇంకా పూర్వకాలంలో చిత్రాలు రేఖమయంగానే చిత్రించ బడుతుండేయి.

చిత్ర నిర్మాణానికి కొన్ని విధాలయిన మాధ్యమికాలు వాడుకలో వున్నాయి. వీటిలో ప్రధానమైనవి జలవర్ణాలూ, తైలవర్ణాలూ, టెంపరావర్ణాలూ, ప్యాస్టల్ వర్ణాలూ, ఇంకా రంగుసిరాలూ, రంగు పెన్సిళ్లూ మొదలైనవి. ఒకొక మాధ్యమానికి ఒకొక గుణం గోచరిస్తుంది.

తైలవర్ణచిత్రానికి ఒక కమనీయమైన కాంతీ పురుషోచితమైన ఒక విధమైన స్థూల గంభీరతా చేతికి తగిలే స్పర్శనీయతా (Texture), నీరు తగిలితే చెరగని తనమూ మొదలైన గుణాలు వుంటాయి. చిత్రించేసమయాన కలిపిన రంగులు ఎండకుండా వుండటంతో ఎంతపెద్ద చిత్రం చిత్రించాలన్నాకూడ చిత్రకారునికి బాధవుండదు. తైలవర్ణ చిత్రాన్ని చిత్రిస్తున్నప్పుడు ఎన్ని మార్పులైనా సులభంగా చేసుకోవచ్చు. దీని చిత్రణలో కొంత ఆలస్యం పడుతుంది.

ఇక జలవర్ణ చిత్రాలదొక ప్రత్యేకత. జలవర్ణ చిత్రాలలో ఒక లాలిత్యమూ, నారీసులభమైన మార్దవమూ, కవిత్వమయతా, సౌకుమార్యమూ గోచరిస్తాయి. త్వరలో ముగించవచ్చు. ప్రకృతిలోని వాతావరణ శోభను కమనీయంగా ప్రదర్శించవచ్చు జలవర్ణాలలో.

టెంపరా విధానం జలవర్ణాలకు సంబంధించినదే కాని ఇది తైలవర్ణ చిత్రణలాగా చేయాలసుంటుంది. ఈ టెంపరాలో కూడ కొన్ని మార్పులున్నాయి. ఎగ్ టెంపరా అనే వర్ణవిధానంలో కోడిగ్రుడ్డుసొన కలిపి చిత్రిస్తారు. టెంపరావర్ణాలలో చిత్రించటం కొంత కష్టం. జాగ్రత్తగా ముందు ఆలోచించి ఎక్కడ ఏ వర్ణాన్ని వుంచాలో దాన్ని అక్కడ వుంచాలి. దీనిలో తప్పులుచేసి సవరించటం అంత సులభంకాదు. టెంపరా చిత్రాలు ఉష్ణదేశాల వాతావరణాలకు చెడకుండా చాలాకాలం నిలిచిపోతాయి.

ప్యాస్టల్ వర్ణాలు పొడిరంగులు. ప్యాస్టల్ చిత్రాలను ధూళిచిత్రాలనవచ్చు. ప్యాస్టల్ వర్ణాలు మృదువుగానూ, చిత్రించిన రూపాలు వదులు వదులుగా ఉన్నివలె గోచరిస్తాయి. వీటిని మిగతా వర్ణాలవలె ఒక రంగుతో ఒకటి కలపటానికి వీలుండదు. అందుకని ఈ రంగులు అసంఖ్యాకంగా దేనికదే వుంటాయి. ప్యాస్టల్ చిత్రాలు చూడటానికి కనులకు ఆనందంగా వుంటాయి. వీటిని భద్రంగా కాపాడాలి.

ఈ విధంగా ఒక్కొక్క మాధ్యమం ఒక్కొక విశేషాన్ని కల్గి వుంటుంది. అయితే రంగులు మాత్రమే చిత్రాలను రచించజాలవు. సమర్థుడైన చిత్రకారుడు ఏ మాధ్యమంలో చిత్రించినా కూడ ఆ చిత్రం అద్భుతంగానే వుంటుంది.

చిత్రాలను ప్రధానంగా మూడు విధాలక్రింద విభజించవచ్చు. వ్యక్తుల రూపచిత్రాలు, ఆఖ్యాయికా చిత్రాలు, ప్రకృతి చిత్రాలూ అని. రూపచిత్రనిర్మాణానికి వాస్తవవాదం చాలా అవసరమేకాని వ్యక్తి ముఖాన్ని వున్నది వున్నట్లు చిత్రించినాకూడ అది

ఉత్తమ రూపచిత్ర మనిపించుకోదు. వ్యక్తి ముఖం లోని పోలికలు రూపచిత్రంలో బాగా ప్రస్ఫుటించినంతమాత్రంచేత లాభం లేదు. ఆ వ్యక్తిలోని ప్రధాన స్వభావమేమిటో ఆ చిత్రంలో అది అభివ్యక్తం కావాలి. అప్పుడుకాని అది ఉత్తమ రూపచిత్రంకాదు.

ఇక ఆఖ్యాయికా చిత్రణ అంటే ఒక కథనో, ఘటననో చిత్రించటం. ఇందుకు వాస్తవిక చిత్రణకు తోడు ఆదర్శవాదంతో కలసిన చిత్రణకూడ వుండాలి. నిత్యజీవితంలో జరిగే అనేక సన్నివేశాలను చిత్రించటం ఈ వర్గంలోకే వస్తుంది

మూడవది ప్రకృతిచిత్రణ. కొండలను కోనలను, చెట్లను పుట్టలను, సెలయేళ్ళను, పచ్చిక బయళ్లను ఉషః కాంతులనూ, సాంధ్యరాగాలనూ, మేఘాలనూ సముద్రాలనూ మొదలైనవాటిని చిత్రించటం ప్రకృతి చిత్రణ క్రిందికొస్తుంది. ప్రకృతి చిత్రణలో ప్రదేశ (Topography) చిత్రణా, వాతావరణ చిత్రణా ప్రధానమైనవి. ఎక్కడ అనే ప్రశ్నకు జవాబిస్తుంది ప్రదేశ చిత్రణ. ఎప్పుడు అనే ప్రశ్నకు జవాబిస్తుంది వాతావరణ చిత్రణ.

ప్రకృతి చిత్రాలలో మానవమూర్తి వుండకుండా వుండాలని కొందరూ, మానవమూర్తి వుండాలని మరి కొందరు ప్రకృతి చిత్రంలో మానవమూర్తి గోచరించగానే ప్రేక్షకుని శ్రద్ధంతా ఆ మానవమూర్తి మీదే కేంద్రీకృతమై ప్రకృతిలోని మిగతాశోభను ఆనందించటం మరచిపోతాడు. మానవమూర్తి అందులో లేకుండా వుంటే ప్రేక్షకుడు ప్రకృతి దృశ్యంలోని వివిధ శోభలనూ నిరాటంకంగా ఆనందించగలడని.

ఇక ప్రకృతి చిత్రాలలో మానవమూర్తి వుండాలనేవారి వాదన ఏమంటే ప్రకృతినుంచి మానవుడు కానీ, మానవునినుంచి ప్రకృతికానీ వేరై పోరాదని. ప్రకృతికీ మానవునకూ సన్నిహిత సంబంధంవుండాలని అందుకని మానవమూర్తి లేని ప్రకృతి చిత్రాలు సమంజసం కావని.

ఈ ఇద్దరి వాదాలకూమధ్య మూడోమార్గం ఒకటి ఏర్పరచుకొన్నారు కొందరు ప్రకృతి చిత్రకారులు. వీరి విధానంప్రకారం ప్రకృతి చిత్రంలో చాలా సూక్ష్మరూపాలలోవున్న మానవమూర్తులను చొప్పించటం. పకృతి ప్రాధాన్యంలో ఈ సూక్ష్మ మానవమూర్తులు చాలా అప్రాముఖ్యంగా గోచరించటంతో ప్రకృతి ప్రాధాన్యత ఇంకా బాగా హెచ్చి కనిపిస్తుంది. ఉదాహరణకు ఒక పర్వత శిఖరం క్రింద అతి చిన్న రూపంలో మానవ మూర్తిని చిత్రిస్తే ఆ పర్వత శిఖరపు ఎత్తు ఇంకా ఎక్కువగా గోచరిస్తుంది.

రెండు ఆయతనాల సమతల ప్రదేశం మీద మూడు ఆయతనాల (Three Dimensional) లోతులనూ, ఎత్తులనూ, దూరాలనూ సృష్టించి చూపటం చిత్రలేఖనంలో ఒక వైజ్ఞానిక పరిణతి. ఈ విధానాన్ని కొన్ని శతాబ్దాల క్రిందట పాశ్చాత్య చిత్రకళలో ప్రవేశ పెట్టేరు. దీనిలోని ప్రధాన విధానాన్ని దృష్టిక్రమం (Perspective) అంటారు.

ఒకచోటున నిలచి కనుపించు మేర చూస్తుంటే వస్తువులు కంటికి గోచరించే క్రమం కనుక దీన్ని దృష్టిక్రమం అన్నారు. దగ్గరలో వున్న వస్తువులు ఎత్తుగానూ, దూరానున్న వస్తువులు పొట్టిగానూ గోచరిస్తాయి. పర్వతానికంటే చెట్టు చిన్నదిగా వుంటుంది. సహజంగా కాని దగ్గరలోవున్నచెట్టు దూరానవున్న పర్వతానికంటే ఎత్తుగా కనుపిస్తుంది. దగ్గరున్న చెట్టుకంటే పర్వతం పొట్టిగా గోచరిస్తుంది. ఇది దృష్టిక్రమం కలిగించే మిధ్యాభాస లేక కంటి భ్రమ మాత్రమే కాని యథార్థంకాదు. యథార్థంలో పర్వతం ఎత్తుగానూ, చెట్టు పొట్టిగానూ వుంటాయి

క్రమేణా కవిత్వం నిబద్ధతనుంచి అనిబద్ధతలోకి ఏ విధంగా రూపాంతరం చెందుతూవచ్చిందో, ఛందోబద్ధ కవిత నేడు ముక్తఛందోరూపంలో వచనకవితలోకి ఏ విధంగా పరిణమించిందో పాశ్చాత్య దేశాల్లోని చిత్రకళలోకూడ అటువంటి అనిబద్ధత ఏర్పడి నేడు దేశ భేదాలు లేకుండా విశ్వమంతటాకూడ ఆధునిక చిత్రకళ అనేది వ్యాపించివుంది.

1789లో జరిగిన ఫ్రెంచి విప్లవం మానవుని జీవన విధానంలోనే అశేషమైన మార్పులు తెచ్చింది. ఈ మార్పులు సాహిత్యంలో, సంగీతంలో, నాట్యంలో, చిత్ర, శిల్పకళల్లో, మానవుని ఆలోచనల్లో అనుభూతుల్లో, ఒకటేమిటి మొత్తం జీవితంలోనే ప్రతిబింబించాయి. ఈ మార్పులలో ప్రధానమైంది బంధన నుంచి స్వేచ్ఛ వైపుకు పయనం. ఇందుకు ప్రధాన సాధన సంప్రదాయబద్ధమైన నియమాలను ఉల్లంఘించటమే.

ఈ నూతన దృక్పథం చిత్రకళలో తెచ్చినంత

సమూల పరివర్తనను సాంస్కృతిక రంగంలోని మరి ఏ ఇతర శాఖలోకీ తేలేదేమో! ఇందులోని ముఖ్యమైన వైఖరి ఏమంటే వాస్తవ వాదంనుంచి విడవడటం. సహజ రూపాలలోకంటే, అసహజ రూపాలలో సౌందర్యాన్ని అన్వేషించి అటువంటి అసహజ రూపాలకు చిత్రకళలో సృజన నివ్వటం. ప్రకృతి రూపాలను వికృతపరచి, దృష్టిక్రమానికి సంబంధించిన నియమాలన్నిటినీ ఉల్లంఘించటం మొదలైనవాటితో ఈ ఆధునిక చిత్రకళ అనేది ఆవిర్భవించింది. దీన్ని ప్రత్యేకించి ఇరవయోశతాబ్దపు చిత్రకళ అనవచ్చు. ఈ ఆధునిక చిత్రకళమూలాలు అస్పష్టంగా క్రిందటి శతాబ్దంలో పాతుకపోయి వున్నా కూడా ఇది స్పష్టరూపాన్ని తాల్చింది. ఇరవైయో శతాబ్దపు మొదటి భాగంలోనే ఇందుకు పరోక్షంగా పునాదులువేసింది పాల్ సజాన్ అనే ఫ్రెంచి చిత్రకారుడైనప్పటికీ, ఈ ఆధునిక చిత్రకళకు నిజమైన జన్మదాత స్పెయిన్ దేశస్థుడైన పాబ్లో పికాసో అని మాత్రమే చెప్పాలి.

పికాసోకంటే ముంధు బయలుదేరింది ఇంప్రెషనిజం అనే వాదం. ఇందులో వర్ణసంకరం కలుగకుండా వర్ణాల కాంతులను స్వచ్ఛంగా కాపాడటం నిమిత్తం, వర్ణాలనుఒకదానితో మరొకటి కలపకుండా ఒకదాని ప్రక్కన మరొకటి వుంచసాగేరు. ఎరుపు రంగూ నీలమూ కలిపితే ఊదారంగు ఉద్భవిస్తుంది. కాని ఈ ఇంప్రెషనిస్టులు తమ చిత్రాలలో ఎరుపునూ నీలాన్ని మిశ్రం చేయకుండా ఎరుపు ప్రక్కన నీలాన్ని వుంచేవారు. కొంతదూరంలోవుండి ఈ చిత్రాన్ని చూచినప్పుడు ఈ ఎరుపూ, నీలమూ మన దృష్టిలో మిశ్రమవర్ణంగా మారి ఊదాగా కనుపించసాగుతాయి. ఇందు మూలంగా రంగుల కాంతులు స్వచ్ఛంగా గోచరిస్తాయి.

ఇంప్రెషనిజం తరువాత వచ్చిన చిత్రకళలోని నూతన ఉద్యమాలన్నిటినీ కలిపి పోస్టు ఇంప్రెషనిజం అన్నారు. వీటిలో ప్రధానమైంది క్యూబిజం అనేది. దీనికి సూత్రాలు వేసింది పాల్ సజాన్. కాని నిర్మాణాకృతిలోకి రూపొందించింది పాబ్లోపికాసో. ఈ విధానంలో చిత్రించే రూపాలను క్యూబ్‌ల ఆకారంలో అంటే ఘనాకృతులలో చిత్రిస్తారు. ఇటువంటి చిత్రం చూస్తున్నప్పుడు ప్రథమ దృష్టికి గోచరించేవి ఘనాకృతులేకాని అసలు రూపంకాదు నిదానంగా ఆ ఘనాకృతులగుండా అసలురూపం గోచరించ సాగుతుంది. ఈ క్యూబిజాన్ని ప్రాతిపదికగా చేసుకొనే నేడున్న ఆధునిక చిత్రకళ అనేది పరిణామంచెందింది.

1912లో ఇటలీలో ఫ్యూచరిజం అనేది బయలుదేరింది ఇది సాహిత్యంలోనూ చిత్రలేఖనంలోకూడా రూపొందింది. గతినీ, వేగాన్నీ చూపటం దీని లక్ష్యం. తరువాత జర్మనీలో ఎక్స్‌ప్రెషనిజం బయలుదేరింది. ఇందులోని ప్రాధాన్యత బాహ్యజగత్తులోని వస్తువులను కాక చిత్రకారుడు తన కల్పనా జగత్తులోని రూపాలను చిత్రించటం. అటు తరువాత సర్రియలిజం (స్రియలిజం అనరాదు) అనేది 1924లో సాహిత్యంలోనూ, చిత్రకళలోనూకూడ ఉద్భవించింది. స్వప్నజగత్తుకు ఈ వాదం చాలా దగ్గరలోది. అచేతనలో గోచరించే అసహజ రూపాలను ఈ చిత్రకారులు చిత్రించేవారు.

ఇక ఆఖరులో చిత్రకళలో నైరూప్యవాదం ఎక్కువగా నిలిచిపోయింది. ఈ నైరూప్యవాదం (Abstractionism కూడా 1912లోనే జన్మించింది. దీని జన్మదాత రష్యా దేశస్థుడైన కాన్‌డిన్‌స్కీ. నేడు విశ్వమంతటా వ్యాపించివున్న ఆధునిక చిత్రకళ అనే దానిలో అధికభాగం ఈ నైరూప్య విధానమే. ఇందులో చిత్రించబడే రూపాలకూ దృశ్యజగత్తులో కనుపించే పరిచిత రూపాలకూ ఎక్కడా సారూప్యం వుండదు. ఇవన్నీ ప్రకృతిలోచూడని అపరిచితరూపాలు కావటంలో, చూచేవారు ఈ రూపాలను ఆనందించ జాలకుండా వుంటున్నారు. పరిచితరూపాన్ని చూడటానికే అభ్యస్తమైవున్న కంటికి అపరిచితరూపం కనుపించే వరకు దాన్ని ఆనందించలేక చెదరిపోతూన్నది.

ఈ ఆధునిక చిత్రకళకూడ లలితకళలలోది అయినప్పటికీ అలవాటయిన సాంప్రదాయక దృష్టితో చూస్తే ఇది లలితంగా గోచరించదు. దీని రసాస్వాదన ప్రజానీకానికి అందుబాటులో వున్నట్లు తట్టదు. ఇటువంటి ప్రత్యేక విషయాలను గురించిన విషయజ్ఞానం ప్రజానీకంలో ప్రచారం చేయటం ఎంతో అవసరం.

మానవుడు హేతువాది; అంతేకాదు, ఆనందజీవి కూడ. రసానుభూతి ఆనందాన్నిస్తుంది. రసానుభూతి నిస్తాయి లలితకళలు.



# మతం పేరుతో హింసాకృత్యాలు

నలభై అయిదేళ్ల నాటిమాట. తిరుపతి సంస్కృత కళాశాలలో మాతోపాటు ఒక విద్యార్థి ఉండేవాడు. నాకంటే రెండుమూడేళ్ళు పెద్ద. చాల బుద్ధిమంతుడు. అతనికి ఏమయిందో ఏమో! ఒకనాడు హఠాత్తుగా వెర్రివెర్రి చేష్టలు చేయడం ప్రారంభించాడు. పుస్తకాలు చించివేశాడు. గుడ్డలు పీలికలుచేశాడు. గుడ్డలు పీక్కున్నాడు. నామాలు తుడిచేసుకొన్నాడు. (వైష్ణవ విద్యార్థి; పేరు కారంచేడు సీతారామాచార్యుడు.) ఈ అవలక్షణాలు చూచి మాకందరికీ ఏమిటో భయం భయంగా వుండేది. మాకన్నా పెద్దపిల్లవాళ్ళు అతనికేమో ఎవరో ఏమోచేశారని, శాతబడో, శూన్యమో అయివుంటుందని నిశ్చయించారు మేమంతా ఆ విద్యార్థిని వెంటబెట్టుకొని ఒకరాత్రి గుట్టుగా ఒక భూతవైద్యుని యింటికి వెళ్లాము. ఆయనపేరు వెంకటప్ప. బుర్రమీసాలు, నొసలంతా ముంచివేసిన కుంకుమబొట్టు చూస్తేనే దయ్యంపట్టేట్టు, పట్టినదెయ్యం పారిపోయేట్టు వున్నాడు. పెద్దపిల్లవాళ్ళు ముందుకు వెళ్ళారు: చిన్నవాళ్లమయిన మేమంతా వెనక్కు నక్కాము. వెంకటప్ప సంగతి గ్రహించాడు. "మీ స్నేహితునికి ఎవరో శాతబడిచేశారు. నేను తిప్పేస్తా చూస్కోండి. అయితే, ఒకమేకపిల్ల కావాలి. అమ్మవారికి బలి యివ్వాలి" అన్నాడు. మా నాయకులు జంకారు. సంస్కృత పాఠశాల పిల్లలం మాకు బలీ గిలీ తెలీదు. అన్నారు. "నాకు పగడశాల పిల్లలసంగతి తెలీదూ! మీరేమీ చేయనక్కరలా. నేను రేపురాత్రి కపిలతీర్థం కొండపైన ఒకచోట ఇది తిప్పికొడతాను. మీరంతా రండి. ఏమీ భయంలేదు, నే నున్నాను," అన్నాడు వెంకటప్ప, మీసాలు మెలివేస్తూ. మేము ఆయన మీసాలునమ్మి మరుసటిరాత్రి కపిలతీర్థం కొండమీదికి వెళ్ళాము.

అర్ధరాత్రయింది. వెంకటప్ప అప్పుడు మరీ భయంకరంగా ఉన్నాడు పసుపుతో, కుంకుమతో, పేడతో ఏవేవో మండలాలుచేసి, వాటిలో రంగవల్లికలు తీర్చాడు. ఒక మండలంలో మా మిత్రుని కూర్చోబెట్టాడు. ఎదుట మరొక మండలంలో మేకపిల్లను కట్టివేశాడు! అది ప్రాణభయంతో విలవిలలాడుతూ అరుస్తూంది. వెంకటప్ప పెద్ద గొంతుతో దిక్కులు పిక్కటిల్లేట్లు ఉచ్చరించే మంత్రాలు, ప్రాణభయంతో తనకలాడే మేకపిల్ల చావుఅరుపులు, కపిలతీర్థం నిరంతర నినాదం, ఆ నీరవరాత్రిలో కొండచరియలకు తాకి ప్రతిధ్వనిస్తూ, వాతావరణాన్ని మరీ భయానకంగా చేస్తున్నాయి! మేమంతా కిక్కురుమనకుండా కూర్చున్నాము.

వెంకటప్ప అసలే ఆజానుబాహువు. అప్పుడు, ఆ వేషంలో మరీ పొడగరిగా, ఆకాశం అందుకుంటున్నట్టూ కనిపించాడు. ఏవేవో మంత్రాలు పఠిస్తూ, కత్తి చేతో పట్టుకొన్నాడు. మా వళ్ళు జల్లుమంది. "ఓం విరుద్ధే రూపిణి చండికే వైరి మముకం దేహి దేహి స్వాహా!" అంటూ ఖడ్గాన్ని అభిమంత్రించాడు. మరేదో ఖడ్గమంత్రం పఠించి పూజించాడు. మేకపిల్లను ముందుకులాక్కున్నాడు "నువ్వేశత్రువుసుమా!" అంటూ అభిమంత్రించాడు. ఎర్రదారం ఒకటి ఒక మం-లంనుంచి తీసుకొని ఆ కత్తితో పుటుక్కున తెంపి, ఆ మేకపిల్ల మూతికి బిగించికట్టాడు అనామకుడయిన వైరిపేరుతో దానికి ప్రాణప్రతిష్ఠ చేశాడు:

"ఓమ్, అయంసవైరీ యోద్వేష్టి
తమిమం పశురూపిణమ్
వినాశయ మహాదేవి
స్ఫేంస్ఫేం ఖాదయ ఖాదయ"

అంటూ, బలిపశువు నెత్తిమీద పూవులువేసి బలిమంత్రం పఠించాడు. "దుర్గాయై భగవత్యై తుభ్య మహం, సంప్రదదే, ఆం క్రూం ఫట్" అంటూ మేక

---

రచన:

**శ్రీ తిరుమల రామచంద్ర**

పిల్లతల నరికి "ఏకత్రుధిరం దుర్గాయైనమః" అని రక్తాన్ని, మేకతలను నివేదించాడు. తర్వాత ఆ రక్తంతో హోమంచేశాడు. ఆ దుర్వాసన భరించలేక పోయాము. కాని, ఏమన్నా, ఏమనుకున్నా మహాప చారం. ఈ తంతంతా ముగిసేవేళకు చుక్కపొడిచింది.

తర్వాత మా మిత్రుడు ఊరికి వెళ్ళిపోయినవాడు తిరిగి రాలేదు. ఏమయ్యాడో ఏమో తెలియదు; జ్ఞాపకమూ లేదు.

* * *

మొన్నటి ఎన్నికల ప్రచారంతో వెలువడిన కరపత్రాలు, ప్రకటనలు చూస్తే ఆనాటి భయాలు, నమ్మకాలు ఇంత విజ్ఞానశాస్త్రం అభివృద్ధిచెందినా, ఇంత సంస్కారప్రచారం జరిగినా, గాంధీ అంతటివాడు అవతరించి మూఢవిశ్వాసాలు, హింసలు వద్దని గోల పెట్టినా, మారినట్టుగాని, పోయినట్టుగాని కనిపించదు. ఎన్నికలలో తమ ప్రత్యర్థులను మంత్రశక్తితో, అభిచారాది హోమాలతో జయించాలనే ప్రయత్నాలు కూడా కొందరు చేసినట్టు ఆ కరపత్రాలు తెలిపాయి. ఎవరో తమ ప్రత్యర్థులను ఓడగొట్టడానికి మాంత్రికులను పిలిపించారట; ఏవో తంతులు జరిపించారట కాని, వారి ఆశయం సిద్ధించకపోయినందున తదభిమానులు మాంత్రికులనే కొట్టారట.

ఒక పెద్దమనిషి తిరుమలమీద తలనీలాలు సమర్పించాడు. "ఎందుకండీ, ఏమిటీ మొక్కుబడి?" అని ప్రశ్నించగా, "నా ప్రత్యర్థి ఓడిపోతే తలనీలాలు ఇసానని ఏడుకొండలవాడిని వేడుకొన్నాను." అన్నారు. "మీకు ప్రత్యర్థి ఏమిటీ? మీరు ఎన్నికల్లో నిలబడలేదే?" అని అంటే, "ప్రత్యర్థి అంటే, నాకేనా, నా స్నేహితుని ప్రత్యర్థి! మా నాయకుని ప్రత్యర్థి, ఆతడికోసం నేను మొక్కుకున్నాను." అని సమాధానమిచ్చాడు. ఈ ముండనం, మొక్కుబడీ రాజకీయ నాయకులకు ప్రజా ప్రతినిధులకూ మరీ ఎక్కువయిపోయింది. ఆంధ్రప్రదేశ్ శాసనసభ మొన్నటి ఎన్నికల తర్వాత ముండిత మస్తకులతో మండితమై తన శోభను పెంచుకొంది. అయితే:

కోరికలు లేనివారంటూ వుండరు. వాటిని తీర్చుకోడానికి రకరకాల ప్రయత్నాలు, ప్రార్థనలు, జ్యోతిషాలు, శకునాలు, ప్రశ్నలు, మొదలయిన మూఢవిశ్వాసాలు అనాదిగా ప్రతి దేశంలోను, ప్రతి మతంలోను ప్రతి తెగలోను ప్రపంచమంతా వున్నవే దురాచారాలు, మూఢ విశ్వాసాలు వద్దని సంస్కార మహోద్యమంగా బయలుదేరిన బౌద్ధంలోను బుద్ధి అన్న పేరుతో మహాత్మ్యాలకు, పూజా పురస్కారాలకు ప్రాధాన్యమిచ్చే మహాయానం, మంత్ర తంత్ర యంత్రాలకు పుట్టవయి, మూల సిద్ధాంతాలను మూలకు త్రోసిన వజ్రయానం బయలుదేరి అసలుమతం దిగజారిపోవడం చరిత్ర. తనకు హితంకోరడం ఎలా సహజమో, తనకు సరిపడని వారికి అనిష్టం కోరడమూ సామాన్య మానవుని స్వభావానికి సహజమే. కాని, ఈ అనిష్టాకాంక్ష అంతటితో ఆగక, క్రౌర్యంగా పరిణమించి, మానవత్వాన్ని అధఃపాతాళానికి తొక్కివేస్తుంది. ఈ నీచ మనస్తత్వమే చేతబడి, చిల్లంగి, చెడుపు, అభిచారం, శూన్యం ప్రయోగం మొదలయిన దుష్కృత్యాలకు మూలం.

ఈ దురాచారాలు వివిధ రూపాల్లో, వివిధ సిద్ధాంతాల పేరుతో ప్రపంచమంతటా అనాదిగావుంది. పూర్వం సైబీరియాలో షామానోన్, కొరియాలో పాన్సస్-ముటంగ్, చైనాలో మా-పో, సెర్బియావో, లైకంత్రపీ వూడోయిజం మొదలయిన పేర్లతో ఉండేదని తదభిజ్ఞులు చెబుతున్నారు. యూరోపియన్ దేశాలలో ఇది 1474 నుంచే సాహిత్యంలో కనిపిస్తుంది. షేక్స్పియరు నాటకాలలో పిశాచాల, దయ్యాలప్రసక్తి ఉండడం అందరూ ఎరిగినదే. ఫ్రాన్సు, జర్మనీలలో 18వ శతాబ్దినుంచే భూతప్రేత పిశాచాదుల ఆవాహన విసర్జనాదులు జరిపే సంఘాలుండేవి. మధ్య యుగాలలో, విజ్ఞానశాస్త్ర రహస్యాలు కొన్ని మతగురువులకే తెలిసిన రోజులలో, వారు కొన్ని రసాయన వస్తువులద్వారాను, శారీరక సాధనాలద్వారాను సాధించిన పనులను అద్భుతాలుగా చూపుతూ, సామాన్య ప్రజలను భ్రమింపజేస్తూ, వారిని తమ వశంవదులుగా చేసుకొనేవారు. దీనికితోడు సామాన్య ప్రజలలోగల పిశాచభీతి, తక్కిన భయాలు మతాచార్యులకు బాగా వినియోగపడ్డాయి. కొన్ని శక్తులవల్ల కామరూపం, కామగమనం మొదలయినవి సాధ్యమనే "లైకంత్రపీ"లో గూడ జనానికి చాలనమ్మకం వుండేది. లైకంత్రపీ అంటే, తోడేలురూపం పొందడం. మానవుడు కొన్ని శక్తులవల్ల తోడేలుగాను పెద్దపులిగాను మారిపనులు

సాధించగలడని జరిపే మోసాలు, మాయలు ప్రబలిపోవడంవల్ల, ఒకదశలో రోమన్ చర్చీలు వాటినేకాక ఇంద్రజాలం, గారడీవంటి వినోద విద్యలనుకూడ నిషేధించాయని చరిత్ర చాటుతున్నది.

ఇక భారతదేశంలో ఇలాంటి నమ్మకాలు పూర్వ నుంచీవున్నట్టు పురాణేతిహాసకావ్య చరిత్రలలో ఎన్నో కథలున్నాయి. ఈ కథలకన్నిటికీ మూలం అధర్వణ వేదం తదంగాలయిన ఉపవేదాలూను. వీటిలో దీనిని అభిచారమని అన్నారు. అభిచారమంటే, ఆభిముఖ్యేన శత్రువధార్థం చారః హింసాకర్మ శత్రువధకోసం ఎదురుగా చేసేపని, హింసాకర్మ."

ఈ అభిచారం ఆరువిధాలు, మారణం, మోహనం, స్తంభనం, విద్వేషణం, ఉచ్చాటనం వశీకరణం అని. శత్రువును ఈ విధంగా ఆరురకాలుగా హింస చేయడానికి శ్యేనయాగం. డేగనుచంపి తద్రక్త మాంసాలతో హోమాదులుచేయడం మొదలయిన సవాలు, కృత్య, పిశాచప్రయోగం, యాతుధానులు, అసురలు, మొదలయినవారిని ప్రయోగించటం, ఇత్యాది హింసా కర్మలను అధర్వణవేదం నిర్వచించింది. రాజపురోహితులకు రాజ్యశ్రేయస్సుకోసం ఐహిక ఫలాలయిన శాంతిక పౌష్టిక కర్మలు, శత్రుహనన సమర్థాలయిన అభిచారాదులు తెలిసివుండాలని గోపథబ్రాహ్మణం తెలుపుతున్నది గోపథబ్రాహ్మణంలో మరొక తమాషాకథ వుంది. బ్రహ్మ, అధర్వణవేదం చెప్పినతర్వాత పూర్వ దక్షిణ పశ్చిమోత్తర దిశలను వరుసగా చూచాడట. పైకికూడ చూచాడట. దానితో పంచోపవేదాలు సర్ప వేదం, పిశాచవేదం అసురవేదం, ఇతిహాసవేదం పురాణవేదం పుటాయట. (1-10) అధర్వణవేదానికి సంబంధించిన ఆంగీరస దూర్వాస కౌషీతక్యాది నవ కల్పాలలో ఈ సవాల, యాగాల వివరాలున్నాయి.

వేదం ఇలాటి అభిచారాదులను ప్రోత్సహిస్తుందా అన్నది సంశయమే. కాని, ఇలాటి హింసాధర్మాలు, ఆచరణలు, నమ్మకాలు మంత్రతంత్రాలు అనాదిగా వున్నాయని, వాటిని అధర్వణవేదం సంస్కరించి క్రోడీకరించి, బ్రాహ్మణీకరించిందని కొందరు విమర్శకులు అంటున్నారు. వేదం వివిధ విజ్ఞాన వాహినుల సంగమం, సంకటం గనుక ఇవి, ఇంతకన్నా ఘోర మయినవీ వుంటే ఆశ్చర్యమేమీ కాదని మరికొందరు విమర్శకుల అభిప్రాయం.

శాంతిక పౌష్టిక ప్రక్రియలకు అభిచారానికి సంబంధించిందా అధర్వణవేదం. అవిసం(గొర్రెను బలి యిచ్చే హోమం), అజౌదనసవం (మేకబలి) కర్కి సవం (తెల్లని ఆవుదూడ బలి), అనడుహ్సవం (ఎద్దు బలి) ఋషభసవం, వసాసవం (వట్టిపోయిన ఆవు బలి) మొదలయిన బలులిచ్చే యజ్ఞాలు, ఓదనసవం, పవిత్రసవం (నువ్వులు, బియ్యం వంటకం) ఊర్వరా సవం (పంటచేల దానం) మొదలయిన అహింసాత్మక యజ్ఞాలు విషహరణమయిన "ఊరుగుల" వంటి పాముమంత్రాలు, అర్బుది న్యర్బుది, త్రిసంధి, వజ్రవంటి దివ్యాస్త్రాలు, తక్మ (జ్వర) కుష్టాది రోగ హరణమయిన కుష్ట (సోమంవంటిది), శర. పృశ్నిపర్ణి, అపామార్గ, పాట, రోహిణీ, అర్క, పిప్పల, గుగ్గులు, జంగిడ (తంగేడు), మొదలయిన ఓషధులు, కేశవర్ధనివంటి కేశవర్ధని మూలికలు తెలుపడమేకాక నేటి చాతబడులకు మూలమనదగిన "కృత్య" అనే చిత్ర హింసాత్మకమయిన ప్రక్రియను మహాయుధంగా వర్ణించింది

కర్రతోగాని, గుడ్డతోగాని, పిండితోగాని, బొమ్మ చేసి, దానిని అభిమంత్రించి, శత్రువును ఆవాహనచేసి, జరిపే చిత్రహింస కృత్య. ఈబొమ్మ రెండు మొదలు నాలుగడుగులు ఎత్తు వుండవచ్చు. దీనిని పెండ్లికుమార్తె లాగ అలంకరించవచ్చు. అపామార్గను(ఉత్తరేణిని) రక్షగా కట్టుకుంటే దీని దోషం పోతుంది. జంగిడ (తంగేడు) మూలికను రక్షగా కట్టుకోడం కూడా దీనికి విరుగుడు

ఈ కృత్యావర్ణనం, స్తోత్రం, ప్రయోగం ప్రేషణం, ప్రత్యావర్తనం, మొదలయినవి. దశమకాండం, ప్రథమానువాకం, ప్రథమ సూక్తమంతాను. తక్కిన అనువాకాలలో సకృత్తుగానూ ఉన్నాయి. కృత్యను ఒక ఋక్కు ఇలా అంటుంది.

అపక్రామ నానదతీ
నినద్ధా గర్దభీవ,
కర్తౄన్ అక్షస్వ ఇతో
బ్రహ్మణా వీర్యవతా.
(10-1-1-14)

ఇక్కడి నుంచి గాడిద లాగా ఓండ్ర పెడుతూ, పెడుతూ, వెళ్ళు. కర్తను, నిన్ను రూపొందించిన

వాడిని వదిలి పెట్టు. వీర్యవంతుడయిన బ్రహ్మ నిన్ను సృష్టించాడు సుమా!

పరేహి కృత్యే మాతిష్ఠో
విద్ధస్యేవ పదం నయ,
మృగస్య మృగయుస్త్వం
నత్వా నికర్తుమర్హతి.

(10-1-1-16)

ఓ కృత్యా! వెళ్ళిపో. ఎవరిని గురిచూచి విడువ బడావో, అతడున్న చోటికి వెళు. అతడిని నీవు వేటాడు, నీవు వేటగత్తెవు. అతడేమో వేటమృగం. కనుక నిన్ను చంపలేడు.

వాతం ఇవ వృక్షాన్ నిమృణిహి
పాదయ మాగా మశ్వం పురుషము
చిహ్న ఏషాం,
కర్తౄన్నివృత్యేతః కృత్యే
అప్రజాత్వాయ బోధయ.

(10-1-1-17)

పెనుగాలి చెట్లను కూల్చి వేసేటట్టు ఎవరి కోసమయితే నీవు ప్రేషితురాలివో ఆ పురుషుని పడగొట్టు. అతని ఆలమందలు, గుర్రాలు, మొదలయిన వాటిని నశింప జేయి. కర్త నుంచి బయలుదేరి వారిని ప్రజా రహితులను గానూ చేయి.

ఈ కృత్యా కర్మను ఆంగీరసుడు మొదలు పెట్టాడు. అందువల్ల దీనికి అతడు అధ్యక్షుడు, ఋషి, పురోహితుడు. అతడు దీనిని విడువ గలడు. మళ్ళించను గలడు. విడువడం ఆంగీరసం (విధానం) మళ్ళించడం పత్యంగిరసం (ప్రత్యక్ అంగిరసం అనికూడా) ఇలా తిరిగి వచ్చిన కృత్యప్రత్యంగిరా దేవతగా మారింది. ఈ కృత్యను మళ్ళిపొమ్మనే మంత్రాలు ఇలా అంటున్నాయి:

యస్త్వోవాచ పరేహీతి
ప్రతికూల ముదాయ్యం,
తం కృత్యేభి నివర్తస్వ
మాస్మాన్ ఇచ్ఛో అనాగసః

(10-1-1-7)

నిన్ను మా మీదకు వెళ్ళమన్నవాడు చెప్పింది ప్రతికూల మయిన మాట మేము తప్పు చేయని వాళ్ళం. కృత్యా, మమ్మల్ని కోరవద్దు వెళ్ళిపో

యస్తే పరూషి సందధే
రథాస్యే ఋభుః ధియా,
తంగచ్ఛ తత్రతే అయనం
అజ్ఞాతః తే అయం జనః

(10-1-1-8)

రథాన్ని చక్రాలు మొదలయిన వాటితో సిద్ధ పరచినట్లు నిన్ను సంధానం చేసిన వాడి వద్దకు తిరిగి వెళ్ళు. అదే నీ స్థానం అదే నీ దారి. వీడు నీకు తెలిసిన వాడు కాడు.

"అఘమస్త్వఘకృతే
శపథః శపథీయతే,
ప్రత్యక్ ప్రతి ప్రహిణ్మో
యథాకృత్యా కృతం హనత్."

(10-1-1-5)

కృత్యను పంపి పాపంచేసినవాడికి పాపం తగులనీ. శపథం చేసినవాడికి ఇది ప్రతి శపథంకానీ, ఈ కృత్యను మళ్ళించి పంపుతున్నాము. కృత్య తనను చేసినవాడిని తానే కొట్టివేయనీ.

కృత్య తిరిగిపోయింది. మళ్ళించినవాడు ఎంతగానో సంతోషిస్తాడు; ఎంతో సంతృప్తి పడుతాడు.

"యథా సూర్యోముచ్యతే తమసస్పరి
రాత్రింజహాత్యు షసశ్చ కేతూన్,
ఏవాహం సర్వం దుర్భూతం కర్త్రం
కృతాకృతాం కృతం హస్తీ
రజోమరితం జహామి."

(10-1-1-22)

అబ్బ! ఈ కృత్య నన్ను ఏమీచేయక వదలిపెట్టి వెళ్ళింది. అన్నిపాపాలు పోయాయి. సూర్యుడు చీకటి పొరలనుంచి బయటపడినట్టు, ఉషస్సురాత్రి నుంచి వెలికి వచ్చినట్టు. అన్ని దుష్కర్మాలనుంచి విడవడాను. అందువల్ల ఏనుగు మదాన్ని వదలినట్టు దురితం వదలి పెడుతున్నాను.

అధర్వణవేదం తక్కిన మూడు వేదాలలాగ కాక, విలక్షణంగా, కేవలం ఐహిక విషయాలను, ముఖ్యంగా అభిచారాది హింసాకర్మలను ప్రవచించడంవల్లనే పారలౌకికవాదులు దీనిని అంతగా పరిగణించక ఋగ్యజుస్సామాలనే త్రయికే ప్రాధాన్యమిస్తారు.

ఇలా అధర్వణవేదానికేఎక్కిన కృత్య వేణీసంహార నాటకం రచించిన భట్టనారాయణునితో 'కృత్యారా

షణం' అనే నాటకం రచించడానికి కారణమయిందంటే, విద్యావంతులలోను ఆనాడుఇలాంటిఅభిచారాల ఎడలగల విశ్వాసం ఎంతబలీయమో చెప్పనక్కరలేదు

ఆ కృత్య, నేటికీ వివిధ నామధేయాలతో మూఢ విశ్వాసాలున్నవారికీ, దుర్బల మనస్కులకు హింసా కర్మోపకరణాలుగానే వున్నాయి. ఈనమ్మకంగలవారు నేటికీ,పిండిబొమ్మనో, కర్రబొమ్మనో చేసి 21,42, 63 మొదలయిన నియత దినాలపర్యంతం వాటినిఅర్చించి, వాటి అంగాలలో ముండ్లుగాని, మేకులుగాని, చెక్కుతారు. చివరకు కంఠంలో చెక్కినప్పుడు, శత్రువు ప్రాణం పోతుందని నమ్మకం. ఈ అభిచారులు తమ శత్రువుల తల వెంట్రుకలను, గోళ్లు, మలాలు, ఋతుస్రావం, మొదలయినవాటిని సంపాదించి ఈ బొమ్మలో వేసారు. జాగిలాలకు. దొంగకు సంబంధించి గుడ్డనో, మరే వస్తువునో, మూజూపిస్తే, అది ఆ దొంగను పసిగట్టి, పట్టుకొని కరిచేటట్టు. అతని వసువుల వాసనతో, అభిచార పిశాచమో, దైవతమో అతనిని పసి గడుతుందనే, నమ్మకమే ఈ మురికి వస్తువుల సంపాదనకు కారణ మయి వుంటుంది.

సంస్కృత భాషలోని అభిచార పదానికి, కృత్యకు తెలుగులో చెడుగు, చేతబడి, చిల్లంగి, సమానార్థాలుగా ప్రచార మయాయి. చేడ్పడు, చేడ్పాటు అనేవి బాధపడు, బాధ అనే అర్థాలలో వున్నాయి కీడు అని కూడా దీని అర్థం. వీటి అపభ్రష్ట రూపమే చేతబడి, చాతబడి, శాతబడి. చిల్లంగి అంటే మూలికాదులతో చేసే ఉచ్చాటన క్రియ. దీని ఉత్పత్తి ఏమిటో ? శూన్యం పెట్టడం, ప్రయోగం చేయడం, అనికూడా వాడుతారు. శూన్యమంటే అవయవాలను, బుద్ధిని కర్మ శూన్యంగా, అకర్మణ్యంగా చేయడం. ప్రయోగంఅంటే దుష్టశక్తిని ఒకరిపై ప్రయోగించడం, వదలడం.

ఈ క్రియలోని ఉద్దేశం దుష్టమని ఈ మాటలే చెబుతాయి. శుభకామన తత్సిద్ధికి మొక్కుకోవడం, భగవత్సేవ చేయడం అర్థంగల పనులు. దుర్హృదయంతో పెరవారికి చెడుగు కోరడం న్యాయంకాదు. హత్యకు, హత్యా చింతకు శిక్ష విధించడం రాజ దండ నీతి లక్షణం. మనువు దీనిని ఉపపాతక మన్నాడు. దీనికి కృచ్ఛ్రి వ్రతాలు చేయడం ప్రాయశ్చిత్తంగాను విధించాడు:-

అభిచార మహీనంచ
త్రిభిః కృచ్ఛ్రైః వ్యపోహతి

సర్వాకరే ష్వధీ కారః
మహాయంత్ర ప్రవర్తనం,
హింసౌషధీనాం స్త్రీ జీవ్యః
భిచారో మూల కర్మచ

(11.63)

గనులపై అధికారం, కీళ్ళుగల పెద్ద యంత్రాలను నడపడం, ఓషధులతో హింస, స్త్రీలను బ్రతుకు తెరువు చేసుకోడం, అభిచారం, వశీకరణం, ఉపపాతకాలని, ప్రాయశ్చిత్తార్హాలని శిక్షార్హ విషయాలలో క్రోడీకరించాడు.

వీటి లక్ష్యం పరహింస. వీటిని ఇతరులను భయపెట్టడానికి దుర్వినియోగ పరచే ప్రమాదం ఎప్పుడూ వుంది. మంచి చెబితే జరుగక పోయినా, చెడు చెబితే జరుగుతుందనే భయం, కాకతాళీయంగా ప్రమాదం జరిగితే ఫలానా దానివల్లనే జరిగిందనే నమ్మకం అపరిణత మనస్కులకు కలుగుతుంది. భయం ఆవహించినచోట వికాసానికి అవకాశం వుండదు. విజ్ఞాన శాస్త్రం బాగా అధ్యయనం చేసిన వారికి కూడా, ఇలాంటి విశ్వాసాలు పరస్పర సమన్వయం లేక, వేటికవే అరలు అరలుగా మనస్సుల్లో వుండడం చూస్తున్నాము. ఒక విశ్వవిఖ్యాత వైజ్ఞానికుని గురించి ఒక కథ చెబుతారు. పదిహేనేళ్ళ క్రితం చెన్నపట్టణంలో సంపూర్ణ సూర్యగ్రహణం వచ్చినపుడు సముద్రంలో స్నానం చేసి, సూర్యోపరాగ పితృతర్పణం చేస్తున్నారట ఆ విజ్ఞానవేత్త పక్కన పరిశీలనార్థం వచ్చిన పాశ్చాత్య వైజ్ఞానికులు కొందరు అడిగారట :

"డాక్టర్ ఏమిటిది ? సూర్యునికి ఏదో అడ్డంవస్తే కదా గ్రహణం ? ఏమిటి మీరు చేసేది ?" అని.

"దట్ ఈజ్ సెన్స్, అండ్ దిసీజ్ సెంటిమెంట్ !" అని ఆయన సమాధాన మిచ్చాడట. ఇక సామాన్య ప్రజల సంగతి చెప్పనక్కరలేదు. ఏ ప్రకృతి వైపరీత్యం ఏర్పడినా భయపడతారు. ఏవేవో మొక్కులు, ముడుపులూ చేసారు.

పూర్వం దేశ పాలకులు దేశరక్షణ దృష్టితో ప్రజాహిత దృష్టితో శత్రు నిబర్హణానికి అభిచారాదులు జరుపడమంటే, కాల, దేశ, వర్తమానాలను బట్టి సహేతుకమే కావచ్చు కాని ఆ సాకుతో నేడు ప్రతివాడూ, తనకు గిట్టని వాడిని ఇలాంటి దుష్క్రియలతో బెదిరించడం ప్రారంభిస్తే సంఘంలో అవినీతి, దుష్టచింతన, వ్యాపిస్తాయి. కనుక నేటి ప్రభుత్వాలు ఇలాటి వాటిని నిషేధించడం అవసరం.

తలనీలాలు సమర్పణ సంగతి, పూర్వోదంతం మరీ విడ్డూర మయినట్టివి, పూర్వం, ఎప్పుడో, ఏ అనాది అనాగరక స్థితిలోనో నవయౌవన ప్రాదుర్భవ కాలంలో అందరూ దేవాలయానికి వెళ్ళి సేవ చేయవలసి వచ్చేదని, ఆ సేవలో పెద్దలకు స్వీయాంగ సమర్పణం కూడా భాగమని, సంఘం వివేకవంతం, నాగరకం కానుకాను ఆ సేవకు చిహ్నంగా, తమను పోలిన విగ్రహాలు సమర్పించడం ఆచారమయిందనీ, దాని అవశేషమే నేటి తలనీలాల సమర్పణ మని కొందరు సంఘవిజ్ఞాన శాస్త్రవేత్తలు అంటున్నారు. దీనిని మరి కొందరు అన్యథా వ్యాఖ్యానిస్తున్నారు.

శిరోముండనం పరాజితునికో, శత్రుదూతకో, చేసే పరాభవాలలో ఒకటి. జితుడు, విజేతకు దాసోహమనడానికి ఇదొక చిహ్నం. ఇది రామాయణ, భారతాలలో వుంది. పూర్వం రాజులు తమ రాజ్యాన్ని భగవత్కైంకర్య రూపంగా పాలించేవారు. గనుక తమ శత్రువులకు అవమానం భగవత్సన్నిధిలోనే చేయడం ఆచారమయింది. తర్వాత యిది అభీష్టప్రదాత అయిన భగవంతునికి వినయ ప్రకటనగా రూఢమయింది.— అని

దీని మూలకారణం ఏమైనా నేడు తః నీలాల సమర్పణం భక్తికి బాహ్యచిహ్నంగా, త్యాగానికి ప్రతిరూపంగా నేడు దక్షిణ భారతంలోని పెక్కు క్షేత్రాలలో ముఖ్యంగా వేంకటేశ్వర, నరసింహ, ఆంజనేయ, షడానన, క్షేత్రాలలో ప్రచురమైన ఆచారం. (ఇది నిజంగా త్యాగమే! "కురూపికయినా కురులే అందమని" సామెత వుండగా, మహిళలు తమ మోములకు, ఎంతో అందచందాలు చేకూర్చే శిరోజాలను ఇవ్వడం – కొనలను కత్తిరించడం కాదు, కూకటి వేణితోపాటు క్షురకు బలిచేయడం – వికార స్వరూపం వరించడం అనేది నిజంగా త్యాగమే.) ఈ భక్తి త్యాగ ప్రకటన క్రియనుకూడా శత్రు నిషూదన, ప్రత్యర్థి పరాభవ కాంక్షకు పరతంత్రం చేయడం ఉచితం కాదు. ఇలాచేస్తే ఇది నిషేధార్హం కాకపోదు.



# సినిమాల్లో సహజ నటన

సినిమాల్లో సహజంగా నటించాలి. నాటక రంగంలో కూడా సహజంగానే నటించవచ్చు. కాని దానికి తగిన సదుపాయాలు, మైక్‌తో, మంచి లైటింగ్ సౌకర్యాలున్నప్పుడు మన సహజ నటన కొంత వరకు రాణించబడుతుంది.

నాటకరంగంలో కొంతమంది నటులు స్టేజీలో వున్నంతసేపూ బిగదీసుకొని నటిస్తూవుంటారు. ఈ విధానం నాటకరంగంలో నటిస్తున్న అనేక మంది నటులలో చూస్తున్నాం. కాని సినిమాలలో బిగదీసుకు నటించడం మంచిదికాదు. మన యొక్క లోపాలన్నీ కెమేరా లెన్స్, ఇట్టే బయటపెడుతుంది. మనం చెయ్యాలని చేసే నటనగాని, లేక బిగదీసుకొని నటించినా, ఏ అభినయంలేక చలనం లేకుండా నిలబడినా సినిమాలలో బయట పడిపోతాం. నాటకంలో అస్వాభావికమైన అభినయ కదలికలు ముఖంలో వచ్చినప్పుడు రంగస్థలం మీద స్పష్టంగా అందరికీకనబడదు. కనుక ఎలాగో ఓలాగా తట్టుకుంటాం. కాని సినిమాలో అలా ఏ మాత్రం వీలులేదు. అద్దంలో ప్రతిబింబంలాగా ప్రతిచిన్నలోపాన్ని పట్టి చూపిస్తుంది కెమేరా. సినిమాలో నటన అతి స్వాభావికంగా వుండాలంటే జీవితానుభావాల అభినయనానికి చాలా సన్నిహితంగా వెళ్ళాలి.

అందుకే అనుభవమున్న అనేకమంది సినీనటులు చెపుతూవుంటారు: సినిమాలో సహజంగా వుండు– నాటకంలో మాదిరి నటించకు-అని.

ముఖ్యంగా నాటకరంగంలో నటించే నటీనటులకు స్టేజీ పరిమితమై యుంటుంది. ఆ కొద్ది స్థలంలోనే నటించాలి. కాని సినిమానటుని రంగస్థలం విశాలమైంది. అది సహజమైనది అనేక సెట్సులోను అనేక ప్రకృతిదృశ్యాలవద్ద, కొండల్లోనూ, జలపాతాలవద్దా నటించవలసి వుంటుంది. అంటే జీవితంలో మానవుడు వెళ్ళగలిగిన ప్రదేశానికి ఆనందించతగిన అనేక దృశ్యాలవద్దకు సినిమానటుడు వెళ్ళి నటించాల్సి వుంటుంది. ఇంత దీర్ఘ ప్రయాణంలో నటుడు ఎంతో సహజంగా వుంటేగాని నటించలేడు. ఉదాహరణకు ఒక పెద్ద జలపాతాన్ని చూచినప్పుడు ఆ పాత్రపొందే ఆనందాన్ని క్లోజప్‌లో తీస్తారు. సినీనటుడు జలపాతాన్ని చూస్తున్నపుడు ఏ ఆనందాన్ని పొందగలిగాడో అంత ఆనందాన్ని ఎన్నో రోజుల తరువాత స్టూడియోలో తీయబడే క్లోజప్ షాట్‌లో నటించాల్సి వుంటుంది. ఇది ఎంతో కష్టమైన నటన.

నాటకరంగ నటీనటులు సంభాషణల ద్వారా ఎక్కడో దూరాన్ని చూపించినట్లు చూపించి ఆ జలపాతాన్ని ఆ సుందర ప్రకృతి దృశ్యాన్ని సంభాషణల ద్వారా వెల్లడించి, మనలో మనకు ఆనందాన్ని కలిగిస్తారు.

నాటక రంగంలో నటన ఎప్పుడూ ఒక జనరల్ ప్లానులో నడుస్తుంది. నాటకం పూర్తి అయ్యేలోగా తాను ఏ విధంగా నటించాలో, తన పాత్ర ఏమిటో పూర్తిగా తెలుసుంటుంది.

కాని సినిమా నటుడు సెట్టుమీదికి వెళ్ళేవరకూ సంభాషణలు మినహా తను ఏ విధంగా నటించాలో తెలియదు. ఏ సంభాషణ క్లోజప్‌లో తీస్తారో, ఏ నటుడు ఎక్కడ నిలబడి నటించాలో కూడ తెలియదు. ఎలా నటించాలో అన్న విషయాలన్నీ డైరెక్టరు బుర్రలో వుంటాయి. ఆయన సెట్‌మీద ఒక అభిప్రాయంచెప్పి నటించమంటాడు. అప్పటికప్పుడు మనం ఆ సన్నివేశంలో ఎలా నటించాలో వెంటనే నిర్ణయించుకోవాలన్నమాట ఇది ఎంతో కష్టమైన నటన. ఈ విధంగా నాటకరంగ నటునికి వుండదు. తన సంభాషణలు, తన అభినయాలు ఎప్పుడు ప్రదర్శించాలి? ఎక్కడ కూర్చోవాలి? ఏయే వస్తు పరికరాలను ఎలా వాడాలి?

---

రచన:

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

ఎప్పుడు నిష్క్రమించాలో మొదలైన అన్ని విషయాలు అదివరకే రిహార్సల్సు జేసివుండడం వల్ల నాటకరంగ నటకునికి చాల తేలికైనపని. ఈ విధంగా సినిమాలో ఒక్క డాన్సర్సుకు మినహా మూమెంటు రిహార్సల్సు నటీనటులకు ఎక్కువగా వుండవు. ఈ విషయంలో సినిమా నటుని నటనే కష్టమైనది.

ఉదాహరణకు నాటకంలో ఒక శృంగారదృశ్యంలో నటించే దంపతులు ఎలా నటించాలో పూర్తిగా నటించ గలరు. ఇది సినిమాలో చాలా దూరం, సెట్టుమీద తప్పితే, కుదురైన రిహార్సల్సు ఎక్కడా జరుగవు. అందువల్లనే సినిమాలో కొన్ని ఇటువంటి దృశ్యాలు చాలా పేలవంగా వుంటాయి.

సినిమా నటుడు నటనలో ఎంతో చురుకుదనాన్ని కలిగివుంటేగాని, ఎప్పటికప్పుడు డైరెక్టరు చెప్పే సంభాషణలకు తగినట్లు నటించటానికి సిద్ధంగా వుండ లేడు. ముందే తన పాత్రను గూర్చి తెలిసినప్పుడు, తాను నటించే చిత్రంయొక్క ఇతివృత్తం తెలిసి నప్పుడు ఇంకా ఎంతో బాగా నటించగలుగుతాడు. ఇలాంటి అవకాశం నేటి సినిమారంగంలో ఏదో ఒకటి రెండు ముఖ్యమైన విషయాలను మినహాఇస్తే ఇతరు లెవ్వరికీ స్క్రిప్టుగాని, సంభాషణలు గాని తెలియవు. ఇందువల్లనే సినిమాలో కొన్నిపాత్రలు రాణిం చాల్సినంత బాగా రాణించలేక పోతున్నాయి.

ఉదాహరణకు ఒక నాటకంలో కథానాయకుడు కథానాయకిని నాటకాంతంలో హత్యచేసాడు. ఎందుకు హత్య చేయాల్సివచ్చిందో ఆ నటులిద్దరికీ నాటక ప్రారంభంనుండి తెలుసుంటుంది. కాని సినిమాలో అలాంటి హత్యాసంఘటనే వుంటుంది. అది ఇది వరకు చెప్పుకున్నట్లు ముందే తీస్తారు. కాని ఎందుకు హత్య చేయాల్సివచ్చిందో సినీ నటునికి నాటకరంగ నటునికి అయినంత అవగాహనకాదు. ఏదో వూహా మాత్రంగా అంతకు పూర్వ చరిత్రను స్మరించుకుని ఈ హత్యకు పూనుకున్నట్లు నటించాల్సివుంటుంది. ఇలా నటించే సమయంలో ఇలాంటి ముఖ్యమైన సంఘటనలు సరిగా అర్థంకాక నటించి తరువాత హత్యకు కారణమైన మిగతా సన్నివేశాలను ఎంతో బాగా నటించినప్పుడు అర్రే ఈ సంగతి ముందే తెలిసుంటే ఆ హత్యా సంఘటనలో ఇంకెంతో బాగా నటించి వుండేవాణ్ణి గదా అని అనుకుంటూ వుంటారు కథ యొక్క పరిణామం పూర్తిగా అవగాహన కానప్పుడు ఇలాంటి చెడ్డ పరిణామాలు వస్తూవుంటాయి ఒక హత్యకు కారణా లేమిటో తెలుసుకోకుండా వున్నదానికీ పూర్తిగా తెలుసుకుని హత్య చేసినదానికీఎంతో భేదంవుంటుంది.

నాటకరంగ నటీనటులు ఒకే నాటకాన్ని ఎన్ని సార్లు ఎక్కువ ఆడగలిగితే అంత ఎక్కువ రాణి స్తారు. కాని సినిమానటుడు ఒక సినిమాలో బాగా రాణించగలిగితేగాని రెండవ సినిమాలోకి తీసుకోరు. ఇందుకు కారణం ఒక నాటకంలో ఆడిన కొద్ది మార్పులు తీసుకవచ్చినట్లుసినిమాలో అనేకమార్పుల్ని అనేకసార్లు తీసుకురాలేము. ఒకసారి నటించిన నటన ఆ చిత్రంలో తప్పుగాని ఒప్పుగాని ఇంకే మార్పు పొందదు.

సినిమా తరువాత సినిమాలో నటిస్తూ రాణించాల్సి వుంటుంది సినీనటుడు. ఒక సినిమాలో నటించలేని నటుని రెండవ చిత్రంలో లక్షలు దండగపెట్టి ఎక్స్పెరిమెంటు చేయరు. చేయాల్సిన అవసరం కూడాలేదు. వారికి కావలసింది వ్యాపారం, కనుక ఈ విషయంలో కూడనాటకరంగంలోవున్ననటునికంటెసినిమానటులకే సాధకబాధకాలుఎక్కువ.నాటకరంగంలో నటుడు ఎక్కువ కాలం రాణించినట్లు స్థిరంగావున్నట్లు సినిమాలో నటీ నటులు వుండలేరు. ఏరకంగా చూచినా సినిమా నటుడే ఎక్కువ అగ్ని పరీక్షలకు గురికావాల్సి వుంటుంది. నాటకంలో ఇష్టమొచ్చిన పాత్రను నటించవచ్చు. కాని సినిమాలలో అది కూడదు.

నాటకంలో దూరంగావున్న ప్రేక్షకుల్ని వొప్పించ డానికి కొంచెం ముఖం చించుకొని మాట్లాడడంగాని, చేతులు మొదలైనవి ఎక్కువగా ఆడించడంగాని చేయడంవల్ల నాటకరంగ ప్రేక్షకుల్ని మెప్పించ వచ్చు. కాని అదే నటనను సినిమాల్లో నటించే నటులు ఎంతో జాగ్రత్త వహించాల్సి వుంటుంది. తుది ప్రేక్షకునికొరకు వినపడాలనే మాట గాని, పాటగాని అభినయంగాని కొంత బాగానే వుంటుందని మనం ఒప్పుకోక తప్పదు. అలాంటి అభినయాన్నే సినీ క్లోజప్ద్వారా చూపించినప్పుడు మన ముఖభంగిమల్లు

హాస్యాస్పదంగాను వికారంగాను వుంటాయి. ఇలాంటి అభినయాన్ని సినిమాలో కొచ్చిన నాటకరంగ నటులు చాల వరకు అస్వాభావికమైన కదలికల్ని తగ్గించుకోవాల్సివుంటుంది.

సినిమా క్లోజప్ ప్రేక్షకునికి అతి సున్నితంగా వుంటుంది. అంటే నటుని యొక్క చిరునవ్వు సైతం మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. ఇలాంటి చిరునవ్వు నాటకంలో చూపించగలమా? చూపించవచ్చు. కాని అది అందరి ప్రేక్షకులకు అందుబాటులో వుండదు. అందువల్లనే అలాంటి చిరునవ్వులను నాటకంలో పెద్దగా నవ్వడమో ఏదో చేస్తాం. అలాగే క్రీగంటి చూపులూ, ఈర్ష్యా దృక్కులూ, కేవలం సంభాషణలు లేకుండా చూపించే అభినయంలో నటుడు ఎంతో సున్నితమైన అభినయాన్ని అభినయించాలి. ఇంత సున్నితమైన అభినయం నాటకంలో కష్టం. అందువల్లనే సినిమాకంటే నాటకంలో కొంచెం అతిగా నటిస్తాం. ఆ అలవాటుతోనే సినిమాలో అభినయిస్తాం, అందువల్లనే అది అస్వాభావికంగా వుంటుంది. ఇలాంటి నాటకరంగ నటనాపద్ధతులను అనుసరించిన సినిమానటుడు త్వరగా సినిమా రంగంనుంచి నిష్క్రమించాల్సి వుంటుంది. కేవలం నాటకరంగ ప్రేక్షకులకొరకు నటించే నటనా విధానాలను సినిమాలోకి రాదలచుకున్న నటీ నటులు తప్పకుండా ఆ పాత పద్ధతుల్ని వదులుకోవాలి. తేలికగాను, మరింత కేంద్రీకరణతోనూ సినిమా నటనను అభ్యసించాలి.



# రాజకీయ విజ్ఞాన ప్రగతి

## పాశ్చాత్య రాజకీయ చింతన :

మానవుడు సామాజికజీవి. వ్యవస్థిత సమాజములలో నివసించుట అతని సహజ లక్షణము. అట్టి సమాజములలో కాననగు రాజకీయ కార్యకలాపములు పాలక పాలిత వర్గములు వారి మధ్యగల అధికార విధేయతా సంబంధములను బట్టి యుండును. ఈ విషయములపై సాగునదే రాజకీయ చింతన. ఇది అన్ని కాలములలో అనేక దేశములలో బుద్ధిజీవుల నాకర్షింపగలిగినది. ఐరోపాలో ప్లేటో, అరిస్టాటిల్ తూసిడెడిస్ డెమెక్రిటస్, ఆంటిఫాన్, జెనో వంటి గ్రీకు మేధావులు రాజకీయ విషయములను గురించి కొంత తాత్త్విక చింతన చేసిరి. పిమ్మట సిసిరో, జాన్ ఆఫ్ శాలిస్‌బరీ, సెయింట్ ఆగస్టిన్, సెయింట్ థామస్ ఆక్వైనాస్, మార్‌శిలియో ఆఫ్ పాడ్యువా, నికొలో మాకియావెల్లి, జీన్ బోదాం, థామస్ హాబ్స్, జాన్ లాక్, జీన్‌జాక్స్‌రూసో, ఇమాన్యుయల్ కాంట్, జార్జి హెగెల్ వంటి రాజనీతిజ్ఞులు, తత్త్వవేత్తలు దానినొక ప్రధాన తత్త్వ విషయంగా మలిచారు.

అయినప్పటికి పందొమ్మిదవ శతాబ్దం వరకు స్వీడన్ దేశంలో మినహా (1622) మరెచ్చట రాజకీయ విజ్ఞానం విశ్వవిద్యాలయములలో పఠనీయాంశం కాలేదు. 1870 సంవత్సర ప్రాంతంలో ఎమిల్ జాట్ మీ ఫ్రాన్సులో రాజకీయ శాస్త్రముల అధ్యయనానికి ఒక ప్రత్యేక పాఠశాలను స్థాపించెను. దాని అడుగు జాడలలో 1890 సంవత్సర ప్రాంతంలో లండన్ ఆర్థిక రాజకీయశాస్త్ర పాఠశాల నెలకొల్పబడినది. 1903 వ సంవత్సరంలో రెండువందల మంది సభ్యులతో అమెరికా శాస్త్రసంఘము అవతరించినది. నేడు ప్రపంచంలోని రాజకీయ శాస్త్రజ్ఞులలో అత్యధిక సంఖ్యాకులు (షుమారు 90%) అమెరికా విశ్వవిద్యాలయములలో ఎంతోవైవిధ్యంగలకృషి చేయుచున్నారు. కాగా అంతర్జాతీయ రాజకీయ శాస్త్రసంఘము 1950 వ సంవత్సరంలో ప్రథమ సమావేశము జరుపుకోగలిగింది. అప్పటికి రాజకీయ శాస్త్రాధ్యయనంలో రాజ్యమే ప్రధాన విషయం. దాని పుట్టుక పెంపుదల, నిర్మాణము, లక్ష్యములు, అధికారము కార్యకలాపములు; వీనికి సంబంధించిన సిద్ధాంతముల వివరణతో రాజకీయశాస్త్ర గ్రంథములు నిండిఉండెడివి. ఈ ఛాందస దృక్పథంపై ఒత్తిడులు ఆనాటి నుండి ఆరంభమై, రాజకీయ శాస్త్రమును క్రొత్త పుంతలు త్రొక్కించుచున్నవి. ప్రకృతిశాస్త్ర విజ్ఞానాభివృద్ధి గణిత, గణాంక శాస్త్రములు, 'కంప్యూటర్ల'వంటియంత్రాలుసమైక్యసాంఘిక శాస్త్రభావన, మానవ వర్తనాశాస్త్రములు, ప్రపంచ రాజకీయ వ్యవస్థలో మార్పులు అమెరికాలో రాజకీయ శాస్త్రాభివృద్ధి వలన ప్రభావితమైన ఈ వైజ్ఞానిక విభాగం గతరెండు దశాబ్దములలోను నూత్న విషయాన్వేషణతో త్వరితగతిని మారుచున్నది. దాని రూపురేఖలు సూచ్యప్రాయంగా క్రింద వర్ణింపబడినవి.

(అ) రాజకీయ శాస్త్రం రాజ్యవ్యవస్థ, దానిబృహత్సమస్యల, గురించియేగాక 'రాజకీయజీవి'గ మానవుని ప్రవర్తనను పరిశీలింప బూనుకొన్నది.

(ఆ) ఆదర్శములు, విలువలనుండి వాస్తవిక విషయముల వైపుదృష్టి మరల్చుటయూ, రాజకీయశాస్త్రంలో కాననగును. కాని రెండింటి సమన్వయ దృక్పథముతో రాజకీయ శాస్త్రాభ్యసనము చేయవలెనను వాదముపై అంగీకారము హెచ్చు

(ఇ) రాజకీయ విషయగ్రహణకు సాంఘికశాస్త్రజ్ఞులు, మానవశాస్త్రజ్ఞులు ఆర్థికశాస్త్రజ్ఞులు ఇతరులు అనేక క్రొత్త సిద్ధాంతములు ప్రతిపాదించుచున్నారు. మన సత్త్వశాస్త్రం, జీవశాస్త్రం, గణితశాస్త్రం, గణాంక శాస్త్రం, సాంకేతిక విజ్ఞానము కూడ కొన్ని సిద్ధాంత చర్చలు రేకెత్తించినవి. టాల్కట్ పార్సన్స్ డేవిడ్ ఈస్టన్ ప్రభృతులు జిజ్ఞాసువుల ముందుంచినవి సమగ్ర

రచన :
శ్రీ కొత్తపల్లి కేశవరావు

సిద్ధాంతములు. తక్కిన వారివి పాక్షిక సిద్ధాంతములు. వీటి పుణ్యమున గతితార్కిక భౌతిక వాదము, తీవ్ర ప్రజాస్వామ్య దృక్పథము, ప్రకృతిన్యాయము, కాల్పనిక సిద్ధాంతము వంటివి మూలబడు చున్నవి.

(ఈ) సిద్ధాంత చర్చ నట్లుండనిండు. రాజ్యేతర వ్యవస్థలు జంతు సముదాయముల జీవిత పరిశీలన వలన చాల సమాచారము లభ్యమైనది. ఇది ముడి పదార్థంగా రాజకీయ శాస్త్రం క్రొత్త విశ్లేషణ సాధనములను, భావములను తయారుచేయుటలో నిమగ్నమై యున్నది. ఉదాహరణకు ప్రాణికి సాంఘిక వ్యవస్థకు ప్రకృతికి గల పరస్పర సంబంధము నేడు మరింత స్పష్టంగా అవగాహన చేసికొనగలుగుట విశేషమే గదా! చిన్నచిన్న మానవ వర్గములు, సమూహములు పనిచేయు పద్ధతులను గమనింపక నాయకత్వము నిర్ణయ విధానములను గురించి విషయ పరిజ్ఞానము పెరిగినది. దీనివలన ప్రజాస్వామ్యాచరణకు సంబంధించి క్రొత్త భావములు, రీతులు బయలుదేరినవి. ఆఫ్రికాలో తెగల జీవితమును పరిశోధింపగా రాజకీయములకు, ప్రజల ఆచారములు, కర్మకాండ, సాంఘిక నియంత్రణ నిబంధనలతో గల అనాది సంబంధము గ్రాహ్యమగుచున్నది, అట్లే 'అధికారము' 'పలుకుబడి' 'బలముల' స్వభావము పరస్పర సంబంధము వాటి కొరకు సమాజములో పాలక వర్గములు పడు పాట్లు, వాటిని ఉపయోగించి అవి వ్యవహరించు తీరులను గురించి అనేక విషయములు తెలియ వచ్చు చున్నవి. పరిపాలనా శాఖలు, వ్యాపార సంస్థలు వాటి నిర్మాణము, పనిచేయు పద్ధతులను గమనించి చిలవలు పలవలతో 'వ్యవస్థా సిద్ధాంతం' ప్రాముఖ్యమువహించు చున్నది. రాజకీయ జీవితముపై 'చట్టము' లేక 'శాసనము' యొక్క ప్రభావమును దాని వ్యవహార సరళి గురించి విజ్ఞానాత్మకమైన చర్చ జరుగుట మరొక విశేషము. అట్లే భాషకు సాంఘిక ప్రగతి సమైక్యములకు భావ ప్రచారమునకు గల సంబంధము విశదముకాగ రాజకీయ శాస్త్ర పదజాలము యొక్క అస్పష్టత (ఇంద్రజాలము కూడ అనవచ్చు) తేటతెల్ల మగుచున్నది.

(ఉ) సాధారణంగా రాజకీయ శాస్త్ర విద్యార్థులు ప్రముఖ దేశముల రాజ్యాంగములను గురించి తులనాత్మక అధ్యయనం చేయుదురు. దీనిలో శాసన నిర్మాణ, కార్యనిర్వాహక, న్యాయ పాలన శాఖల నిర్మాణము, అధికారములు, రాజకీయ పక్షములు, ఎన్నికల వ్యవస్థ ముఖ్యాంశములు. నేడు ఈ విభాగముకూడ మార్పులకు లోనగుచున్నది. ఒక దేశ రాజకీయ వ్యవస్థయొక్క స్వరూప స్వభావములను తీర్చి దిద్దు కుటుంబము మతము, సంస్కృతి, వార్తా సౌకర్యములు, ఆర్థికవ్యవస్థ మున్నగు విషయముల సమగ్ర పరిశీలన అనివార్యము. దాని స్థిర స్వభావమే గాక పరిణామశీలంకూడ సమీక్షింపబడు చున్నది. రాజ్యాంగము నిర్దేశించిన సంస్థలు' పదవులు, వాని వాస్తవిక పాత్రల దృష్ట్యా విశ్లేషింపబడు చున్నవి. ఈ విశ్లేషణ రాజ్యాంగ వ్యవస్థ యొక్క రాజకీయ స్వరూపమును పరిగణించును. రాజకీయ నాయకులు, పక్షములు, అధికారవర్గములు, సైన్య విభాగము, ఆర్థిక సాంఘికసంస్థలు, సాంస్కృతిక ప్రాంతీయ విభేదములు తమ తమ అలవాట్లు, ధోరణులు, ప్రయోజనములు, లక్ష్యములనుబట్టి వ్యవహరించుచు, ప్రభుత్వాధికారమును వినియోగింప జూచుట వలన రాజకీయ వ్యవస్థ సజీవత్వము పొందు చున్నది. వివిధ దేశములలోని రాజకీయవ్యవస్థల తరతమ భేదముల మదింపులో 'సంస్కృతి' 'సమాజము' 'జాతి' 'రాజ్యము'ల యొక్క అన్యోన్య సంపర్కము ప్రభావముకూడ అంతర్భాగములే.

(ఊ) సమకాలీన రాజకీయశాస్త్రం రాజకీయాభివృద్ధి లేక రాజకీయ గతి దశలను, సూత్రములను స్పష్టీకరింప బూనుకొన్నది. ఇదివరలో అలక్ష్యం చేయబడినవిషయం ఇది. రాజ్యస్థిరస్థితి యొక్క సాంగోపాంగ వర్ణన పరిపాటియని చెప్ప బనిలేదేమో! దానిలో 'మార్పు' అసాధారణ విషయముగ పరిగణింపబడేది. విప్లవమే దానికి మార్గం. నేడు చరిత్ర, మానవశాస్త్రం, సాంఘికశాస్త్రం, జీవశాస్త్రం, భౌతిక శాస్త్రం సామాన్యంగా ప్రతిపాదించు సత్యములు. 'రాజకీయ స్థిరత్వం అశాశ్వతమని రాజకీయమార్పు నిత్యమను భావమును రూఢి పరచినది. రాజ్యవ్యవస్థ మానవుని భౌతిక, సాంఘిక వాతావరణంలో అంతర్భాగము. వానిలోని మార్పులను అది అనుసరించుచునే యుండును. ఈ మార్గములో కాలహరణమేమైన జరిగి అభివృద్ధికి అంతరాయం కలిగినచో విప్లవం శరణ్యం కావచ్చు. రాజకీయ అభివృద్ధి లేక

మార్పుకు దోహదంచేయు శక్తులు ఉప వ్యవస్థలు సమాజంలో నుండును. వాని ఆశయములు, విలువల తీవ్రతను అవి రాజ్య వ్యవస్థపై ఒత్తిడులు తెచ్చును. అధికారం గల దాని నాయకత్వం మార్పును కాంక్షించు శక్తులు వర్గమును అణచివేయుటో వానితో రాజీ పడుటో తేల్చుకోవాలి. మార్పును ఎంతవరకు ఎప్పుడు ఎలా తెచ్చి "రాజకీయ సమతౌల్యం లేక స్థిరత్వాన్ని నెలకొల్పాలి అను సమస్య పరిష్కరింపవలయును." మానవత్వపు విలువలే అట్టి మార్పుకు కొలతబద్ద అగుట సహజం కదా!

(ఋ) నేడు ప్రపంచ రాజ్యముల సంఖ్య పెరుగుటయేగాక, వాని అన్యోన్య సంబంధములలో "గుణభేదము" వచ్చినది. ఇందుకు కారణములు ప్రయాణం, వార్తా, సౌకర్యముల శీఘ్ర అభివృద్ధి అపూర్వమారణాస్త్ర పటిమ వెల్లుబుకుచున్న జాతీయ భావశక్తి జాతుల మధ్య వృద్ధి యగుచున్న ఆర్థిక అసమానత్వములు సర్వంసహాధికారము గల రాజ్య వ్యవస్థ యొక్క లోపములను పూరించుటకు అనేక క్రియాశీల, ప్రాంతీయ సంస్థలు వివిధ రాజ్యముల అంగీకారముతో నెలకొని పనిచేయుచున్నవి. 'ఐక్యరాజ్య సమితి ఉనికి జగమెరిగిన సత్యము వసుధైక ప్రభుత్వం లేకుండ వసుధైక శాసనం ఏర్పరచి ప్రపంచ శాంతి, ప్రగతి సాధించుట సాధ్యమా, ప్రత్యేకత, పరస్పరాశ్రయత లక్షణములు రెండునూ గల ప్రపంచ రాజ్యములు మానవుని మనుగడకు, పురోగతికి ముప్పుతెచ్చిపెట్ట గలవా? అను జటిల సమస్యల పరిష్కరణీయ రూపమును ప్రతిబింబించుటయే రాజకీయ విజ్ఞాన దర్పణ తక్షణ లక్ష్యం, ప్రపంచ రాజ్యముల సమ్మేళనము వలన' వసుధైక కుటుంబము' అను నినాదము మానవకోటి అంతిమాశయము కాగలదు.

## భారతదేశంలో రాజకీయ శాస్త్రము

పాశ్చాత్య పండితులు రాజకీయ విషయంలో ముందంజ వేయగల్గుటకు ఆయా దేశములందలి సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిణామములు చాలవరకు తోడ్పడినవి. ఇక స్వదేశములో "పరిస్థితిని సమీక్ష చేయుదము.

రాజకీయ చింతన సనాతన భారతావనిలో కొంవడ లేదు. వేదములు, బౌద్ధ, జైన మత గ్రంథములు చాణక్యుని 'అర్థశాస్త్రము,' ధర్మశాస్త్రములు, సూత్రములు, మహాభారత, రామాయణములు, కామందకుని ప్రధాన వస్తువులు. ప్రభుత్వ వ్యవస్థ, దాని అంగములు వాని కార్యకలాప పద్ధతులు – ఆనాటి సమాజంలోని పాలకవర్గమునకు, రాజ్యనిర్వహణ చాతుర్యము కలజేయుట, దానిలక్ష్యముగ నెంచవచ్చును. రాజ్య స్థాపన స్వభావము, ప్రయోజనములు, మానవ హక్కులు మున్నగు విషయములపై తత్వ లేక సిద్ధాంత చర్చ దానిలో స్వల్పము. ఏది ఎట్లున్నను, సమాజము, సంస్కృతులకు గల ప్రాముఖ్యమునకు ఆనాటి రాజ్యవ్యవస్థ తలవంచినది.

మహమ్మదీయ పాలనకాలంలో రాజకీయ విజ్ఞానం మోడువారినది. కారణం చరిత్ర ప్రసిద్ధమైన సత్యం భిన్న సంస్కృతికి చెందిన ముస్లిం ప్రభువుల నిరంకుశత్వమునకు ప్రతిఘటన. సంస్కృతి పునరుద్ధరణ పేరిట జరిగినదిగాని, రాజకీయ సిద్ధాంత ప్రాతిపదికపై గాదు. పిమ్మట ఆంగ్లేయులు ప్రభుత్వంలో వారి చరిత్ర, సారస్వతం, సామ్రాజ్య వైభవం, ప్రజాస్వామ్య సంప్రదాయముల వలన ప్రభావితులైన భారతీయులు వారి రాజకీయ సూత్రములు భావములను అధ్యయనము చేసి, తిరిగి వాటినే తమ పాలకులపై ప్రయోగించిరి. ప్రభుత్వములో భాగస్వాములు కావలెనను కోర్కెతో మొదలిడి, మధ్యలో బాధ్యతాయుత ప్రభుత్వకాంక్ష వెలిబుచ్చి, తుదకు స్వరాజ్యము మా జన్మహక్కనుచు, స్వాతంత్ర్యసమరం ఫలప్రదంగా సాగుటెరుగని వారెవ్వరు?

ఈ పరిణామమునకు దోహదం చేసినది భారతదేశంలో పరిమిత ప్రభుత్వ ప్రయోజనముల కొరకు అల్ప వ్యయంతో సాగిన ఆంగ్లలేక పాశ్చాత్య విద్యావ్యాప్తి. దానిలో అంతర్భాగమే భారతీయ విశ్వవిద్యాలయములలో, కళాశాలల్లో జరిగిన రాజకీయ శాస్త్రబోధన. ఇప్పటికి ఏబది యేండ్లకు పైబడిన సాధనయిది. అయినను చాల వైజ్ఞానిక విషయములలోవలె రాజకీయ శాస్త్రాధ్యయనంలో కూడ నేటికినీ మనం చాల వెనుకబడి ఉన్నాము. ఈ పరిస్థితి వివరణార్హము.

(అ) 'భారతీయ చింతన రాజకీయమును' అర్థమను పురుషార్థములోని అంశముగ, ధర్మ, మోక్షములకు లోనైనదిగ ఎంచినది. దాని ప్రకారం రాజకీయాధి

కారము' ఒకటి రెండు అగ్రవర్ణముల సొత్తు సమాజ జీవిత సాఫల్యమునకు రాజ్యవ్యవస్థ ఒక అంగము మాత్రమే. వర్ణాశ్రమ ధర్మరక్షణయే దాని ప్రధాన కర్తవ్యము.

(ఆ) ఆంగ్ల పరిపాలనమునకు ప్రసాదించిన పాశ్చాత్య విజ్ఞానము పట్ల మనము ఆరాధనా వైఖరి ప్రదర్శించితిమి. వారి రాజకీయ విజ్ఞాన పాఠములు చిలుక పలుకుల వలె వఠింపబడినవి.

(ఇ) నిన్న మొన్నటివరకు మన రాజకీయశాస్త్రాధ్యాసము, చరిత్ర పఠనము లోనో, ఆర్థిక శాస్త్ర పఠనము లోనో ఉపవిషయముగ నుండెడిది.

(ఈ) దానికి సంబంధించిన బోధనా పద్ధతులు పాఠ్య గ్రంథములు, పరీక్షా పద్ధతులు పైన చెప్పిన' అస్వతంత్ర (అనుకరణ) ధోరణినే బలపరచినవి.

(ఉ) మన రాజకీయ శాస్త్ర పాఠ్య ప్రణాళికలు, గ్రంథములకు రాజకీయ విజ్ఞాన ప్రగతి యొక్క వాసన సరిగ సోకలేదు.

(ఊ) చాలవరకు మన విశ్వవిద్యాలయములో రాజకీయ విజ్ఞాన పరిశోధన లోతులేనిది, పట్టములు, పదవుల కాంక్షతో ప్రారంభమై, వానితో 'అంతమగుట దాని సామాన్యలక్షణము. కావున భారతీయ రాజకీయ సమస్యల ఆ మూలాగ్ర పరిశీలన దాదాపు జరుగలేదు.

(ఋ) భారత దేశములో రాజకీయ శాస్త్రాధ్యయనము భారతీయ చరిత్ర, అనుభూతులలో ప్రవేశ్లూన లేదు. అందుచే పాశ్చాత్య రాజకీయ విజ్ఞాన సూత్రములను మన సమాజపరిస్థితులతో మేళవించి ఒకవిశిష్ట భారత రాజకీయ వైజ్ఞానిక విభాగమును సృజింపలేకపోతిమి. మౌలికమైన రచనలు, భావములు దాదాపు మృగ్యము.

స్వాతంత్ర్య సముపార్జన తర్వాత ఈ లోటు పూరించు యత్నము చేయబడుచున్నది. అహింసా సిద్ధాంతము, సత్యాగ్రహపద్ధతి, జాతీయభావము, ప్రజాస్వామ్యము, రాజకీయ పక్షములు, వ్యక్తిహక్కులు, సామ్యవాదము, స్థానిక సంస్థలు, ప్రజాస్వామ్య వికేంద్రీకరణ అను విషయములపై కొంత పరిశోధన జరిగి మంచి రచనలు కొన్ని వెలువడినవి. అయితే ఈ ఘనతలో హెచ్చుభాగము పాశ్చాత్య మేధావులకే చెందును. జరుగవలసిన కృషి ఇంకెంతయో గలదు. ఈ తరుణంలో డా॥ కొఠారి అధ్యక్షత క్రింద పని చేసిన భారతీయ విద్యాసంఘ నివేదిక మన విద్యావ్యవస్థలో కొన్ని విప్లవాత్మకమైన మార్పులు ఆవశ్యకమని భావించినది. మాతృభాషలో ఉన్నత విద్యాబోధన అందులో నొకటి దీనినిబట్టి తెలుగులో రాజకీయ శాస్త్రాధ్యయనానికి గల వసరులు సమీక్షింతము.

## తెలుగులో రాజకీయ శాస్త్రాధ్యయనం

ఉన్నత విద్యాసాధనములు పరిపుష్టిగల ఆంగ్లభాషాభిజ్ఞత దేశభాషాభివృద్ధిని కుంటుపరచిన సంగతి విజ్ఞు లెరుంగుదురు. తెలుగులో అధునక విజ్ఞాన శిఖరములను అవలోకించిన గ్రంథములు అరుదు. ఉన్నంతలో రాజకీయ విజ్ఞానస్థితి కొంత మెరుగు స్వాతంత్ర్య సమర సందర్భములోను, అనంతరం దేశపునరుద్ధరణ; అభివృద్ధి విషయములలోను అనేక రాజయ సమస్యలు, వివాదాంశములు తలయెత్తినవి. అట్టిచో రాజకీయ భావ ప్రచారం కొరకు, విజ్ఞానాభివృద్ధికై రాజకీయ సాహిత్యం కొంత వెలువడుట సహజమేగదా। ఆ విధంగా వచ్చినవే :

(అ) వివిధ దేశముల రాజకీయ చరిత్రలు

(ఆ) నాయకుల స్వీయ చరిత్రలు, జీవిత చరిత్రలు

(ఇ) ప్రజా సమస్యలపై రాజకీయ పక్షముల నాయకుల ప్రచురణలు, ప్రసంగ పాఠములు, పత్రికలలో వ్యాసములు.

(ఈ) విద్యార్థుల కొరకు వ్రాయబడిన పౌరశాస్త్ర గ్రంథములు.

(ఉ) ఆంధ్ర విజ్ఞాన సర్వస్వములో 'రాజనీతి' 'దర్శనముల' సంపుటములు.

(ఊ) చాణక్యుని 'అర్థశాస్త్రం' 'ప్లేటో' ఆదర్శ రాజ్యం, మాకియవెల్లి 'రాజనీతి' వంటి అనువాద గ్రంథములు, ప్రముఖ సామ్యవాద రచనల భాషాంతరీకరణములు.

తెలుగువారిలో రాజకీయ విజ్ఞాన పరిశోధనా పటిమ కలదని డాక్టరు కే. బి. కృష్ణ, ఆచార్య వంగల శివరామ్, ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య, ఆచార్య ఎన్. శ్రీనివాసన్, ఆచార్య వి జగన్నాథం ఆచార్య రషీదుద్దీన్ ఖన్, ఆచార్య రామిరెడ్డి, డాక్టరు ఆర్.వి ఆర్. చంద్రశేఖరరావు, డాక్టరు కె. వెంకటేశ్వర్లు వంటివారు నిరూపించారు.

తెలుగు విద్యార్థి లోకంలో రాజకీయ శాస్త్రాధ్యయనానికి మంచి ఆదరణ ఉంది. వీటి నన్నిటినీ వినియోగించుకొని మన భాషను ఉన్నత విజ్ఞాన సాధనంగా మలచుకోవాలి. అందుకుగాను చర్యలు అవసరం.

(అ) కేంద్ర రాష్ట్ర సాహిత్య అకాడమిలు తెలుగు అకాడమి,రాష్ట్రంలోని విశ్వవిద్యాలయములు రాజకీయ శాస్త్రాధ్యాపకులు, రచయితలు అనువాదములు,మౌలిక రచనలు వెలువరింపవలెను. ఈ కృషికి భౌగోళిక, కుల, మత విభేదములు ఎట్టి అంతరాయములు కల్పింపరాదు.

(ఆ) అతి స్వల్ప భేదము గల భావవైచిత్రిని ప్రకటింపగల రాజకీయ పారిభాషిక పదజాలము తయారు కాబడవలెను. ఈ పదములు సులభము, స్పష్టముగా నుండవలయును. ఆవశ్యకమగుచో అన్య భాషాపదముల స్వీకరణకు అభ్యంతరము ఉండరాదు.

(ఇ) విశ్వ విద్యాలయ దశలో అన్ని తరగతులకు రాజకీయ శాస్త్ర పాఠ్య ప్రణాళికలు సమకాలీన విజ్ఞాన ప్రగతి దృష్ట్యా సవరింపబడవలెను.

(ఈ) రాజకీయ శాస్త్రబోధనకు 'ఉపన్యాసములు' ఒకటే మార్గముగ ఉండరాదు. ఈశాస్త్రం తక్కినవైజ్ఞానిక విభాగములకంటె 'చర్చావిధానము' నకు అనువుగనుండును. దానిపై అభిమానముచే విద్యార్థులు 'వ్యాసరచన చేయుటకుకూడ ఇచ్చగింతురు.

(ఉ) ముఖ్యంగా ప్రాంతీయ రాజకీయ వైజ్ఞానిక సమస్యలపై పరిశోధన నిరంతర వ్యవసాయంకావాలి.

(ఊ) ఆంధ్రప్రదేశ్‌లోని రాజకీయ విజ్ఞానాభిమానులెల్లరు ఎడనెడ సమావేశములు జరుపుకొని' అంతర్జాతీయ, దేశీయ, రాష్ట్రీయ సమస్యలపై చర్చలు సాగింపవలెను. వాటి వివరములను గ్రంథస్థము చేయదగును.

ఇవి జరుగకున్నచో దేశస్వాతంత్ర్య ప్రతిపత్తిని ప్రజాస్వామ్య వ్యవస్థను నిలబెట్టగల రాజకీయ చైతన్యము ఉత్పన్నంకాదు. విద్యావంతులుకూడ నవభారత సమాజాదర్శములను అందుకొనజాలరు. పెపెచ్చుసహనము, సద్విమర్శ, సృజనాత్మక కృషివినా రాజకీయ శాస్త్రాధ్యయనము సమాజమునకు చేయు కీడు అనితర సాధ్యము.



# "పంచ తంత్రం"

భారతీయ గ్రంథాలలో బహుళ ప్రచారానికి ఓం ప్రథమంగా పేర్కొనదగినట్టిది "పంచతంత్రం". ఒక బైబిల్‌ను మినహాయిస్తే ఇతర గ్రంథానికి దేనికీ ప్రపంచం మొత్తంమీద దీనికున్నంతవ్యాప్తి మరి లేదని చెప్పవచ్చునేమోకూడా. తూర్పున జావా మొదలుకొని, పశ్చిమాన ఐస్‌లెండ్ వరకూ ఎన్నడో అది ప్రాకింది. దేశంనుంచి దేశానికి ప్రాకడంలో అది రెండువందల అవతారాలెత్తింది. సంస్కృత మూలంలోనుంచి ఇతర భాషలలోనికిదాని సరాసరి అనువాదం చేసుకున్న సందర్భాలు కొన్నివున్నాయి. ఇంతకంటే మిన్నగా ఒకఅనువాదంలోనుంచి మరొక అనువాదం జరిగిన సందర్భాలున్నాయి. ఏమైనా మొత్తం యూభై! అరవై ప్రపంచ భాషలలోకి కొన్ని శతాబ్దాల క్రితమే అది వెళ్ళింది. క్రీస్తుశకం పదహారవ శతాబ్దికి పూర్వమే అది యూరప్ ఖండానికి చేరుకొనడం, గ్రీక్, లాటిన్, స్పానిష్, ఇటాలియన్, జర్మన్, ఇంగ్లీషు, పాత స్లోవానిక్, చెక్ మొదలైన భాషలలో అది ప్రచారం పొందడం సంభవించింది.

"పంచతంత్రం" పుట్టు పూర్వోత్తరాలను గురించి ఇదరు జర్మన్ పండితులు విశేషంగా పరిశోధనలు చేశారు. వారిద్దరిలో హెర్టెల్ భారతదేశంలో అది ఎప్పుడు, ఎక్కడ, ఏ విధంగా ఆవిర్భవించిందో, ఏయే పరివర్తనలను పొందిందో, అందుకు సంబంధించిన పూర్తి వివరాలను సాధ్యపడినంతవరకు నిర్ణయించడానికి కృషిచేశాడు. కాగా, దాని విదేశ యాత్రల విషయమై బెన్‌ఫే అనే రెండవ పండితుడు ప్రత్యేకించి శ్రద్ధ వహించాడు.

సరిగా ఎప్పుడు "పంచతంత్రం"రచన జరిగిందో, ఆదిలో ఏ రూపంలో అది వుండేదో తేల్చి చెప్పడం కష్టం. ఇప్పుడున్న దాని పాఠం సంపూర్ణమైనది కాదనడం మాత్రం నిశ్చయం. వేర్వేరు ప్రాంతాలలో విభిన్న సంక్షిప్త రూపాలలో మాత్రమే అది ప్రస్తుతం లభిస్తున్నది. "తంత్రాఖ్యాయిక" అనే పేరుతో కాశ్మీర్‌లో ఒక పాఠం, నేపాల్‌లో మరొకటివున్నది. క్రీస్తుశకం 1199 లో పూర్ణభద్రుడు "పంచాఖ్యానక" అనే పేరుతో, 1656-60 లో మేఘ విజయుడు "పంచాఖ్యానోద్ధార" అనే పేరుతో ప్రచురించిన మరి రెండు పాఠాలున్నాయి. (ఈ రచయితలిద్దరు జైన మతస్థులు) ఇవికాక, సరళమైన భాషలోకి విశేషంగా సంగ్రహపరచిన దక్షిణాదిపాఠం ("పంచతంత్రం" పేరుతో) వేరొకటి కూడా వున్నది. ఇవి ముఖ్య పాఠాలుకాగా, ఇరవై వరకు ఇతర పాఠాలుకూడా వున్నాయి. వీటినన్నింటిని సమన్వయంచేసి, మూల పాఠాన్ని నిర్ణయించడానికి హెర్టెల్‌తో పాటు ఎడర్టన్, పెంజర్, థామస్ ప్రభృతి పాశ్చాత్య పండితులు ప్రయత్నించారు గాని వారు కృతకృత్యులైనారని చెప్పలేము. అయితే, వివిధ పాఠాల మధ్య వైరుధ్యాలకంటే సామ్యాలే విశేషంగా వున్నాయి. ఇంత వరకు కొనసాగిన పరిశోధనల ఫలితాలను పురస్కరించుకొని "తంత్రాఖ్యాయిక" ప్రస్తుతం లభిస్తున్న వాటిలో అతి ప్రాచీనమైన పాఠమని భావిస్తున్నారు. దక్షిణాది పాఠం దానికి చాలా చేరువగా వున్నది. దానిలోని కొన్ని కథలు అంతకంటే ప్రాచీనమైనవైనా, పంచతంత్రాన్ని క్రీస్తుకు పూర్వం రెండవ శతాబ్దిలో తొలిగా కూర్చినారని హెర్టెల్ అభిప్రాయం.

బౌద్ధ జాతక కథలే పంచతంత్రానికి మాతృకలని ఒక వాదం వున్నది; కాదు, జైన గాథలని మరొక వాదం వున్నది. ఈ రెండు వాదాలు నిరాధారమైనవని వింటర్‌నిట్జ్ నిశ్చితాభిప్రాయం. బౌద్ధ, జైన ధర్మాలు బోధించే నీతికి, పంచ తంత్రంలోని నీతికి తూర్పు పడమరల వ్యత్యాసం వున్నది. పంచతంత్రంలోని నీతి కేవలం రాజనీతి, లేదా, ఆర్థికనీతి. ప్రాపంచిక వ్యవహారాలలో ఏయే యుక్తి కుయుక్తుల

---


రచన:
నార్ల వెంకటేశ్వరరావు

ద్వారా విజయం సాధించవచ్చునో, ముఖ్యంగా రాజ్యపరిపాలనా బాధ్యతను వహించవలసిన క్షత్రియులు ఏయే విధాల కార్యసాధకులు కావలెనో - ఈ విషయాల వివరణకే అది ఉద్దేశించబడినది. పైగా, వింటర్‌విట్జ్ పేర్కొన్నట్టు బౌద్ధ, జైన మతాలు కొంతవరకు వెనుకపడుతున్న కాలంలో వైదిక మత ప్రాబల్యం హెచ్చుతున్న రోజులలో పంచతంత్ర రచన జరిగినట్లు భావించడానికి దానిలో ఎన్నో సాక్ష్యాధారాలున్నాయి.

"పంచతంత్రం" ప్రఖ్యాతి విని దాన్ని పహ్లవీ భాషలోకి అనువదించవలసిందిగా పర్షియారాజు ఖొస్రో అనోషర్వాన్ (క్రీస్తుశకం 531 - 579) ఆదేశించారు. ఆయన ఆదేశానుసారం క్రీస్తుశకం 570 ప్రాంతంలో దీన్ని ఆయన ఆస్థానానికి చెందిన ఒక రాజవైద్యుడు - అతని పేరు బుర్జో - కాశ్మీర్ పాఠంనుంచి అనువదించినట్లు ప్రతీతి.

తర్వాత ఇరవై సంవత్సరాలకు (క్రీస్తుశకం 590 లో) పహ్లవీ అనువాదాన్ని అబ్దుల్లా - ఇబిన్ - అల్ మొకాఫా అరబిక్ భాషలోకి తర్జుమా చేశాడు. తన అనువాదానికి "కలీలా, దిమనులు" అని ఆయన నామకరణం చేశాడు. ఇది కరటక దమనకులకు వచ్చిన తిప్పలు!

పహ్లవీ అనువాదం త్వరలోనే కాలగర్భంలో కలిసిపోయినా, దాని అరబిక్ తర్జుమా మాత్రం స్థిరంగా నిలిచింది. ఇంచుమించుగా ఇదే సమయంలో నాటి సిరియా భాషలోకి జరిగిన తర్జుమాలో రెండు భాగాలు లుప్తమైపోయినా, తక్కిన గ్రంథం మిగిలింది.

అరబిక్‌తర్జుమానుంచి అటు పిమ్మట కొంత కాలానికి హిబ్రూ అనువాదం వెలువడింది. దానినుంచి లాటిన్ అనువాదం, దానినుంచి జర్మన్, ఇటాలియన్ వగైరా అనువాదాలు, మొదటి ఎలిజబెత్‌రాణి పరిపాలనా కాలంలో జరిగిన ఇంగ్లీషు తర్జుమా లాటిన్ నుంచి కాదు; ఇటాలియన్ నుంచి. 1570లో సర్ థామస్‌నార్ ఈ తర్జుమాను మొట్టమొదటిగా ప్రచురించాడు; 1601లో దీని పునర్ముద్రణ జరిగింది. ఇక్కడ గమనించదగు విశేషం - సంస్కృతంలోని పంచతంత్రం పహ్లవీ, అరబిక్, హిబ్రూ, లాటిన్, ఇటాలియన్ భాషల గుండా వడపోతల తర్వాత ఇంగ్లీషులో అవతరించడం!.

పంచతంత్రంలోని కొన్ని కథలు స్వల్పమైన మార్పులతో ఈసప్ కథాసంపుటిలో ప్రవేశించాయి.

అయిదవ తంత్రంలోని ("అపరీక్షిత కారకము" లోని) పాము-ముంగిస-బ్రాహ్మణుని కథకూడా కొద్దిపాటి మార్పులతో పెక్కు పాశ్చాత్య దేశాలలో ప్రచారం పొందింది. ఫ్రెంచి రచయిత లా ఫాంతేన్ వ్రాసిన పిట్టకథలకు యూరోపియన్ ప్రఖ్యాతివున్నది. వాటికి మాతృకలను చాలావరకు పంచతంత్రం నుంచే ఆయన పరిగ్రహించాడు.

మన దేశానికి సంబంధించినంతవరకు "హితోపదేశం" పంచతంత్రానికి పూర్తిగా అనుకరణ, పంచతంత్రంలో లేని కథలు హితోపదేశంలో ఒక పదిహేను అదనంగా వున్నాయి. కామందక నీతిసారంలోని కొన్ని భాగాలను దీనిలో ఉదహరించడం జరిగింది.

పంచతంత్రం పేరైనా వినకముందే దానిలోని కథలను భారత బాలబాలికలు తమ తాతలు, అవ్వలు చెప్పగా వింటారు. తర్వాత ఒక పాఠ్యగ్రంథంగా దాదాపు ప్రతి ప్రాంతంలోను స్థానిక భాషలో దాన్ని వారు చదవడం జరుగుతుంది. మన తెలుగు భాషకు సంబంధించినంతవరకు మన ఆధునిక వచనానికి (చిన్నయసూరి, వీరేశలింగం పంతులుగార్లపుణ్యమా అని)ఒక రూపు దిద్దడానికి పంచతంత్రం తోడ్పడింది.



